ఓం పరబ్రహ్మణేనమః

# పూర్వకాలామృతము



వల్లి వర్మ

శ్రీ లక్ష్మీనరసింహ ప్రెస్

బచ్చుపేట - మచిలీపట్నం

ఓం పరబ్రహ్మణేనమః

జ్యోతిశ్శాస్త్రప్రారంభకులకు అత్యంతోపయుక్తమైన

# పూర్వకాలామృతము

[టీకాతాత్పర్యసహితము]

శతాధిక వైదిక గ్రంథకర్త

## కీ॥ శే॥ చల్లా లక్ష్మీనరసింహశాస్త్రి గారిచే

వ్రాయఁబడి

బ్రహ్మశ్రీ వెంపటి కుటుంబశాస్త్రిగారిచేఁ బరిష్కరింపఁబడి





పబ్లిషర్సు

శ్రీ లక్ష్మీనరసింహ ప్రెస్

(చల్లావారి ప్రెస్)

బచ్చుపేట - మచిలీపట్టణమునందు

ముద్రించి ప్రకటింపబడెను

ద్వితీయ ముద్రణ

ప్రతులు 500

 1985 (వెల రు. 16-00

# పీఠిక

అయ్యా !

జ్యోతిషమనఁగా జ్యోతిస్సులయొక్క శాస్త్రము, జ్యోతిః అనఁగ ఆకాశము నందు జ్యోతించెడివి యనఁగా ప్రకాశించెడివి, వాటివి దెలిపినందున మనకుఁ గ్రహెడు ఫలమేమంటే త్రుటిమొదలుకొని బ్రహ్మకల్పపర్యంతముగల కాలభేదములను కొలుచుటకు, ఇంకప్రపంచములో నుండెడిజీవులకు వెలుగు మొదలగునవి కలుగ జేయుట మొదలగు కార్యములకుఁగాను గ్రహనక్షత్రాది మండలము ఈశ్వరునిచే నిర్మింపఁబడినవి వీటిచేతను అహో, రాత్రి, పక్ష, మాస, ఋతు, అయన, సంవత్సరాదులేర్పడినవి. వీటివలన వేదములోవిధించిన గర్భాధానాదిసమస్తకర్మలకును, తదుక్తకాలములను మనము దెలిసికొనవచ్చును. ఇదియే వేదాంగత్వమనఁగాను, దీనికి లగధమహాముని సూత్రకారుఁడు. ఈ లగధసూత్రములకు భాష్యముగూడఁ గలదు. మఱియు సోమ, సూర్య, ఆర్యభట బ్రహ్మ, రోమక, వ్యాస, పైల, వాసిష్ఠములను, అష్టసిద్ధాంతములను వాటిభాష్యములనుజట్టి భాస్కరాచార్యులు మొదలైనవారు చేసినవి యనేకములు గలవు. ఈ శాస్త్రములో ముఖ్యముగ నాలుగు ప్రమేయములుగలవు. ౧ సిద్ధాంతభాగము, ౨ జాతకభాగము, ౩ ముహూర్తభాగము, ౪ ప్రశ్నభాగము అని చెప్పబడినవి. వానిలో జాతకవిషయమునకు జైమినిమహాముని రెండుఅధ్యాయముల సూత్రములుచేసిరి. యింకనుగలవని వినియుంటిని ఇదిగాక పారాశర్యము, కారికాగ్రంథము, ఇంకకేరళము, సిద్ధాంతరహస్యము, జాతకాభరణము, జాతకసారావళి, పూర్వకాలామృతము, ఉత్తరకాలామృతము, జ్యోతిషరత్నావళి, గ్రహలాఘవము, నృసింహము, కాశ్యపసంహిత, వృద్ధవాసిష్ఠము, బృహజ్జాతకము, దైవజ్ఞవిలాసము, కాలప్రకాశిక, ముహూర్తదర్పణము, ముహూర్తమార్తాండము, ముహూర్తచింతామణి, ముహూర్తప్రదర్శిని, ముహూర్తచంద్రిక, మాథవీయము, నక్షత్రకళావిలాసము, దైవజ్ఞాభరణము, మల్లినాథీయము, గణకానందము, శిష్యధీతంత్రము, ప్రకాశిక, జ్యోతిషాభరణము, జ్యోతిషసంహిత, జ్యోతిషార్ణవము, ప్రశ్నాకకీయము, సిద్ధాంతశేఖరము మొదలు జ్యోతిషగ్రంథము లనేకములుగలవు వానిలో కొన్ని గ్రంథములు ముద్రించఁబడినవి. ఈజ్యోతిషగ్రంథములు నాలుగులక్షల పరిమితిగలవని చెప్పఁబడినవి, మఱియు కాళిదాసాది మహాకవులు ముహూర్తాంశములో అనేకగ్రంథములురచియించిరి. అవన్నియుమనకులభ్యముకాకనేపోవుచున్నవికదా, అథవా 1, 2 గ్రంథములు మనకులభ్యమైనను దానిని మతముపరిశోధించిప్రచురించుటయేలేదు. ఇందువలనజ్యోతిషప్రచారముతగుసాంప్ర

దాయములును, మనపూర్వులకుఁదప్ప తదితరులకు తెలియకనేపోవుచున్న విముహూర్తాంశమునందు అర్థజ్ఞానంబులేనిచో ముహూర్తము శుభకరమైనదిలేక అశుభకరమైనది ముందుగానెఱుంగుటకు వీలుండదు కాన నీభువిలో మనుష్యులకర్థజ్ఞానంబుండుటయపసరమనుట కించుకయు సంశయములేదు అర్థజ్ఞానము సంస్కృతపండితులకుఁ దప్ప తదితరులకు సాధ్యముగాదుగదా మఱియునామిత్రులలో కొందఱు పదవిభాగ టీకా తాత్పర్యసహితముగానుండునటుల గొప్పగ్రంథమునుముద్రింపించుఁడనివలుమాఱు వెలియపరచి నప్పటికిని యిక్కార్యంబునారంభింపక యూఱకయేయుంటిని ఇట్లుండ నొకనాడు నాయొక్క మిత్రబృందంబు నాతోనిట్లుఁబ్రశంసించె ముహూర్తగ్రంథములు పెక్కులున్నవిగాని వానిలోనొకగ్రంథమందైనను, పదవిభాగటీకాతాత్పర్య సహితముగా లేనందున సంస్కృతపరిచయములేనిబాలురందరు గురుసహాయము కోరకనేగ్రహించునటుల ముందు పూర్వకాలామృతగ్రంథమును ముద్రింపించుమనికోరిరి పిమ్మట శ్రీమాకా శాంతులూరి కృష్ణమాచార్యులవారివద్దపాతక్రమముగా సర్వధారినామసంవత్సరంబున నేనభ్యసించిన పూర్వకాలామృతగ్రంథమును పరిశుద్ధముగావ్రాసితినిగాని వెంటనేముద్రింపించుటకువీలుకలుగకనిలచియుండెను, క్షణభంగురంబైన మనజీవితమింతంతయని యెరుంగుట కలవిగాకుండుటచే నేఁబూనిన యీకార్యంబెన్నఁడెట్లుగొనసాగునోయని విచారించుచుంటిని, పిమ్మట 1 బ్రహ్మశ్రీ వెంపటికుటుంబశాస్త్రిగారు 1 బ్రహ్మశ్రీ ఇంగువ వేంకటకృష్ణశాస్త్రిగారు మొదలగు మహనీయ్యులచేఁ బరిబోధింపఁజేసి ముద్రించిప్రచురించితిని ఈగ్రంథమునందఱు కరుణచే నాదరించుటయే గాక యిందుండు స్ఖాలిత్యములును ముద్రణలోపములును విశదముగావ్రాసి నాకుంబంపిన తరువాతకూర్పునందు సవరించి ముద్రింపించెదను ఈగ్రంథముయొక్క ప్రయోజనమును గుఱించి చదువరులే గ్రహింతురుగాక, గురుసహాయము విశేషముగా కోరనక్కఱలేదు ప్రతిశ్లోకమునకును కరతలామలకముగా నుంటునటుల పదవిభాగమును పిమ్మట టీకయును, అటుపిమ్మట తాత్పర్యమునుజేర్పఁబడినవి మఱియు ఈ గ్రంథమందుఁ జేర్పవలసిన చక్రములన్నియును ప్రత్యేకగ్రంథముగానుండునటుల కొందరు కోరుటచేచక్రములు మాత్రము ఈ కూర్పునందుఁజేర్పబడలేదు, ముహూర్తచక్రప్రదర్శిని అను గ్రంథమునందుఁ జూడగలరు మఱియు నీకోశంబులో గన్పడెడి నెరసులను మన్నింపవలయునని జ్యోతిష్కులను పండితులను ప్రార్థించుచున్నాడను.

బందరు }
బచ్చుపేట }

ఇట్లు
చల్లా మాధవశాస్త్రి

# విషయసూచిక





| విషయములు | పుట |
|---|---|
| ఇష్టదేవతాప్రార్థనం | 1 |
| తిథివారాధిపతులు | 2 |
| నక్షత్రాధిపతులు | 3 |
| నక్షత్రములకు క్షిప్రాదిసంజ్ఞలు | 4 |
| గ్రహములకూ్రరసౌమ్య పురుషస్త్రీనపుంసక సంజ్ఞాజాతికాలములు | 5 |
| చంద్రునకు పూర్ణత్వక్షీణత్వములు | 6 |
| రజస్వలకుశుభాశుభనక్షత్రాది విషయములు | 7 |
| రజస్వలకు ఉగ్రనక్షత్రములు | |
| రజోదుష్టకాలము | 9 |
| వస్త్రాదినిర్ణయము | 11 |
| బిందుఫలనిర్ణయము | 12 |
| గర్భాధానము | 13 |
| ఋతుకాలనిర్ణయము | 14 |
| పుంసవనకాలము | 15 |
| సీమంతకాలము | 16 |
| జాతకర్మకాలనిర్ణయము | 17 |
| నామకరణకాలనిర్ణయము | 17 |
| అన్నప్రాశనకాలనిర్ణయం | 18 |
| అన్నప్రాశన లగ్నగతగ్రహ ఫలనిర్ణయము | 18 |
| కేశఖండనకాలనిర్ణయము | 19 |
| కర్ణవేధయోగ్యకాల నిర్ణయము | 19 |
| చౌలకాలనిర్ణయము | 20 |
| అంకురారోపణ నిర్ణయం | 20 |

| విషయములు | పుట |
|---|---|
| గ్రహములకుచ్చ నీచమూల త్రికోణములు | 21 |
| బ్రహ్మక్షత్రవిశాముపనయన యోగ్యకాలములు | 22 |
| ఉపనయనాద్యములకు పక్షాంతర కాలములు | 23 |
| ఉపనయనములకు వార నక్షత్ర లగ్నకాలములు | 24 |
| వర్ణాధిపతిబలము | 24 |
| వేదాధిపతులనిర్ణయము | 26 |
| ఉపనయనలగ్నమునకువర్ణాదీశాది విశేషము | 26 |
| కేంద్రస్థానస్థితపాపగ్రహఫలం | 27 |
| వటువునకుగురుబలము | 28 |
| చంద్రరాశి స్థితఫలము | 28 |
| ఉపనయనలగ్నమునకుత్యాజ్య కాలములు | 29 |
| షడ్జన్మనక్షత్రస్వరూపము | |
| జన్మనక్షత్రమునకు జరుపు కార్యా కార్యవిచారణము | 30 |
| ఉపనయనలగ్నమునకు దోషాపవాదము | 30 |
| అక్షరస్వీకారయోగ్యకాలము | 32 |
| విద్యారంభయోగ్య కాలము | 32 |
| అనధ్యయనదినములు | |
| శుక్లపక్షనైమిత్తికానధ్యయన దినములు | 33 |
| కృష్ణపక్షనైమిత్తికానధ్య యనదినములు | 33 |

| విషయములు | పుట |
|---|---|
| ఉపనయనకర్తలయొక్కకాలము | 35 |
| గోదానాదివేద వ్రతకాలకాలము | 35 |
| సమావర్తనకాలము | 36 |
| అతాధౌ వివాహప్రశంసా | 37 |
| వివాహప్రశ్నకాలఫలములు | |
| వివాహప్రశ్నశుభఫలములు | |
| కన్యకనువివాహమునకు నిశ్చయించుట | 40 |
| వివాహసంవత్సరనిర్ణయము | 41 |
| ద్వితీయవివాహ యోగ్యకాలము | 4 |
| వివాహయోగ్యమాసనిర్ణయం | 42 |
| వివాహవిషిద్ధతిథినిర్ణయము | 44 |
| వివాహవారనక్షత్రనిర్ణయము | 44 |
| వివాహమునకు నిషేధకాలము | 45 |
| గురుశుక్రచంద్రులకు బాలత్వాది కాలము | 46 |
| చంద్రగురుశుక్రాస్తమయఫలము | 47 |
| త్రిజ్యేష్ఠస్వరూపనిర్ణయము | 48 |
| వివాహమునకు గురుబలము | 49 |
| ఏకోదరులకు ఏకలగ్నంబున వివాహనిషేధము | 50 |
| ఏకకాలంబున పుత్రీ పుత్ర వివాహము | 52 |
| వివాహమునకు యోగ్యాయోగ్య సంబంధము | 5 |
| గండనక్షత్రజననఫలము | 5 |
| ఏకవింశతిమహాదోషములు | 5 |
| దివసత్రిత్సంక్రాంతిదోషములు | 5 |
| లగ్నమునకుహోరాదికాలము | 5 |

| విషయములు | పుట |
|---|---|
| ద్రేక్కాణాధిపనిర్ణయము | 60 |
| నవాంశద్వాదశాంశస్వరూప నిర్ణయము | 61 |
| త్రింశాంశాధిపతులు | 62 |
| పుష్కరాంశవర్గోత్తమాంశ నిర్ణయము | 64 |
| శుభనవాంశము | 64 |
| నవాంశప్రత్యేకఫలనిర్ణయము | |
| కుజాష్టమభృగుషట్కదోషములు | |
| కర్తరిదోషనిర్ణయము | |
| అష్టమలగ్నదోషనిర్ణయము | |
| షష్ఠాష్టరిప్ఫచంద్రసంగ్రహ దోషములు | 67 |
| సూర్యాదియుక్తచంద్రగ్రహఫల నిర్ణయము | |
| వారజనితదుర్ముహూర్తదోషములు | 68 |
| కాలహోరాస్వరూపము | 70 |
| ఖార్జూరచక్రలక్షణము | 71 |
| గ్రహణోత్పాతదోషనిర్ణయము | 72 |
| క్రూరయుక్తధిష్ణ్యదోషము | 74 |
| పంచశలాకదోషలక్షణము | 75 |
| నక్షత్రత్యాజ్యదోషనిర్ణయము | 76 |
| లగ్నాస్తదోషనిర్ణయము | 77 |
| గండాంతదోషనిర్ణయము | 78 |
| తిథిగండాంతము | 79 |
| వ్యతీపాతదోషనిర్ణయము | 80 |
| దోషపరిహారము | 81 |
| గ్రహసంపత్తి | 81 |

| విషయములు | పుట | విషయములు | పుట |
|---|---|---|---|
| జామిత్రిస్థానస్థితిగ్రహఫలం | 82 | రజ్జువర్గు | 108 |
| అబ్దాదిసంధియందుత్యాజ్యకాల నిర్ణయము | 83 | యోగినీవర్గు | 108 |
| వర్షమేఘాడంబరదోషములు | 84 | అష్టకక్షులప్రయోజనము | 109 |
| నక్షత్రస్వల్పదోషము | 85 | లింగవర్గు [స్త్రీ పుం నపుంసక తారలు] | 109 |
| స్వల్పదోషములకు దేశవ్యవస్థలు | 86 | భూతవర్గు | 110 |
| వివాహలగ్నమునకు దోషాపవాదము | 86 | చంద్రయోగవర్గు | 111 |
| దోషప్రసంగనుపసంహారము | 88 | గోత్రవర్గు | 113 |
| వింశతివర్గు | 89 | బ్రాహ్మణాదులకు తత్త్వర్గోచితవర్గువులు | 113 |
| మరియొక నాడీకూటము | | జన్మనామనక్షత్రకాలము | 114 |
| పార్శ్వైకాంగుళిదోషాపవాదము | 91 | సందిగ్ధరాశినక్షత్రస్వరూపము | 115 |
| ఏకాంగుళస్థితనక్షత్రపరిహారము | 92 | అభిజిద్గోధూళ్యకాలకాలము | 115 |
| రాశికూటము | 92 | లగ్నపరీక్ష | 116 |
| గణనఫలకాలము | 93 | ముద్రాకారంభకాలము | 116 |
| గ్రహమిత్రత్వములు | 94 | శ్రావణహోమకాలము | 118 |
| యోనికూటము | 97 | క్షౌరకాలనిర్ణయము | 120 |
| స్త్రీదీర్ఘ కూటము | 99 | క్షౌరమునకు యోగ్యకాలనిర్ణయము | 121 |
| గణకూటము | | రాజకుమారులకు ఛురికాబంధనము | 122 |
| మాహేంద్రకూటము | 101 | నూతనవధూగృహప్రవేశకాలము | 123 |
| గణితాగతాయుష్యవర్గు | 102 | నిషేక కాలనిర్ణయము | 124 |
| అయవర్గునిర్ణయము | 102 | నూతనవస్త్రభూషణధారణ కాలనిర్ణయము | 126 |
| వశ్యవర్గు | 103 | ద్వాదశలగ్నమునకు ఘటికా ప్రమాణము | 128 |
| దినవర్గము | 10 | యాత్రాప్రకరణము | 129 |
| జాతివర్గము | 105 | యాత్రాప్రశ్నఫలము | 130 |
| వేధావర్గు | 106 | | |
| పక్షివర్గు | 10 | | |

| విషయములు | పుట |
|---|---|
| యాత్రాతిథివారనక్షత్రకాలము | 132 |
| వారశూలనక్షత్రశూలలు | 133 |
| పరిఘాదండచక్రలక్షణము | 133 |
| నక్షత్రరాసులకుదిగ్ద్వారకాలము | 135 |
| ద్వాదశలగ్నములయందు గమనఫలము | 136 |
| ప్రతిశుక్రభౌమబుధదోషములు | 136 |
| ప్రతిశుక్రాదిదోషములకుగోత్రభేదములపరిహారము | 137 |
| యాత్రాఫణిచక్రలక్షణము | 138 |
| చంద్రగర్భచక్రలక్షణము | 139 |
| ఆదలస్వరూపలక్షణము | 140 |
| త్రికంకస్వరూపము | 140 |
| యాత్రాపంచకశుద్ధిస్వరూపము | 141 |
| అంగీకారార్థస్వరూపము | 142 |
| యాత్రాచంద్రకంటకకాలము | 143 |
| యాత్రాలలాటస్వరూపము | 144 |
| యుద్ధగమనరాహుఫలము | 145 |
| గమనవర్జ్యకాలము | 146 |
| అభిజిద్ధనిష్ఠాపంచకమందుగమననిషేధకాలము | 146 |
| నానాయాత్రలకు లగ్నకాలము | 147 |
| యుద్ధగమనకాలముయొక్క రాహుస్థితఫలము | 148 |
| స్థిరచరయోగినులకుఫలము | 149 |
| పక్షచ్ఛిద్రములయొక్క వర్జ్యకాలము | 150 |
| గమననిషిద్ధనక్షత్రములయందు వర్జ్యకాలములు | 151 |

| విషయములు | పుట |
|---|---|
| దినశుక్ర వారశుక్ర స్వరూపములు | 152 |
| నక్షత్రదిగ్భుక్తులస్వరూపము | 153 |
| చంద్రద్వాదశావస్థాప్రకారకాలము | 154 |
| చంద్రద్వాదశావస్థలకునామ నిరూపణము | 155 |
| ఖచరయోగఫలము | 156 |
| కర్మణిఫలము | 156 |
| బార్యాదిస్వరవివేచనము | 157 |
| జాలాదినామములకు తిథివారనక్షత్రకాలములు | 158 |
| పందారాహుచక్ర నిరూపణం | 159 |
| సూర్యచంద్రనాడీబలము | 163 |
| సర్వదిగ్గమనకాలము | 164 |
| ప్రయాణమునకు నక్షత్రములు | 164 |
| ప్రయాణలగ్నమునకు గ్రహస్థితిఫలము | 165 |
| యాత్రాయోగములు | 166 |
| తారాబలము | 167 |
| చంద్రబలము | 168 |
| నిర్గమనలక్షణము | 169 |
| యాత్రాశుభశకునములు | 170 |
| ప్రయాణలగ్నములకు ఉపశకునములు | 171 |
| ప్రయాణలగ్నాదులకు శుభశకునములు | 171 |
| క్షుతక్రోష్టురుతఫలములు | [illegible] |

| విషయములు | పుట |
|---|---|
| గౌళివాక్పతనఫలము | 173 |
| కాకరుతఫలము | 174 |
| ప్రతిప్రయాణలక్షణము | 175 |
| మరియొకశుభశకునములు | 176 |
| అశుభశకునములు | 177 |
| మరియొకఅశుభశకునములు | 178 |
| ప్రయాణమునకు మృత్యుశకునములు | 179 |
| శకునస్వరూపములు | 180 |
| అవసరప్రయాణమునకు ఫలములు | 181 |
| ప్రయాణంబున రాజున కాశీర్వాదఫలము | 182 |
| ప్రతిప్రయాణలక్షణము | 183 |
| మరియొకప్రయాణలక్షణము | 184 |
| యోగాంతరఫలము | 184 |
| ప్రయాణవిషయమై విప్రాదులకు నియతఫలములు | |
| పైనముబోవుదినమందు విడువ తగిన కార్యములు | 189 |
| గృహనిర్మాణయోగ్యప్రదేశములు | 190 |
| రాజభృత్యార్పణము | 191 |
| గ్రామార్పణము | 192 |
| నామనక్షత్రాదులయందు చేయ తగినకార్యములు | 195 |
| గృహముయొక్క ఫలము | 196 |
| పల్లమున జలము నిండించుటకు ఫలము | 196 |
| జలగతికూపఖననములకు దిగ్నిర్ణయము | 197 |
| గృహకర్త్రికాచక్రలక్షణము | 198 |

| విషయములు | పుట |
|---|---|
| క్షేత్రమునకు నవవర్గగణిత క్రమము | 200 |
| ధనఋణాదులకుఫలము | 201 |
| గృహనక్షత్రఫలము | 201 |
| గృహరాశ్యంశగణనమునకు ఫలనిర్ణయము | 202 |
| చైత్రాదిమాసములకు ఫలము | 204 |
| చరరాశ్యాదిగతసూర్య ఫలము | 205 |
| లగ్నఫలము | 206 |
| నక్షత్రతిర్యగధోర్ధ్వముఖత్వములు | 206 |
| స్తంభప్రతిష్ఠనక్షత్రఫలము | 237 |
| వాస్తుపురుషస్థితిక్రమము | 208 |
| శంకులక్షణము | 209 |
| శంకువును స్థాపించుటకుఫలము | 210 |
| శంకుయొక్క శుభాశుభవృక్ష ఫలములు | 211 |
| గృహదిఙ్నిర్ణయము | 211 |
| రాజులనైమిత్తికగృహములకు స్థానఫలము | 212 |
| ధ్వజాదిఅష్టదిక్షుఫలము | 213 |
| ధ్వజాద్యాయములు | 214 |
| గజతురగాదిశాలలగట్టుటకు ఆయఫలము | 215 |
| గృహనిర్మాణనిషిద్ధకాలము | 216 |
| గృహముకట్టుటకు ముఖ్యకాలములు | 217 |
| స్తంభప్రతిష్ఠాలగ్నమునకు గ్రహస్థితిఫలము | 218 |

| విషయములు | పుట |
| --- | --- |
| స్తంభప్రతిష్ఠాలగ్న రాజయోగములు | 218 |
| లగ్నగ్రహబలఅయొఫలము | 219 |
| క్షితివాస్తుస్వరూపము | 220 |
| గృహప్రవేశప్రకరణము | 221 |
| గృహప్రవేశమాసఫలము | |
| గృహప్రవేశవారఫలము | 222 |
| గృహప్రవేశమునకు వర్జ్యకాలములు | 222 |
| గృహప్రవేశనక్షత్రఫలము | 223 |
| గృహమునకుద్వారఫలము | 224 |
| పక్షాంతరద్వారఫలము | 225 |
| రాశిభేదములబహిర్ద్వారఫలం | 226 |
| కర్తకుజన్మరాశిలగ్నాదులయందు గృహప్రవేశఫలములు | 227 |
| గృహప్రవేశమునకు పాపాష్టమి చంద్రదోషములు | 227 |
| గ్రహములదృష్టిఫలము | 228 |
| గృహప్రవేశలగ్నమునకు గ్రహస్థితఫలము | 229 |
| ప్రవేశనిషేధము | 230 |
| వృషభచక్రలక్షణము | 230 |
| కలశచక్రలక్షణము | 232 |
| సకలదేవతాప్రతిష్ఠాకాలము | 230 |
| పశుబంధనకాలము | 234 |
| పైతృవిషయములు | 235 |
| మాసికాదులకువిశేషకాలము | 235 |
| మహాలయఫలము | 236 |
| సకృన్మహాలయకాలము | 237 |
| సకృన్మహాలయయోగ్యతిథి వారనక్షత్రములు | 238 |
| నిత్యశ్రాద్ధసకృచ్ఛ్రాద్ధములు చేసినగలిగెడుఫలములు | 239 |
| షణ్ణవతిశ్రాద్ధస్వరూపము | 240 |
| మన్వాదియుగాదులయందు శ్రాద్ధఫలములు | 241 |
| అష్టకశ్రాద్ధతిథినిర్ణయము | 242 |
| గయాశ్రాద్ధఫలము | 242 |
| నిత్యశ్రాద్ధసాంవత్సరికము | 243 |
| ఏకాదశాహవిధి | 244 |
| నవశ్రాద్ధసంఖ్యాఅస్థిసంచయన కాలములు | 245 |
| వపనవిధి | 246 |
| తిలోదకవాసోదకములు | 247 |
| తిలోదకాదులకు నిషిద్ధకాలం | 248 |
| ఏకాదశాహమునకు జ్ఞాత్యాశౌచము | 248 |
| సాపిండ్యత్రైపక్షికశ్రాద్ధ కాలములు | 249 |
| ఊనత్రయకాలములు | 250 |
| ఊనత్రయవర్జ్యకాలము | 251 |
| సంక్రాంతిపుణ్యకాలములు | 251 |
| అఖండతిథినక్షత్రనిర్ణయము | 252 |
| అఖండతిథులందువ్రతాదినిర్ణయము | 253 |
| అభ్యంగనిషేధకాలము | 254 |
| నిషిద్ధదినములయందుఅభ్యంగవిధి | 255 |
| యుద్ధమునకు తిథివారనక్షత్ర లగ్నములు | 255 |
| యమకంటకగుళికార్ధప్రహారములు | 256 |

| విషయము | పుట | విషయము | పుట |
|---|---|---|---|
| అపమాతృద్యుస్వప్నాదికము | 257 | కృషిభూమిప్రవేశ తిథివార నక్షత్రాదులు | 261 |
| పాదచ్ఛాయాగతఘటికా నిర్ణయము | 258 | బీజపణిచక్రము | 261 |
| విష్టిదినములు | 258 | చక్రఫలము | 262 |
| భద్రకరణదినములు | 259 | బీజావాపనమంత్రవిధి | 263 |
| హాలచక్రము | 260 | బీజావాపనతిథివారనక్షత్రము | 264 |
| | | బీజావాపనలగ్నఫలములు | 265 |


## అథ గురుప్రార్థనమ్

శ్లో॥ జ్ఞానానంద మయందేవం నిర్మలస్ఫటికాకృతిమ్ । ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే॥అఖండమండలాకారం వ్యాప్తంయేనచరాచరమ్ తత్పదందర్శితంయేనతస్మై శ్రీగురవేనమః॥గురుర్బ్రహ్మగురుర్విష్ణుర్గురుర్దేవో మహేశ్వరః । గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీగురవేనమః॥ఆదిత్యాయచ సోమాయ మంగళాయ బుధాయచ।గురుశుక్రశనిభ్యశ్చరాహవేకేతవేనమః॥

శ్లో॥ చింతావంశ పయఃపార వార రాకా సుధాకరం ।
వందేవేంకటనాథాయ జ్యోతిస్సిద్ధాన్త సద్గురుమ్ ॥

## వంశానుక్రమణిక

౧ చల్లా బుచ్చన్నశాస్త్రిగారు పత్ని లక్ష్మీదేవమ్మగారు వీరిపుత్రులు
౨ వేంకటరామశాస్త్రులవారు పత్నీ రావమ్మగారు వీరిపుత్రులు
౩ గంగాధరశాస్త్రులవారు పత్నీ మహాలక్ష్మమ్మగారు వీరిపుత్రులు
౪ నాగలింగశాస్త్రులవారు పత్నీ సీతాదేవమ్మగారు వీరిపుత్రులు

లక్ష్మీనృసింహశాస్త్రి ధర్మపత్నీ సుందరలక్ష్మీ

వీరి ప్రథమపుత్రుడు

సుబ్రాయశాస్త్రిగారు-తావుమ్మగారు

వీరిపుత్రులు

రామలింగశాస్త్రి, మాధవశాస్త్రి, వాసుదేవశాస్త్రి

శ్రీః శ్రీః శ్రీః శ్రీః శ్రీః

గౌరీపంచాంగం కాలం ౧ కి 3½ ఘడియ చొ॥ ఘంట ౧ నిముషములు 30

[పగటిముహూర్తములు]

| కాలం | ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| ౧ | ఉద్యో | అమృ | రోగం | విషం | ఉద్యో | రోగం | విషం |
| ౨ | లాభం | విషం | ఉద్యో | అమృ | విషం | జ్వరం | అమృ |
| ౩ | విషం | ఉద్యో | జ్వరం | శుభం | జ్వరం | అమృ | జ్వరం |
| ౪ | అమృ | లాభం | లాభం | ఉద్యో | లాభం | కలహం | ఉద్యో |
| ౫ | శుభం | జ్వరం | అమృ | రోగం | అమృ | లాభం | శుభం |
| ౬ | ధనం | అమృ | ఉద్యో | శుభం | విషం | సుఖం | లాభం |
| ౭ | అమృ | అదా | విషం | ధనం | కలహం | ధనం | ధనం |
| ౮ | విషం | ధనం | లాభం | అమృ | జ్వరం | అమృ | లాభం |

(రాత్రిముహూర్తములు)

| కాలం | ఆది | సోమ | మంగళ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| ౧ | శుభం | రోగం | జ్వరం | లాభం | సుఖం | అమృ | విషం |
| ౨ | అమృ | లాభం | ఉద్యో | రోగం | రోగం | జ్వరం | ఉద్యో |
| ౩ | జ్వరం | ఉద్యో | కలహ | విషం | కలహ | కలహ | శుభం |
| ౪ | రోగం | ధనం | లాభం | ఉద్యో | లాభం | లాభం | అమృ |
| ౫ | కలహం | రోగం | రోగం | శుభం | ఉద్యో | శుభం | కలహం |
| ౬ | లాభం | అమృ | లాభం | లాభం | జ్వరం | ధనం | రోగం |
| ౭ | ఉద్యో | విషం | ఉద్యో | ధనం | లాభం | అమృ | అమృ |
| ౮ | రోగం | జ్వరం | ధనం | లాభం | ఉద్యో | విషం | లాభం |

## పండితాభిప్రాయములు

అయ్యా !

ఈ గ్రంథమును సాకల్యముగా చిత్తగించి మాకువ్రాసినవారి నామములన్ని ఏలులేకపోయినది గ్రంథము బహూపయోగకరమని వ్రాసిరి.

ఓమ్

పరబ్రహ్మణేనమః

# పూర్వకాలామృతమ్

ఇష్టదేవతాప్రార్థన

శ్లో॥ శ్రీమద్వేంకటనాయకం కులగురుం నత్వాసదాభీష్టదం।
జ్యోతిశ్శాస్త్రపయోనిధి ప్రమథనాత్సారం సముత్కృష్యతమ్।
విద్వద్విశ్వమనోహరం మృదుపదం సంక్షేపతస్సంస్ఫుటం।
గర్భాధానముఖంపిపాసుసులభం కాలామృతంవచ్మ్యహమ్॥౧

(పదవిభాగము) శ్రీమద్వేంకటనాయకమ్, కులగురుమ్: నత్వా। సదా.అభీష్టదం, జ్యోతిశ్శాస్త్రపయోనిధి ప్రమథనాత్, సారం, సముత్కృష్య, తమ్: విద్వద్విజమనోహరం, మృదుపదం, సంక్షేపతః, సంస్ఫుటం, గర్భాధానముఖమ్.పిపాసుసులభమ్, కాలామృతం, వచ్మి, అహమ్ ॥

టి. కులగురుం-కుల-వంశమునకు,గురుం-గురువైనట్టిన్ని।అభీష్టదం-కోరినకోరికల నిచ్చునట్టి, శ్రీమద్వేంకటనాయకమ్ - శ్రీమత్-సంపత్తుగల, వేంకటనాయకమ్-వెంకటేశ్వర్లను, సదా-ఎల్లప్పుడు: నత్వా-నమస్కరించి, జ్యోతిశాస్త్రపయోనిధిప్రమథనాత్, జ్యోతిశాస్త్ర - జ్యోతిశాస్త్రమను పయోనిధీ - పాలసముద్రముయొక్క, ప్రమథనాత్ -తరుచుటవల్ల: తమ్-ఆసారమ్-ముఖ్యాంశమును:సముత్కృష్య-బయలుపరచి: విద్వద్విశ్వమనోహరద, విద్వత్-పండితులయిన, విశ్వ-సమస్తజనులకు, మనోహరం-సుందరమైనట్టిన్నిమృదువదం-సరసవాక్యములుకలిగినట్టిన్ని గర్భాధానముఖం - గర్భాధానము ప్రారంభముగా గలిగినట్టిన్ని, పిపాసుసులభం,; పిపాసు-చెవులచే నాదరముతో వినువారలకు, సులభం - విశదముగా తెలియునట్టి కాలామృతం - కాలామృతమనుగ్రంధమును: సంక్షేపతః - క్లుప్తముగా నుండునట్టుగాను, సంస్ఫుటం-అర్థమందితరాపేక్షలేకుండ తెలియునట్లుగాను, అహం - నేను, వచ్మి — చెప్పుచున్నాను,

అవతారిక. గ్రంధకర్త తాఁజెప్పెడు గ్రంధము నిర్విఘ్నముగా సమాప్తినొందుటకు నిష్టదేవతాప్రార్థనా పూర్వకముగా గ్రంధవివరమును తెలియజేయుచున్నాడు

తాత్పర్యము ఇష్టదైవంబును; ఇష్టములనిచ్చువాఁడును, సంపదధిష్ఠానదేవత యగు వలవేలుమంగాసమేతుండును పాపనాశకరుండును నగు వేంకటేశ్వరస్వామికి నెల్లప్పుడును వందనంబుచేసి జ్యోతిశ్శాస్త్రమనెడి పాలసముద్రముఁబరిశోధింకుట వలనఁ బుట్టినసారాంశమునుసంగ్రహించివిద్వత్సమూహరమ్యంబగునట్లు;మృదుపద ములుఁ గలదియు, గర్భాధానాదిషోడశకర్మ యోగ్యంబులకు తిథివారనక్షత్రా దులఁదెలియఁజేయునదియును శ్రోత్రములచే పానముచేయఁదలఁచినవారల కతిసులభ ముగాఁ దెలియునదియును నగు కాలామృతమను గ్రంథమును సూక్ష్మముగా నితరః గ్రంథాపేక్షలేనట్లునేఁ దెలియఁజెప్పెదను,

## తిథివారాధిపతులు

శ్లో॥ వహ్నిః స్రష్టృహిమాద్రిజా గణపతిస్సర్పః కుమారోరవి
 ర్గౌరీశోవసుదాగధర్మ హరయః కామఃకలీందూపితా ॥
 ఏతేసర్వదినాధిపాస్స్యు రథతేవారేశ్వరాభాస్కరశ్చం
 ద్రోభూమిజఇందుజోగురుభృగూమందోభవేయుః క్రమాత్ ॥ ౧

(పదవిభాగము) వహ్నిస్రష్టృహిమాద్రిజాః। గణపతిః। సర్పః।కుమారః।రవిః। గౌరీశః। వసునాగధర్మహరయః; కామః। కలేందూ। పితా। ఏతే। సర్వదినాధిపాః । స్యుః। అథతే। వారేశ్వరాః। భాస్కరః। చంద్రః । భూమిజః।ఇందుజఃగురుభృగూ మందః । భవేయుః । క్రమాత్ ।

టీ॥ వహ్ని-అగ్నియు, స్రష్టృ-బ్రహ్మయు, హిమాద్రిజా- పార్వతియు, గణపతిః-విఘ్నేశ్వరుఁడును; సర్పః-సర్పరాజైనశేషుఁడును, కుమారః - కుమార స్వామియు, రవిః-సూర్యుఁడును, గౌరీశః-శివుఁడును, వసు-అష్టవసువులును, నాగ- దిగ్గజములును, ధర్మ-యముఁడును, హరయః-విష్ణువును; కామః—మన్మధుడును;కలి- కలిపురుషుఁడును, ఇందూ-చంద్రుఁడును, పితా - అగ్నిష్వాత్తాది పితృదేవతలును; ఏతే—ఈపదునార్గురును; సర్వదినాధిపాః-పాడ్యమిమొదలగు పదునారుతిథులకు నధి పతులుగ, స్యుః-ఉండిరి. అథ-పిదప భాస్కరః—సూర్యుఁడును; చంద్రః-చంద్రుఁ డును; భూమిజః-అంగారకుండును, ఇందుజః—బుధుఁడును; గురు- బృహస్పతియు భృగూ-శుక్రుఁడును, మందః-శనియు: తే-అప్రసిద్ధులు। క్రమాత్-వరుసగా, వారే శ్వరాః-ఆదివారాది వారములకు; నధిపతులై ; భవేయుః-అగుదురు.

తా॥ పాడ్యమికి అగ్నియును; విదియను బ్రహ్మయును, తదియకు పార్వతి యును, చవితికి విఘ్నేశ్వరుండును; పంచమికి అదిశేషుండును, షష్ఠికికుమారస్వా

మియు, సప్తమికి సూర్యుఁడును, అష్టమికి శివుఁడును, నవమికి అష్టవసువులును: దశమికి దిగ్గజమునను, ఏకాదశికి యముఁడును, ద్వాదశికి విష్ణువును, త్రయోదశికి మన్మధుఁడును, చతుర్దశికి కలిపురుషుఁడును పూర్ణిమకు చంద్రుఁడును, అమావాస్యకు పితృదేవతలును వీరలిక్రమంబున దినాధిపతులనంబడుదురు. మఱియు నాదివారమునకు సూర్యుండును: సోమవారమునకుఁ జంద్రుఁడును, కుజవారమునకంగారకుఁడును బుధవారమునకు బుధుడును, గురువారమునకు బృహస్పతియును, శుక్రవారమునకు శుక్రుఁడును, మందవారమునకు శనైశ్చరుండును: వీరలిక్రమమున వారాధిపతుల నంబడుదురు.

## న క్ష త్రా ధి ప తు లు

శ్లో॥ ఋక్షేశాఅథదస్రకాల హుతభుగ్బ్రహ్మేందురుద్రాదితీ
జ్యానాగాఃపితరో భగార్యమరవిత్వష్ట్రాశుగాఖ్యాఃక్రమాత్ ।
ఇంద్రాగ్నీ అపిమిత్రశక్రదనుజా స్తోయాఖ్యవిశ్వాత్మభూ
శ్రీశాఖ్యావసుతోయపాజచరణాహిర్బుధ్న్యపూషాహ్వయాః॥

(పదవిభాగము) ఋక్షేశాః, అథ, దస్రకాలహుత భుగ్బ్రహ్మేందురుద్రాదితిజ్యానాగాః। పితరః ॥ భగార్యమరవిత్వష్ట్రాశుగాఖ్యాః। క్రమాత్। ఇంద్రాగ్నీః అపి మిత్రశక్రదనుజాః । తోయాఖ్యవిశ్వాత్మ భూశ్రీశాఖ్యాః। వసుతోయపాజ చరణాహిర్బుధ్న్య పూషాహ్వయాః ॥

టీ॥ అథ-తిధివారముల కధిపతుల చెప్పిన పిదప: దస్రకాలహుత భుగ్బ్రహ్మేందురుద్రాదితిజ్యానాగాః: దస్ర-అశ్వనీదేవతలు। కాల-యముడు, హుతభుక్-అగ్ని, బ్రహ్మ-బ్రహ్మయు: ఇందు-చంద్రుఁడు, రుద్ర-శివుడు, అదితి-దేవమాతయు: ఇజ్య-బృహస్పతియు, నాగాః-సర్పములు, పితరః- పితృదేవతలు: భగ-భగాఖ్యసూర్యుఁడు, అర్యమ-అర్యముడనుసూర్యుడు, రవి - రవియనుసూర్యుడు, త్వష్ట్ర ఇంద్రుడు: ఆశుగః-వాయువు: ఇంద్రాగ్నీ-ఇంద్రాగ్నులు, మిత్ర – మిత్రాఖ్యసూర్యుఁడు, శక్ర-దేవేంద్రుఁడు: దనుజ-రాక్షసుఁడు, తోయాఖ్యా-ఉదకములు:విశ్వ - విశ్వేదేవతలు: ఆత్మభూః-బ్రహ్మ। శ్రీశాఖ్యః - విష్ణువు,వసు - అష్టవసువులు: తోయప–వరుణుడు: అజచరణః అజైకపాత్తును, అహిర్బుధ్న్య - అహిర్బుధ్న్యుడను రుద్రుఁడును, పూషాహ్వయాః-పూషుఁడను సూర్యుఁడును: ఏతే-వీరలు, క్రమాత్ - వరుసగా: ఋక్షేశాః-అభిజిత్తుతోఁగూడిన నశ్వని మొదలుగాఁగల నక్షత్రముల కధిపతులు.

తా॥ అశ్వినికి నశ్వినీదేవతలును, భరణికి యముండును, కృత్తికకగ్నియును రోహిణికి బ్రహ్మయు, మృగశీర్షకుఁ జంద్రుఁడును, ఆర్ద్రకు శివుండును, పునర్వసు కు అదితిదేవియును, పుష్యమికి గురుండును, ఆశ్రేషకు సర్పములును,మఘకుపితృ దేవతలును, పుబ్బకు భగుడనెడు సూర్యవిశేషుండను, ఉత్తర కర్యముఁడనెడిసూర్య విశేషుండును, హస్తకు సూర్యుండును, చిత్త కింద్రుఁడును, స్వాతికి వాయువును: విశాఖ కింద్రాగ్నులను: అనూరాధకు మిత్రుఁడనెడి సూర్యవిశేషుండు, జ్యేష్ఠకు దేవేంద్రుండును, మూలకు రాక్షసుఁడును పూర్వాషాఢకు నుదకంబులును, ఉత్త రాషాఢకు విశ్వేదేవతలను, అభిజిత్తునకు బ్రహ్మయు,శ్రవణమునకువిష్ణువునుధనిష్ఠ కష్టవసువులును; శతతారకు వరుణుఁడును పూర్వాభాద్ర కజచరణుండును; ఉత్త రాభాద్ర కహిర్బుధ్న్యుండును, రేవతి పూషాఖ్య సూర్యవిశేషుండును, వీరలీక్రమ మున నక్షత్రాధిపతులనంబడుదురు, ఇందుఁజెప్పఁబడినది సూర్యవిశేషులుద్వాదశాది త్యులలోఁ గొందరని తెలిసికొనవలయును.

నక్షత్రములకు క్షిప్రాదిసంజ్ఞలు

శ్లో॥ క్షిప్రం దస్రరవీజ్య మాసురశివ జ్యేష్ఠోరగం దారుణం।
చిత్రాం త్యేందుభ మైత్రభం మృదుభవేద్బ్రాహ్మోత్తరాభం స్థిరమ్
ఉగ్రంకాలమఘా త్రిపూర్వమనలంద్రాగ్నేతునా ధారణం ॥
స్వాత్యాదిత్యహరిత్రయం చరమిదందద్యాత్స్వసంజ్ఞాఫలమ్ ॥౫

[పదవిభాగం] క్షిప్రం, దస్రరవీజ్యం, అసురశివజ్యేష్ఠోరగం. దారుణం।చిత్రాం త్యేందుభ, మైత్రభం। మృదు,భవేత్: బ్రాహ్మోత్తరాభం। స్థిరం। ఉగ్రం। కాల మఘాత్రిపూర్వం। అనలేంద్రాగ్ని। తు।సాధారణం।స్వాత్యాదిత్య హరిత్రయంచరం ఇదం: దద్యాత్। స్వసంజ్ఞాఫలం.

టీ॥ దస్రరవీజ్యం-దస్ర-అశ్వని; రవి—హస్త;ఇజ్యం-పుష్యమి;యీమూడును క్షిప్రం-క్షిప్రములను పేరుగల [అనగా శీఘ్రముగా కార్యముజేయుననుట అసుర - మూల; శివ—ఆర్ద్ర; జ్యేష్ఠ-జ్యేష్ఠయు; ఉరగం-ఆశ్రేష; యీనాలుగు నక్షత్రములు; దారుణం. దారుణములను పేరుగలవి. (అనఁగాకార్యమునకుమంచిదికాదనుట)చిత్ర- చిత్రయు; అంత్య—రేవతియు; ఇందుభం-మృగశిరయు; మైత్రభం-అనూరాధయు: యీనాలుగును మృదు-మృదువులను పేరుగలవి [యీనక్షత్రములయందు కార్యము మంచిదనుట] బ్రాహ్మోత్తరాభం-బ్రాహ్మ — రోహిణియు; ఉత్తరాభం - ఉత్తరోత్తరాషాఢోత్తరా భాద్రలను; యీ నాల్గును; యీ శాస్త్రమందెచ్చట నుత్త రాశబ్దముచే చెప్పబడునో అచ్చటనుత్తరోత్త రాషాఢోత్తరాభాద్ర నక్షత్రములని

గ్రహించవలయును; స్థిరం-స్థిరములను పేరుగలవి(అనగా కార్యమాంస్యము గుననుట) కాలమఘాత్రిపూర్వ: కాల — భరణియు మఘ - మఘానక్షత్రము; త్రిపూర్వం - పుబ్బ పూర్వాషాఢ పూర్వాభాద్రలు యీఐదును: ఉగ్రం - ఉగ్రములను పేరు-గలవి (అనగా మంచివిగావనుట) అనలేంద్రాగ్నీతు; అనల, కృత్తికయు; ఇంద్రాగ్నీతు-విశాఖయు యీరెండును: సాధారణం-సాధారణములను పేరుగలవి (అనగా మధ్యమములు] స్వాత్యాదిత్యహరిత్రయం: స్వాతి - స్వాతియు ఆదిత్య - పునర్వసు హరిత్రయం - శ్రవణధనిష్ఠాశతభిషములు ఈఐదును; చరం - చరములను పేరుగలవి: ఏతాని-ఈనక్షత్రములు; స్వసంజ్ఞాఫలం-తమ పేర్లకు తగినఫలములను దద్యాత్ - ఇచ్చును

తా॥ అశ్వని: హస్త: పుష్యమి ఈమూడును క్షిప్రనక్షత్రములు; మూల ఆర్ద్ర; జ్యేష్ట; ఆశ్లేషలు ౪ ను దారుణనక్షత్రములు చి...; రేవతి; మృగశీర్షానూరాధలు ౪ ను మృదునక్షత్రములు రోహిణి; ఉత్తర; ఉత్తరాషాఢ; ఉత్తరాభాద్ర; ద్రలు ౪ ను స్థిరనక్షత్రములు భరణిమఘపుబ్బపూర్వాషాఢ పూర్వాభాద్రలు ౫ నుఉగ్ర నక్షత్రములు కృత్తిక; విశాఖ ౨-ను సాధారణ నక్షత్రములు స్వాతి; పునర్వసు; శ్రవణ; ధనిష్ట; శతభిక్కు ౫ ను చరనక్షత్రములు ఈచెప్పబడిననక్షత్రములుతమ తమసంజ్ఞాఫలముల నిచ్చును అనగా క్షిప్రనక్షత్రములు శీఘ్రఫలమును దారుణనక్షత్రములు భయఫలమును మృదునక్షత్రములుమృదుఫలమును స్థిరనక్షత్రములుస్థిరఫలములనుఉగ్రనక్షత్రములు ఉగ్రఫలములనుసాధారణ నక్షత్రములుసామాన్య ఫలమును చరనక్షత్రములు చంచలఫలములనిచ్చుననుట.

## { గ్రహములకూరసౌమ్య పురుషస్త్రీనపుంసక సంజ్ఞాజాతినిర్ణయము }

శ్లో॥ క్రూరాభానుతమశ్శనిధ్వజకుజాశ్శుక్రార్యసౌమ్యేందవ
స్సౌమ్యాస్తేపురుషాఃకుజార్కగురవోరాహ్విందుశుక్రాః స్త్రియః
తచ్ఛేషాస్తునపుంసకాగురుభృగూవిప్రౌకుజార్కౌనృపౌ
వైశ్యౌచంద్రబుధౌతదన్యకులజః మందస్తువర్ణేశ్వరః ॥

(పదవిభాగము) క్రూరా॥ భానుతమశ్శనిధ్వజ కుజాః॥ శుక్రార్య సౌమ్యేందవః॥ సౌమ్యాః తే। పురుషా। కుజార్క-గురవః॥ రాహ్వింద్వుశుక్రాః స్త్రియః॥ తచ్ఛేషాః తు। నపుంసకాః॥ గురుభృగూ। విప్రౌ। కుజార్కౌ। నృపౌ। వైశ్యౌ। చంద్రబుధౌ, తదన్యకులజః॥ మందః। తు। వర్ణేశ్వరః

టీ॥ భానుతమశ్శనిధ్వజకుజాః॥కుజాః॥భాను-సూర్యుడుతమః-రాహువుశని-శనియు॥ ధ్వజ-కేతువు కుజాః-అంగారకుడు । ఈయయిదుగ్రహములు । క్రూరాః -

పాపులు।శుక్రార్యసౌమ్యేందవః।శుక్ర-శుక్రుడు।అర్య-బృహస్పతి। సౌమ్య- బుధుడు ఇందవః-చంద్రుడు। యీనాల్గుగ్రహములు।సౌమ్యాః—శుభగ్రహములు।(ఇచ్చటనొక్క విశేషము కలదు బుధుడు పాపగ్రహముతో చేరిన పాపుడగును। చంద్రుడు క్షీణ చంద్రుడయినచో పాపుడు పూర్ణచంద్రుడయిన శుభుడు యింతుకు కాలకోశినియందు వచనములు కలదు. శ్లో॥ బుధః పాపయుతః పాపః క్షీణ చంద్ర స్తథైవచ।అవి)కుజార్కగురవః । కుజ—అంగారకుడు।అర్క—సూర్యుడు;,గురవఃబృహస్పతిపురుషాః — పురుషగ్రహములు। రాహ్వేందుశుక్రాః-రాహు-రాహువు; ఇందు-చంద్రుడు।శుక్రాః శుక్రుడు। స్త్రియః—స్త్రీగ్రహములు। గురుభృగూ। గురు - బృహస్పతియు । భృగూ శుక్రుడును। విప్రౌ-బ్రాహ్మణగ్రహములు। కుజార్కౌ । కుజ-అంగారకుడు । అర్కౌ—సూర్యుడు। నృపౌ-క్షత్రియులు। చంద్రబుధౌ। చంద్ర-చంద్రుడు।బుధౌ - బుధుడు। వైశ్యౌ-కోమటిగ్రహములు। మందస్తు-శనైశ్చరః।తదన్యకులజః-తత్-అబ్రహ్మక్షత్రియ వైశ్యకులముకంటె। అన్య-యితరమైన। కులజః-కులమందు పుట్టినవాడు। వర్ణేశ్వరః-శూద్రవర్ణమున కధిపతియును। (అనగా శూద్రుడనుట)శూద్రకులమందు పుట్టినవానికి శూద్రవర్ణేశ్వరత్వముకలుగును గాని యితర వర్ణములకు కలుగవేరదు.

అవ. నవగ్రహములను శుభాశుభసంజ్ఞలకు పురుషస్త్రీనపుంసక సంజ్ఞలను బ్రాహ్మణాదజాతి నిర్ణయమునుం దెలియఁజేయుచున్నాఁడు.

తా॥ సూర్యుఁడు: కుజుఁడు శని, రాహువు, కేతువు యీ ౫ ను పాపగ్రహములు, చంద్రుఁడు: బుధుఁడు, బృహస్పతి,శుక్రుఁడు యీ౪ను,శుభగ్రహములు వీరిలో బుధుఁడుపాపగ్రహముతోఁ గూడినట్లయితే పాపయనిన్నీ,చంద్రుఁడు క్షీణదశయందు పాపియనిన్నీ, పూర్ణదశయందు శుభకరుఁడనిన్నీ, తా॥ సూర్యుఁడు, అంగారకుఁడు: బృహస్పతి యీ ౩ను: పురుషగ్రహములు: చంద్రుఁడు: శుక్రుఁడు రాహువు యీ ౩ ను; స్త్రీగ్రహములు, బుధుఁడు: శని: కేతువు యీ ౩ను: నపుంసక గ్రహములు, బృహస్పతిః శుక్రుడు యీ ౨ను బ్రాహ్మణగ్రహములుసూర్యుఁడు: అంగారకుఁడు యీ ౨ ను క్షత్రియ గ్రహములు. చంద్రుఁడు: బుధుఁడుయీ ౨ను వైశ్యగ్రహములు, శనైశ్చరుఁడుశూద్రవర్ణాధిపతియాక్రమమునగ్రహముల వర్ణనిర్ణయములు తెలియఁదగినదనితా ॥

## చంద్రునకు పూర్ణత్వ క్షీణత్వములు

శ్లో॥ అష్టమ్యోరుభయోశ్చ మధ్యమగతశుక్లాన్యయోర్వ్యత్యయే
పూర్ణః క్షీణఇతిక్రమాచ్ఛశధరః పూర్ణశ్శుభేమంగళే ।
కృష్ణాదాదినపంచకం శుభకరం తన్మధ్యమం ॥
తస్యాంత్యం త్వధమాభిధం శశివశాచ్ఛుక్లేతు తద్వ్యత్యయమ్

[పదవిభాగము] అష్టమ్యోః ఉభయోః చ । మధ్యమగతః, శుక్లాస్యయోః । వ్యత్యయే। పూర్ణః। క్షీణః। ఇతి। క్రమాత్ । శశధరః । పూర్ణః-శుభః మంగళే । కృష్ణాదౌ। దినపంచకం। శుభకరం। తన్మధ్యమం। మధ్యమం। తస్య। అంత్యం।తు। అథ మాఖిదం శశవశాత్ । శుక్లే। తు తద్వ్యత్యయం॥

టీ॥ ఉభయోః-రెండయిన- అష్టమ్యోః - శుక్లకృష్టాష్టములకు మధ్యగతః - మధ్యమందున్న, శశధరః : చంద్రుడు, పూర్ణః-పూర్ణచంద్రుడు, శుక్లాస్యయోః - శుక్లకృష్ణపక్షములకు: వ్యత్యయే-విపరీతముగా కలుగగా [అనగా కృష్ణశుక్లపక్షముల యొక్క అష్టములనుట] ఉభయోః-కృష్ణశుక్ల పక్షౌ అష్టములయొక్క మధ్యగతః - మధ్యకాలమందుండు చంద్రుడు. క్షీణః-క్షీణచంద్రుడు; క్రమాత్ - క్రమముగా పూర్ణః: పూర్ణచంద్రుడు - మంగళే - శుభకర్మయందు, శుభః — మంచివాడు; కృష్ణాదౌ - కృష్ణపక్షముయొక్క మొదటిభాగమందు; దినపంచకం అయిదుదినములు శుభకరం - శుభమునిచ్చునవి; తన్మధ్యమం, తత్-ఆకృష్ణపక్షముయొక్క।మధ్యమం మధ్యనుండు నైదుదినములు: మధ్యమం-సాధారణము; తస్య - ఆకృష్ణపక్షముయొ క్క, అంత్యం-చివరపంచకము; అథమాఖిదం -తక్కువతను పేరుగలది।శశవశాత్ చంద్రునిపూర్ణత్వ మధ్యత్వ క్షీణత్వయోగమువల్ల; శుక్లేతు - శుక్లపక్షమందైచేః తద్వ్యత్యయం - తత్ - ఆకృష్ణపక్షమునకు వ్యత్యయం: తల్లకిందును.

తా॥ చంద్రుడు శుక్లాష్టమి మొదలు కృష్ణాష్టమి వరకు పూర్ణుడు కృష్ణాష్టమి మొదలు శుక్లాష్టమి వరకు క్షీణుడు; క్షీణుడ శుభముచేయును పూర్ణుడు శుభము కలుగజేయును యిది సామాన్యము, విశేషమనగా కృష్ణపక్షాది యందైదుదినములు మిక్కిలి పూర్ణుడగుటచే నతిశుభుడు పూర్ణఫలమునిచ్చును షష్టీమొదలుదశమి పర్యంతము మిక్కిలి పూర్ణుడుకాకుండుటచే మధ్యముడై మధ్యఫలమునిచ్చును;ఏకా దశిమొదలు అమావాస్య పర్యంతము మిక్కిలి క్షీణుడై క్షీణఫలమునే యిచ్చును- శుక్లపక్షమందు దీని విపర్యమనగా ఆదిపంచకము క్షీణముమధ్యపంచకము:మధ్య మము; అంత్యపంచకము పూర్ణమని తెలియదగినది.

రజస్వలకు శుభాశుభసక్తాదివిషయములు

శ్లో॥ కన్యాయాఃప్రథమార్తవేశుభకరాణ్యాద్యంతమూలోత్తరా
బ్రాహ్మీజ్యేందుదినేశ పంచకహరిత్రీణ్యేవనాన్యానితు ।
వారాశ్చేందుజజీవశుక్ర శశినాం తేషాంచవర్గాశ్శుభాః
కేంద్రోపాంత్యత్రికోణ సహితాశ్చాన్యేరిలాభత్రిగాః ॥ 2

[పదవిభాగము] కన్యాయాః। ప్రథమార్తవే। శుభకరాణి।ఆద్యంతమూలోత్త రాః । బ్రాహ్మీజ్యేందుదినేశ పంచకహరిత్రీణి। ఏవ । న అన్యాని । తు వారాః।చ,

ఇందుజజీవశుక్రశశినాం. తేషాం, చ, వర్గాః శుభాః—కేంద్రోపాంత్య ధనత్రికోణ సహితాః; చ, అన్యే, అరిలాభత్రిగాః ॥

టీ॥ అద్యంతమూలోత్తరాః; అధి-అశ్వనియు, అంత్య-రేవతియు: మూల - మూలయు, ఉత్తరాః - ఉత్తరో త్తరాషాఢో త్తరాభాద్రలు: బ్రాహ్మ్యేందుదినేశ పంచకహరిత్రిణీ: బ్రాహ్మ-రోహిణి, ఇజ్య-పుష్యమియు, ఇందు - మృగశిరయు; దినేశపంచకం - హస్తచిత్రస్వాతివిశాఖానూరాధనక్షత్రములును;హరిత్రిణి-శ్రవణ ధనిష్టా; శతభిషములు; యీపమనేమ నక్షత్రము లే: కన్యాయాః, కన్యకయొక్క ప్రథమార్తవే-మొదటిరజస్సు రయందు, శుభకరాణీ-శుభమునిచ్చునని. అన్యానితు - మిగిలిన పదినక్షత్రములన-శుభకరములుకావు. ఇందుజజీవశుక్రశశినాం, ఇందుజ. బుధవారము, జీవ-బృహస్పతివారము. శుక్ర - శుక్రవారము: శశినాం; సోమవారము: వారాశ్చ-యీనాలుగువారములును; శుభకరాః - మంచివి; తేషాం - ఆబుధ గురుశుక్రచంద్రులయొక్క: వర్గాశ్చ-నవవర్గములును, శుభాః— మంచివి, శుభాః - శుభగ్రహములు, కేంద్రోపాంత్య ధనత్రికోణసహితాః: కేంద్ర- లగ్నచతుర్థసప్తమ దశములును: ఉపాంత్య-పదనొకండవస్థానమును, దనం - రెండవయిల్లునుత్రికోణ-పంచమనవమములును. సహితాః-శుభగ్రహములతో కూడినపై. శుభకరాః - మంచినిచేయును, (అనగాను కస్థానముల యందుండిమంచినిచేయుననుట) అన్యే - పాపగ్రహములు, అరిలాభత్రిగాః, అరి-అరవయింట: లాభ పదునొకండవయింట త్రి-మూడవయింట, గాః-వున్నవారై: శుభకరాః-మంచినిచేయును.

తా॥ అశ్వి: రోహిణి: మృగశిర, పుష్యమి, ఉత్తర, హస్త: చిత్త,స్వాతి, విశాఖ: అనూరాధ, మూల,ఉత్తరాషాఢ, శ్రవణము: ధనిష్ఠ, శతభిషక్, ఉత్తరాభాద్ర: రేవతి: ఈ ౧౭ నక్షత్రములయందు నమర్తాడిన శుభకరమనియు: భరణి: కృత్తిక: ఆర్ద్ర: పునర్వసు, ఆశ్రేష, మఖ: పుబ్బ: జ్యేష్ట: పూర్వాషాఢ: పూర్వాభాద్ర ఈ ౧౦ నక్షత్రములయందును సమర్తాడిన మంచిదికాదనియు సోమ, బుధ గురు శుక్రవారములయందు నమర్తాడిన శుభకరమనియు వీని లగ్నములగువృషభ మిధున కర్కాటక కన్య తుల ధనుః మీనలగ్నములను చంద్రహోరయు నీలగ్నముల ద్రేక్కాణములును నవాంశద్వాదశాంశ నుత్రిశాంశలునుశుభకరములయినవని తాత్పర్యము. ఒకలగ్నమునకు హోరలురెండుఅందుప్రథమాదిబేసిలగ్నములయందు మొదటిభాగము సూర్యహోర రెండవభాగము చంద్రహోర వృషభాది సమలగ్నములయందు ప్రథమభాగము చంద్రహోర రెండవభాగము సూర్యహోరద్రేక్కాణ మనగా లగ్నతృతీయభాగమనియు తాత్పర్యము మరియు శుభగ్రహములు రజస్వలయైన లగ్నమందును లగ్నమునకు రెండు నాలుగు ఐదు యేడు తొమ్మిది పది పదనొకండు యీయిండ్లలో మండెనేని శుభకరములనియును పాపగ్రహములు ౩-౬—౧౧ ఈస్థానములయందుండిన శుభము నిచ్చుననియు తాతకర్యము.

### రజస్వలకు ఉగ్రనక్షత్రములు

శ్లో॥ దుఃఖస్యాత్పిత్రౄరౌద్రయోరదితిభేనాబంధకీశక్రిభే ।
ప్యగ్నౌనిస్వతరార్కిభౌమదినకృద్వారేషు రోగార్తికృత్
వైధవ్యాసుతనిర్ధనాశుభఫలం యామ్యత్రిపూర్వోరగే
ష్వేకద్విత్రిచతుష్పదాని యువతేరద్యుః క్రిమాదార్ద్ర॥ వే॥ూ

(పదవిభాగము) దుఃఖీ స్యాత్ । పిత్రృరౌద్రయోః। అదితిభే। సా। బంధకీ।శక్రి భే। అపి । అగ్నౌ। నిస్వతరా, అర్కిభౌమదినకృద్వారేషు । రోగార్తికృత్, వైధవ్యాసుతనిర్ధనా శుభఫలం। యామ్యత్రిపూర్వోరగేషు । ఏకద్విత్రిచతుఃపదాని।యువతేః। దద్యుః। క్రిమాత్। ఆర్ద్రవే ॥

టీ॥ పిత్రృరౌద్రయోః— మఘార్ద్రలయందు,యేకన్యకప్రథమరజస్వలయగునో సా-ఆకన్యక, దుఃఖీ-దుఃఖముగలది, స్యాత్-అగును, శక్రిభే-పునర్వసు నక్షత్రమంతయినచో, బంధకీ-రంకులాడియగును, శక్రిభేపి—జ్యేష్టయందును, అగ్నౌ-కృత్తికయందును రజస్వలయినచో, నిస్వతరా-మిక్కిలి దరిద్రురాలగును, అర్కిభౌమ దినకృద్వారేషు-శని, అంగారక, రవి వారములయందయినచో, రోగార్తికృత్ - రోగపీడకలుగును. యామ్యత్రిపూర్వోరగేషు, భరణీ, పూర్వఫల్గునీ, పూర్వాషాఢా, పూర్వాభాద్రి, ఆశ్రేషనక్షత్రముల యందయినచో, ఏకద్విచతుః పదాని - ఒకటి రెండు మూడు నాల్గుపాదములయందు, యువతేః-స్త్రీకి; క్రిమాత్ — వరుసగా, వైధవ్యాసుతనిర్ధనాశుభఫలం-ప్రథమపాదము వైధవ్యము। ద్వితీయపాదము పుత్రులు లేకుండుటను, తృతీయపాదము దరిద్రత్వమును, చతుర్థపాదము అశుభఫలం-పాప ఫలమును: దద్యుః-ఇచ్చుచున్నవి.

తా॥ మఘః ఆర్ద్రి: ఈ ౨ నక్షత్రములయందు ప్రథమరజస్వలయైన వనిత దుఃఖియగును- పునర్వసునందు వ్యభిచారిణియగును, జ్యేష్ఠ: కృత్తిక, ఈ ౨ నక్షత్రములయందు మిక్కిలి దరిద్రురాలగును. భరణి పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్రి, ఆశ్రేష ఈనక్షత్రములయందు మొదటిపాదములందు విధవయగును రెండవ పాదములయందు గొడ్రాలగును. మూడవపాదములయందుదరిద్రురాలగును. నాల్గవ పాదములయందు నశుభఫలములపొందును. మఱియు నాదిత్యమంగళ శనివారముల యందు రజస్వలయిన రోగములచే పీడింపబడునని తాత్పర్యము.

### రజోదుష్టకాలము

శ్లో॥ సంధ్యోపప్లవపర్వపాత పరిఘారిక్తాష్టమీద్వాదశీ ।
షష్టీవిష్టివిపావచూదినివసా దుష్టగ సంస్థోరవిః।

రంధ్రేందుర్నిధనోడు భర్తురశుభా యోగా నిశా వైధృతిః ।
పాపాక్రాంతభమస్తపాపవసతిః కన్యార్తవే దోషకృత్॥ ౯

(పదవిభాగము) సంధ్యోపప్లవపర్వపాతపరిఘః. రిక్తాష్టమీద్వాదశీ షష్టివిష్టివిషావమాదిదివసాః దుష్టర్షసంస్థః। రవిః। రంధ్రేందుః। నిధనోడుః। భర్తుః। అశుభాః।యోగాః। నిశా। వైధృతిః । పాపాక్రాంతభం। అస్తపాపవసతిః । కన్యార్తవే।దోషకృత్॥

టీ॥ సంధ్యోపప్లవపర్వపాతపరిఘాః । సంధ్యా - సూర్యోదయాస్తమయకాలములయందు కలుగు సంధికాలమును; ఉపప్లవ—అపత్కాలము;లేక గ్రిహణకాలము పర్వ-అమావాస్యా పూర్ణిమా కృష్ణాష్టమి కృష్ణచతుర్దశీ సంక్రాంతులును పాత - వ్యతీపాతమహాపాతలును; పరిఘాః - పరిఘనామయోగమున్నూ రిక్తాష్టమీద్వాదశీ షష్టీవిష్టివిషావమాదిదివసాః, రిక్తా— చతుర్థినవమీ చతుర్దసులున్నూ; అష్టమీ-అష్టమియు; ద్వాదశీ-ద్వాదశియు, షష్టీ-షష్టియు, రెండుపక్షములయందు నుండునవి, విష్టి-భద్రికరణము: విష-వర్జ్యఘడియలు:అవమః-దినత్రియము; ఆది-త్రిద్యుస్పృత్ మొదలయినవిన్ని: శ్లో॥ దినత్రియంస్పృశత్యేకో వారస్యాదవమంహితత్। త్రివారస్పృక్తిధిర్యత్రి త్రిద్యుస్ప్రిగితివిందితః॥ఒకవారము మూడుదినములనంటినచోనవమయని పేరుగలుగును. ఒక తిధిమూడువారముల నంటిని త్రిద్యుస్పృగని పేరుగలుగును; దుష్టర్షసంస్థః-దుష్టనక్షత్రిమందుండు దుష్టనక్షత్రిమనగా యిదివరలో చెప్పబడిన కృత్తికాదినక్షత్రిములు; రవిః-సూర్యుడు, భర్తుః-పెనిమిటికి; రంధ్రేందుః - అష్టమి చంద్రిడును: నిధనోడు — నైధనతారయు; అశుభాః - అయోగ్యమయిన: యోగాః-యోగములున్నూ, [అనగా వజ్రివిష్టంభగండవ్యాఘాత శూలాతిగండము మొదలయినవ] నిశా-రాత్రిః; వైధృతి-వైధృతియు: పాపాక్రాంతభం — పాపగ్రిహములో గూడిన నక్షత్రిమును, లేకరాశియయినను, అస్తపాపవసతిః - రజోలగ్నముకంటె నేడవయింట పాపగ్రిహముంటుటయు: కన్యార్తవే-కన్యకయొక్క ప్రిథమరజస్వలయందు, దోషకృత్ - దోషముచేయునది.

తా॥ సూర్యోదయ సూర్యాస్తమయ కాలములు; గ్రహణకాలము. అమావాస్య, పున్నమి కృష్ణాష్టమి, కృష్ణచతుర్దశి; మేషాది సంక్రమణములు; వ్యతీపాతనామయోగము, మహాపాతలనగా వ్యత్రపైపరిలు, పరిఘానామయోగము; చవితి; షష్టి; అష్టమి; నవమి. ద్వాదశి, చతుర్దశి; భద్రకరణము, త్యాజ్యఘడియలు;అవమయనగా మూడుతిధులు గలసిన వారమును, త్రిద్యుస్పృగనగా మూడువారములతో గూడిన తిధియు, క్రిందచెప్పబడిన కృత్తికాది దుష్టనక్షత్రములయందు; సూర్యుడుండగాను, పెనిమిటి రాశికి నెనిమిదవయింట చంద్రిడుంటగాను నైధనతారయనగా జన్మనక్ష

త్రమునకు నేడవనక్షత్రమును వజ్రము, విష్కంభము,గండము,వ్యాఘాతము;శూలము; అతిగండము; యీమొదలయిన యశుభయోగములును; రాత్రి, వైధృతినామ యోగమును: పాపగ్రహములగు సూర్యాంగారక శనిరాహుకేతువులచే నాక్రమింపబడిన నక్షత్రములును: రజస్వలయయిన లగ్నముకు నేడవలగ్నమందు సూరాద్య పాపగ్రహములుండగా నీచెప్పబడిన కాలములు ప్రథమరజస్వలకుదోషమునుచేయునవియనుట

## వస్త్రాది నిర్ణయము

శ్లో॥ సప్తైకాష్ట చతుష్షడక్షి నవదిక్పుత్రాదిసంఖ్యాః క్రమా ।
ద్రామాద్య్రబ్ధికరాబ్ధిరామ శశభృచ్చంద్రారజో బిందవః ।
జీర్ణం శ్యామలరక్త శుభ్రమలినం కాషాయచిత్రంచతత ।
ద్వస్త్రంధాతుమయంచపృచ్ఛకవశాత్ప్రాచ్యాది కాష్ఠాఫలమ్

(పదవిభాగము) సప్త। ఏక। అష్ట: చతుః షడక్షినవదిక్పుత్రాదిసంఖ్యాః, క్రమాత్। రామాద్ర్యబ్ధికరాబ్ధి రామశశభృచ్చంద్రాః । రజోబిందవః।జీర్ణం । శ్యామలరక్త శుభ్రమలినం; కాషాయచిత్రం। చ: తద్వస్త్రం । ధాతుమయం। చ । పృచకవశాత్। ప్రాచ్యాదికాష్టాఫలమ్ ॥

టీ॥ పృచ్ఛకవశాత్-ప్రశ్ననడుగవానినిబట్టి, ప్రాచ్యాదికాష్టాఫలం - తూర్పుదిక్కు మొదలు క్రమముగా ఫలములను, వదేత్—చెప్పవలయును.క్రమాత్-క్రమముగా: సప్తైకాష్టచతుష్టడక్షినవదిక్పుత్రాదింఖ్యాః: సప్త—ఏడు; ఏక — ఒకటి, అష్ట — ఎనిమిది, చతుః—నాలుగు. షట్-ఆరు, అక్షి-రెండు, నవ - తొమ్మిది; దిక్ - పది పుత్రాదిసంఖ్యాః-పుత్రులుమొదలగు సంఖ్యలను చెప్పవలయును- రామాద్ర్యబ్ధికరాబ్ధిరామశశభృచ్చంద్రః, రామ—మూడు; అద్రి-యేడు; అబ్ధినాలుగు, కర - రెండుడు, అబ్ధి-నాలుగు, రామా - మూడు; శశభృత్ - ఒకటి, చంద్రాః - ఒకటి: రజోబిందవః-శోణితబిందువుల చెప్పవలయును. తద్వస్త్రం-తత్-అస్త్రీయొక్క: వస్త్రంబట్ట; జీర్ణం-చిరిగినది- శ్యామలరక్త శుభ్రమలినం - శ్యామల - శ్యామలరంగుకలది రక్త- మెరపినది, శుభ్ర-తెల్లనిది, మలినం - నల్లనిది, కాషాయచిత్రం - కాషాయ-కాషాయవర్ణముగలది. చిత్రం-చిత్రవర్ణముగలది: ధాతుమయం-ధాతువికారమయినది అని చ్ప్పవలయును.

తా॥ అడుగవచ్చినవాడు జోస్యుడైన తనకు తూర్పుననుండి యడిగిన నేడు గురుపుత్రులనియు: మూడు రజోబిందువులనియు జీర్ణవస్త్రమనియును జెప్పవల

వలయును. ఆగ్నేయదిక్కునుండి యడిగిన నొక్కపుత్రిదనియు నేడు బిందువు లనియు నీలవస్త్రమనియుఁ దక్షిణమునుండియడిగిననెనమండ్రుగురుకొడుకులనియు నాల్గుబిందువులనియు. ఎఱ్ఱనివలువయనియు, నిర్ ఋతిదిక్కునుండినచో నలుగురు కొమరులు: రెండుబిందువులు తెల్లబట్టయనియు, పశ్చిమదిశనుండినచో నాల్గురుకొమ రులనియు, ౪ బిందువులనియు: మురికివలువయనియు: వాయవ్యదిశనుండినచో ౨ కొమరులనియు: ౩ బిందువులయు, చెంగావి చీరెయనియు: కుబేరదిశనుండినచో ౯ కొమరులు; ౧ బిందువ: నానారంగులుగల వస్త్రమనియు, ఈశాన్యదిశనుండినచో ౧౦ కొమరులనియు: ౧ బిందువనియు: గైరికాదిధాతురంగుగలవలువయునని క్రమ ముగా తూర్పుమొదలుకుని చెప్పవలయును.

బిందుఫలనిర్ణయము

శ్లో॥ శ్యామంమృత్యుకరంబృఢం శుభకరంచిత్రంచదారిద్ర్యకృ ।
రక్తంవ్యాధికరంసితంసుతకరం వస్త్రంరజోదూషితమ్।
స్త్రీణాంబిందుసమత్వమామయకరం కన్యాప్రదంచార్తవే ।
బిందూనాంవిషమత్వమేవ సుతకృద్భాగ్యప్రదంసర్వదా॥ ౧౧

(పదవిభాగము) శ్యామం। మృత్యుకరం। దృఢం। శుభకరం। చిత్రం। చ। దారి ద్రకృత్। రక్తం। వ్యాధికరం। సితం। సుతకరం। వస్త్రం। రజోదూషితం । స్త్రీణాం। బిందుసమత్వం, ఆమయకరం। కన్యాప్రదం। చ। ఆర్తవే । బిందూనాం।విషమత్వం ఏవ। సుతకృత్। భాగ్యప్రదం। సర్వదా ॥

టి॥ స్త్రీణాం—స్త్రీలకు; రజోదూషితం - ముట్టుచే దూషింపబడు; వస్త్రం - వలువ: శ్యామం-నల్లనిదైనచో: మృత్యుకరం - మరణముచేయును. దృఢం-చిరగ కున్నచో; శుభకరం - మంచినిచేయును. చిత్రం- నానారంగులు గలిగినచోః దారి ద్ర్యకృత్—దరిద్రముకలుగును; రక్తం—యెఱ్ఱనిదైనచో: వ్యాధికరం-రోగముకలుగ చేయును. సితం - తెల్లనిదైనచో సుతకరం - కొమరుల గలుగజేయును. ఆర్తవే - ముట్టగుకాలమందు బిందుసమత్వం - సమసంఖ్యగల బిందువులుకలిగినచో,ఆమయ కరం - రోగముఁగలుఁగజేయును: కన్యాప్రదం -ఆడపిల్లలఁగగజేయును. బిందూ నాం-బిందువులయొక్క విషమత్వం - బేసిసంఖ్యగలుఁగుట సుతకృత్ - కొమరు లఁగలుఁగజేయును సర్వదా-కాలమంతయు భాగ్యప్రదం- భాగ్యము కలుగజేయును.

తా॥ నల్లచీరకట్టుకొని బయటనున్న మరణముచేయును. గట్టిచీరకట్టుకొని వెలుపలనున్న శుభముచేయును పెక్కురంగులుగలవస్త్రముకట్టుకొని వాకిటనున్న దరిద్రిగలుగును ఎర్రచీరకట్టి ముట్టయిన రోగముకలుగును తెల్లచీరయయిన కొమ రులు కలుగును. ౨-౪ ఈరీతున సమబిందువులయినచో రోగము స్త్రీసంతతి

కలుగును। ౩-౫ యిట్లుచేసి బిందువులయినచో పురుషసంతానమునెల్లప్పుడు వయిద
వతనము కలుగును-యీఫలములన్నియు ప్రథమసమస్తము చెప్పబడినవి.

గర్భాధానము

శ్లో॥ గర్భాధానమరిష్టమష్టమవిధౌ పాపగ్రహాక్రాంతభే।
దస్రాహిద్వయకాలమూలనిధనజ్యేష్ఠాంత్యజన్మోడుషు।
షష్ఠీవిష్టివిషావమాసు పరిఘాద్యర్ధే దివా వైధృతౌ।
సంధ్యాపర్వచతుర్దశీ వ్రతపితృశ్రాద్ధేషు పాతే భవేత్ ౧౨॥

(పదవిభాగము) గర్భాధానం అరిష్టం । అష్టమవిధౌ పాపగ్రహాక్రాంతభే
దస్రాహిద్వయకాలమూలనిధనజ్యేష్ఠాంత్యజన్మోడుషు। షష్టివిష్టివిషావమాసు।పరిఘా
ద్యర్ధే। దివా। వైధృతౌ। సంధ్యాపర్వచతుర్దశీ వ్రతపితృశ్రాద్ధేషు । పాతే । భవేత్॥

టీ॥ అష్టమవిధౌ-దంపతులకష్టమ చంద్రుని యందును పాపగ్రహాక్రాంతభే
పాపగ్రహముతో గూడిన నక్షత్రమందును, దస్రాహిద్వయకాలమూల నిధనజ్యేష్ఠాం
త్యజన్మోడుషు; దస్ర-అశ్వనియందు: అహిద్వయ—ఆశ్లేషామఘలయందు కాల -
భరణియందు, మూల— మూలయందు,నిధన-దంపతులకు; నైధనతారయందుజ్యేష్ఠా-
జ్యేష్ఠానక్షత్రమందు: అంత్య-రేవతినక్షత్రమందు, జన్మోడుషు-దంపతులకుజన్మనక్ష
త్రములయందు యీతొమ్మిదినక్షత్రములయందు, షష్టివిష్టివిషావమాసు,షష్టి,రెండు
పక్షములలోని షష్టియందు: విష్టి - భద్రకరణమందు. విషా—వ్యతిపాత ఘడియలయందు
అవమాసు-దినత్రయమందు. పరిఘాద్యర్ధే- పరిఘనామయోగముయొక్క పూర్వార్ధ
మందు: దివా- పగటియందు: వైధృతౌ - వైధృతినామయోగమందు, సంధ్యాపర్వ
చతుర్దశీ వ్రతపితృశ్రాద్ధేషు-సంధ్యా- రెండుసంధ్యాకాలములయందు. పర్వ — పంచ
పర్వలయందు: చతుర్దశీ - శుక్ల చతుర్దశీయందు [కృష్ణచతుర్దశి పంచపర్వలయం
దంతర్భావము జెందితనుట]వ్రతె-వ్రతదినమందు:పితృశ్రాద్ధేఘాతల్లిదండ్రుల శ్రా
ద్ధములయందు, పాతే—వ్యతీపాతమహాపాతలయందు గర్భాధానం - గర్భాధానము
స్యాద్యది-అయినట్టులయిన అరిష్టం అశుభము భవేత్-అగును.

తా॥ భార్యాభర్తలరాశి కెనిమిదవయింట చంద్రుడుండగాను ముందుచెప్ప
బడిన సూర్యాదిపాపగ్రహముల గూడిన నక్షత్రములయందు అశ్వని భరణి ఆశ్లేష
మఘ జ్యేష్ఠా మూల రేవతి ఈనక్షత్రములయందు దంపతులయొక్క జన్మనక్ష
త్రమందు రెండుపక్షములయందుండు షష్టులయందు పరిఘనామయోగముయొక్క
పూర్వభాగమందు పగటియందు వైధృతినామయోగమునందు సూర్యోదయాస్తమయ
కాలములయందు, పంచపర్వలనగా, కృష్ణాష్టమి,కృష్ణచతుర్దశి, పూర్ణిమ, అమావా

స్య, సంక్రాంతులయందును, శుక్లచతుర్దశియందును, ఏకాదశిమొదలుగాగల వ్రత దినములయందు శ్రాద్ధదినములయందును వ్యతీపాతమహాపాతయందును ఈరోజుల యందు గర్భాధానము కూడదనుట

ఋతుకాల నిర్ణయము

శ్లో॥ స్త్రీణా మార్తవదర్శనాది దినతస్స్యాత్షోడశర్తుక్షపాః ।
పుత్రార్థీవరయేత్సమాసు సుముఖీంతాస్వేవశుద్ధాంకృశామ్।
పుంలగ్నే పురుషైరవేక్షితయుతే పుంవర్గ సంస్థైర్గ్రహై
ర్జీవేలగ్నసుతాంకగేయదిసుతస్సద్వ్యత్యయే పుత్రికా ॥ ౧౩

[పదవిభాగము] స్త్రీణాం, ఆర్తవదర్శనాదిదినతః స్యాత్, షోడశ: ఋతుక్షపాః। పుత్రార్థీ। వరయేత్। సమాసు। సుముఖీం। తాసు ఏవ। శుద్ధాం। కృశాం । పుంలగ్నే। పురుషైః ఆవేక్షితయుతే: పుంవర్గసంస్థైః। గ్రహైః। జీవే । లగ్నసుతాంకగే యది। సుతః తద్వ్యత్యయే। పుత్రికా ॥

టీ॥ స్త్రీణాం - స్త్రీలకు, ఆర్తవదర్శనాదిదినతః - ప్రథమ రజస్వలయిన మొదటిదినము మొదలు షోడశ-పదునారుదినములు: ఋతుక్షపాః — ఋతురాత్రులు స్యాత్-అగును, పుత్రార్థీ - పుత్రసంతానము కోరువాడు, తాస్వేవ - ఆపదునారురాత్రులయందే: సమాసు-సమరాత్రులయందు, సుముఖీం — అనుకూలవంతురాలైన శుద్ధాం — పరిశుద్ధురాలైనట్టి: [అనగా స్నానముచేసినదనుట] కృశాం - రజస్వలా నియమములచేత జిక్కినటువంటిన్ని భార్యను: వరయేత్ -పొందవలయును-ఇచ్చట నొక విశేషముగలదు పదునారుదినములలో మొదటినాల్గుదినిములునిందితములుగనుక వానిని వదలి మిగతదినములలో సంగమము జేయవలయును, ఇందుకువచనముశ్లో॥ ఋతుస్స్వాభావికా స్త్రీణాం రాత్రయష్షోడశస్మృతాః, చతుర్భిస్త్వితరైస్సార్ధమహోభిస్సద్విగర్హితైః । తాసామాద్యాశ్చతస్రస్తు నింద్యా ఏకాదశీచయా। త్రయోదశీచశేషాసుప్రశస్తాదశరాత్రయ ఇతి తా॥ స్త్రీలకు స్వభావముగా పదునారురాత్రులు ఋతుకాలము ఆపదునారురాత్రులతో నింద్యములయిన రాత్రులుకూడచేరినవి, రజస్వలయినది మొదలునాల్గుదినములను, ఏకాదశియు: త్రయోదశియు: నింద్యములు మిగిలిన పదిరోజులు శ్రేష్టములయినవి యని తాత్పర్యము ఇంతియెగాక పుంవర్గసంస్థైః వర్గమనగా షడ్వర్గము పురుషసంజ్ఞగలరాశి వర్గమందుగాని లేక పురుషగ్రహాధిపత్యముగలరాశి వర్గమందుగాని స్థితైః-ఉన్నటువంటివి: పురుషైః - పురుష గ్రహములచే అవేక్షితయుతే - చూడబడినదయిన(కూడినదయిన)పుంలగ్నే-పురుష లగ్నమందు. జీవే-బృహస్పతి లగ్నసుతాంకగే - లగ్నపంచమనవమములయందు

స్యాద్యది–వున్నట్లాయనా: పుత్రః-కొమరుడును: తద్వ్యత్యయే - యిదివరకుచెప్పిన దానికి విపరీతమయినచో: పుత్రికా-కుమార్తె, కలుగును

తా॥ స్త్రీలకు రజోదర్శనదినము మొదలు పదునారురాత్రులుఋతు రాత్రిం నంబడును. పుత్రసంతానమును గోరినవారీ పదునారురాత్రులలోసమదినంబులఋతు స్నానాదులచే పరిశుద్ధురాలును: ఋతునియమాదులచే గ్రహించినదేహముగలదియును తనకత్యంతప్రియురాలునగు భార్యతో అలింగనము చేయవలయును మరియుపురుష రాసులగు మేష:మిధున, సింహ: తులా:ధను॥కుంభషడ్వర్గులయందైనపురుషగ్రహ రాసులయిన మేష, సింహా।వృశ్చికధనుర్మీనములషడ్వర్గులయందైననీరాసుల పురుష గ్రిహములగూడియుండినచూడబడినను బృహస్పతిలగ్నపంచమనవమ స్థానముల యందుండగాను గర్భాధానముచేసిన పుత్రుండు కలుగుననియు స్త్రీరాసులయిన వృషభకర్కాటక కన్యా వృశ్చిక మకర మీనరాసులయందైనను స్త్రీగ్రిహరాసు లైన వృషభ కర్కాటక తులారాసుల షడ్వర్గులయందైనను లగ్నము స్త్రీగ్రిహము లచే జూడబడియయినను: స్త్రీగ్రిహములతో గూడియయిననుండగానులగ్నపంచమ నవమ స్థానములయందుబృహస్పతిలేకుండగానుగర్భాధానముచేయగాపుత్రిక కలుగ నని తాత్పర్యము

పుంసవనకాలము

శ్లో॥ కుర్యాత్పుంసవనం కరత్రయవిధిశ్రోణత్రయార్యోత్తరా।
మిత్రాంత్యాదితిమూలదస్రశశభృద్భేష్వాద్యగర్భేస్ఫుటే ।
లగ్నే పుంగ్రహవాసరే రవిగృహంత్యక్త్వాలినద్మాప్యమా।
రిక్తాఛిద్రవివర్జితేఽహ్ని యువతౌ మాసేతృతీయేపతిః ॥ ౧౪

[పదవిభాగము] కుర్యాత్। పుంసవనం। కరత్రయ విధిశ్రోణత్రియార్యోత్తరా మిత్రాంత్యాదితిమూలదస్రిశశభృద్భేషు, అద్యగర్భే। స్ఫుటే।లగ్నే పుంగ్రహవాసరె రవిగృహం। త్యక్త్వా. అళినద్మ అపి అమారిక్తాచిద్రివివర్జితే అహ్ని యువతౌ। మాసె, తృతీయే: పతిః॥

టీ॥ ఆద్యగర్భే-మొదటిగర్భము; స్ఫుటె-స్పష్టమగుచుండగా । కరత్రియ విధిశ్రోణత్రియార్యోత్తరా మిత్రాంత్యాదితిమూలదస్రశశభృద్భేషు:కరత్రయ–హస్త చిత్ర, స్వాతులు, విధి-రోహిణి; శ్రోణత్రయా-శ్రవణధనిష్టాశతభిషములు: అర్య - పుష్యమి; ఉత్తరా-ఉత్తర ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్రిలు; మిత్ర - అనూరాధ: అంత్య - రేవతి: అదితి–పునర్వసు మూల-మూలదస్రి-అశ్వనిశశభృత్ - మృగశిర యీనక్షత్రములయందు లగ్నే-పురుషలగ్నమందు పుంగ్రిహవాసరే పురుషగ్రిహ

వారములయిన రవికుజగురువారములయందును. రవిగృహం-సింహం ఆళిసద్మాపి-వృశ్చికమునున్నూ: త్యక్త్వా-వదలి; అమా రిక్తా ఛిద్రివివర్జితే - అమా - అమావాస్య రిక్తా-రిక్త తిథులయిన చవితి నవమి; చతుర్దసులను-ఛిద్రి-చెప్పబోవు పక్షఛిద్రిములను; వివర్జితే-వదలిన, అహ్ని-దినమందును: తృతీయో-మూడవదయిన,మాసె-మాసమందు, యువతౌ - స్వభార్యయందు; పతిః, - పెనిమిటి, పుంసవనం—పుంసవనమను కర్మను, కుర్యాత్ - చేయవలయును.

తా॥ తొలుత గర్భము కలిగిన వనితకు మూడవమాసమందు; అశ్వనిరోహిణీ మృగశిర; పునర్వసు; పుష్యమి; ఉత్తర; హస్త; చిత్త; స్వాతి; అనూరాధ; మూల ఉత్తరాషాఢ; శ్రవణము; ధనిష్ట; శతభిషము; ఉత్తరాభాద్ర. రేవతియానక్షత్రములయందును వృశ్చిక సింహరాసులయందును; చవితి నవమి చతుర్దశిఅమావాస్యలవదలి మిగిలిన శుభదినములయందును; గర్భముకుశుభము కలుగుటకై పెనిమిటియైనవాడు పుంసవనమనెడికర్మనుఁజేయవలయును.మఱియునాపస్తంభసూత్రిమందుస్త్రీలకుగర్భముస్పష్టముగా నగుపడిన పిదప పుంసవనము చేయువలయునని చెప్పియున్నదిగాని మాసనియమముఁ జెప్పలేదుగాపునచన్పిట మూడవమాసమనిచెప్పుట గర్భ స్పష్టమయిన తర్వాత యని తెలియజేయుటకే యని తెలియవలయును

సీమంతకాలము

శ్లో॥ పూర్వం పుంసవనే యథైవ కథితం మాసవ్యవస్థాం వినా ।
సీమంతేఽపి తథైవ మాసవిషయే షష్ఠే చతుర్థేఽష్టమే
లగ్నాదంత్యసుతాష్టమేషు రహితేష్వర్కాదిపాపగ్రహైః ।
శ్చంద్రే లగ్నవివర్జితే చ నవమే శుద్ధే సముం పుంసవే ॥౧౫॥

[పదవిభాగము] పూర్వం। పుంసవనే। యథా। ఏవ। కథితం। మాసవ్యవస్థాంవినా సీమంతే। అపి। తథా। ఏవ। మాసవిషయే షష్ఠే। చతుర్థే। అష్టమే।లగ్నాత్। అంత్య సుతాష్టమేషు। రహితేషు। అరాకాదిపాపగ్రిహైః। చంద్రే । లగ్నవివర్జితే । చ నవమె। శుద్ధే।నమం। పుంసవే ॥

టీ॥ పూర్వం—ముందుగా:పుంసవనే-పుంసవనకర్మయందు; యథైవ-యేవ్రికారము; కథితం-చెప్పఁబడెనో; మాసవ్యవస్థాం నా-మాసనియమమునువదలి; సీమంతేపి—సీమంతకర్మయందును తథైవ-అప్రికారమే; మాసవిషయే - మాసనియమం. నైతే;షష్టే-ఆరవమాసమందును;చతుర్థే-నాలుగవమాసమందును;అష్టమే—ఎనిమిదవ మాసమందును దీనిలో నేమాసమందైనను(జేయవలయునని;లగ్నాత్-సీమంతలగ్నమునుంచి, అంత్యసుతాష్టమేషు, అంత్య - పండ్రెండు: అయిదు ఏనిముదిరానులయ్య అర్కాదిపాపగ్రిహై సూర్యుడుమొదలగు పాపగ్రిహములతో రహితేషు - కూనః

మగుచుండగా, చంద్రే-చంద్రుడు, లగ్నవివర్జితే - లగ్నమందుండవివాడగుచుం డగా: నవమె-తొమ్మిదవయిల్లు, శుద్ధె-గ్రహములేవిదగుచుండగా: సీమంతం-సీమం తకర్మ, కార్యం-చేయదగినది. పుంసవే-పుంసవనమందును: యీచెప్పబడినదంతయు సమం-సమానము:

తా॥ పూర్వశ్లోకంబున: పుంసవనవిషయమయి చెప్పిన, మాసకర్మముతప్ప తక్కిన, దినవారనక్షత్రిదులు:సీమంతమునకును: గ్రహించతగినవిమాసవిషయమై ౪-౬ వమానములయందును: పంచమాష్టమ, ద్వాదశములయందు: సూర్యాంగారక శనిరాహుకేతు క్షీణచంద్రాది, పాపగ్రహములులేక యుంతగాచంద్రుడు లగ్నము నందులేకయుంతగా, నవమశుద్ధిగల లగ్నమునందు, సీమంతముచేయవలయును. ఉత్తరార్ధమునచెప్పినవన్నియు, పుంసవనముకు: గూతగ్రహించవలయునని తా॥

జాతకర్మ కాలనిర్ణయము

శ్లో॥ జాతేజాతదినాదిరాదశదినా త్తజ్జాతకర్మాత్మజె।
కుర్యాద్రిద్రిదినేధవాస్థి చరక్షిప్రాముఖ్యమైత్రోడుషు ।
రిక్తామారహితేస్యఖండదివసే లగ్నేశుభేవాసరే ।
పూర్ణోహ్నైసురపూజితేసురగురావ్యక్తేచసౌమ్యాయనే॥ ౧౬

తా॥ పుత్రోత్పత్తి కాలమందైనను పుత్రోత్పత్తి దినముమొదలుదినములవరకు నేదినమందైనను జాతకర్మ జేయవలయును. మఱియుపదినొకండవ దినమందైన చేయవలయును యీచెప్పబడినదినములలోచేయనట్లయినచో అశ్వని: రోహిణి:పున ర్వసు పుష్యమి: ఉత్తర, హస్త, స్వాతి అనూరాధ: ఉ॥రాషాఢ: శ్రవణము, ధనిష్ఠ శతభిషము: ఉ॥రాభాద్ర: యీనక్షత్రములయందును, చవితి, నవమి: పున్నమ: అమావాస్య, ఇవితప్పతక్కిన తిథులయందును ఉ॥ రాయణమునందును గురుశుక్ర మూఢములులేని. కాలమునందును; పూర్ణతిథులయందును: సోమ: బుధ: గురు శుక్ర: వారములయందు శుభగ్రహాధిపలగ్నములయందు. యీలక్షణములుగలశుభ దినపూర్వభాగమందు జాతకర్మచేయవలయునని తాత్పర్యము

నామకరణ కాలనిర్ణయము

శ్లో॥ జాతానంతర మేవకరణం త్వేకాదశాహేస్ఫుటం ।
పుత్రిస్యైవసమాక్షరంతుయువతేఃకార్యంతతోవ్యత్యయం।
శుద్ధిజాతవచ్ఛనామ్ని సకలై స్త్ర్యాదశేషాడశే ।
ద్వావిం శేష్వథవింశకేహ్ని విహితంజాతివ్యవస్థాంవినా॥ ౧౭

తా॥ పుత్రుకుకలిగిన, క్షణంబున: నక్షత్రనామమనఁగా రోహిణీ: నక్షత్రమందు:బుట్టినవానికి:రౌహిణుడు:మొదలగు నక్షత్రనామకరణము,రహస్యముగాజేసి ౧౧వరోజున,కుమారునిషయమైనమానవర్ణములుగల పేరఁనగాకృష్ణఃశివఃమహేశ్వర, ఇట్టివ్యవహారనామములను: కూతరివిషయమైజేసి యక్షరములు, గల నామములనఁగా జానకీ, పార్వతి, భవాని, ఇట్టినామములు నిశ్చయించవలయునుఈనామకరణవిషయమై, లగ్నాదిశుద్ధపూర్వశ్లోకమందు, జాతకర్మకునిర్ణయించినప్రకారమని తెలియవలయును. ౧౧ వదినమందుచేయని పక్షంబున బ్రాహ్మణులుమొదలుగాగల వర్ణములకు౧౦ దినములపర్యంతముజాతాశౌచమని,విశేషవచనముండుటవలనజాతిభేదములేక నాలుగువర్ణములవారు,పుట్టినదినముమొదలు, ౧౨:౧౬,౨౦,౨౨వీనిలో నేదినమందయినను: నామకరణము, జేయవలయునని తాత్పర్యము.

## అన్నప్రాశన కాలనిర్ణయము

శ్లో॥ అన్నప్రాశనమర్భకస్యశుభదం మాస్యేవయుగ్మేశుభే ।
షష్ఠాద్యావధపంచమాదివిషమె మాసేషధూనాంశుభే ।
వారేసౌమ్యగ్రహేవిశుద్ధతశమేసందాష్టమీద్వాదశీ ।
రిక్తామాగహిరాదిసేచరమృదు క్షిప్రధ్రువాఖ్యోడుషు ॥౧౮॥

తా॥ పురుషశిశువు,విషయమై యారవమాసముమొదలు సంవత్సరములోపల వరిమాసములయందును:ఆడపిల్లలవిషయమై ౫ వమాసముమొదలుచేసిమాసముయందును, సోమ, బుధ,గురు, శుక్రవారములయందును-అన్నప్రాశన లగ్నము పదవయింట గ్రహములేకుండగాను: వృషభ, కర్కాటక,మిధునకన్యా,ధనుర్మీనములనెడి శుభలగ్నములయందును, పాడ్యమి: చవితి, షష్టి, అష్టమి, నవమి: ఏకాదశి,ద్వాదశి అమావాస్య: పున్నమి, వీనికన్న నితరమయిన దినములయందును అశ్వని,రోహిణి మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర హస్త, చిత్త: స్వాతి, అనూరాధ: ఉత్తరాషాఢ, శ్రవణము: ధనిష్ట, శతభిషక్: ఉత్తరాభాద్ర:రేవతి: యీనక్షత్రములయందు అన్నపాశన జేయవలయునని తా॥

## అన్నప్రాశనలగ్నగితగ్రహఫలనిర్ణయము

శ్లో॥ కుష్ఠిలగ్నగతేరవౌతకనుకశేచంద్రేసదాభిక్షుకః ।
పూర్ణేందౌబహుసత్రతద్యజ్వనిసుతే పిత్తాదిజాతోజ్ఞానవాన్ ।
జైజీవేబహుభోగవాన్భృగుసుతే దీర్ఘాయురర్కాత్మజే ।
వాతాంగీతమసిథ్వజేప్యనశనీ బాలోన్నభోక్తాభవేత్ ॥౧౯॥

తా॥ అన్నప్రాశనలగ్నమందుసూర్యుడుండినచోచిన్నవాడుకుష్ఠరోగియగును క్షీణచంద్రుడుండిన దరిద్రుడును; పూర్ణచంద్రుండుండినయన్నదాతయును అంగారకుడుండిన పైత్యరోగియును; బుధుడుండిన;విశేషజ్ఞానవంతుడును;గురువుండిమిక్కిలి భోగవంతుడుగు శుక్రుడుదీర్ఘాయువుగలవాడును; శనైశ్చరుడుండిన వాతరోగియును రాహు కేతువులుండిన మిక్కిలి దరిద్రుడైయుండునని తాత్పర్యము

కేశఖండన కాలనిర్ణయము

శ్లో॥ జన్మాద్దాసమవత్సరేషుపుత్రవిషయే స్త్రీణాంతుతద్వ్యత్యయే ।
కార్యంచాదిమకేశఖండనమిదం పూర్వేహ్ని సౌమ్యాయనే ।
ఆదిత్యాద్ద్వయదస్రపౌష్ణశశభృద్విష్ణుత్రయార్కత్రయే ।
పూర్ణాహే శుభవాసరేజయదినేచాష్టమ్యమావర్జితే ॥౨౦॥

తా॥ పుత్రవిషయమైపుట్టినదిమొదలు సరినెలలయిన ౨: ౪: ౬: నెలలయందును: స్త్రీవిషయమైబేసినెలలయిన ౩-౫-౭ నెలలయందును ఉభయులకు ఉత్తరాయణమందును అశ్విని మృగశీర్ష: పునర్వసు: పుష్యమి: హస్త: చిత్త: స్వాతి:శ్రవణము; ధనిష్ఠ:శతభిషము; రేవతీ: ఈనక్షత్రములయందును;సోమ:బుధ:గురు:శుక్రవారములయందును తదియ: అష్టమి త్రయోదశి: అమావాస్యలు వదలి పైన చెప్పిన మాస నక్షత్రములతో గూడిన పూర్ణతిథియందు బాలురకుఁ గేశఖండనముఁ జేయవలయునని తా॥

కర్ణవేధ యోగ్యకాలనిర్ణయము

శ్లో॥ జాతాద్ద్వాదశషోడశేహ్ని నిధనేశుద్ధేష్టమేసప్తమే ।
షష్ఠేమాసిశుభేచవారభవనే కర్ణౌ సువేధ్యౌశిశోః ।
రిక్తాపర్వనిశాదినాదిరహితే సంపూర్ణతిథ్యక్షయోః ।
సౌమ్యాదిత్రయ:రద్వయోత్తరహరశ్రోణద్వయార్ద్రేందుషు॥౨౧॥

తా॥ శిశుపుట్టినదిమొదలు పండ్రెండవదినమందైనపదునారవదినమందైను పగటియందును కర్ణవేధలగ్నమునకెనిమిదవయింటనేగ్రహమును లేకయుండగా చెవులుకుట్టవలననది. యీ చెప్పబడినకాలము నతిక్రమించినను ౬ ౭ యీ నెలల యందును సోమ బుధ గురు. శుక్రవారములయందును వృషభ మిధున కర్కాటక కన్యా ధనుర్మీనలగ్నములయందును చవితి నవమి చతుర్దశి పూర్ణిమ అమావాస్య కృష్ణాష్టమి కృష్ణచతుర్దశి సంక్రమణములు రాత్రిశుక్లపాడ్యమి వీనియందుతప్ప పూర్ణతిథి నక్షత్రములయందును మృగశీర్ష ఆర్ద్ర పునర్వసు పుష్యమి

హస్త, చిత్త: ఉత్తర, ఉ॥సాషాఢ, శ్రవణము, ధనిష్ఠ: ఉ॥భాధ్ర, రేవతి ఈనక్షత్రములయందు బాలురకు చెవులుకుట్టవలయునని తా॥

## చౌలకాలనిర్ణయము

శ్లో॥ మద్యేష్వూత్తరవాయుమిత్ర వరుణబ్రహ్మాభిధేష్వూత్తమో,
చిత్రాంత్యేందుపునర్వసూ ద్వయకరశ్రోణద్వయాద్యేదివా।
బాలస్యత్రితయోఽథపంచమసమేమాసాదిరిక్తాష్టమీ।
పర్వాన్యాసుభాంశవారభవనే చౌలంవిశుద్దేష్టమె ॥౨౧।

తా॥ పుత్రుడుకలిగినదిమొదలు ౩ వసంవత్సరమందునుఐదవసంవత్సరమందును శుక్లపాడ్యమి: చవితి, నవమి: చతుర్దశి శుక్లకృష్ణాష్టములు, పూర్ణిమ: అమావాస్యచతుర్దశిసంక్రమణమువీనిని నిషేధించియితరములయినతిధులయందు: సోమ: బుధ: గురు: శుక్రవారములయందును; వృషభ: మిధున: కర్కట. ధనుః; మీనము ననెడు శుభగ్రహముల లగ్నములయందును: శుభగ్రహములనవాంశములయందును రోహిణి, ఉత్తర స్వాతి అనూరాధ: ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర: యీనక్షత్రములు మధ్యమము లగుటవలన చౌలకర్మకు శ్రేష్టములుకలవు- గనుకఅశ్విని,మృగశీర్ష పునర్వసు: పుష్యమి, హస్త, చిత్త, శ్రవణము, ధనిష్ఠ యీ యుత్తనక్షత్రముల యందును పైనజెప్పునపైనను, అష్టమశుద్దిగల లగ్నమందు చిన్నవానికి, చౌల కర్మచేయుటయుక్తము.

## అంకురారోపణ నిర్ణయము

శ్లో॥ కర్తవ్యోవిధినాంకురార్పణవిధశ్చాలాదికర్మాదితో।
రాత్రిషేవశరాగ్నిశైలగణనాస్వేతాసుసద్యోథవా।
రిక్తాపర్వవిమప్రదోషరహితేవాతేశుభానాంగృహె
క్షిప్రస్వాతిమృదధ్రువాసురముఖావిష్ణుత్రయభ్యోడుషు ॥౨౨॥

తా। అంరారోపణమును: గృహ్యసూత్రములలో( చెప్పినప్రకారము అన్నప్రాశన చౌలఉపనయన వివాహసీమంతపుంసవసకర్మములకు(బూర్వము:తన(గావీని ముహూర్తదినమునకు(బూర్వరాత్రియందైనను, సద్యస్కాలమందైనను పరరాత్రియందైనను; ఇట్లుచేయనిపక్షమందుసుముహూర్తదినానికి ౩. ౫, ౭:యీరాత్రులు యందైనను, చవితి: నవమి, చతుర్దశి: ఈరిక్తతిథులను, పూర్ణిమ. అమావాస్య, కృష్ణాష్టమీ, కృష్ణచతుర్దశి, సంక్రమణము; లీపర్వతములను: చవితిసప్తమీత్రయోదశి- ప్రదోషదినములను; త్యాజ్యఘడియలను: విషేధించి సోమ; బుధ బృహస్పతి

శుక్రవారములయందును వృషభ మిధున కర్కాటక కన్య ధనుర్మీనములైన శుభగ్రహములయొక్క లగ్నములయందును అశ్విని పుష్యమి హస్త స్వాతి చిత్త, రేవతి; మృగశీర్ష, అనూరాధరోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరా, భాద్ర, మూల, మఖ శ్రవణ, ధనిష్ట,శతభిషక్,నక్షత్రములయందునుఅంకురారోపణముచేయవలయునని తాత్పర్యము.

గ్రహములకుచ్చనీచమూల త్రికోణనిర్ణయములు

శ్లో॥ మేషోగార్మకరస్త్రనీ శశిగా ్రహాంమీనస్తులోచ్చభిధా
ద్విగ్రామోమనుయుగ్దినంశనమీంతారాః క్రమాద్వింశతిః
స్వస్యోచ్చాస్తగ్రహాంస్వనీచఃనవం సూర్యాదితస్సింహగో
మేషావృషధనుస్తులాశ్చకలశో మూలత్రికోణాభిధా

తా॥ సూర్యునికి మేషరాశి వుచ్చరాశి, అందు ౧౦ దో భాగము పరమోచ్చము, ఈయుచ్చరాశి కేడవదగు తులారాశి నీచరాశి అందు ౧౦ దో భాగము పరమనీచము: ఈగ్రహమునకు సింహరాశిలో మొదటి ౨౦ భాగములుమూలత్రికోణమును, మిగత ౧౦ భాగములు స్వక్షేత్రమును, చంద్రగ్రహమునకు వృషభరాశి యుచ్చరాశి, అందు ౩ వ భాగము పరమోచ్చము. ఈ యుచ్చరాశి కేడవదగువృశ్చికరాశి, నీచరాశి; అందు ౩ వ భాగము పరమనీచము. ఈగ్రహమునకు వృషభ రాశిలో మొదట ౩ భాగములుచ్చయును, మిగప౨౭భాగములు మూలత్రికోణము అంగారకగ్రహమునకు మకరరాశి యుచ్చరాశి, అందు ౧౮ వ భాగము పరమోచ్చము, ఈమకరరాశి కేడవదైన కర్కాటకరాశి నీచరాశి: అందు ౧౮ వ భాగము పరమనీచము, ఈగ్రహమునకు మేషరాశిలో ౧౨ భాగములు మూలత్రికోణము, మిగత ౧౮ భాగములు స్వక్షేత్రమును, బుధగ్రహమునకు కన్యారాశి యుచ్చరాశి అందు ౧౫ వ భాగము పరమోచ్చము, ఈరాశి కేడవదైనమీనరాశినీచరాశి,యందు ౧౫ వ భాగము పరమనీచము, ఈ గ్రహమున కీచెప్పఁబడిన కన్యారాశిలో ౧౫ వ భాగ ముచ్చమును, మిగత ౧౫ భాగములు మూలత్రికోణము: బృహస్పతికికర్కాటకరాశి యుచ్చరాశి, అందు ౫ వ భాగము పరమోచ్చము. ఈ రాశి కేడవదైన మకరరాశి నీచరాశి, అందు ౫ భాగము పరమనీచము, ఈ గ్రహమునకు ధనురాశిలో: మొదట ౧౦ భాగములు మూలత్రికోణమును: మిగత ౨౦ భాగములుస్వక్షేత్రము. శుక్రగ్రహమునకు మీనరాశి యుచ్చరాశి: అందు ౨౭ వ భాగము పరమోచ్చము ఈరాశి కేడవదైన కన్యారాశి నీచరాశి, అందు ౨౭ వ భాగము పరమ నీచము

శః గ్రహమునకు తులారాశిలో మొదట ౨౦ భాగములు మూలత్రికోణమునుమిగత ౧౦ భాగములు స్వక్షేత్రము॥ శనైశ్చరగ్రహమునకు తులారాశి యుచ్చరాశి, అందు ౨౦ వ భాగము పరమోచ్చము, ఈయుచ్చరాశి కేడవదైన మేషరాశి నీచరాశిః అందు ౨౦ వ భాగము పరమనీచము,ఈగ్రహమునకుకుంభములో మొదట౨౦భాగములు మూలత్రికోణమును౧౦భాగములుస్వక్షేత్రమునునీప్రకారముస ప్తగ్రహముల యుచ్చాత్యుచ్చనీచాదినిర్ణయములఁ దెలియవలయునని తాత్పర్యము.

శ్లో॥ పూర్వకాలామృతంనామ గ్రంధఃప్రాచీననిర్మితః ।
పదచ్ఛేదపదార్థోక్తి సహితాన్యాద్యధాక్రమమ్ ॥
మచిలీపట్టణే చల్లాలక్ష్మీనృసింహశాస్త్రిణా ।
విరచ్యతేమయాటీకా బాలానాంబోధసిద్ధయే ॥

పృథమబిందు స్సమాప్తః

---

## ద్వితీయబిందుప్రారంభః

—:o:—

బ్రహ్మక్షత్రవిశాముపనయన యోగ్యకాలనిర్ణయము

శ్లో॥ బ్రహ్మక్షత్రవిశామధోపనయనం వక్ష్యేవసంతేక్రమా ।
ద్గ్రీష్మెశ్శారదీహావర్ణనియ తేతత్రాపిసాధారణాః ।
మాసామాఘముఖాస్తు పంచజననాద్వాగర్భతోష్టేష్టమే
నిత్యేవిప్రవిశోః క్రమాన్నృపవిశో రేకాదశేద్వాదశే ॥ ౨౨

(పదవిభాగము) బ్రహ్మక్షత్రవిశాం, అథ, ఉపనయనం, వక్ష్యే,వసంతేక్రమాత్ గ్రీష్మయోః శరది, ఇహ, వర్ణనియతే, తత్ర, అపి, సాధారణాః, మాసాః, మాఘముఖాః, తు, పంచ, జననాత్ః వా గర్భతః, అబ్దే, అష్టమే, నిత్యేః విప్రవిశోః, క్రమాత్, నృపవిశోః, ఏకాదశే, ద్వాదశే.

టీ॥ అథ- అంకురార్పణమైనతర్వాత, బ్రహ్మక్షత్రవిశాం- బ్రహ్మ- బ్రాహ్మణులకు, క్షత్ర-రాజులకు, విశాం-కోమట్లకు, ఉపనయనం—ఉపనయనమనుకర్మము, క్రమాత్-వరుసగా, వక్ష్యే-చెప్పెదను, వసంతే-వసంతఋతువునందు, బ్రాహ్మ

ణులకు, గ్రీష్మే-గ్రీష్మఋతువునందురాజులకు; శరది- శరత్కాలమందుకోమట్లకు ఇహ-ఈవిషయమందు, వర్ణనియతే-వర్ణయమము కలిగియున్నను, తథాపి- అందులో: మాఘముఖాః-మాఘమాసముమొదలుగాగల,పంచ-అయిదైన; మాసాః—మాసములు సాధారణా-సర్వవర్ణములకు సమానములు, జననాద్వా - జన్మముమొదలుకొనియైననుగర్భతః-గర్భధారణమొదలుకొనైన, నిత్యే-విధిప్రాప్తమైన, అష్టమే- యెనిమిదవదైన, అబ్దే-సంవత్సరమునందు; విప్రశిశోః- బ్రాహ్మణపిల్లవానికి, నృపవిశోః క్షత్రియ, వైశ్యపిల్లవార్లకు, ఏకాదశే - పదనొకండవసంవత్సరమందు, ద్వాదశే- పండ్రెండవసంవత్సరమందు, క్రమాత్ - క్రమముగా, కార్యము-చేయవలయును.

తా॥ బ్రాహ్మణులకు గర్భసంవత్సరము మొదలైనను జననసంవత్సరము మొదలుగానైననుఎనిమిదవసంవత్సరమునందును,వసంతఋతువునందును,క్షత్రియులకు ౧౧ సంవత్సరమునందును: గ్రీష్మర్తువునందును, వైశ్యులకు;౧౨వసంవత్సరమునందును శరదృతువునందును.మఱియు నీవిధముననిర్ణయింపఁబడినఋతువులయందునుమాఘమాసము మొదలు జ్యేష్ఠమాసమువరకు శ్రేష్ఠమాసములౌటవలనజాతభేదనిమిత్తములేక నీ ౫ మాసములయందును.బ్రహ్మక్షత్రియవైశ్యులకుపనయనకర్మచేయుటప్రాముఖ్యం

## ఉపనయనాబ్దములకుపక్షాంతరనిర్ణయము

శ్లో॥ కామ్యాబ్దేత్వథపంచమాదివిషమే షష్ఠేచతుర్థేపరే ।
వాంఛంత్యేవహిమధ్యమేతు దశమేదైవాచ్చకాలాత్యయే।
కృష్ణాదౌదినపంచకేశుభదినేపక్షేవళక్షేవినా ।
రిక్తానధ్యయనానిమధ్యమతిథీ నందేఅపిద్వాదశీ ॥౨౬॥

(పదవిభాగము) కామ్యాబ్దే: తు; అథ: పంచమాదివిషమే: షష్ఠే: చతుర్థే, పరే: వాంఛంతి, ఏవ; హి, మధ్యమే, తు: దశమే: దైవాత్; చ, కాలాత్యయె కృష్ణాదౌ, దినపంచకే, శుభదినే: పక్షేవళక్షే, వినా: రిక్తానధ్యయనాని, మధ్యమతిథి, నందే: అపి ద్వాదశీ

టీ॥ కామ్యాబ్దేతు— సప్తమెబ్రహ్మవర్చసకామమష్టమమాయుష్కామంనవమేతేజస్కామందశమేఽన్నాద్యకామ మేకాదశేఇంద్రియకామం ద్వాదశేపశుకామం ఇతి: యీరీతుగనాపస్తంబులు చెప్పిన కామ్యాబ్దములయందు, అథ లేక; పంచ .మాది—అయిదవసంవత్సరము మొదలు: విషమే-బేసిసంవత్సరములయందు; సమేషు సమసంవత్సరములయందు-షష్ఠే- ఆఱుసంవత్సరమందు (ఆఱువసంవత్సలమందు

ఉపనయనముచేయుట గర్భాష్టమేషు బ్రాహ్మణముననయీతేతి ఆపస్తంబసూత్రము బహువచనముచెప్పుట। గర్భషష్ఠ సప్తమ గర్భాష్టములను గూడ గ్రహించి వ్రాయడమయినది, యిదిపరలో ఐదవసంవత్సరముచెప్పుటకుకూడయిదేప్రమాణము చతుర్థే-నాల్గవసంవత్సరమందు, పరే - కొంతమంది వాంఛంతి - కోరుదున్నారు మాపక్షముగాదు, దైవాత్ - దైవవశమువల్ల కాలాత్యయే - చెప్పఁబడిన కాలమతి క్రమించినయెడలమధ్యమే— మధ్యమైన దశమే - పదవసంవత్సరమందు కృష్ణాదౌ కృష్ణపక్షాదియందు, దినపంచకే, ఐదుదినములయందు, శుభదినే - పంచాంగశుద్ధిగల దినమందు, వళక్షే-శుక్లమను, పక్షే—పక్షమందు, వినా-మొదటిఅయిదు దినములను వదలి, రిక్తానధ్యయనాని — రిక్తా, రిక్తతిథులను అనధ్యయనాని। అనధ్యయములను మధ్యమతిధి-అష్టమితిథులు, నందే—షష్ఠ్యేకాదశులను, ద్వాదశీ - ద్వాదశీతిథులను, వినా వదలి: ఉపనయనం-ఉపనయనము, కర్తవ్యం-చేయతగినది,

తా॥ బ్రాహ్మణాది జాతిత్రయమునకు జననముమొదలు ౫: ౬। ౭। ౮; ౯ ఈసంవత్సరములయందునుఈకాలములయందుచేయుటకుదైవవశముననను కూలించ నిపక్షమునకు: ౧౦। ౧౧ సంవత్సరములయందునుకృష్ణపాడ్యమిమొదలైదుదినముల యందును: శుక్లపాడ్యమిమొదలు ౫ దినములవర్జించి మిగతదినములయందుశుభకర ములైన తిథివారనక్షత్రయోగ కరణములతోఁ గూడిన దినములయందును: చవితి నవమి। చతుర్దశి: పాడ్యమి మధ్యమములగు షష్ఠ్యేకాదశులు ద్వాదశి వీనిని విడిచి ౩౯ ౪౦ శ్లోకమందుఁజెప్పఁబడినప్రకారం మనధ్యయనదినముల వర్జించి క్రింతఁజెప్పఁబడిన నిర్ణయకాలములయందుపనయనముఁజేయవలయును మఱియు నాల్గవసంవత్సమందుపనయనకర్మజేయుటకొందఱికిష్టమైనను గ్రంధకర్తకుఅసమ్మ తమౌటవలన విధింపబడలేదు అనగాకూడదని తాత్పర్యము

ఉపనయనమునకువార నక్షత్రలగ్ననిర్ణయములు

శ్లో॥ శుక్రార్కేందుజవాసరేర్క-శశినోర్వారాచమధ్యాతయో ।
మిత్రాంత్యాదిమృగస్థిరాదితిగురుశ్రోణత్క-యార్క-త్రయే।
స్వాంశాదన్యశుభాంశగే హిమకరేశ్రోణాదితిస్వాంశగే ।
లగ్నే చంద్రవివర్జితేశుభదినే పూర్వేఒహ్ణిశుద్ధేష్టమే ॥ ౪౭

(పదవిభాగము) శుక్రార్కేందుజవాసరె: అర్క-శశినో: వారౌ చ మధ్యాః తయో:। మిత్రాంత్యాది. మృగస్థిరాదితిగురు శ్రోణత్రియార్క-త్రయే స్వాంశాత్

అన్యశుభాంశగే । హిమకరే । శ్రోణాదితిస్వాంశగేః లగ్నే, చంద్రవివర్జితే।శుభదినే పూర్వే । అహ్ని। శుద్ధే । అష్టమే ।

టీ॥ శుక్రార్యేందుజవాసరే - శుక్ర—శుక్రునియొక్కయు; అర్య-బృహస్పతి యొక్కయు, ఇందుజ-బుధునియొక్కయు, వాసరే- వారముయందును: తయోః - ప్రసిద్ధులయిన, అర్కశశినోః—సూర్యచంద్రులయొక్క: వారౌచ- వారములును: మధ్యౌ - మధ్యమములు; అనగాశుక్ర: బుధవారమువలెనే: మిక్కిలి ముఖ్యములు గాపనుట,కుజశనివారములవలే;మిక్కిలి నింద్యములు గావు,మధ్యమ ఫలమునిచ్చును మిత్రాంత్యాదిమృగస్థిరాదితిగురుశ్రోణత్రయార్కత్రయే: మిత్ర-అనూరాధ,అంత్య- రేవతి; అది-అశ్వని; మృగ-మృగశీర్ష: స్థిరనక్షత్రములయిన,రోహిణ్యు త్తరాత్రయ ము: అదితి-పునర్వసూ: గురు-పుష్యమి, శ్రోణత్రయ-శ్రవణ; ధనిష్టాశతభిషములు అర్కత్రయే హస్త, చిత్త; స్వాతులు, ఏతేషు-యీపదునారునక్షత్రములయందును యింక-హిమకరే-చంద్రుడు, స్వాశాత్—కర్కటకాంశముకంటె: అన్యశుభాంశగే యితరగ్రహములయొక్క అంశలను పొందియుండగా,శ్రోణాదితిస్వాంశగే-శ్రవణ పునర్వసులయొక్క; స్వాంశయందుండగా, అనగాశ్రవణము నాలుగవపాదమందైన పునర్వసునాల్గవపాదమందయినా వుండగా[యింక] చంద్రవివర్జితే- చంద్రుడులేని; లగ్నే లగ్నమందు, శుభదినే—పంచాంగశుద్ధిగలదినమందు; పూర్వే- మొదటిదయిన అహ్ని-దినమందు, అష్టమె—ఉపనయన లగ్నమునకెనిమిదవయిల్లు,శుద్ధె-గ్రహము లేని దగుచుండగా; ఉపనయనము ముఖ్యము.

తా॥ ఉపనయనవిషయమై; బుధ, బృహస్పతి శుక్రవారములు శ్రేష్టములు ఆదిత్యసోమవారములు మధ్యమములు; అనూరాధ; రేవతి. అశ్వని; మృగశీర్షఉత్త ర: ఉత్తరాషాఢ; ఉత్తరాభాద్ర, పునర్వసు. పుష్యమి, శ్రవణం, ధనిష్ట; శతభిషక్ హస్త, చిత్త స్వాతి రోహిణి ఈ ౧౬ నక్షత్రములు శ్రేష్టములు చంద్రుడుస్వకీ యాంశమందుండగా స్వాంశమైన కర్కాటకమునుంచి బుధ గురు శుక్రులయంశ మును బొందియుండగానుశ్రవణపునర్వసువులనాల్గవపాతమందుండగాను చంద్రుం డులేనిలగ్నమందును: శుభదినపూర్వాహ్ణమందును ఉపనయనలగ్నమున ఎనిమిదవ యింట నేగ్రహములు లేక యుండగా నుపవయనమునకు యోగ్యకాలమనితా॥

## వర్ణాధిపతిబలనిర్ణయము

శ్లో॥ వర్ణేశార్కకవీజ్యవేదపబలం చాబ్దేందుతారాబలం ।
తత్రాచార్యకుమారయో రురుబలం తేభ్యోహిముఖ్యంవ్రతే

తేషాం వార్ధకబాల్యమౌఢ్యరహితే మూలత్రికోణాలయే ।
స్వోచ్ఛస్వాలయమిత్రరాశిసహితేష్వేషు కార్యంవ్రతమ్ ॥ ౨౮ ॥

తా॥ వర్ణేశబలమనగా బ్రాహ్మణులకును బృహస్పతిబలము; క్షత్రియులకు సూర్యబలమును వైశ్యులకు చంద్రబలము నందఱికి సూర్యశుక్రగురుబలములుతమ తమ వేదాధిపతులబలమును,ఉపనయనముచేయుసంవత్సరాధిపతిబలము;చంద్రతారాబలములు నీవర్ణేశాధిబలముకంటె, నాచార్యవటువులకుబృహస్పతిబలమునుఆవశ్యముచూడఁదగినది ఈవర్ణేశాదులకు మూఢబాలవృద్ధత్వములు లేక యుండఁగాను మఱియు పైచెప్పినగ్రహములుతమతమమూలత్రికోణములయందుగానిఉచ్చస్థానములయందుగాని స్వక్షేత్రమిత్రక్షేత్రములయందునుండగానినుపనయనముచేయుట ప్రాముఖ్యము

వేదాధిపతులనిర్ణయము

శ్లో॥ ఋగ్వేదపభృతీశ్వరా గురుభృగుక్ష్మాపుత్రసౌమ్యావ్రతే,
స్వీయం వేదపలగ్నవాసరబలం త్వేతత్త్రయందుర్లభమ్ ।
లగ్నేందుః క్షయరోగిణంచకురుతే స్వోచ్ఛస్థితోఽప్యర్కకం
లగ్నాద్ద్వాదశగంరవింయదికుజఃపశ్యన్దృశోర్నేత్రహృత్ ॥ ౨౯

తా॥ ఋగ్వేదమునకు గురువును యజుర్వేదమునకు శుక్రుడును సామవేదమున కంగారకుడును అథర్వణవేదమునకు బుధుడును వీరలీక్రమమున వేదాధిపతులనంబడుదురు ఉపనయనవిషయమై స్వకీయవేధాధిపతిబలమును వటువుయొక్క జన్మలగ్నాధిపతిబలమును, జన్మవాసరాధిపతిబలమును యివి ముఖ్యముగా నుండవలయును. యీచెప్పబడిన మూడుబలములు నేకకాలమందుదొరుకుట దుస్తరము. మఱియు చంద్రుడుపనయలగ్నమందున్న స్వకీయమగు తననుచ్చరాశియైననువటుని క్షయరోగవంతునిగాజేయును.ఉపనయనలగ్నముకుపండ్రెండింటనుండెడు సూర్యుని కంగారకవీక్షణము కలిగినట్లయిన వటువుతండ్రికినేత్రహానికలుగునని భావము.

ఉపనయన లగ్నమునకు వర్గాధిపాదివిశేషము

శ్లో॥ నీచస్థేషు పరాజితే ష్వరిగృహస్థేష్వస్తగేషువ్రతే ।
వర్ణాధీశకవీజ్య వేదపతిషు న్యాద్దంత్యోలోప్యవటుః ।
అన్యైరప్యఖిలైక వింశతిమహాదోషైర్వియుక్తైఽఖిలే ।
కేంద్రేపాపవివర్జితే యదిశుభేలగ్నేచ కార్యంవ్రతమ్ ॥ ౩౦ ॥

టీ. వ్రతే-ఉపనయనమందు: వర్ణాధీశకవీజ్య వేదపతిషు, వర్ణాధీశ — పూర్వమందుచెప్పిన వర్ణాధిపలులు, కవి-శుక్రుడు; ఇజ్యః-బృహస్పతియు; వేదపతయః - వేదాధిపతులు; ఏతేషు-వీరలు. నీచస్థేషు—నీచరాశినిబొందినవారైనను, పరాజితేషు: -గ్రహయుద్ధమందపజయమునుపొందియుండగా: అరిగృహస్థేషు- శతృగృహమందుండగా: అస్తగేషు-అస్తమానమును పొందియుండగా, వటుః - ఉపనయనవటువు అంత్యతుల్యః-తక్కువజాతితో సమానుడై, స్యాత్-అగును, అప్యైః - చెప్పబడిన వాటికంటెనితరమయిన:అఖిలైకవింశతిమహాదోషైశ్చ-సమస్తమైనయిరువదియొక్కమహాదోషములతోనున్నా: వియుక్తె—వియోగముగల,అఖిలే-సమస్తమయిన కేంద్రే -కేంద్రములు,పాపవివర్జితేయది-పాపగ్రహములులేనివయినచో[అనగానుపనయన లగ్నముకంటెకేంద్రములయందుశుభగ్రహములుండగాననుట)వ్రతం-ఉపనయనం కార్యం- చేయతగినది. (యిట్లుచెప్పుటచేకేంద్రమందుపాపగ్రహములున్నను శుభగ్రహములతో గూడినచోదోషములేదనుట] అట్లుదైవజ్ఞ విలాసమందు ఇట్లు చెప్పబడియున్నది.

దైవజ్ఞవిలాసే

శ్లో॥ లగ్నాదికేంద్రేప్యథవాత్రికోణే దేవేజ్యదైత్యార్చితసోమసౌమ్యాః॥ ఏకోనిహంతిస్ఫుజితాదిదోషాన్ భానుర్యథాగాఢమివాంధకారం

తా॥ లగ్నమునకు కేంద్రత్రికోణము యందు శుభగ్రహములైనగురుశుక్రచంద్ర, బుధులున్నచో ఒక్కడున్నను స్ఫుంజితాదిమహాదోషములను గాంఢాంథకారమును సూర్యుడువలె పోగొట్టుననుట

తా॥ వర్ణాధిపతులును, గురుశుక్రులును, వేదాధిపతులును వీరలు నీచరాసులయందుండగాను: శత్రుగ్రహములతో గూడియుండగాను శత్రుక్షేత్రములయ్యందుండగాను నీచగ్రహముల స్తమించియుండగానుఉపనయనముచేసినవటువుచండాలునితో సమానుడనిచెప్పవలయును. మఱియు ఒక శ్లోకము మొదలుచెప్పబోయెడి ౨౧మహాదోషములను వదలి కేంద్రములనగా లగ్నచతుర్థసప్తమదశమ స్థానములయందుపాపగ్రహములు లేక యుండగా శుభగ్రహములుకేంద్రస్థానముల యందుండగానుశుభలగ్నమందు పనయన కర్మచేయతగినదని తా॥

కేంద్రస్థానస్థిత పాపగ్రహఫలమ్

శ్లో॥ లగ్నాత్కేంద్రగతైరవాస్ఫుజితఇత్యాచార్యశిష్టావ్రతే
భౌమేకూజితనామకస్తు జననీం హంత్యేవ మందేకులమ్

దోషోఽయంరుధిరాభిధః సమసిచే దుగ్రాభిధో బాలకం ।
రంధ్రాఖ్యః పితరంధ్వజేనగదశత్యేష్వబ్ది కేంద్రాభిధాః॥ 3౧॥

తా॥ కేంద్రస్థానములనగాలగ్నమునకు ౧:౪:౭:౧౦ స్థానములు ఈనాలుగు కేంద్రస్థానములయందు సూర్యుడుండినస్ఫుజితమనుదోషము; దోషముపనీతునికిని నతనితండ్రికినిమారకములంబనియు, అంగారకుండుండినేనికూజితమనుదోషముఆదోష మతనితల్లికి మారకంబనియు: శనియుండిన రుధిరమనుదోషము ఆదోషమతనిగోత్రజులకు మారకంజీనియును; రాహువుండిన నుగ్రమనుదోషము ఆదోషముపనీతునికి మారకంబనియు కేతువుండిన రంధ్రమనుదోషము ఆదోషమతని తండ్రికి మారకంబనియు తా॥

వటువునకు గురుబల నిర్ణయము

శ్లో॥ జీవఃకర్కటచాపమీనగృహగస్తద్భాగసంస్థోఽపివా ।
జన్మాదష్టశరంధ్రగో యది వటోర్విద్యార్థదస్స్యాద్ధృతే
స్త్రీగో యుగ్మతులామృగాఖ్యగృహగస్తద్భాగసంస్థోఽపివా
విద్యాచారసుఖాయురర్థ రహితంకుర్యాద్గురుస్తంశిశుమ్॥ 3౨

తా॥ కర్కాటక ధనుర్మీనరాసులయందైననీరాసులయంశలయందైననుఉపనీతుని జన్మరాశియందైననుఉపనీతునిఉపనయనలగ్నమునకు ౧-౨టనైననుబృహస్పతి యుండిననుఉపనయనవటువు సంపూర్ణవిద్యావంతుడును భాగ్యవంతుడగుననియువృషభ మిధున కన్యా తులా మకర రాసులయందైనను నీయంశల యందెచ్చటనైనను బృహస్పతి నివశించినేని నుపనయనమయినవాడు విద్యాచారసుఖాయుర్ధములలో నొకటినయినను బొందడని తాత్పర్యము ॥

చంద్రరాశి స్థితఫలము

శ్లో॥ సూర్యాత్మాంశకినం వటుం శశధరస్సూర్యాంశగస్స్వాంశగో
నిష్ఠం భూమిసుతాంశ [illegible] భృతం [illegible] విద్యాయుతం
జీవాంశే క్రతుకారిణం భృగుసుతస్యాంశే వివాహాన్వితం ।
మందాంశే గతశుచోపనయనే చండాలసేవాకరమ్ ॥ 33

తా॥ చంద్రుడుసింహరాశియందుండగాను ఉపనయనమయినవాడుపాపవంతుడును కర్కాటకరాశియందున్నదరిద్రుడును మేషవృశ్చికరాశులయందున్నచో ఆయుధధరుండును కన్యామిధునరాసులయందున్న బండితుడను ధనుర్మీనరాసుల

యందున్నచో సోమయాజియును: తులావృషభరాసులయందున్నచో శీఘ్రముగాభార్యా వంతుడును: మకరకుంభరాసులయందున్నచో జండాలసేవకుండును; ఈరీతిచంద్రాదీ రాసుల యందుండగా నుపనయనమైనవాడీ ఫలముకలవాడగునని తా॥

ఉపనయన లగ్నమునకు త్యాజ్యకాలములు

శ్లో॥ పూర్వేద్యుశ్చ పరేహాని వ్రతదినాత్తస్మాచ్చతుర్థేదినే ॥
నధ్యాయాశ్చ రజస్వలా స్వజననీగర్భిన్యవాహాశ్రితా, ।
పిత్రోశ్చక్షయవత్సరోయది గతో సంధ్యాభిజిత్సద్మవా
బాలోవాయదికర్ణవేధరహితో నైతేషు కార్యంవ్రతమ్ ॥32

శ్లో॥ గర్భిణీ యధిపత్నీ చేన్నకుర్యాధుపనాయనం । పంచమాసాదధః కుర్యాదత ఊర్ధ్వంనకారయేత్ ॥ పిత్రోః తల్లిదండ్రులయొక్క: క్షయవత్సరోయది-మృతసంవత్సర మందును. సంధ్యాభిజిత్సద్మవా – సంధ్యకాలలగ్నము అభిజిల్లగ్నము[అనగా సూర్యుడున్నరాశియును; అభిజిత్ నాల్గవ రాశియును] బాలః – ఎటువు; కర్ణవేధ రహితోయదివా – చెవులు కుట్టకయుండగా వ్రతం – ఉపనయనము నకార్యం - చేయగూడదు యిచ్చట నొక వివాదముకలదు. కృష్ణపక్షమందు మొదటి పంచకము మంచిదనియు చెప్పబడి యున్నది శుక్లపక్ష మందు మొదట అయిదుదినములు నింద్యములని చెప్పబడియున్నది; ఇట్లుండ యిచ్చటనుపన యనలగ్నముకు పూర్వదినము పరదినమునాల్గవదినము అనధ్యయనమయినచోకూడ దనువాక్యము సందర్భముగనున్నదియెందువల్లననినవిదియకుపూర్వదినముచతుర్థదినము లనధ్యయనము లగుటవలనగును.

శ్లో॥ ద్వితీయాచ తృతీయాచ పంచమీసప్తమీతథా । త్రయోదశీచ దశమీప్రశ స్తాసితయోవ్రతే ॥ అను వ్రమాణమునననుసరించియు పూర్వదినపరదిననాల్గవదినము లనధ్యయనములు గూడదనుమాట యుక్తముగనుండలేదు యిందుకుదర్పణమందు వచనముగలదు శ్లో॥ వ్రతబంధనపూర్వేద్యుః పరేద్యురితియద్వచః।తపనస్మృతిః ప్రోక్తవచనానాం విరోధతః ఉపనయన పూర్వాపరదినములనధ్యయనములు కాగూడ దనుమాట వచనవిరోధమువల్ల కూడదని తా॥

తా॥ ఉపనయనముహూర్తదినమునకు పూర్వరోజునపరరోజున నాలుగవరోజున వీనితోనొకరోజుయైన అనధ్యాయమేయుండగాను బాలునితల్లి నాందీముఖముచేయక పూర్వము; రజస్వలయినను ౬ మాసముగర్భిణీయయినను, కుమారునితల్లిదండ్రులు పితామహపితామహులు చనిపోయిన వత్సరమందును సూర్యుడున్నరాశి యందును అభిజిత్ రాశియందును బాలునికి చెవులుకుట్టకుండగానుపనయనముచేయకూడదనితా

## షడ్జన్మనక్షత్రస్వరూపము

శ్లో॥ జన్మర్క్షం జననోదుకర్మదశమం సాంఘాతికం షోడశం ।
వైనాశాఖ్య మధత్రివింశమపిభం తత్పంచవింశం యది ।
ఋక్షం మానససంజ్ఞికం ద్వినవమం తత్సాముదాయాభిదం ॥
త్యాజ్యం సప్తమభంతు నైధనమిదం సర్వేషుకర్మస్వపి॥ ౩౫

తా॥ యేనక్షత్రమందుజన్మించినవాని కానక్షత్రము — జన్మనక్షత్రమనియు: జన్మనక్షత్రమునకు ౧౦ నక్షత్రము కర్మనక్షత్రమనియు, ౧౬ నక్షత్రముసాంఘాతికమనియు ౨౩ నక్షత్రము వైనాశకమనియు: ౧౮ నక్షత్రసాముదాయకమనియు ౭ నక్షత్రము నైధనమనియు: ౨౫ నక్షత్రముమానసమనియు నీప్రకారముగా: నీ సంజ్ఞలుగల నక్షత్రములయందుఉపనయనము మొదలయినశుభకార్యములేమియుజేయ కూడదని తా॥

## జన్మనక్షత్రమునకు జగుపుకార్యాకర్యవిచారణము

శ్లో॥ జన్మర్క్షం శుభదం నిషేకముఖ చౌలాన్నభుక్తిక్రియా।
మౌంజబంధనపట్టబంధనమహీ ప్రాప్త్యక్షరాప్తిషు ।
ఏభ్యోన్యేష్వశుభప్రదంచ సువసే సీమంతసంగ్రామయో
ర్గర్భాధానపితృక్రియా క్షురభిషగ్యాత్రావివాహేష్వపి॥ ౩౬

తా॥ జన్మనక్షత్రమునదుం నిషేకము, యజ్ఞము: చౌలము: అన్నప్రాశనము వ్యవసాయము: ఉపనయనము పట్టాభిషేకము, భూసంపాదనము: అక్షరాభ్యాసము— ఈకార్యములయందు శుభకరమనియును, ఇతరకర్మములయందనగా పుంసవనము యుద్ధము, సీమంతము గర్భాధానము: శ్రాద్ధము: క్షౌరము,ఔషధసేవ ప్రయాణము వీనియందశుభప్రదమని తా॥ మఱియు స్త్రీలకు జన్మనక్షత్రము వివాహమందుశ్రేష్ఠ ప్రదమని గ్రంధాంతరమందు జెప్పబడినది తత్ప్రమాణము.

## తథా చ చ్యవనః

శ్లో॥ జన్మర్క్షం జన్మమాసశ్చ తథాజన్మదినంశుభం । స్త్రీణాం జన్మత్రయంశ్రేష్ఠం వివాహే సర్వసమ్మతమ్ ॥ఇతి॥

## ఉపనయన లగ్నమునకు దోషాపవాదము

శ్లో॥ దోషాణాం నియుతం నిహంతి బలవాన్ లగ్నస్థితశ్చేందుజః
శుక్రస్తద్విగుణం గురుర్దశగుణం లగ్నంచ పంచేష్టికమ్ ।

లగ్నస్యోపచయే స్థితోగ్రహపతిః కూరోబలీచేద్వితే
లగ్నేకాదశగోరపిశ్చసకలాన్ దోషాన్నిహంత్యేవతాన్ 32

టీ॥ ఇందుజః: బుధుడు, బలవాన్ - స్థానాదిషడ్బలములు కలవాడగుచు: లగ్నస్థితశ్చేత్ - ఉపనయనముహూర్తలగ్నమందుండినేని; దోషాణాం- దోషముల యొక్క; నియుతం - శతసహస్రం - నూఱువేలదోషములను; నిహంతి - నశింప చేయును, శుక్రః- శుక్రుడు, లగ్నగతోయది - ముహూర్త లగ్నమందుండినేని తద్విగుణం, - [లక్షద్వయం] రెండులక్షలదోషములను, నిహంతి- నశింపజేయును బలవాన్ - బలవంతుడైన; గురుః — బృహస్పతి, లగ్నగతశ్చేత్ - ముహూర్త లగ్నమునందుండెనేని; దశగుణం - (దశలక్షదోషాన్) పదిలక్షలదోషములను, నిహంతి — నశింపజేయును- పంచేష్టికం-పంచేష్టికబలయుక్తమైన:లగ్నం-లగ్నము దశగుణం - [దశలక్షదోషములను] పదిలక్షలదోషములను నిహంతి-నశింపచేయును

అథపంచేష్టిక లక్షణమ్

శ్లో॥ కాలాధీశోలగ్న పతిర్గురుశ్చత్రయేష్టికం చంద్రబలంచతుర్థం ।
పంచేష్టకం నేతి సహస్రరశ్మిర్నిరీక్షితంపంచబలేన శస్తమ్ ॥

[అభిప్రాయము:-] కాలాధిపునిచేతను, లగ్నాధిపునిచేతను గురువుచేతను సూర్యునిచేతను, చంద్రునిచేతను; చూడబడులగ్నము పంచేష్టికబలయుక్తమని యభిప్రాయము.

కాలాధిపతులు

శ్లో॥ ప్రాక్పూర్వరాత్రౌ బలవాన్ శశాంకః ॥ శుక్రోర్ధరాత్రౌచ కుజోనిశాంతే॥ ప్రాతర్బుధోమధ్యదినేచ సూర్యశ్శనిర్దినాంతే సతతంబలీజ్యః ॥

అభిప్రాయము తా॥ పూర్వరాత్రియందు చంద్రుడు బలవంతుడు- అర్ధరాత్రియందు శుక్రుడు బలవంతుడు; తెల్లవారుజామున కుజుడు బలవంతుడు ప్రాతఃకాలమందు బుధుడుబలవంతుడు; మధ్యాహ్నకాలమందుసూర్యుడుబలవంతుడు సాయంకాలమందు శనిబలవంతుడని తా॥

తా॥ బుధుడు స్థానాదిషడ్బలములతోగూడి ఉపనయనలగ్న మందుండినేని లక్షదోషములను పరిహరించును మఱియు శుక్రుడులగ్నమందుండినయెడల;రెండు లక్షలదోషములను హరించివేయుననియు; బృహస్పతిలగ్నమందుండి లగ్నము పంచేష్టికబలముకలదైనను పదిలక్షలదోషములను తీసివేయును- ఉపనయనలగ్నము

నకు లగ్నాధిపతిఉపచయములందున్నచో రెండులక్షలదోషములను హరించుననియు పాపగ్రహములైన సూర్యాంగారక శనైశ్చరరాహుకేతువులు బలయుక్తమైయేగ్రహమైనా తృతీయషష్ఠ్యైకాదశ స్థానములయందుండినచో రెండులక్షలదోషములహరించుననియును ఉపనియనవిషయమై సూర్యుడుపనయనలగ్నములకుఏకాదశస్థానమందుండినచో సర్వదోషముల నపహరించునని తా॥

## అక్షరస్వీకారయోగ్యకాలము

శ్లో॥ బాలానాం శుభవాసరేహ్ని నిశనేశుద్ధేఽక్షరస్వీకృతి ।
కార్యాపంచమవత్సరే ప్రతిపదం రిక్తాష్టమీ షష్ఠమాః ।
హిత్వాపూష్ణిచరేస్థిరే చరగృహే వ్యస్తే గురౌ భార్గవే ।
మిత్రాంత్యాద్యరవిత్రయాదితిగురుశ్రోణాసుసౌమ్యాయనే ॥౩౮॥

తా॥ సోమ-బుధ-గురు-శుక్రవారములయందును, పగటియందును, అక్షరస్వీకారలగ్నమునకు నెనిమిదవయింట నేగ్రహము లేక యుండగాను జననముమొదలు ఐదవసంవత్సరమందును శుక్లపాడ్యములును; షష్ఠి అష్టమి; ౪-౯-౧౪ యీ రిక్తతిథులు; అమావాస్యయును యీతిథులవిడచి, సూర్యుడు చరరాసులయందనగా మేష కర్కాటక తులా మకరరాసులయందుండగాను స్థిరరాసులనగా, వృషభసింహ వృశ్చిక కుంభరాసులయందుండగాను; చరలగ్నములయందును: గురుశుక్రులస్తమించకయుండగాను అనూరాధ, రేవతి; అశ్వినీ; హస్త; చిత్ర, స్వాతి, పునర్వసు పుష్యమి; శ్రవణము; ఈ ౯ నక్షత్రములయందును, ఉత్తరాయణమందునుశాలురకక్షరాభ్యాసముచేయుట ముఖ్యమని తా॥

## విద్యారంభయోగ్యకాలము

శ్లో॥ విద్యారంభ విధిర్ద్విషేవ శుభదోనధ్యాయరిక్తావినా ।
విస్రార్కత్రయసౌమ్యపంచక హరిత్రయాద్యపూర్వత్రయే ।
శాఖేశార్య కవిజ్ఞసోమదివసేకృద్వారేషు లగ్నేచరే ।
నోవిద్యాబుధసోమయోఃపరమతంశస్త్రంకుజేర్కేఽభ్యసేత్ ॥౩౯

తా॥ ౪౦; ౪౧, ౪౨, శ్లోకములయందుచెప్పబోయెడియన ధ్యాయములను ౪-౯-౧౪ యీరిక్తతిథులనువిడచి తక్కిన శుభతిథులయందును పగటియందును, అశ్వని, హస్త, చిత్ర, స్వాతి, మృగశిర, ఆరుద్ర; పునర్వసు, పుష్యమి, ఆశ్లేష; శ్రవణము: మూల, పూర్వఫల్గుని; పూర్వాషాఢ; పూర్వాభాద్ర; ఈ౧౪నక్షత్రములయందును: గురు శుక్ర బుధ సోమ భానువారములయందును, ౧-౪-౭-౧౦ యీ చర లగ్నములయందునువిద్యాభ్యాసము చేయుట ముఖ్యమనియును:మంగళ వారము

ఆదిత్యవారములయందు శస్త్రవిద్యాభ్యాసము చేయుట ప్రాముఖ్యమనియును సోమ బుధవారములయందు విద్యాభ్యాసముచేయుట కొందఱికసమ్మతమైనను గ్రంథకర్త యిష్టానుసారముగా వీరెండు వారములు శ్రేష్ఠములుగా చెప్పబడినవని తా॥

అనధ్యయనదినములు

శ్లో॥ అప్యర్కే-చరరాశిగే తదయనే స్యాత్పక్షిణీసాతిథి ।
శ్చాంత్యోపాంత్యసుమధ్యమాదితిథయఃపక్షేషుచానధ్యయా
ప్రాతః పంచసు నాడికాః క్షయతిథౌవృద్ధ్యాంత్రయోదశత్రయ॥
షట్సాయం క్రమశస్సమత్వముభయోర్నాడిచతుష్కంసదా॥ ౨౦

తా॥ మేషకర్కాటక తులామకర సంక్రాంతులయందును, వీరాసులయందు నొకటిన్నరదినమనియు; పాడ్యమి; అష్టమి; చతుర్దశి: పూర్ణిమ అమావాస్య తిధులు క్షయకాలమందుదయమున పాడ్యమి అష్టములు ఐదుఘడియలుండిననువృద్ధియందు ౩ ఘడియలుండినను; వృద్ధిక్షయములు లేకయుండగా ౪ ఘడియలునుసాయంకాలమందు(సప్తమిత్రయోదశులలో క్షయవృద్ధి సామ్యములయందు గ్రమముగా ఆఱు మూడు, నాలుగు; ఘడియలు అష్టమీచతుర్దశులు కలిసియున్న తిధులును ఈచెప్పబడినవన్నియు నిత్యానధ్యయనదినములని తా॥

శుక్లపక్షనైమిత్తికానధ్యయనదినములు

శ్లో॥ చైత్రమాఘన షష్ఠయోరపి సహాశుక్లతృతీయాశుచౌ ।
షష్ఠీపాదశమీత్విషోర్జ్జ నవమీమాసే ద్వితీయాత్విషే ।
ఊర్జేమాస్యథ పంచమీతపసిచేత్సాన సప్తమీ ద్వాదశీ ।
మాఘే భాద్రపదాదిషుత్రిషు శుచౌపౌషేసితైకాదశీ॥ ౨౧

తా॥ చైత్రశుద్ధతృతీయ: వైశాఖశుద్ధతృతీయ, ఆషాఢశుద్ధ షష్ఠి, దశమీ ఏకాదశి, భాద్రపద శుద్ధతృతీయా, ఏకాదశి, ఆశ్వయుజ:శుద్ధద్వితీయ,శుద్ధనవమి:శుద్ధ ఏకాదశి, కార్తికశుద్ధపంచమీ, నవమి ఏకాదశి: పుష్యశుద్ధఏకాదశి, మాఘశుద్ధసప్తమి ద్వాదశి, ఈ౧౬ తిధులున్నుశుక్లపక్షమునందు నైమిత్తికానధ్యయన దినములని తా॥

కృష్ణపక్షనైమిత్తికానధ్యయన దినములు

శ్లో॥ తచ్ఛేషాస్తు సితేతరాశ్చ తిథయః షష్ఠిత్రయోదశ్యథో ।
యామ్యోష్టంచ తపస్య కార్తికశుచిష్వేవ ద్వితీయాఇమాః ।
సంధ్యాగర్జిత మన్వకాలపతితావృష్టిశ్చ తిస్రోష్టకాః ।
రిక్తానధ్యయనేకృతోపనయనస్యాత్కర్మహీనార్తికృత్ ॥౨౨

టీ॥ తచ్ఛేషాః - యిదివరలో చెప్పినవాటికన్నమిగిలిన సితేతరాః - కృష్ణ పక్షసంబంధమయిన; తిథయః-తిధులు, షష్ఠీ—షష్టితిధియు త్రియోదశీ - త్రియోదశితిధియు, అథ-పిమ్మట; యామ్యర్క్షం - త్రియోదశికిపూర్వమందువచ్చు భరణీ నక్షత్రమును, తపస్యకార్తికశుచిషు - తపస్య-ఫాల్గుణమాసము: కార్తిక — కార్తిక మాసము, శుచిషు - ఆషాఢమాసము, ఏషు - వీట్లయందు; ద్వితీయాః - విదియ లున్నూ: ఇమాః—ఈఐదున్నూ, కృష్ణపక్షమందు నైమిత్తికానధ్య యనములు, సంధ్యాగర్జితమపి-సంధ్యా—ప్రాతస్సాయం సంధ్యలు; గర్జితం - మేఘ..నియు: గర్జితానధ్యాయలక్షణ మెట్టులనినసూర్యోదయముకంటె పూర్వముజాముకాలములో సూర్యోదయాత్పరము రెండు ఘడియల కాలములోగా ఉరిమినచో నాదనధ్య యన మనవలయును.

గర్జితానధ్యాయనము

శ్లో॥ ఉదయాత్ప్రాగ్యామేతు పరేతు ఘటికాద్వయమ్ ।
తస్మిన్ గర్జత్యనధ్యాయః పునస్సంధ్యాంతరమ్భతీతి ॥

అన్యకాలపతితా — అకాలమందువర్షించు (సకాలముకానికాలమందు) వృష్టిః వర్షము, [అకాలవృష్టిః] అకాలశ్చ

అకాలవర్షనిర్ణయము

శ్లో॥ అనూరాధర్క్షమారభ్య షోడశర్క్షేదివాకరః ।
యావచ్చరతి తత్కాల మకాల మనురబ్రవీత్ ॥

తా॥ అనూరాధ నక్షత్రముమొదలు ౧౬ పదునారునక్షత్రములయందు సూర్యుడుండగా వర్షించువర్షము అకాలవర్షమనంబడును.

త్రిసోప్టకదిననిర్ణయము

శ్లో॥ మార్గశీర్షేచపౌషేచ మాఘే ఫాల్గునఏవచ ।
కృష్ణాష్టమ్యశ్చ త్రిసోప్టాః పూర్వయాపరయాసహ ॥

తా॥ మార్గశీర్ష బ ౭-౮-౯ పుష్య బ ౭-౮-౯ మాఘ బ ౭-౮-౯ఫాల్గుణ ౭-౮-౯ క్రమముగా సప్తమి-అష్టమి-నవమి ఈమూడుతిధులు త్రిసోష్టకలనితా ॥

(పైటీకకు సశేషము) రిక్తాః — చతుర్థినవమి, చతుర్దశి ౪-౯-౧౪ రిక్త తిధులు; అనధ్యాయాః-నిత్యనైమిత్తికానధ్యయనదినములు; ఏతేషు - వీటియందు చేయబడునుపనయనము: కర్మహీనార్తికృత్ — కర్మహీనునిగాను దుఃఖపరుదున్నిగా మన్ను, స్యాత్ - అయ్యేని.

తా॥ ఆషాఢబహుళద్వితీయ, భాద్రపద బహుళత్రయోదశీబహుళత్రయో దశికి పూర్వమేతిథియందు భరణీనక్షత్రమువచ్చుచున్న దోయాతిథిన్ని కార్తికబహుళ ద్వితీయ, ఫాల్గునబహుళద్వితీయ, ఈ ౫ న్ను కృష్ణపక్షపైమిత్తికానధ్యయనములు వీనియందును: ఉదయసాయంకాలములయందును: ఉరిమేకాలమందును సూర్యుడు అనూరాధమొదలు: మృగశీర్షమువరకు ఈ ౧౯ నక్షత్రములయందు నుండగావర్షిం పుచుండెనేని అట్టికాలమందును; పైజెప్పిన తిసోస్రష్టకదినములయందును రిక్తతిథుల యందును; పూర్వమంతుఁజెప్పఁబడిన శుక్లపక్షనైమిత్తికానధ్యయనములయందును: వీనియందు నుపనయనముచేసినట్లైన చిన్నవాఁడు కర్మహీనుఁడగునని తా॥

(ఉపనయనకర్తలయొక్క నిర్ణయము)

శ్లో॥ పుంత్రాంశ్చోపన యేత్పిత్రైవహివటో స్తాతేవిదూరంగతే॥
చేద్బాలస్య పితామహస్సచనచే ద్భ్రాతా పితుస్సోపినో ॥
కర్తాసోదర ఏవసోపియదినో జ్ఞాతిశ్చకర్తాతదా ।
నోచేత్సోపి సగోత్రజ స్సకులజః కర్తావ్రతేయం క్రమః

తా॥ తండ్రి కుమారునికి ఉపనయనముచేయుట ప్రాముఖ్యము ఆ తండ్రి దేశాంతరమందున్నచో; తాతగారు అనగా తండ్రి తండ్రియు అతనులేనియెడల తండ్రిసోదరులైన అన్నదమ్ములు అనగా పినతండ్రులు; పెదతండ్రులుఅధికారులు వారులేనియెడల వటువుయొక్క అన్నగారు అధికారి అతనులేనియెడల సగోత్ర మందుపుట్టినవారుఅధికారులు వారున్నులేనియెడల సకులమందు పుట్టినవారుఅధి కారులు యీ ప్రకారముగా ఉపనయనము చేయుటయందు ప్రాముఖ్యమని తా॥

[గోదానాదివేద వ్రతకాల నిర్ణయము]

శ్లో॥ మౌంజీబంధనకర్మతోథ విహితం పూర్వంచ గోదానతః ।
కర్తవ్యం క్రమశ శ్చతుష్టయ మిదం వేదవ్రతానమపి ।
చౌలే యత్కథితం తదత్ర కథితం వర్షవ్యవస్థాం వినా।
ప్రాప్తే షోడశవత్సరేతు విహితం గోదానకర్మైవతత్ ॥

శ్లో॥ (౪౪) [పదవిభాగము] మౌంజీబంధనకర్మతః। అథ। విహితం। పూర్వం। చ। గోదానతః। కర్తవ్యం। క్రమశః। చతుష్టయం। ఇదం। వేదవ్రతానాం। అపి। చౌలే। యత్। కథితం। తత్। అత్ర। కథితం। వర్షవ్యవస్థాం। వినా। ప్రాప్తే। షోడశ వత్సరే। తు। విహితం। గోదానకర్మ। ఏవ। తత్।

తా॥ వేదవ్రతములనఁగా - ఆగ్నేయప్రాజాపత్యసౌమ్య వైశ్వదేవ వ్రతములును. ఉపనయనాంతరమందు స్నాతకమునకు ముందుగాను సంవత్సరనియమము తప్ప యితరమైన చౌలకర్మకు చెప్పఁబడిన - లగ్నాదులయందు వేదవ్రతములను జేయవలయుననియు, ౧౬ పదునారవసంవత్సరమందు విధించబడిన కర్మస్నాతక వ్రతమనియు తాత్పర్యము.

— (సమావర్తనకాలము) —

శ్లో॥ నానావేదసమూహ మంగసహితం చాధీత్య లబ్ధ్వా గురో
రాజ్ఞాం యజ్ఞసుతార్థిన స్స్యురధ తైః కార్యంసమావర్తనమ్
పూర్వాహ్ణేశుభవాసరే చరగృహంత్యక్త్వా చనందాష్టమీ,
రిక్తాపర్వదినత్రయాణిచ మృదుక్షిప్రస్థిరర్క్షేష్వపి ॥

శ్లో॥ [౪౫] (పదవిభాగము) నానావేదసమూహం। అంగసహితం। చ। అధీత్య లబ్ధ్వా। గురోః। అజ్ఞాం। యజ్ఞసుతార్థినః। స్యుః। అధ। తైః। కార్యం। సమావర్తనం పూర్వాహ్ణే। శుభవాసరే। చరగృహం త్యక్త్వా।చ। నందాష్టమీరిక్తాపర్వదినత్రయాణి చ; మృదుక్షిప్రస్థిరర్క్షేషు। అపి।

టీక॥ అంగసహితం- ఛందస్సు: కల్పము: వ్యాకరణము: జ్యోతిషము నిరుక్తము: శిక్షయను షడంగములతోగూడిన, నానావేదసమూహం - (చతుర్వేద సముచ్చయం] నాలుగువేదములగుంపును: అధీత్య - చదివి, గురోః - గురువు యొక్క, అజ్ఞాం - అజ్ఞను; లబ్ధ్వా - పొంది; యే - యెవరు: యజ్ఞసుతార్థినః-యాగములనుకుమారులనుగోరువారు, స్యుః - అగుచున్నారో; తైః- వారలచే; సమావర్తనం - సమావర్తనమనుకర్మ; పూర్వాహ్ణే - పూర్వాహ్ణమందు; (అనగాపూర్వభాగమందు, శుభవాసరే-శుభగ్రహవారమందు, చరగృహం - మేష కటక. తులా; మకరరాసులను; నందాష్టమీరిక్తాపర్వదినత్రయాణి - నందా - ౧-౬-౧౧ ఈనందతిధులు అష్టమీ - శుక్లకృష్ణ పక్షములయందుండుఅష్టమీతిథులు రిక్త- ౪-౯-౧౪ ఈరిక్తతిధులు, పర్వ-పంచపర్వాలు దినత్రియం-అవమ.

— (పంచపర్వములు) —

శ్లో॥ కృష్ణాష్టమీచతుర్దశ్య ప్యమావాస్యా చపూర్ణిమా ।
సంక్రాంతిః పర్వతిధయో యోగ్యైనిభిః పరికీర్తితాః ॥

టీ॥ కృష్ణాష్టమీ — కృష్ణపక్షాష్టమియు: చతుర్దశ్యాపి - కృష్ణపక్షచతుర్దశియు; అమావాస్యాచ - అమావాస్యయు: పూర్ణిమా - పున్నమయు, సక్రాంతి

సంక్రమణ ప్రవేశతిధియు పర్వతిధయః - పంచపర్వతిథులని, మునిభిః - ఋషీశ్వరులచేత,పరికీర్తితాః-చెప్పబడినవమట.

(దినత్రయ నిర్ణయము)

ముహూర్తసారే॥శ్లో॥ తిథీత్రయయుతో వారః తద్దినత్రయ ముచ్యతే। తిథిర్వారత్రయయుతం త్రిద్యుస్పృక్సంజ్ఞకః॥ అత్రదినత్రయ శబస్య అవమఇత్యుచ్యతే॥ కించ॥ ఏకస్మిన్వాసరే తిథిత్రయ సంయుతాయాది అవమాహ ఇతిపోక్తాః వారత్రయయుతాతిథిః త్రిదినస్పృక్ ఇతిఖ్యాతః శుభకర్మసు నిందితా ఇతి

తా॥ యాగకర్మలను కుమారులనుకోరెడువారు నాలుగుపేదములను వేదాంగములన(గాశిక్షా వ్యాకరణము మొదలగు షడంగములనుజదివి గురువుననుజ్ఞనుబొంది సమావర్తనమనుపేరు గలకర్మను, చరరాసులగు - మేష-కర్కాటక-తులా-మకర రాసులును, పాడ్యమి, షష్ఠి: శుక్ల కృష్ణాష్టములను: పంచపర్వములను; అవమతిధులును, అమావాస్యను, వీనినివిడచి; పగటిపూర్వయామమందును, శుభవారములయందును, చిత్ర, అనూరాథ, రేవతి,మృగశీర్ష, అశ్వని: పుష్యమి; హస్త, రోహిణి, ఉత్తరఫల్గుణి, ఉత్తరాషాఢ ఉత్తరాభాద్ర; ఈ పదకొండునక్షత్రములయందుసమావర్తనకర్మచేయవలయునని తా॥

శ్లో॥ మచిలీపట్టణే చల్లా లక్ష్మీనృసింహశాస్త్రిణాః
పూర్వకాలామృతం నామ ద్వితీయోబిందు రప్యభూత్ ॥

ద్వితీయ బిందుస్సమాప్తః

---

అథ తృతీయబిందుప్రారంభః

(అత్రావివాహ ప్రశంస)

శ్లో॥ ఆదౌ స్వేప్సితదేవతాం గ్రహగణం సంపూజ్యకర్తుస్తదా।
తారాచంద్ర బలాన్వితే శుభదినే లగ్నే శుభేవాసరే।
జ్యోతిశ్శాస్త్రవిదంప్రశాంత మనసంనత్వాయథాశక్తితం
తాంబూలాదిసమర్ప్య తస్యతేవదేద్వధ్వా వరస్యాపిభమ్ ॥

శ్లో॥ (౬౬) [పదవిభాగము] ఆదౌ, స్వేప్సితదేవతాం, గ్రహగణం;సంపూజ్య కర్తుః, తదా; తారాచంద్రబలాన్వితే; శుభదినే;లగ్నే శుభేవాసరే జ్యోతిశ్శాస్త్రవిదం

ప్రశాంతమనసం। నత్వా యథా స్వం గురుం తాంబూలాది సమర్ప్య తస్య తు వదేత్ వధ్వా వరస్య అపి భమ్ ॥

టీక॥ ఆదౌ - ప్రథమమందు, స్వేప్సిదదేవతాం — స్వ - తమయొక్క-ఈప్సితదేవతాం - యిష్టదేవతలు, గ్రహగణం - సూర్యుఁడు మొదలగు గ్రహసమూహమును, సంపూజ్య-బాగుగాపూజించి, తదా-ఆకాలమందు, కర్తుః-వివాహకర్తైనవరునితండ్రికి, తారాచంద్రబలాన్వితే-తారాబల చంద్రబలములతోఁగూడిన, శుభదినే - పంచాంగశుద్ధిగలదినమందు, శుభవాసరే — మంచివారమున, ప్రశాంతమనసం - శాంతాంతఃకరణగల, జ్యోతిశాస్త్రవిదం - జ్యోతిషముతెలిసిన, గురుం-గురువును, స్వం-తనసంబంధమైన, గురుంయధా-గురువునువలె, నత్వా-నమస్కరించి, తాంబూలాది - తాంబూలము మొదలగుదానిని, సమర్ప్య - యిచ్చి, వధ్వాః-పెళ్లికుమార్తెయొక్క-, భం-నక్షత్రమును, వదేత్-చెప్పవలయును.

అ॥ వివాహప్రశంసను జెప్పుచున్నాడు.

తా॥ వివాహకర్తయగు వరునితండ్రివివాహప్రయత్నారంభమందు నిష్టదైవమునుసూర్యాదినవగ్రహములకు భక్తిగలిగి పూజించి తనకు తారాచంద్రబలంబులు బాగుగనున్నరోజున శుభ దిన శుభలగ్న శుభవాసములయందు శాంతచిత్తుడగు జ్యోతిశ్శాస్త్రవేత్తను గురుభావముతో నమస్కరించి, తాంబూల దక్షిణాదులచేసంతుష్టంచేసి యాజ్యోతిష్కునకు కన్యావరుల నక్షత్రము దెలిపి మేమువచ్చిన లగ్నమునుబట్టి శుభాశుభఫలముల చెప్పవలయునని వివాహకర్త ప్రార్థించవలెనని తా॥

## వివాహప్రశ్నకాల ఫలములు

శ్లో॥ పాపః పంచమగోవినష్టతనయాంకుర్యాత్సజామిత్రిగః ।
కన్యాం లగ్నగతోవరం నిధనగోహన్యాచ్చ కన్యావరౌ ।
చంద్రో ప్యష్టమగోథవారిపుగతఃప్రష్టుర్విలగ్నాద్బలీ ॥
పశ్చాదష్టమవర్గతశ్చ పురతస్సౌమ్యైర్నయుక్తేక్షితః ॥

శ్లో॥ [౪౭](పదవిభాగము) పాపః పంచమగః। వినష్టతనయాం। కుర్యాత్। సః। జామిత్రిగః। కన్యాం। లగ్నగతః। వరం। నిధనగః। హన్యాత్। చ కన్యావరౌ। చంద్రః। అపి। అష్టమగః। అథవా రిపుగతః ప్రష్టుః విలగ్నాత్। బలీ పశ్చాత్। అష్టమవర్గతః। చ పురతః సౌమ్యైః। నయుక్తేక్షితః।

టీక॥ పాపః - పాపగ్రహము, ప్రష్టుః - అడుగువానికి, విలగ్నాత్ - లగ్నముకంటె పంచమగోయది - పంచమస్థాన మందున్నటులయిన కన్యాం —

కన్యకను వినష్టతనయాం వినష్ట - నశించిన, తనయాం - కుమార్తెకలదానిగా కుర్యాత్ - చేయును, సః- అపాపగ్రిహము, జామిత్రిగః - ప్రశ్నలగ్నమునకు నేడవయింటనున్నటులయిన, కన్యాం – కన్యకను, హన్యాత్ - చంపును, సఏవ - వాడే, లగ్నగతః - లగ్నమందున్నటులైన, వరాం - వరుని, హన్యాత్ - చంపును, నిధనగః-అష్టమమందున్నచో, కన్యావరౌ - కన్యావరులును, హన్యాత్- చంపును, చంద్రోపి-చంద్రుడున్ను, బలి - బలవంతుడగుచు, అష్టమగః-అష్టమందున్నచో, అథవా-లేక, రిపుగతః–ఆరవఇంటనున్నచో, సౌమ్యైః–శుభగ్రిహముల తో, యుక్తేక్షితః-కూడబడినవాడును, చూడబడినవాడును, నచేత్-కానియెడల, పశ్చాత్-వివాహానంతరము, అష్టమవర్షతః-ఏనిమిదోవసంవత్సరముకరచె, పురతః-ముందుగా [ఎనిమిదిసంవత్సరముల లోవుగానుండుట] కన్యావరౌ-కన్యావరులను హన్యాత్–చంపును.

అ॥ రెండుశ్లోకములచే నడిగినలగ్నమునుపట్టి ఫలా ఫలములను జెప్పుచున్నాడు.

తా॥ అడిగినలగ్నమునకైదవయింట పాపగ్రిహ ముండినటులైన వివాహకన్యను మృతపుత్త్రిలు కలదానిగా జేయును; యేడవయింటనున్న పక్షమందుఁగన్యనునశింపజేయును. పృచ్ఛలగ్నమందున్నట్లయిన వరుని నశింపజేయును యెనిమిదవయింట నున్నటులైన కన్యావరులనశింపజేయును. మఱియు చంద్రుడు పృచ్ఛకలగ్నమునకు యెనిమిదవయింటను ఆవ యింటను శుభగ్రిహములతోఁగూడియున్నను, జూడబడినను, కన్యావరులవివాహమైనపిదప యెనిమిదిసంవత్సరములకు ముందుగానే నశింపజేయునని తా॥

(వివాహప్రశ్నకు శుభఫలములు)

శ్లో॥ లగ్నాత్పంచమసంస్థితౌ గురుబుధౌ వధ్వాస్సుపుత్రప్రదౌ
శుక్రః పూర్ణనిశాకరశ్చ బలినౌ తస్యాశ్చ కన్యాప్రదౌ।
ఏతే లగ్నగతావరస్య సుఖదాః స్త్రీరత్నలాభప్రదాః।
జామిత్రేయది సంస్థితాస్తుయువతేః పుంరత్నలాభప్రదాః॥

శ్లో॥ [౪౦] [పదవిభాగము] లగ్నాత్। పంచమసంస్థితౌ గురుబుధౌ। వధ్వాః సుపుత్రప్రదౌ। శుక్రః। పూర్ణనిశాకరః। చ। బలినౌ। తస్యాః। చ। కన్యాప్రదౌ। ఏతే। గతాః। వరస్య సుఖదాః। స్త్రీరత్నలాభప్రదాః జామిత్రే। యది। సంస్థితః। తు। యువతేః। పుంరత్నలాభప్రధాః॥

టీక॥ గురుబుధౌ-గురుబుధులు, లగ్నాత్ – ప్రశ్నలగ్నముకంటె: పంచ సంస్థితౌ-పంచమందున్నవారగుచు; వధ్వాః - కన్యకకు; సుపుత్రప్రదౌ – యోగ్యమగుపుత్రులనిచ్చువారగుదురు: శుక్రః - శుక్రుఁడు; పూర్ణనిశాకరశ్చ - పూర్ణచంద్రుఁడున్నూ, బలినౌ-బలవంతులగును; పంచమమందున్నచో, తస్యాః - కన్యకకు, కన్యాప్రదౌ - స్త్రీసంతానమునిచ్చును. ఏతే - గురుబుధశుక్రపూర్ణచంద్రులు వీరిలో వకరయినా. లగ్నగతాశ్చేత్ - లగ్నమును బొందినటులయిన, వరస్య - వరునకు - సుఖదాః - సుఖమునిచ్చెదరు. స్త్రీరత్నలాభప్రదాః - శ్రేష్టమయిన స్త్రీప్రాప్తిని కలుగజేసెదరు:జామిత్రే-ప్రశ్నలగ్నమునకేడవయింట, సంస్థితశ్చేత్ ఉన్నచో, యువతేః-పెళ్ళికుమార్తెకు: పుంరత్నలాభప్రదాః–శ్రేష్టమగు పురుషుని కలుగజేసెదరు.

తా॥ అడిగినలగ్నమునకేడవయింట గురుబుధులుండినట్లయిన కన్యకనుసుపుత్రివంతురాలిని జేయుదురనియు: శుక్రపూర్ణచంద్రులు బలవంతులై ౫ టనున్న పక్షమునకన్యకను స్త్రీసంతానముకలదానిగా చేయుదురనియు, మరియునీచెప్పఁబడిన బుధ, గురు: శుక్ర, చంద్రులలోనొకరైననులగ్నమందున్నపక్షమునవరునికిమిక్కిలి సుఖమును సకలలక్షణ సంపన్నురాలగు స్త్రీ నిన్నియిత్తురనియు: పృచ్ఛకలగ్నమునకు ౭ ట పైగ్రహములున్నచోయీకన్యకకు రూపయౌవన విద్యావినయ సంపన్నుడైనవరుడు సంభవించునని తాత్పర్యము.

(కన్యకను వివాహమునకు నిశ్చయించుట)

శ్లో॥ ఏవంసత్ప్రసుయుం విచార్యమనసా శ్రీవేంకటేశం స్మరన్ ।
కన్యాదాతృగృహం ప్రవిశ్యసహతైస్సంభాష్యశర్కవతాం
కన్యాం శీలగుణాన్వితాం స్వకులజాంనక్షత్రరాశ్యాదిభి ।
స్సద్భిస్సైగనుకూలిసీంచ వరయేత్స్వర్ణాదినాలంకృతామ్॥

అవ. కన్యకను వివాహమునకు నిశ్చయించెడి క్రమమును జెప్పుచున్నాడు.

తా॥ శఃక్రిందజెప్పఁబడినప్రకారము శుభలగ్నమునువిచారించి మనమున నిష్టదైవంబునుస్మరింపుచుఁ గన్యకనిచ్చువారి గృహమును బ్రవేశించి:వారితో సంభాషించి సదాచారవతియై:సాముద్రికశాస్త్రమందుఁజెప్పబడినలక్షణములతోఁగూడినదై తమకులమందుఁబుట్టినదై నక్షత్రరాశిగ్రహ మైత్రాదులచే ననుకూలవతియైబంగారు ముత్యములు: పగడములు యివిమొదలైనవానిచే నలంకరింపఁబడినదైయున్నకన్యకను వరునికిఃదండ్రి నిశ్చయింపవలెను.

— (వివాహ సంవత్సర నిర్ణయము) —

శ్లో॥ జాతాత్సప్తదశాబ్దతోఽథ విషమే ష్వబ్దేషు పుంసాం శుభో ।
గోదానాహ్వయకర్మ లోపకరణేచే త్పంచమాబ్దాదిషు ।
కన్యానాం సమవత్సరేషు విహితః పాణిగ్రహః పుత్రికృ ॥
జ్జాతా ద్వాదశవత్సరాత్తునియమో నేయం వ్యవస్థాపరే ॥

అవ. వివాహముఁ జేయఁదగినసంవత్సరములఁ జెప్పబడును.

తా॥ పుట్టిన ౧౭ వ సంవత్సరము మొదలుకొని బేసిసంవత్సరములయందును, గోదానవ్రతము చేయనిపక్షమందు ఐదువ సంవత్సరము మొదలు బేసి సంవత్సరములయందుఁ బురుషులకు వివాహయోగ్యంబనియు మఱియు స్త్రీలకు సరి సంవత్సరములయందు వివాహము పుత్రిప్రదమనియును, ౧౦ సంవత్సరములకు పైన రజోదర్శనసమయమౌటవలన చేసినసంవత్సరములయందు జేయవచ్చును.

— ద్వితీయవివాహ యోగ్యకాలము —

శ్లో॥ ఉద్వాహా త్సమనంతరం యది పునః పాణిగ్రహేచ్ఛుర్భవే।
త్తద్వర్షాద్యసమాబ్దఏవశుభదస్తస్యాన్యపాణిగ్రహః ।
స్యాత్పత్నీమృతవత్సరాదవిషమే వర్షే వివాహశ్శుభో ।
యుగ్మాబ్దే త్వశుభప్రదోఽపి విషమే మాసీతి కేషాంమతమ్॥

శ్లో॥ (౩౧) [పదవిభాగము] ఉద్వాహాత్। సమనంతరం। యది। పునః।పాణిగ్రహేచ్ఛుః। భవేత్। తద్వర్షాత్। అసమాబ్దః। ఏవ। శుభదః। తస్యాః।అన్యపాణిగ్రహః స్యాత్। పత్నీ। మృతవత్సరాదివిషమే। వర్షే। వివాహః, శుభః। యుగ్మాబ్దే। తు।అశుభప్రదః। అపి। విషమే। మాసి। ఇతి। కేషాం। మతం.

టీక॥ ఉద్వాహాత్ - వివాహముకంటే, సమనంతర - వెంటనే, యః - యేపురుషుఁడు, పునః - తిరికి, పాణిగ్రహేచ్ఛుః - వివాహముకోరినవాఁడు: భవేద్యది - అయినట్టులయిన, తద్వర్షాద్యసమాబ్దఏవ - ఆసంవత్సరముమొదలుబేసి సంవత్సరములయందే, తస్య - ఆరెండవవివాహముచేసుకొనువానికి, అన్యపాణిగ్రహః - మఱియొకస్త్రీనివివాహముచేసుకొనుట, శుభదః—శుభకరమైనది, స్యాత్- అగును, పత్నీమృతవత్సరాదివిషమే భార్యచనిపోయినసంవత్సరము మొదలుబేసిసంవత్సరమందు, వివాహః-వివాహము, శుభః-మంచిది, యుగ్మాబ్దేతు - సరిసంవత్సరములయందు, అశుభప్రదః-మంచిదికాదు, విషమే—బేసిదైన, మాసి - మాసమందు

శుభప్రదః - శుభమునిచ్చును, ఇతి - అని, కేషాం - కొందరియొక్క, మతం- అభిప్రాయము.

— అత్రి విశేషము —

శ్లో॥ అపుత్రిణీమృతాభార్యా తస్యాభర్తుర్వివాహకం ।
యుగ్మాబ్దేయుగ్మమాసేవా కుర్యాచ్చేచ్ఛుభదోమతః ॥
ప్రజాపత్యాంచభార్యాయాం మృతాయాంబ్రాహ్మణస్యతు ।
విషమాబ్దేతుకర్తవ్యో వివాహశ్శుభకృద్భవేత్ ॥

తా॥ భార్యపుత్రసంతానము లేక చనిపోయినచో ఆచిన్నదాని పెనిమిటికి వివాహము సరిసంవత్సరమందు సరిమాసమందు చేయుటమంచిది, పుత్రసంతానముగలిగిన ఆమెచనిపోయినచో బేసి సంవత్సరములయందు వివాహముచేయుటశుభప్రదము.

అవ. రెండవవివాహమునకు తగినకాలముచెప్పఁబడును.

తా॥ వివాహమైనతర్వాత భార్య జీవించియుండగా తిరిగి వివాహముకోరువాఁడు, ప్రథమ వివాహసంవత్సరము మొదలు బేసి సంవత్సరములయందునుభార్య చనిపోయినవెనుక చనిపోయినది మొదలు బేసి సంవత్సరములయందను. కొందరి మతానుసారముగా సరిసంవత్సరములలో బేసినెలలయందును ద్వితీయాదివివాహము చేయఁదగినదితాత్పర్యము, మఱియుఇచ్చట భార్యపుత్రహీనురాలై మృతినొందినచో సమవర్షములయందు సమమాసములయందుచేయ తగుననియు, మఱియు ఆస్త్రీ పుత్రవంతురాలై మృతినొందినచో బేసి వర్షములయందే వివాహము చేయవలయుననియు కొందరియభిప్రాయమని తా॥ .

వివాహయోగ్యమాస నిర్ణయము

శ్లో॥ కుంభాజోక్షనృయుగ్మతౌళిసదనే ప్యర్కేస్థితే ఫాల్గునే ।
మాఘేమాధవశుక్రయోశ్చ శుభదస్తూర్జద్వయే మధ్యమః,
చైత్రేమీనగతే ధనుర్మృగగతే పౌషేచయుగ్మాన్వితే ,
ప్యాషాఢేనశుభోథనుర్ఝషయుతే ప్యర్కే వివాహశ్శుభః ॥

శ్లో॥ [ఇ-౨] [పదవిభాగము] కుంభాజోక్ష నృయుగ్మతౌళిసదనేషు। అర్కే। స్థితేఫాల్గునే। మాఘే। మాధవశుక్రయోః। చ। శుభదః। తు। ఊర్జద్వయే మధ్యమః। చైత్రేమీనగతే। ధనుర్మృగగతే పౌషే। చ। యుగ్మాన్వితే। అపి ఆషాఢే। నః శుభః। ధనుర్ఝషయుతే। అపి। అర్కే। వివాహః శుభః ॥

టీక॥ అర్కే - సూర్యుడు, కుంభాజోక్షనృయుగ్మతౌళిసదనేషు, కుంభ - కుంభము, అజ - మేషము, ఉక్ష — వృషభము, నృయుగ్మ - మిథునము, తౌళి - తుల, ఏతేషు - ఈ, సదనేషు - రాసులయందు, అర్కే - సూర్యుడు, స్థితే సతి- ఉన్నవాడగుచుండగా, ఫాల్గునే-ఫాల్గునమాసమందు, మాఘె - మాఘమాసమందు' మాధవశుక్రియోః-వైశాఖజ్యేష్ఠమాసములయందు వివాహః-వివాహము,శుభదః-శుభ మునిచ్చును, ఊర్జద్వయె-కార్తికమార్గశిరమాసములయందు, మధ్యమః-మధ్యమము: అర్కే--సూర్యుడు, మీనగతె-మీనరాశినిబొందియుండగా, చైత్రే-చైత్రమాసంబున ధనుర్మృగగతే — ధనుర్మకరములను బొందియుండగా, పౌషేమాసి - పుష్యమాస మందు, యుగ్మాన్వితే-మిధున మందుండగా ఆషాఢే - ఆషాఢమాసమందు, నశుభ ప్రదః-శుభమునివ్వడు, అప్రకారమాపస్తంబులవారు చెప్పియున్నారు. ఉత్తమంచ నైదాఘమితి ఆషాఢము మొదలు మూడుమాసములు నిషేధమగుటవల్ల ధనుర్మకర ములయందుండగా పుష్యమాసము కంటే నితరమాసములుకూడును సూర్యుడుమీన మందుండగా చైత్రమాసమందు గూడదనునిషేధము. వింధ్యపర్వతమునకుత్తరదేశ మునకే. దక్షిణదేశమునకుకాదు, వింధ్యోత్తరదేశములయందును కళింగవంగ సింధు దేశములకే మీనచైత్రమంతయు నిషేధము. మిగతదేశములకు మీనాయనగతుడగు చుండగా నిషేదములేదు. అప్రకారము దక్షుడుచెప్పియుండెను.

(మీనచైత్రే దోషనిర్ణయము)

శ్లో॥ మేషాయనప్రవేశేతుతదారభ్య ప్రయత్నతః । వివాహంశుభ
మిచ్ఛంతిగర్గకశ్యపదేవలాః । మీనచైత్రే మహాదోషః
కళింగేవంగసింధుషు । వివాహంవర్జయెత్తత్ర చాన్యేషుతు
శుభప్రదః ॥

పరాశర సంహితాయాంచ

శ్లో॥ వింధ్యస్య దక్షిణేదేశే మీనచైత్రిశ్శుభావహః ॥ తస్యసా
త్సౌమ్యభాగేతు మేషచైత్రిశ్శుభావహః ॥ వివాహే మీన
చైత్రేతు యావన్మేషం విశేద్రవిః తావద్వైవాహికంకర్మ
కుర్యా ద్వింధ్యస్యదక్షిణ ఇత్యుక్తత్వాత్ ॥

అవ వివాహవిషయమై శుభాశుభమాసములని చెప్పబడును.

తా॥ మేష, వృషభ, మధున తులా కుంభరాసులయందు సూర్యుడుండగాను సూర్యుడు పుష్యమాసముకంటె నితరమాసములయందుధమర్మకరములబొందియుంద

గాను వైశాఖ జ్యేష్ఠమాఘ ఫాల్గున మాసములయందును వివాహముచేయుటమంగళ కరమనియు కార్తిక; మార్గశీర్ష మాసములయందుఁజేయుట యల్పఫలదంబనియు, సూర్యుఁడుఁ పుష్యమాసమందు ధనుర్మకరరాసులయం దుండఁగాను, నాషాఢమాస మందు మిధున కర్కాటకరాసులయం దుండఁగాను వివాహముచేయుట యమంగళ కరమనియు. సూర్యుఁడు చైత్రమాసమునందు మీనరాశియందుండఁగా గలిగెడు దోషము వింధ్యపర్వతోత్తరదేశమునగాని, దక్షిణదేశమునకులేదు గాన, దక్షిణదేశ స్థులు మీనచైత్రమందు మేషాయన ప్రవేశమైనను వివాముముజేయవచ్చునని తా॥

## — వివాహనిషిద్ధతిధి నిర్ణయము —

శ్లో॥ మాసాంతే దినపంచకే పితృతిథౌ రిక్తాష్టమీ ద్వాదశీ ।
షష్ఠీ విష్టిషువా దినోత్తరదళే సాయంతనేఽహర్ముఖే ॥
మాసాదౌనవమార్ధ రాత్రిదినకృత్క్రామప్రదోషేషువా ॥
మన్వాదౌ చ యుగాదివర్జదివసే పాణిగ్రహో నిందితః ॥

శ్లో॥ [౫౩] [పదవిభాగము] మాసాంతే । దినపంచకే । పితృతిథౌ । రిక్తాష్టమీ ద్వాదశీ షష్ఠీవిష్టిషు । వా । దినోత్తరదళే । సాయంతనే । అహర్ముఖే । మాసాదౌ । అవ మార్ధరాత్రి దినకృత్క్రామప్రదోషేషు । వా । మన్వాదౌ । చ । యుగాదివర్జదివసే । పాణిగ్రహః॥ నిందితః॥

అవ॥ వివాహనిషిద్ధకాలముల జెప్పుచున్నాడు.

తా॥ కృష్ణైకాదశిమొద లమావాస్యవఱకును, పితృతిథులయందును, అష్టమి, ద్వాదశి, షష్ఠియందును, భద్రకరణమందును, దినోత్తరిభాగమనఁగా మూడవజాము నందును, సాయంకాలమనగా ౨౬ ఘడియలు మొదలు ౪ ఘడియలును, ప్రభాత సమయమందును, శుద్ధ ౧ పాడ్యమియందును, ౩ మూఁడుతిధులు గూడిన దినమం దును, సగము రాత్రివేళయందును; ౧౪ మన్వాదులయందును; ౪ యుగాదులయం దును; ముందు జెప్పఁబడిన వర్జదివసములయందు వివాహము చేయగూడదు.

## — వివాహవార నక్షత్ర నిర్ణయము —

శ్లో॥ శుక్రార్కేజ్యంకుజవాసరేషు శుభదో మాసార్కయోర్మధ్యమ
శ్చోద్వాహః కుజవాసరే విఘనదస్సోమే సపత్నీప్రదః ।
రేవత్యుత్తరరోహిణీకర పితృస్వాతీందు మిత్రాసురే ।
పావానస్వాత పాపవేధహితే పాణిగ్రహశ్శోభనః ॥

శ్లో॥ (౫౪) [పదవిభాగము] శుక్రార్కేందుజవాసరేషు। శుభదః। మందార్కయోః మధ్యమః। చ। ఉద్వాహ। కుజవాసరే। నిధనద। సోమే । సపత్నీప్రదః । రేవత్యుత్తరరోహిణీకకృపకరస్వాతీందుమిత్రాసురే పాపానన్విత పాపవేధరహితే: పాపగ్రహః। శోభనః—

అవ. వివాహమునకు యోగ్యాయోగ్య వారనక్షత్రముల జెప్పుచున్నాడు.

తా॥ బుధ గురు శుక్రవారము లుత్తమంబులు. ఆదిత్య శనివారములుమధ్యంబులు: భౌమవారము మరణప్రదంబు, సోమవారము పునర్వివాహప్రదము మఱియు, రోహిణి, మృగశిర: మఘ: ఉత్తర: హస్త, స్వాతి: అనూరాధ, మూల ఉత్తరాషాఢ: ఉత్తరాభాద్ర, రేవతి: వీనిలో పాపగ్రహములేని నక్షత్రమందు, పాపగ్రహవేధలేని నక్షత్రమందును వివాహముచేయుట యుక్తమని తా॥

వివాహమునకు నిషేధ కాలములు

శ్లో॥ ఆర్ద్రాద్యా వనిలాంతబుక్షుదశకే సూర్యేస్థితేవాగురౌ ।
సింహాస్థేప్యథవాతదంశకగతే పూర్వేదశే పారిఘే ।
ఉద్వాహోనశుభః స్వజన్మనిధనే మాసేచరాశౌగృహే ।
దంపత్యోరపిజన్మకర్మ నిధనాద్వృక్షేషు సప్తస్వపి ॥

శ్లో॥ (౫౫)(పదవిభాగము) ఆర్ద్రాదౌ: అనిలాంతబుక్షదశకె, సూర్యే, స్థితే। వా। గురౌ। సింహస్థే। అపి। అథవా। తదంశకగతే। పూర్వే। దశే । పారిఘే, ఉద్వాహః। న। శుభః స్వజన్మనిధనే। మాసే । చ। రాశౌ। గృహే । దంపత్యో। అపి జన్మకర్మ నిధనాద్వృక్షేషు । సప్తసు। అపి

టీక॥ సూర్యే—సూర్యుడు: ఆర్ద్రాదౌ — ఆరుద్రమొదలు, అనిలాంత - స్వాతి అంతముగాగల: బుక్షదశకే, పదినక్షత్రములయందు: స్థితే - యుండగా; యీవచనముచే సూర్యుడు ఆర్ద్రనక్షత్రముయొక్క నాల్గవపాదముమొదలు స్వాతి యొక్క అంతమువరకు: గురౌ-బృహస్పతి; సింహస్థే - సింహరాశియందుండగా

అ త్ర వి శే ష ము

శ్లో॥ జ్యేష్ఠమాసె యదాసూర్యే రుత్రిక్షె చార్ధభాగభాక్
వివాహాదిశుభంకార్యం కేచిదాహుః త్రియోంశకాఇతి ।

అథవ-లేక, తదంశకగతే—అసింహాంశనుబొందియుండగా: పారిఘే - పరిఘనామ యోగసంబంధమైన: పూర్వే - మొదటిదైన: దశే — సగమునందు, ఉద్వాహః -

వివాహము: నశుభః—మంచిదికాదు: స్వజన్మనిధనే - తనజన్మమాసము మొదలైన ఎనిమిదవదైన మాసె-మాసమందుజన్మమాసమనఁగా

జన్మమాసనిర్ణయము

శ్లో॥ జన్మనోదినమారభ్య త్రింశద్దినమతః పరం ।
జన్మమాసమితిప్రాహుర్మునయస్సత్వవాదినః॥

తా॥ పుట్టినదినము మొదలు ముప్పదిదినములు మాసమనఁబడును. స్వజన్మరాశౌ—జన్మరాశిమొదలుయెనిమిదవరాశియందు: గృహె — తనజన్మలగ్నము మొదలు యెనిమిదవలగ్నమందు దంపత్యోః- దంపతులయొక్క: జన్మకర్మనిధనా ద్యృక్షేషు — జన్మకర్మసాంఘాతిక పైనాశికమానసికసాముదాయిక నైధనములను సప్తసు—ఏడునక్షత్రములయందు, నశుభః-మంచిదికాదు.

అవ॥ వివాహ నిషేధకాలముల జెప్పుచున్నాడు.

తా॥ సూర్యుఁడార్ద్రనాల్గవపాదముమొదలు స్వాతినాల్గవపాదము వఱకుండినను: బృహస్పతి సింహరాశి యందైనను:ఈరాశ్యంశ యందైననుండగాను,పరిఘా నామయోగ పూర్వార్థ మందును జన్మమాసమనఁగాజన్మించనదినము మొదలు ౩౦దినములయందును, జన్మమాసమున కెనిమిదవమాసమందును, జన్మరాశి కెనిమిదవరాశి యందును: జన్మలగ్నమున కెనిమిదవలగ్నమందును౩౫శ్లోకమందుఁజెప్పఁబడినజన్మ కర్మాదినక్షత్రములయందును వివాహముఁజేయతగదు.బృహస్పతిసింహరాశి యందు ఁడగావింధ్యోత్తరదేశస్థులకేవివాహనిషేధము తక్కినదేశస్థులకానిషేధము లేదు.

గురు శుక్రచంద్రులకు బాలత్వాది నిర్ణయము

శ్లో॥ శుక్రశ్శుక్రదిగుద్గత స్త్రిదివసే బాలోదశాహేపరే ।
పక్షేవృద్ధఇతి క్రమాద్దశదినే పంచాహమేవాథవా ।
పక్షే నోభయతో గురుః పరమతం శుక్రేజ్యయోస్తద్వయే ।
పంచాహంతు దినత్రయేర్ధదివసే వృద్ధశ్శిశుస్స్యాచ్ఛశీ ॥

శ్లో॥ [౩౬] [పదవిభాగము] శుక్రః। శక్రదిగుద్గతః త్రిదివసె। బాలః।దశాహేపరే పక్షే। వృద్ధః ఇతి క్రమాత్ । దశదినే పంచాహం। ఏవ అథవా పక్షే। చ ఉభయత గురుః। పరమతః శుక్రేజ్యయోః తద్వయె పంచాహం । తు దినత్రయె అర్ధదివసే వృద్ధః శిశుః స్యాత్ శశీ

టీక॥ శుక్రః—శుక్రుఁడు, శక్రదిగుద్గతః — తూర్పుదిక్కున ఉదయించిన వాఁడై: త్రిదివసే - మూడుదినములయందు, బాలః - బాలుడు: భవతి - అగు

చున్నాడు: పరే- పశ్చిమదిక్కు యందు, దశాహె - పదిదినములయందు బాలః - బాలుడు; ఇతి - ఈప్రకారము, క్రమాత్ - క్రమముగా, పక్షే - పదునైదు రోజులు వృద్ధః-వృద్ధుడు: పూర్వనందు: దశదినే - పదిరోజులు, పతమట వృద్ధ వృద్ధుడు: అథవా—లేకున్న: పడమట పంచాహమేవ, ఐదురోజులే వృద్ధుడనుట, గురుః - బృహస్పతి: ఉభయతః - ఉదయాస్తమయములయందు పక్షే - పదునైదురోజులు, బాలః - బాలుడు, వృద్ధః - వృద్ధుడు, శక్రేజ్యయోః - శుక్ర బృహస్పతులకు: తద్వయె - ఆయుదయాస్తమయములయందు పంచాహం - ఐదుదినములు బాలత్వవృద్ధత్వములని పరమతం-కొందరిమతము, శశీ-చంద్రుడు, దినత్రయె - మూడుదినములు, వృద్ధః-వృద్ధుడు, అర్ధదివసే - ముప్పది ఘడియలు శిశుః-బాలుడు,

శ్లో॥ చతుర్దశ్యంత్యగశ్చంద్రః సకృదస్తమయంవ్రజేత్ ।
అమావాస్యాంతగో సూర్య చంద్రా రాశ్యాదిభిస్సమా ।
అంత్యే ప్రతిపద సూర్యాన్నిర్గతి శ్చోదయంగతః ॥

అని ప్రమాణము

అవ॥ గురు శుక్రచంద్రుల వృద్ధత్వబాలత్వముల నిర్ణయము-

తా॥ శుక్రుడు పూర్వదిక్కునుదయించిన యుదయానంతము ౩ దినములు బాలుడును పశ్చిమంబున నుదయించిన ౧౦ దినములు బాలుడును; పూర్వనన స్తమించిన నస్తమయమునకు ముందు ౧౫ దినములు వృద్ధుడును: పశ్చిమంబునన స్తమించిన ౧౫ దినములు వృద్ధుడును: నొకపక్షమున పశ్చిమందున నైదుదివసంబులు వృద్ధుడును బృహస్పతియుదయించిన ౧౫ దినములు బాలుడును అస్తమించిన ౧౫ దినములవృద్ధుడును కొందఱియభిప్రాయము. గురుశుక్రుల కుభయులకు నుదయించిన నస్తమించిన ౫ నైదుదినములు బాలత్వ వృద్ధత్వములనియును చంద్రుడు కృష్ణద్వాదశి మొదటి ఘడియమొదలు చతుర్దశ్యంత్య ఘడియలవరకు వృద్ధుడును: శుద్ధపాడ్యమి తుదిఘడియమొదలు విదియ ౩౦ ఘడియలవరకు బాలుడని తా॥

చంద్ర గురుశుక్రాస్తమయఫలము

శ్లో॥ శుక్రార్కేందుషు చాస్తగేషు నిధనంప్రాప్నోతిశీఘ్రంవరో
బాలేషు వ్యభిచారిణీచ యువతిర్వృద్ధేషు సత్పుత్రిషు
కన్యామృత్యుగతా వివాహసమయే వ్రాత్యోవ్రతేవాభవే ।
స్నానమంతం సువనంవినైవ నశుభం సర్వేషు కర్మస్వపి ॥

శ్లో॥ [౫౭] [పదవిభాగము] శుక్రార్యేందుషు । చ । అస్తగేషు । నిధనం । ప్రాప్నోతి। శీఘ్రం । వరః। బాలేషు। వ్యభిచారిణీ। చ। యువతిః। వృద్ధేషు। సత్సు త్రిషు। కన్యా । మృత్యుగతా । వివాహసమయె। వ్రాత్యఃవ్రతే।। వా। భవేత్।సీమంతం। సవనం। వినా। ఏవ। న। శుభం । సర్వేషు। కర్మసు అపి

టీక॥ వివాహసమయె - వివాహకాలమందు । శుక్రార్యేందుష్టు - శుక్ర గురుచంద్రులు: త్రిషు — ముగ్గురు, అస్తగేషుసత్సు - అస్తమానమును పొందియుండగా, యువతిః - ఆడుది వ్యభిచారణీ - వ్యభిచారముగలది స్యాత్ - అగును. వృద్ధేషు - వృద్ధులైయుండగా, కన్యా—కన్యక; మృత్యగతా - మృత్యువుకలది, భవేత్ - యగును, వ్రతె-ఉపనయనమందు, వ్రాత్యః- సంస్కారములేనివాడు; భవేత్ - అగును సీమంతం — సీమంతమునున్నూ, సవనం - పుంసవనమున్నూ, వినా - వదలి, సర్వే - సమస్తమైన; కర్మస్వపి - కర్మలయందు; శుభం-శుభము, నైవ-లేదు.

శ్లో॥ వింధ్యస్యదక్షిణేదేశే వృద్ధ బాల్యేపి జేజ్యయోః ।
త్రిదినం వర్జయిత్వాతు తతః కుర్యాత్తు శోభనం॥

అవ॥ మౌఢ్యకాలఫలములఁజెప్పుచున్నాడు.

తా॥ చంద్ర గురుశుక్ర మూఢములయందు వివాహమైన వరుఁడుశీఘ్రమున మృతినొందిదుననియు; వీరు బాలురై యున్న వివాహమైనకన్యరంకులాడియగునని యు: వృద్ధులైయున్న కన్యక మృతినొందుననియు, సీముగ్గురిప్రకారముండగా నుపనయనమైనవాడు వ్రాత్యుడనియు, మానవియమముగల సీమంతాదులవిడచియన్యములైన సర్వకర్మలకునిషేధము. వింధ్యపర్వత దక్షిణదేశస్థులకు గురు శుక్రులు వృద్ధత్వ బాలత్వములోనున్న ౩ దినంబులం బరిత్యజించి: మిగిలినదినములలో చేయవచ్చునని కొందఱి యభిప్రాయము.

## త్రిజ్యేష్ఠస్వరూపనిర్ణయము

శ్లో॥ జ్యేష్ఠే మాసికరగ్రహోసశుభకృత్ జ్యేష్ఠాంగనాపుత్రయోః
జ్యేష్ఠే మాస్యపిజాతయోశ్చ యదివాజ్యేష్ఠోడుసంభూతయోః
దంపత్యోర్యది యేనకేనవిధినా జ్యేష్ఠాత్రియం చాస్తిచే।
త్రిజ్యేష్ఠా హ్వాయదోషదోహిసతతం నాప్యాద్యగర్భద్వయే।

శ్లో॥ [౫౮] [పదవిభాగము] జ్యేష్ఠే। మాసి। కరగ్రహః। న । శుభకృత్ । జ్యేష్ఠాంగనాపుత్రయోః। జ్యేష్ఠే। మాసి। అపి। జాతయోః। చ । యది । జ్యేష్ఠోడు సం

భూతయో। । దంపత్యోః । యది । యేన। కేన। విధినా। జ్యేష్ఠాత్రియం। చ। అస్తి చేత్। త్రిజ్యేష్ఠాహ్వయదోషదః। హి। సతతం। న। అపి। ఆద్యగర్భద్వయె ॥

టీక॥ జ్యేష్ఠే - జ్యేష్ఠమను, మాసి - మాసమందు, జ్యేష్ఠాంగనాపుత్రయోః— జ్యేష్ఠకన్యక జ్యేష్ఠపుత్రులకు, కరగ్రహః-వివాహము, నశుభకృత్-మంచిదిచేయదు. జ్యేష్ఠె - జ్యేష్ఠమున, మాసి - మాసమందు, జాతయోరపి - పుట్టినవారకు, జ్యేష్ఠోడుసంభూతయోర్యది - జ్యేష్ఠానక్షత్రమందుపుట్టినవారలైనచో, నశుభకృత్-శుభముచేయదు, యేన - యె, కేన - ఏ, విధినా — ఏప్రకారముచేత, దంపత్యోః-దంపతులకు జ్యేష్ఠాత్రయం- మూఁడుజ్యేష్ఠములు, అస్తి చేత్ - ఉంటినచోఁ, త్రిజ్యేష్ఠాహ్వయదోషదః — త్రిజ్యేష్ఠయనుదోషమునిచ్చును, హి - ప్రసిద్ధము, సతతం-యెల్లప్పుడు, ఆద్యగర్భద్వయె—మొదటిగర్భద్వయమునందు, న-వివాహముకూడదు

శ్లో॥ ఆద్యగర్భద్వయోర్వ్యత్రివివాహం కారయేద్యది ।
మాసాధిపతి మిత్రిత్వవశాదత్ర శుభావహః ।
వివాహోయదికర్తవ్య శ్చాద్య గర్భద్వయో రపి ।
అన్యోన్యరాశిమిత్రత్వే శుభం ప్రాహమునిర్మనుః ॥

తా॥ ఏవిధమునైన కన్యావరులకు, మూఁడుజ్యేష్ఠశబ్దములుగూడెనేని త్రిజ్యేష్ఠమనుదోషముగుచున్నది. గానసహోదరులలో జ్యేష్ఠస్త్రీపురుషులకు జ్యేష్ఠమాసమందు వివాహము చేయకూడదనియు, జ్యేష్ఠమాసమందైనను జ్యేష్ఠానక్షత్రమందైనను, బుట్టిన కన్యావరులకును, జ్యేష్ఠంబున వివాహముచేయకూడదనియు త్రిజ్యేష్ఠముగూడకపోయినను కన్యావరులిరువురు సీమంతపుత్రులయిన వివాహము విశేషము. జ్యేష్ఠకన్యావరులయిన దంపతులకు రాశిమిత్రత్వముగాని. మాసాధిపుల మిత్రత్వము గాని కలిగియుండెనేని శుభకరమని మన్వాదులభిప్రాయము.

## — వివాహమునకు గురుబలము —

శ్లో॥ వద్యా స్త్వాదశరంధ్రజన్మసు గురుర్వైధవ్యదస్స్యాత్త్రిష ట్సంస్త్రీక్షయకృ చ్చతుర్థదశమస్థానస్థితో దుఃఖకృత్ ।
ఆవశ్యం బలనార్యసూర్యశశినాం బానాంవివాహేద్వయో ర్దుష్టస్థానగతాఅమీతువిహితాస్తేషాం చ పూజాదినా ।

శ్లో॥ [అ] [పదవిభాగము] వధ్వాః । ద్వాదశరంధ్రజన్మసు । గురుః । వైధవ్యదః। స్యాత్। త్రిషట్సంస్థః । స్త్రీక్షయకృత్ । చతుర్థశమస్థానస్థితః । దుః

కృత్। ఆవశ్యం। బలం । అర్యసూర్యశశినాం। భానాం। వివాహే। ద్వయోః। దుష్టస్థానగతాః। అమీ। తు। విహితాః। తేషాం। చ। పూజాదినా ॥

టీక॥ వధ్వాః - కన్యకకు, గురుః - బృహస్పతి, ద్వాదశరం ద్వాదశ - పండ్రెండవయింట, రంథ్ర-యెనిమిదవయింట, జన్మసు-జన్మమునందు స్థితః - ఉన్నవాడగుచు, వైధవ్యదః - వైధవ్యమునిచ్చువాడగుచు, స్యాత్-అగును త్రిషట్సంస్థః - వరునికిమూడు ఆరుస్థానములయందున్నవాడగుచు, స్త్రీక్షయకృత్-స్త్రీనాశముజేయును, చతుర్థశమ స్థానస్థితః - నాలుగు దశమస్థానముల యందున్నవాడగుచు, దుఃఖకృత్-యిద్దరికి దుఃఖముచేయును, [ యీ చెప్పబడినస్థానముల కంటె యితరస్థానములయందున్న శుభముకలుగజేయును:] వివాహే - వివాహమందు, ద్వయోః - దంపతులయొక్క, ఆర్యసూర్యశశినాం - గురుసూర్యచంద్రుల యొక్క, భానాం-తారలయొక్క, బలం-బలము, అవశ్యం-ముఖ్యము.

వివాహమునకు ముఖ్యగ్రహబలము

శ్లో॥ చంద్రతారాబలం వీక్ష్యదంపత్యోర్గురు సూర్యయోః ।
మాసేశుభే శుభదినేకార యెన్మంగళం ముదే ॥

మీ-గురుసూర్యచంద్రులు, దుష్టస్థానగతాః - దుష్టస్థానమందున్నను, పూజాదినా - పూజాదానాదులచేత, విహితాః _ వశముచేసికొనబడినవారై, తేషాం - దంపతులకు, శుభదాః-మంచినిచేసెదరు.

అవ. వివాహమునకు బృహస్పతిఫలములు జెప్పుచున్నాడు,

తా॥ బృహస్పతికన్యకయొక్క జన్మలగ్నమునకైనను, లేక జన్మచంద్రలగ్నముకైనను ౮ - ౧౨ డీ స్థానములయందున్న గన్యకవిధవయగు ననియును, వరుని జన్మలగ్నమునకు ౩-౬ స్థానములయందున్న భార్యచనిపోవుననియును, ౪-౧౦ స్థానములయందున్న దంపతులు దుఃఖవంతులనియు ౨-౫-౭-౯-౧౧ స్థానములయందున్నచో శుభమునిచ్చుననియు ఇదియునుగాక దంపతులకు రవిచంద్ర బృహస్పతి తారాబలము లవశ్యముగా చూడతగినది ఈ సూర్యచంద్రబృహస్పతులు ఆరిష్టస్థానమందుండిరేని జపహోమదానాదులచే సంతుష్టులగావించిన శుభమునిత్తురు

ఏకోదరులకు ఏకలగ్నంబున వివాహనిషేధము

శ్లో॥ ఏకస్యాపి సుతాద్వయం నవిహితం నాప్యేకజన్యద్వయోః।
రేకస్మిన్నుదయేద్వయోశ్చవరయోర్దద్యాన్నపుత్రిద్వయమ్।

పుత్రీపుత్రశుభద్వయం నయుగపత్కార్యం నపుత్రిద్వయో।
రుద్వాహవ్రతయుగ్మ మేకభవనేనాప్యన్యయో స్తద్వయమ్॥

శ్లో॥ [౬౦] [పదవిభాగము] ఏకస్య। అపి। సుతాద్వయం। న। విహితం న। అపి। ఏకజన్యద్వయోః ఏకస్మిన్। ఉదయె ద్వయో చ వరయోః దద్యాత్ న। పుత్రీ ద్వయం పుత్రీపుత్రి శుభద్వయం। న యుగపత్ కార్యం న। పుత్రిద్వయోః ఉద్వాహవ్రతయుగ్మం ఏకభవనే। న। అపి అన్యయోః తద్వయం.

టీక॥ ఏకస్య - ఒకపురుషునికి, సుతాద్వయం - ఏకోదరులైన యిద్దరు కన్యకలు, నవిహితం - వివాహముచేయకూడదు, ఏకజన్యద్వయో - ఏకోదరులైన వఋలకు, సుతాద్వయం - కుమార్తెలయొక్కద్వయము, నవిహితం _ వివాహము చేయగూడదు, ఏకస్మిన్ - ఒక, ఉదయె—లగ్నమందు, ద్వయోః - భిన్నోదఋలైనయిద్దరు, వరయో-వరులకు, పుత్రీద్వయం- పుత్రికాద్వయమును న దద్యాత్- కన్యాదానముచేయకూడదు. పుత్రీపుత్రిశుభద్వయం - పుత్రికాపుత్రుల యొక్క వివాహద్వయము, యుగపత్ - ఒక లగ్నమందు, నకార్యం - చేయకూడదు, పుత్రిద్వయో-యిద్దరుపుత్రులకు, ఉద్వాహవ్రతయుగ్మం, వివాహద్వయము మప నయనద్వయమును, యుగపత్ - ఒక్కమారు, నకార్యం - చేయగూడదు, తద్వయం తత్-ఆ వివాహోపనయనములయొక్క, ద్వయం—ద్వయము, అన్యయోరపి -భిన్నోదరులకున్నూ, ఏకభవనే-ఒకగృహమందైననేకలగ్నమందైన, న-కూడదు

(అపత్కాల విశేషము)

శ్లో॥ ఏకోదరోద్భవసుతా సుతయోర్వివాహం మాసాంతరేమను వసిష్ఠ పరాశరాద్యాః । ఇచ్ఛంతి మంగళమథాశువదంతి గర్గాః కేచిత్త్వథైవ దివసేప్యుదయప్రభేదే ॥ మఱియొకవిశేషము:-శ్లో॥ ఏక లగ్నేపిభిన్నాంశే వసిష్ఠాత్రిపరాశరాః । త్రియోర్వివాహమిచ్ఛంతి పృథగ్ద్వారేమేధ మంటపే । శుభకృత్పుత్రికోద్వాహాత్పశ్చాత్పుత్రకర గ్రహః ఏకతిథ్యా మపిప్రాహ భార్గవో భిన్నవేళయా। బార్హస్పత్యే॥ ఏకస్మిన్దివసేప్యేకలగ్నే భిన్నాంశకేతయోః । ఏకగర్భోద్భవయోస్త్రత్రి వివాహశ్శుభకృద్భవేత్ ॥ యమళవిషయేతు:- ఏకస్మిన్వత్సరేచైక వాసరేమంటపేపిచ । కర్తవ్యంమంగళం స్వస్రోః భ్రాత్రోర్యమళ

జాతయోః । గణశః । క్రియమాణానాం । యుగపన్మాతృపూజనం ।
నాన్దీముఖం చ వేదేకం హోమమంత్రాః పృథక్పృథక్ ॥

అవ. రెండుశ్లోకములచే సహోదరుల కేకకాల వివాహము నిషేధించు చున్నాడు.

తా॥ ఒకవరునికి నిరువురు సహోదరకన్యల నియ్యగూడదనియు, నన్నదమ్ములకు నక్కచెల్లెండ్రనియ్యఁకూడదనియు నొకలగ్నమందు భిన్నోదర వరులకైనను కన్యకాద్వయమును నియ్యఁకూడదనియు, ఒకలగ్నమందు బుత్రీపుత్రులకు వివాహము చేయకూడదనియు సోదరులకు 2 వివాహములుగాని ఉపనయనములుగాని చేయకూడదనియు నొకనికి నుపనయనము నొకనికివివాహము నొకగృహమందొక లగ్నమందుఁజేయగూడదనియు భిన్నోదరులకైన నొకలగ్న మందొకవేదికయందు జేయఁగూడదనియు తాత్పర్యము.

[ఆపత్కాలవిషయమైమన్వాదులుకొందఱు, మాసాంతరమందుఁజేయవచ్చుననియు, కొందరులగ్నాంతరమందు చేయవచ్చుననియు, కొందఱొక లగ్నమందం శాంతరమందన్యగ్రామ మందుజేయవచ్చుననియుఁ గొందఱు పుత్రికావివాహానంతర మందుఁ బుత్రవివాహముఁ జేయవచ్చుననియుఁ సమదలవిషయమై యేకకాలమందే జేయవచ్చుననిజెప్పిరని తాత్పర్యము]

— ఏకకాలంబున పుత్రీపుత్రవివాహము —

శ్లో॥ పుత్రీపాణినిపీడనాచ్చపరత స్సూనోర్వివాహశ్శుభో ।
నాన్యత్పుత్రకరగ్రహాత్తు నకిమ ప్యుద్వాహఏవ వ్రతాత్ ।
నాన్యత్పూర్వమృతుత్రయాత్స్వశరది హ్యేకోదరాణామయం
ప్రత్యుద్వాహవిధి స్తయోర్న శుభకృచ్ఛ్లోకే త్రిపూర్వత్రిచ

శ్లో॥ [౬౧] [పదవిభాగము] పుత్రీపాణినిపీడనాత్। చ । పరత। సూనోః। వివాహః। శుభః। న। అన్యత్। పుత్రకరగ్రహాత్। తు। న। కిం। అపి । ఉద్వాహః। ఏవ। వ్రతాత్। న। అన్యత్। పూర్వం। ఋతుత్రయాత్। స్వశరది। హి । ఏకోదరాణాం। అయం। ప్రత్యుద్వాహవిధిః। తయోః। న। శుభకృత్। శ్లోకె । అత్ర। పూర్వత్ర। చ ॥

టీక॥ పుత్రీపాణినిపీడనాత్ - కుమార్తె వివాహముకంటె, పరతః - పిమ్మట సూనోః - కుమారునియొక్క, వివాహః - వివాహము, శుభః - మంచిది, పుత్ర, కరగ్రహాత్ - కుమారునివివాహముకంటె తర్వాత, అన్యత్ - కుమార్తె వివాహము

న-కూడదు, వ్రతాత్ – పుత్రుని యుపనయనముకంటెపిదప: ఉద్వాహఏవ – వివాహముచేయుటమంచిది, స్వశరది - వివాహసంవత్సరమందు: ఋతుత్రయాత్- మూడఋతువులనగా ఆఱుమాసములకంటె పూర్వం-లోపుగా: ఏకోదరాణాం - ఏకోదరులకు; అన్యత్ - ఉపనయనము, శుభం – మంచిది, అయం - ఈపుత్ర్యు ద్వాహవిధిః-వివాహవిధి, తయోః-ఆపందతులకు నశుభకృత్ - మంచిదికాదని – అత్ర - శ్లోకమందు, పూర్వత్రచ – పూర్వమునైన: శ్లోకే - శ్లోకమందు, ఉక్తః చెప్పబడినదనుట.

ఈ శ్లోకమందు స్వశరదియనుదానిచే సంవత్సరభేదమున్నచో చేయవచ్చుననిరి.

వివాహమునకు సంవత్సరభేదము

శ్లో॥ ఫాల్గునే చైత్రమాసేతు పుత్రోద్వాహోపనాయనే ।
అబ్దభేదాత్ప్రకుర్వీత ఋతుత్రయవిడంబనమ్ ॥

తా॥ ఏకకాలమందు పుత్రపుత్రికా వాహములలో ముందు పుత్రికావివాహముజేసి పిమ్మట పుత్రవివాహముచేయుట ముఖ్యమనియు, పుత్రవివాహనంతరము పుత్రికావివాహముగాని పుత్రునికి ఉపనయనముగాని చేయకూడదనియు, మఱియు పుత్రోపనయనానంతరమందు పుత్రికావివాహము శుభమునిచ్చుననియు, పుత్రవివాహముచేసినపిమ్మట ౬ నెలల పర్యంతమేకోదరుల కుపనయనాదులు కూడదనియును. మఱియు నీ వివాహవిధి ఈక్రమమున నాసంవత్సరమందు ౬నెలలవిడిచివేయవలయుననియు, జెప్పబడినది. అత్రఒక విశేషముగలదు ఒకనికి ఫాల్గునమాసమందు వివాహముజేసి చైత్రమాసమందు మఱియొకనికి శుభముచేయవచ్చునని తా॥

వివాహమునకు యోగ్యాయోగ్యసంబంధము

శ్లో॥ చాతుర్థీంచ వధూం చతుర్థపురుషస్తాం పంచమీం నోద్వహే ।
న్నో షష్ఠీంతు సముద్వహేత్తు యువతీం నోపంచమీం పంచమః ।
తార్తీయీంతు వధూం తృతీయపురుషస్తాముద్వహేన్నోద్వహే
దిత్యన్యే ప్రవదంతి సప్తమజనా దూర్ధ్వంపరేషామివ ॥

శ్లో॥ (౬౨) [పదవిభాగము] చాతుర్థీం। చ। వధూం । చతుర్థపురుషః । తాం । పంచమీం। ఉద్వహేత్ । నో । షష్ఠీ । తు । సముద్వహేత్ । యువతీం। నో।పం

చమీం। పంచమః॥ తాత్రీయాం। తు। వధూం । తృతీయపురుషః॥తాం। ఉద్వహేత్।
న। ఉద్వహేత్ । ఇతి। అన్యే। ప్రివదంతి । సప్తమజనాత్। ఊర్ధ్వం।పరేషాం।ఇవ।

టీక॥ చతుర్థపురుషః — కూటస్థునికన్న నాలుగవపురుషుడు: చాతుర్థీం — కూటస్థునికన్న నాలుగవదైన, వధూం - స్త్రీని: నోద్వహేత్ - వివాహముచేసికొనకూడదు. పంచమీంచ— కూటస్థునికన్న నైదవచిన్నదానిని, నోద్వహేత్- వివాహముచేసుకొనగూడదు, షష్ఠీం - కూటస్థునికన్న నారవ: యువతీం — స్త్రీని, నోసముద్వహేత్ - వివాహముచేసికొనకూడదు: పంచమః - ఐదవపురుషుడు: పంచమీ - ఐదవదైన: యువతీం - స్త్రీని: నోసముద్వహేత్ — వివాహముచేసికొనకూడదు, తృతీయపురుషః - మూడవపురుషుడు; తాత్రీయాం - మూడవదైన; వధూం - స్త్రీని; ఉద్వహేత్ - వివాహముకావచ్చును; నోద్వహేత్ — వివాహముగూడదు, ఇతి - అని, అన్యే - కొందరిమతము, ఇయం - ఈహద్దు: సప్తమజనాత్ - ఏడవ పురుషునివరకు, ఊర్ధ్వం - ఏడవపురుషుడైనతరువాత, పరేషామివ - ఇతరులకువలనే, నోపంచమీంపంచమః అనుస్థలమందు విశేషము.

శ్లో॥ పంచమః పంచమీంకన్యాం నోద్వహేదితియద్వచః ।
పితృపక్షేనిషేధోయం మాతృపక్షేనతద్భవేత్ ॥

అప॥ వివాహమునకు యోగ్యాయోగ్య సంబంధముల జెప్పుచున్నారు.

తా॥ కూటస్థపురుషుఁడు మొదలు ౪ వ పురుషుఁడు నాల్గవ స్త్రీనిన్ని ౫ వ స్త్రీనిన్ని వివాహము చేయవచ్చుననియు, జతుర్థపురుషుఁడుషష్ఠస్త్రీని వివాహముచేసుకొనఁగూడదనియు, బంచమపురుషునికి బంచమస్త్రీనివివాహముచేయగూడదనియును తృతీయ పురుషునికి తృతీయస్త్రీని వివాహముచేయవచ్చును, కూడదనికొందఱిమతమీచెప్పఁబడిన నియమము సప్తపురుష పర్యంతమేకాన: అనంతరము సామాన్యబంధుసంబంధమువలెనే వివాహము చేయవచ్చుననితా॥ఈపంచమస్త్రీ పంచమపురుష వివాహము తండ్రి సరుసఁగూడదనియుఁ దల్లివరుస మత్తముఁబనికొందఱిమతము

## గండ నక్షత్రజనన ఫలము

శ్లో॥ మూలాహి ప్రథవావధూశ్శ్వశురగాత్పత్న్యైవిహంతిక్రమా
దంత్యాద్యంఘ్రిసముద్భవా త్వధ భవేజ్యేష్ఠర్క్షజా శ్రీషజమ్ ॥
ఇందాగ్నిప్రథవావివాహసమయే హంత్యేవసా దేవరం ।
త్రిష్వేతేష్వపిశేషు జాతపురుషా హంతీతి కేచిజ్జగుః॥

శ్లో॥ (౬౩) [పదవిభాగము] మూలాహిపప్రభవా: వధూః శ్వశురతత్పత్న్యౌ,నిహంతి క్రమాత్, అంత్యాద్యంఘ్రిసముద్భవా తు। అథ। భవేత్ । జ్యేష్ఠర్క్షజా, జ్యేష్ఠజం ఇంద్రాగ్నిప్రభవా। వివాహసమయే।హంతి । ఏవ। సా దేవరం । త్రిషు ఏతేషు। భేషు జాతపురుషః హంతి—ఇతి। కేచిత్ జగుః

టీక॥ మూలాహిపప్రభవా, మూల - మూలానక్షత్రమందు అహి - అశ్రేష నక్షత్రమందు ప్రభవా పుట్టిన, వధూః - స్త్రీ క్రమాత్ - క్రమముగా, శ్వశురతత్పత్న్యౌ - మామగారిని, అత్తగారిని, నిహంతి - చంపుచున్నది. ఆమూలాశ్లేషనక్షత్రములయొక్క అంత్యాద్యంఘ్రిసముద్భవా - మూలయొక్కంత్యపాదమందునాశ్లేషయొక్కాదిపాదమందుపుట్టిన స్త్రీయొక్క అత్తమామలను‌జంపును జ్యేష్ఠర్క్షజా - జ్యేష్ఠానక్షత్రమందు పుట్టిన స్త్రీ: జ్యేష్ఠజం - పెనిమిటియొక్క జ్యేష్ఠునిజంపును, ఇంద్రాగ్నిప్రభవా-విశాఖా నక్షత్రమందుపుట్టిన వధూః - స్త్రీ, వివాహసమయే - వివాహకాలమందు, దేవరం - మరిదిని; హంతి - చంపుచున్నది,ఏతేషు ఈః త్రిషు మూడైన భేషు - నక్షత్రములయందు జాతపురుషః - పుట్టినపురుషుడు, ఇదివరలోచెప్పినవారలను; హంతి - చంపుచున్నాడు. ఇతి — అని కేచిత్ కొంతమంది; జగుః-చెప్పిరి త్రిష్వనుశబ్దముచే నాల్గవ నక్షత్రమునుకూడ గ్రహింపలయును; కేచిదనుటచే నాపక్షము బాగులేదనుట.

శ్లో॥ మూలాసార్పవిశాఖాసు జ్యేష్ఠభే చోద్భవః పుమాన్ ।
నదోషకృద్వివాహేషు స్త్రీయస్సర్వత్రవర్జయేత్ ॥

అవ॥ గండనక్షత్రమందు బుట్టినవారలకు ఫలముల జెప్పుచున్నారు.

తా॥ మూలానక్షత్రమందు‌బుట్టిన స్త్రీమామకు కూడదనియు:ఆశ్రేషయందు బుట్టిన స్త్రీ యత్తకు‌గూడదనియు, నీమూలాశ్రేష్టలయందు‌గూడదనిసామాన్యముగా‌జెప్పినను మూలానక్షత్రనాల్గవపాదమందు‌బుట్టినమామకు మారకురాలనియును ఆశ్రేషయొక్క [౧] పాదమందు‌బుట్టినన త్తకుమారకురాలు అనియు ఇదివిశేషంబనియు జ్యేష్టానక్షత్రమందు‌బుట్టిన స్త్రీ పతిజ్యేష్టభ్రాతృ నాశకారిణియగు ననియు విశాఖా నక్షత్రమందు‌బుట్టిన స్త్రీ వివాహకాలమందే మఱదికి మారకురాలనియు నీమూలా శ్రేషా జ్యేష్టావిశాఖానక్షత్రముల యందుబుట్టిన పురుషు‌డు క్రిందజెప్పినవారికి మారకుడనియును కొందఱు జెప్పినను స్త్రీలకు‌గాని పురుషులకుదోషములేదనితా॥

## ఏకవింశతిమహాదోషములు

శ్లో॥ యః పంచాంగవిశుద్ధి శీలదీనక్షత్రసంక్రాంత్యహాః పాపినాం
షడ్వర్గః కునవాంశకోష్ఠకుజ షష్ట్కంభృగోశతశీ ॥

లగ్నాదష్టమ మష్టమేందు ముభయోశ్చంద్రో ష్టరిఫ్పారిగ॥
శ్చంద్రస్సగ్రహ ఏవ వారజనిత స్స్యాద్దుర్ముహూర్తాభిధః।

శ్లో॥ ఖర్జూరిస్థసమాంఘ్రిభం గ్రహణభం చోత్పాతభం క్రూరయు।
గ్ధిష్ణ్యం చాశుభవిద్ధభం విషయుతం లగ్నాస్తదోష స్తథా।
గండాంతో వ్యతీపాతవైధృతి మహాయోగా ఇతి స్వాభిధా ।
లగ్నస్యాప్యఖిలైకవింశతిమహాదోషా న్ప్రవక్ష్యేథ తాః ॥

శ్లో॥ (౬౪) [పదవిభాగము] యః పంచాంగవిశుద్ధిహీనః దినకృత్సంక్రాంత్యహః। పాపినాం। షడ్వర్గః। కునవాంశకః। అష్టమకుజః । షట్కా । భృగోః । కర్తరీ । లగ్నాత్। అష్టమం। అష్టమేందుః । ఉభయోః చంద్రః । అష్టరిప్పారిగఃచంద్రః : సగ్రహః ఏవ వారాజనితః స్యాత్ దుర్ముహూర్తాభిదః

శ్లో॥ [౬౫] [పదవిభాగము] ఖర్జూరిస్థసమాంఘ్రిభం। గ్రహణభం చ।ఉత్పాతభం క్రూరయుగ్ధిష్ణ్యం; చ అశుభవిద్ధభం। విషయుతం లగ్నాస్తదోషః। తథా గండాంతః వ్యతీపాతవైధృతిమహా యోగాః ఇతి। స్వాభిధాఃలగ్నస్య అపి అఖిలైకవింశతీమహా దోషాః ప్రవక్ష్యే అథ తాః

టీక॥ యః-ఏది పంచాంగశుద్ధిహీనః పంచాంగశుద్ధిలేదో దినకృత్సంక్రాంత్యహః-సూర్యునిసంక్రాంతిదినమో, పాపినాం పాపగ్రహములయొక్క షడ్వర్గః - షడ్వర్గము; కునవాంశకః - కుచ్చితనవాంశము; అష్టమకుజః - అష్టమమందు కుజుడుండుట; భృగోః-శుక్రునియొక్క,షట్కం-అరింటనుండుట,కర్తరీ గ్రహకర్తరియు లగ్నాత్ — లగ్నముకంటె; అష్టమం - ఎనిమిదవస్థానము; ఉభయోః - దంపతులకిద్దఱకు అష్టమేందుః - అష్టమందుచంద్రుడుండుట; అష్టరిప్పారిగః — ఎనిమిది, అఱు, పండ్రెండవ స్థానములబొందిన; చంద్రఃచంద్రుడును, సగ్రహః -గ్రముతోగూడిన, చంద్రః-చంద్రుడును; వారజనితః- వారమువల్లకలుగు దుర్ముహూర్తము ॥

టీక॥ ఖర్జూరిస్థసమాంఘ్రిభం - ఖర్జూరచక్రమందుండు సమపాదములుగ నక్షత్రము; గ్రహణభం-గ్రహణముతోగూడిన నక్షత్రము, ఉత్పాతభం-ఉత్పాతల నక్షత్రము, క్రూరయుగ్ధిష్ణ్యం — క్రూరునితోగూడిన నక్షత్రము; అశుభవిద్ధభం- అశుభవేధగలనక్షత్రము, విషయుత -విషఘడియలతోమందులగ్నములగ్నాస్తదోషః -లగ్నాస్తదోషము, గండాంతః - గండాంతము, వ్యతీపాతవైధృతిమహాయోగాః - వ్యతీపాతవైధృతి, మహాయోగములున్ను, స్వాభిదాః-తమపేర్లుగల, మహాదోషాః—

మహాదోషములు, ఏకవింశతిః - ఇరువదియొకటి, తా, అథ - పిదప, తాన్ - ఆ, అఖిలైకవింశతిమహాదోషాన్-సమస్తమైన యిరువదియొక మహాదోషములను, లగ్నస్య-లగ్నమునకు, వక్ష్యే—చెప్పగలము.

అవ. ఈ రెండుశ్లోకములచే నిఱువదియొక మహాదోషనామముల జెప్పుచున్నాడు.

తా॥ ౧ పంచాంగశుద్ధిహీనమని, ౨ సంక్రాంత్యహస్సని, ౩ పాపషడ్వర్గమని, ౪ కునవాంశమని, ౫ అష్టమకుజుఁడని, ౬ భృగుషట్కమని, ౭ కర్తరియని ౮ లగ్నాష్టమదోషమని, ౯ అష్టమచంద్రుఁడని, ౧౦ షడష్టరిపుచంద్రదోషమని, ౧౧ చంద్రసగ్రహదోషమని, ౧౨ వారజనితముహూర్తమని, ౧౩ ఖర్జూరిష్టసమాంఘ్రిభంబని, ౧౪ గ్రహణనక్షత్రమని, ౧౫ ఉత్పాతనక్షత్రమని, ౧౬ క్రూరయుగ్ధిష్ణ్యమనిః, ౧౭ అశుభవిద్ధమని, ౧౮ విషయుతలగ్నమని, ౧౯ లగ్నాస్తదోషమని, ౨౦ గండాంతమని, ౨౧ వ్యతీపాతవైధృతి మహాయోగమని మొత్తం యీ యిరువదియొక మహాదోషములుగలవని తాత్పర్యము.

## దినకృత్సంక్రాంతి దోషములు

శ్లో॥ దుష్టాశ్చేత్కరణర్క్ష వారతిథయో యోగశ్చ తన్మేళనం ।
నాడ్యష్షోడశ షోడశేత్యుభయతో వర్జ్యా రవేస్సంక్రమాత్ ॥
రాశిష్వేవ చరేషు చైకదివసస్త్యాజ్యో యనే రాశివ
త్తద్రాశింగత ఏవ తత్తదయనం ప్రాప్తో యదా భాస్కరః ॥

శ్లో॥ [౬౬] [పదవిభాగము] దుష్టాః చేత్। కరణర్క్షవారతిథయః। యోగః। చ। తన్మేళనం। నాడ్యః। షోడశ। షోడశ। ఇతి। ఉభయతః। వర్జ్యాః। రవేః। సంక్రమాత్। రాశిషు। ఏవ। చరేషు। చ। ఏకదివసః। త్యాజ్యః। అయనే। రాశివత్ । తద్రాశిః। గతః। ఏవ। తత్తదయనం। ప్రాప్త। యదా। భాస్కరః ॥

టీక॥ దుష్టాః - దుష్టములైన, కరణర్క్షవారతిథయః-కరణనక్షత్రవారతిథులు యోగశ్చ-యోగమున్నూ, తన్మేళనం-వీటియొక్క సమ్మేళముకలవియైనచో, దుష్టపంచాంగమనుదోషము, రవేః - సూర్యునియొక్క, సంక్రమాత్ - సంక్రమణము కంటె, ఉభయతః - పూర్వపశ్చాద్భాగములయందు, షోడశషోడశ - పదునారు పదునారు, నాడ్యః — ఘడియలు, వర్జ్యాః - విడువతగినవి; చరేషు - చరరాసుల యందు, ఏకదివసః — ఒకదినము; త్యాజ్యః - విడువతగినది; అయనే - ఆయన

ములయందు, రాశివత్ - రాశికివలెనె, భాస్కరః - సూర్యుడు, యదా - యేకాలమందు, తదయనం - ఏఅయనమును, ప్రాప్నోతి - పొందుచున్నాడో, తదైవ-అప్పుడే, తద్రాశిం-ఆరాశిని, గతఏవ-పొందినవాడే.

— షడ్వర్గ స్వరూపము —

అవ. క్రింద రెండుశ్లోకములయందుఁ జెప్పఁబడిన యేకవింశతి మహాదోష స్వరూపముల దెలియజేయుచున్నవాఁడై ముందుఁపంచాగశుద్ధిహీన్యదోషలక్షణమును సంక్రాంతిదోషలక్షణమును దెలియఁజేయుచున్నాఁడు.

తా॥ అశుభకరములైన తిథివార నక్షత్రయోగకరణములు గూడినది పంచాంగశుద్ధిహీనదోషమనియును శుభకర్మలవిషయమై ఇది నిందితమనియును మఱియు సూర్యసంక్రమణప్రవేశమునకు ముందు వెనుక ౧౬ఘడియలు వర్జింపవలయునని సూర్యుఁడు మేష కర్కాట తులామకర రాసులయందుఁ బ్రవేశమునకు ముందు ౩౦ ఘడియలను వెనుక ౩౦ ఘడియలను నిషేధింపవలయుననియు, అయనములకు గూడ నిషేధవిధియీప్రకారమేయనియు, నిదే దినకృత్సంక్రాంతి దోషమని తా॥

శ్లో॥ మేషోగౌర్మిథునం కుళీరమృగరాట్కన్యా తులావృశ్చికా।
శ్చాపాఖ్యోమకరోఘటోఝష ఇతిహ్యేతేగ్రహాఖ్యాః క్రమాత్
భౌమశ్శుక్రబుధేందు సూర్యశశిజా భృగ్వారజీవాసితా ।
మందోజీవఇతిక్రమేణ గృహపా ఏతేహి షడ్వర్గపాః ॥

శ్లో॥ [౬౭] [పదవిభాగము] మేషః। గౌః। మిథునం। కుళీరమృగ రాట్కన్యా తులావృశ్చికా। చాపాఖ్యః । మకరః। ఘటః। ఝషః। ఇతి। హి। ఏతే। గృహాఖ్యాః। క్రమాత్। భౌమ। శుక్రబుధేందు సూర్యశశిజాః, భృగ్వారజీవాసితాః, మంద జీవః। ఇతి క్రమేణ। గృహపాః। ఏతే। హి। షడ్వర్గపా ॥

టీక॥ మేషః - యేషము, గౌః - వృషభము, మిథునం- మిథునము, కుళీర మృగరాట్కన్యా తులావృశ్చికాః- కుళీర - కర్కాటకము, మృగరాట్ -సింహము, కన్యా - కన్యయు, తులా - తులయు, వృశ్చికాః - వృశ్చికము, చాపాఖ్యః - ధనస్సు, మకరః - మకరము, ఘటః - కుంభము, ఝషః - మీనము, ఇతి - ఈప్రకారము, ఏతే - ఈపంత్రెండురాసులు, క్రమాత్-క్రమముగా, గృహాఖ్యాః-రాసులనామములు, భౌమః - అంగారకుఁడు, శుక్రబుధేందు సూర్యాః - శుక్రుఁడు బుధుడు చంద్రుఁడు సూర్యుఁడు, శశిజః-బుధుఁడు, భృగు—శుక్రుఁడు, ఆరః-అంగా

రకుడు, జీవ – బృహస్పతి, అసితః-శనిః మందః-శని, జీవః - బృహస్పతి, ఇతి –ఈరీతుగా, ఏతే - వీరలు, క్రమేణ - క్రమముగా, గృహపాః - రాశ్యధిపతులు షడ్వర్గపాః - షడ్వర్గాధిపతులును, భవంతి-అగుచున్నారు.

అవ. ఐదుశ్లోకములచే షడ్వర్గస్వరూపమును దెలియఁజేయుటకై షడ్వర్గోపయోగులగు రాశ్యాధిపతులఁజెప్పుచున్నాడు.

తా॥ మేష, వృషభ, మిధున, కర్కాటక, సింహ, కన్య, తుల, వృశ్చిక ధనుర్మకర, కుంభ, మీనములు ౧౨ మరాసులనియు, మేషవృశ్చికములకు నంగారకుఁడు, వృషభతులలకు శుక్రుఁడు, మిధునకన్యలకు బుధుఁడు, కర్కాటమునకుఁ చంద్రుఁడు, సింహమునకు సూర్యుఁడు, ధనుర్మీనములకు గురువు, మకరకుంభములకు శనైశ్చరుఁడు వీరలీక్రమమున రాశ్యాధిపతులనియు తా॥

## లగ్నమునకు హోరాదినిర్ణయము

శ్లో॥ సౌమ్యానామపి రాశయశ్శుభగ్రహాః కూ్రరగ్రహాఃపాపినాం
సర్వేషాం క్రమశశ్చరస్థిరఇతి స్యాద్ద్విస్వభావోభిధాః ।
త్రింశద్భాగమయంచ లగ్నమధతల్లగ్నేద్వయోర్భాగయో
రర్కేందూవిషమేసమే శశిరవీహోరేశ్వరౌ తౌక్రమాత్ ॥

శ్లో॥ [౬౮] [పదవిభాగము] సౌమ్యానాం। అపి। రాశయః । శుభగృహాః। కూ్రరగ్రహాః। పాపినాం। సర్వేషాం। క్రమశః। చరః। స్థిరః। ఇతి స్యాత్। ద్విస్వభావాభిధాః। త్రింశద్భాగమయం చ లగ్నం అథ। తల్లగ్నే। ద్వయోః। భాగయోః । అర్కేందూవిషమె। సమెశశిరవీ హోరేశ్వరౌ। తౌ। క్రమాత్ ॥

టీక॥ సౌమ్యానాం-శుభగ్రహములయొక్క, రాశయః–రాసులు, శుభగ్రహా -శుభరాసులు, పాపినాం - పాపులయొక్క, రాశయః – ఆసులు, కూ్రరగ్రహాః– కూ్రరరాసులు, సర్వేషాం - అన్నిరాసులకు, క్రమశః–క్రమముగా, చరః-చరము స్థిర-స్థిరముః ద్విస్వభావః-ద్విస్వభావముః ఇతి-ఈరీతిగాః అభిధాః–నామములుః స్యుః - అగుచున్నవిః త్రింశద్భాగమయం-ముప్పదిభాగముగలదిః లగ్నం-లగ్నముః అధ-పిదపః తల్లగ్నే-ఆముప్పదిభాగలుగల లగ్నమందుః ద్వయోః-రెండైనః భాగయోః-భాగములయందుః పూర్వోత్తరభాగములయందుః విషమె-బేసిరాశియందుః అర్కేందూ-సూర్యచంద్రులధిపులుః సమె-సమరాశియందుఃశశిరవీ-చంద్రసూర్యులు తౌ-వారిద్దరుః క్రమాత్–క్రమముగాః హోరేశ్వరౌ-హోరాధిపతులు,

తా॥ సౌమ్యగ్రిహ సంబంధిరాసులు శుభరాసులనియు; పాపగ్రిహ సంబంధి రాసులు కూ్రిరరాసులనియు; ఈ ౧౨ రాసులలో మేషము చరమని; వృషభముస్థిర మని; మిథునము ద్విస్వభావమనియు; యీ ప్రకారము ౧౨ రాసులకుఁజూడవలెను అగ్నము ౩౦ భాగములుగలదనియు; లగ్నము రెండుభాగములుచేసిన హోరలగు వందులో మేషాది విషమరాసులయందుఁ బ్రిధమభాగము సూర్యహోర; ద్వితీయ భాగము చంద్రిహోర; వృషభాదిసమరాసులయందుఁ బ్రిధమభాగము చంద్రిహోర ద్వితీయము సూర్యహోర. ఈ రెండుగ్రిహములు హోరాధిపతులని తా॥

## ద్రేక్కాణాధిపనిర్ణయము

శ్లో॥ తల్లగ్నేశ సుతేశ ధర్మపతయో ద్రేక్కాణపాస్స్యుస్త్రయః।
స్వాంత్యోపాంత్యగృహేశ్వరా ఇతిజగుర్ద్రేక్కాణపాశ్చాపరే॥
కేచిత్స్వాత్మజధర్మపా ఇతిజగుర్ద్రేక్కాణ పాస్స్యుశ్చరే।
ధర్మస్వాత్మజపాస్థిరే సుతనవస్వేశాద్విరూపే గృహే॥

శ్లో॥ [౯౯][పదవిభాగము] తల్లగ్నేశసుతేశ ధర్మపతయః। ద్రేక్కాణపాః స్యుః। త్రియః। స్వాంత్యోపాంత్య గృహేశ్వరాః। ఇతి। జగుః। ద్రేక్కాణపాః। చ। అపరే। కేచిత్। స్వాత్మజధర్మపాః। ఇతి। జగుః। ద్రేక్కాణపాః। స్యుః। చరేధర్మ స్వాత్మజపాః। స్థిరే। సుతనవస్వేశాః। ద్విరూపే। గృహే॥

టీక॥ తల్లగ్నేశ సుతేశధర్మపతయః- తల్లగ్నేశ - యేలగ్నముకు ద్రేక్కాణముచూడబడునో నాలగ్నప్రిథమ ద్రేక్కాణమునకులగ్నాధిపుండధిపతి; సుతేశ- ఐదవరాశికధిపతి రెండవద్రేక్కాణముకధిపతి; ధర్మపతయః-నవమాధిపతి మూడవ ద్రేక్కాణమునకధిపతి ఈరీతిగా; త్రియః -ముగ్గురు; ద్రేక్కాణపాః - ద్రేక్కాణాధిపతులు; స్యుః - అగుదురు; స్వాంత్యోపాంత్యగృహేశ్వరాః- స్వం - లగ్నము; అంత్య-పండ్రెండవస్థానము; ఉపాంత్యపదునొకొండవస్థానము: ఏతేషాం- వీట్లకు; ఈశ్వరాః - అధిపతులగువారు; ద్రేక్కాణాధిపాఇతి - ద్రేక్కాణాధి పతులని; అపరే - కొందరు; జగుః - చెప్పిరి; కేచిత్తు-కొందరు; చరె-చరలగ్న మందు; స్వాత్మజధర్మపాః; స్వా - లగ్నము; ఆత్మజ - ఐదవస్థానము; ధర్మ-నవ మము; ఏతేషాం - వీట్లకు; పాః - అధిపతులును; స్థిరే - స్థిరలగ్నమందు; ధర్మ స్వాత్మజపాః- ధర్మ - నవము; స్వ - లగ్నము; ఆత్మజ-పంచమము; ఏతేషాం- యీస్థానములకు, పాః - అధిపతులు; ద్విరూపెగృహే - ద్విస్వభావరాశియందు

సుతనవస్వేశాః । సుత-పంచమము, నవ - నవమము; స్వ - లగ్నము; ఏతేషాం వీట్లకు; ఈశాః-అధిపతులున్నూ 'ద్రేక్కాణపాః - ద్రేక్కాణాధిపతులు స్యుః - అగుదురు, ఇతి - అని; జగుః-పలికిరి.

ద్రేక్కాణాధిపతులు జెప్పుచున్నాడు.

తా॥ లగ్నమును మూడు భాగములు జేసిన ద్రేక్కాణములగును అందు లగ్నాధిపతి ప్రథమ ద్రేక్కాణాధిపతియు పంచమాధిపతియు:ద్వితీయద్రేక్కాణాధిపతియు; నవమాధిపతి తృతీయ ద్రేక్కాణాధిపతియు,నిట్లు కొందరియభిప్రాయము లగ్నాధిపతి ద్వాదశాధిపతి యేకాదశాధిపతులు క్రమంబుగా ద్రేక్కాణాధిపతులని కొందఱి యభిప్రాయము లగ్నాధిప పంచమాధిప నవమాపతులు చరలగ్నద్రేక్కాణాధిపతులనియుఁనవమాధిపలగ్నాధిబంచమాధిపతులుస్థిరలగ్నద్రేక్కాణాధిపతులనియుఁ బంచమాధిప నవమాధిప లగ్నాధిపతులు ద్విస్వభావలగ్నద్రేక్కాణాధిపతులు

నవాంశద్వాదశాంశ స్వరూపనిర్ణయము

శ్లో॥ మేషః కర్కటక స్తులాచ మకరః స్వస్వాదయోరాశయ ।
స్వస్యస్వాత్మజధర్మయోశ్చనవతద్భాగానవాంశాః క్రమాత్
యల్లగ్నంచ తదాదిసర్వనిలయా స్సద్వాదశాంశాః క్రమా ।
త్తత్తద్రాశ్యధిపా స్తదంశపతయ స్స్యుర్ద్వాదశాంశాభిధాః ॥

శ్లో॥ [౨౦] [పదవిభాగము] మేషః కర్కటకః । తులా। చ । మకరః । స్వస్వాదయః। రాశయః। స్వస్య స్వాత్మజధర్మయోః చ। నవతద్భాగాః, నవాంశాః । క్రమాత్ యత్। లగ్నం । చ తదాదిసర్వనిలయాః । సుః । ద్వాదశాంశాః।క్రమాత్ తత్తద్రాశ్యధిపాః తదంశపతయః స్యుః। ద్వాదశాంశాభిధాః

టీక॥ మేషః - మేషము: కర్కటకః - కర్కటకము: తులా - తులయు మకర: మకరము, రాశయః - ఈరాసులు; స్వస్వాదయః - తమతమయంసలే యాదిగాగలని, స్వాత్మజధర్మయోశ్చ - లగ్నముకంటె పంచమనవమములకున్నూ స్వస్య - లగ్నసంబంధమైన, నవ - తొమ్మిదిసంఖ్యగల, తద్భాగాః - లగ్నభాగములు క్రమాత్ క్రమముగా, నవాంశాః — నవాంశములు; లగ్నం - లగ్నము యత్—యేదో, తదాదిసర్వనిలయాః- అదిమొదలు సమస్తరాసులు, ద్వాదశాంశాః ద్వాదశాంశలు, క్రమాత్ క్రమముగా, స్యుః అగుచున్నవి: తత్తద్రాశ్యధిపాః - ఆయారాశ్యధిపతులు; తదంశపతయః — ఆద్వాదశాంశాధిపతులు స్యుః — అగు । చున్నారు ద్వాదశాంశాభిధాః-వీట్లకు ద్వాదశాంశములని పేరు

అవ. నవాంశద్వాదశాంశములని జెప్పుచున్నాడు.

తా॥ లగ్నపుఘడియను ౯ భాగములుచేసి నవాంశలని మేషసింహరాసులకు మేషాదిగా నవాంశగణింపవలయునని కర్కాట వృశ్చికమీనములకు కర్కాటకాంశ మొదలని మకరవృషభకన్యలకుమకరాంశమొదలనితులాకుంభమిధునములకు తులాంశము మొదలని లగ్నాధిపతియె నవాంశాధిపతియని యిది నవాంశక్రమంబని దెలియవలెను. [మఱియు ద్వాదశాంశలనఁగా లగ్నఘడియలకు ౧౨ భాగములు చేయుట ద్వాదశాంశలని యాయా రాశ్యాధిపతులె ద్వాదశాధిపతులనుట

## త్రింశాంశాధిపతులు

శ్లో॥ త్రింశాంశేష్వధిపాః కుజార్కిగురువిట్శుక్రాస్త్వయుగ్మే క్రమా
ద్బాణేష్వష్టమునీషవస్సమగృహే త్రింశాంశపావ్యత్యయాత్ ।
షడ్వర్గస్త్వయమేవ సోపి శుభకృత్సౌమ్యగ్రహాణాం భవేత్ ।
షడ్వర్గోయది పాపినాం నిధనకృత్సర్వేషు కర్మస్వపి ॥

శ్లో॥ [౭౧] [పదవిభాగము] త్రింశాంశేషు : అధిపాః: కుజార్కి గురువిట్శుక్రాః। తు। అయుగ్మే: క్రమాత్। బాణేషు। అష్టమునీషవః। సమగృహే। త్రింశాంశపా వ్యత్యయాత్। షడ్వర్గః। తు అయం। ఏవ । సః। అపి। శుభకృత్॥ సౌమ్యగ్రహాణాం భవేత్ । షడ్వర్గః । యది పాపినాం। నిథవకృత్। సర్వేషు। కర్మసు । అపి ।

టీక॥ అయుగ్మే - బేసిరాశియందు, కుజార్కిగురువిట్శుక్రాః - కుజశని గురుబుధశుక్రులు: క్రమాత్ - క్రమముగా, బాణేష్వష్టమునీషవః- బాణ - ఐదు ఇషు - ఐదు: అష్ట — యెనిమిది, ముని - యేడు: ఇషవ - ఐదుఅంశలున్నూ సమగృహె - సమరాసులయందు, వ్యత్యయాత్ - బేసిరాసులకు విపరీతముగా త్రింశాంశపాః - త్రింశాధిపతులు జ్ఞేయాః - తెలుసుకొనతగినది: అయమేవ — ఈశ్లోకచతుష్టమోక్తమైనదే, షడ్వర్గః - షడ్వర్గము: సోపి - అషడ్వర్గమున్నూ సౌమ్యగ్రహాణాం - శుభగ్రహసంబంధమైనచో, శుభకృత్ - మంచినిచేయునది. భవేత్ - అగును, పాపినాం-క్రూరగ్రహములయొక్క షడ్వర్గోయది షడ్వర్గెపచో సర్వేషు - సమస్తమైన, కర్మసు — కర్మలయందు: నిధనకృత్ — మరణము జేయునది భవేత్ - అగును   అవః త్రింశాంశాధిపతులఁ జెప్పుచున్నాడు

తా॥ లగ్నము ౩౦ భాగములుచేసిన త్రింశాంశలనియును అందుఅంగారకశనైశ్చరు లైదైదంశలకును గురువు ౮ అంశలకును:బుధ దేడంశలకును,శుక్రుఁడు ౫ అంశలకును వీరలీక్రమముగ మేషాదిబేసిరాసులకధిపతు లనియును, వృషభాది

సమరాసులకు లగ్నము ౩౦అంశములలో శుక్రుడై దంశములకును బుధుఁడేడశము లకూన్ను, గురువు ౮ అంశములకును: శనైశ్చరుఁడై దంశములకును: అంగారకుడు ౫ అంశములకును వీరలు త్రింశాంశాధి పతులనియు: మఱియుఁనీపైనఁజెప్పిన లగ్నహోరద్రేక్కాణనవాంశ ద్వాదశాంశ త్రింశాంశలనెడి షడ్వర్గము సకలకార్య ములకు శుభగ్రహషడ్వర్గము శుభప్రదమనియు, పాపగ్రహషడ్వర్గముమృత్యుప్ర దమనయు తా॥

శ్లో॥ త్రింశద్భాగమయంచ లగ్నమితి సా హోరాతదర్ధంచతత్,
ద్రేక్కాణస్తుతృతీయఏవనవమో భాగోనవాంశఃక్రమాత్॥
తస్యద్వాదశభాగఏవతు తత స్తద్ద్వాదశాంశ స్తత ।
స్త్రింశాంశ స్త్రిదశాంశఏవత భవే త్షడ్వర్గఏవంక్రమః ॥

శ్లో॥ [౭౨] [పదవిభాగము] త్రింశద్భాగమయం। చ । లగ్నం । ఇతి । సా హోరా। తదర్థం। చ। తత్। ద్రేక్కాణః। తు। తృతీయః। ఏవ నవమః । భాగః । నవాంశః । క్రమాత్ । తస్య । ద్వాదశభాగః । ఏవ। తు।తతః।తత్।ద్వాదశాంశః। తతః। త్రిదశాంశః। ఏవ। తు। భవేత్ । షడ్వర్గః। ఏవం। క్రమః

టీక॥ లగ్నం-లగ్నము, త్రింశద్భాగమయం- ముప్పదిభాగలుకలది:తదర్ధం ఆ లగ్న సగభాగము, సా - ప్రసిద్ధమైన: హోరా-హోర, ఇతి అని, ఉచ్యతే — చెప్పబడును: తృతీయఏవ — మూడవభాగమే, తద్ద్రేక్కాణః - ఆ లగ్నమునకు ద్రేక్కాణము, నవమః - తొమ్మిదవదైనభాగః - భాగము నవాంశః - నవాం శము, క్రమాత్ - క్రమముగా, భవతి — అగుచున్నది: తస్య - లగ్నమునకు ద్వాదశభాగఏవ - పండ్రెండవభాగమె, ద్వాదశాంశః - ద్వాదశాంశము. తతః - పిదప, త్రిదశాంశఏవ—ముప్పదవఅంశేత్రింశాంశః-త్రింశాంశమనబడు,షడ్వర్గః- షడ్వర్గము; ఏసంక్రమః - ఇట్టి మర్యాదికలది, భవేత్ - అగును-

## షడ్వర్గవిభాగక్రమము

అవ॥ షడ్వర్గవిభాగక్రమమును జెప్పుచున్నాఁడు

తా॥ లగ్నము ౩౦భాగములుగలదనియులగ్నార్ధము హోరయనియులగ్నత్రి భాగము ద్రేక్కాణమనియు: లగ్ననవాంశమునవాంశమనియు; లగ్నద్వాదశాంశమ నియు; లగ్నత్రింశాంశము త్రింశాంశమనియు, ఇదే షడ్వర్గవిభాగక్రమంబని తా॥

## పుష్కరాంశ వర్గోత్తమాంశ నిర్ణయము

శ్లో॥ భానేత్రిద్విగజాఙ్గ్యగమితో మేషాదితః పుష్కర ।
స్సింహోఽస్తనురాదికస్యచ తదామీనాం తతస్స్యాత్క్రమాత్ ॥
షడ్వర్గేయది పంచవర్గ ఇతివా వర్గోత్తమాంశ స్స్వయం ॥
ప్రాజ్ఞైర్వర్జ్యశ్చరమ శ్చరాదిషు నవాంశే ష్వాద్యమా ద్యాశుభా

అవ. పుష్కరాంశవర్గోత్తమాంశలఁజెప్పుచున్నాఁడు

తా॥ మేషరాశిలో ౨౧ వయంశమును; వృషభములో ౧౪ వ యంశమును మిథునములో ౨౪ వ యంశమును: కటకములో ౭ వ యంశమును, సింహములో ౨౧ యంశమును: కన్యలో ౧౪ వ యంశమును, తులలో ౨౪ వ యంశమును వృశ్చికములో ౭ వ యంశమును; ధనూరాశికి ౨౧ యంశమును, మకరరాశికి ౧౪ వ యంశమును, కుంభరాశికి ౨౪ వ యంశమును, మీనమునకు ౭ వ యంశమును పుష్కరాంశము లనఁబడును మఱియు పుష్కరకాలమందీ జెప్పఁబడిన షడ్వర్గము శుభగ్రహసంబంధమైన శుభప్రదమనియు, శుభగ్రహసంబంధమైన పంచవర్గమైన శుభప్రదమనియు, వర్గోత్తమాంశలనగాఁ చరలగ్నములయందుఁ ప్రథమాంశలును స్థిరలగ్నములందుఁ పంచమాంశములును, ద్విస్వభావలగ్నములయందునవమాంశము నివి వర్గోత్తమాంశలని తా॥ [నవాంశములయందువివివృషభ కర్కటకాంశములకు నవాంశము లౌటవలన నిషిద్ధములైనను రాసులకు శుభగ్రహాధిపతిత్వములుండుట వలన శుభప్రదమని మీనవాంశమునకుశుభగ్రహాధిపతిత్వమునుండివర్గోత్తమాంశమ యున అది గండాంతమౌటచేత నిషేధింపఁబడియుండుటవలన నశుభప్రదమని తా॥

## శుభనవాంశము

శ్లో॥ కన్యాయుగ్మ తులాంశకాఅపిధనుః ప్రాగర్ధ భాగశ్శుభా ।
ఏతేభాగ్య సుతార్థదానచరమా వర్గోత్తమాంశంవినా ।
నైవాహ్యేష్టమురాశిభాగ ఉభయోర్న ద్వాదశాంశ స్తథా ।
తేభ్యోఽన్యేనవాంశకాఅపి శుభం ప్రాహుర్వృషాంశంపరే ॥

అవ॥ వర్గోత్తమాంశము లౌటవలన వృషభకర్కటకాంశలకు శుభప్రదత్వ నిరూపణచేసి మిగిలిన కన్యామిథున తులా ధనుస్సులు పుష్కరాంశ లౌటచేతవీనికివి శుభప్రదత్వము నిరూపణ చేయుచు నితరాంశలకు శుభనవాంశత్వముఁతెలియఁజేయు చున్నాడు.

తా॥ కన్యామిధున తులాంశలు ధనుఃపూర్వభాగమునుసౌభాగ్యపుత్రసంపత్ప్రదములనియు నీరాసుల చరమాంశలు శుభప్రదములు గావనియు వర్గోత్తమాంశము రాశ్యంతర్గతమైనను శుభప్రదమనియు దంపతులకు సప్తమరాశిభాగమునుద్వాదశాంశమును శుభప్రదములు గావనియుఁగన్యామిధున తులా ధనుః పూర్వభాగములకంటె నితరములైన యంశము శునవాంశలని గొందఱి యభిప్రాయము వృషభాంశమున శుభప్రదమని తా॥

## నవాంశప్రత్యేకఫలనిర్ణయము

శ్లో॥ మేషాంశేచ విభర్తృకాపశుగణా కన్యావృషాంశేభవే ।
దుష్యగ్మాంశే ధనపుత్రిణీచ కులటాస్యాత్కర్కటాంశేఖలా।
సింహాంశేపితృసద్మగాధసుగుణా విత్తార్జితాచ స్త్రియా ।
స్వత్పుత్రాచ తులాంశకేచ సుగుణా నిస్వాంశకేచలినః ॥

అవ. రెండుశ్లోకములచేత నవాంశలకుఁ బ్రత్యేకఫలములఁ జెప్పుచున్నాఁడు

మేషాంశమందు వివాహమైన కన్యకవిధవయగుననియు, వృషభాంశమందైన కన్యక పశుసమృద్ధిగలదగుననియు, మిధునాంశ మందైన స్త్రీ ధనవతియుఁబుత్రవతియు నగుననియుఁ గర్కటాంశమందైన స్త్రీవ్యభిచారిణియగుననియు, సింహాంశమందు విధవయుఁ గన్యాంశమందై స్త్రీ సుగుణవతియు, ధనవతియు నగుననియు, తులాంశమందునుపుత్రులు గలదగుననియు, వృశ్చికాంశమందు దరిద్రురాలగును.

శ్లో॥ చాపాంశాదిమభాగఏవ ధనినీభాగేస్య నక్తాపరే ।
దుశ్శీలాచ మృగాంశకేగతధవా కుంభాంశకే రుగ్మిణీ ।
మీనాంశేపతి పుత్రభాగ్యవియుతా లగ్నాన్నవాంశోబలీ ।
షడ్వర్గస్థనవాంశకేచ గదితం యద్వృత్తదత్రాపిచ ।

తా॥ ధనురంశపూర్వభాగమందైన స్త్రీ ధనవంతురాలును, నపరాంశమందైన స్త్రీ వ్యభిచారి దురాచారవతియు నగుననియు మకరాంశమందైన స్త్రీ విధవయు, కుంభాంశమందు రోగవతియు, మీనాంశమందైనస్త్రీ విధవయు నపుత్రవతియు దరిద్రురాలునగు ననియు లగ్నముకంటె నవాంశము బలవత్తరమని జెప్పుటవలన శుభనవాంశము యోగ్యమని తా॥

## కుజాష్టమ భృగుషట్కదోషములు

శ్లో॥ లగ్నాదష్టమగ కుజోనిధనకృద్భామాష్టమాఖ్యోప్యయం
యద్యేవం భృగుషట్కదోషఇతి తల్లగ్నా ద్భృగుష్షష్ఠగః ।

యుద్ధే శత్రుజితౌ రిపోర్గృహగతౌ నీచస్థితౌ చాస్తగౌ ।
తౌ ద్వౌ దుర్బలినౌ వదంతిచ పరే దోషస్తునాస్తీత్యహో ॥

అవ. కుజాష్టమభృగుదోషములఁ జెప్పుచున్నాఁడు.

తా॥ అంగారకుఁడు వివాహలగ్నమునకు ౮ ట నుండిన మృత్యుప్రదుఁడనియు నిదియే కుజాష్టమదోషంబనియు మఱియు నీశుభలగ్నమునకుఁ ౬ ట శుక్రుఁడుండిన భృగుషట్కదోషమనియు, దీనికి దైనఁజెప్పిన ఫలమనియు, కుజశుక్రులు గ్రహయుద్ధమందు శత్రువుచేతజయింపఁబడినను,తిరస్కరింపఁబడినను శత్రుక్షేత్రములను బొందినను నస్తమానమును బొందియుండినను, బలరహితుల వుటవలన దోషములేదని కొందఱును, నాయభిప్రాయము దోషమనే తా॥

### కర్తరిదోషనిర్ణయము

శ్లో॥ లగ్నాద్ద్వాదశగో భవేద్భుజగతి ర్వక్రీద్వితీయస్థితః ।
పాపౌ ద్వౌ యది మధ్యలగ్నముభయో ర్మృత్యుప్రదా కర్తరీ॥
చంద్రోవా యది మధ్యగ స్తదుభయో ర న్యేజగుఃకర్తరీ ।
తౌ ద్వౌవా నచకర్తరీ హ్యృజుగతీ తద్వ్యత్యయా వక్రిణౌ॥ ౭౦

అవ. కర్తరియను దోషమునుఁ జెప్పుచున్నాఁడు.

తా॥ రెండుపాపగ్రహములలో నొకపాపగ్రహము లగ్నమునకు ౧౨ ట వక్రింపకయుండి మఱియొక పాపగ్రహము లగ్నమునకు ౨ట వక్రించియుండెనేని యీరెండి మధ్యముననున్న లగ్నమునకుఁ గర్తరియను దోషము వచ్చు నీదోషము మృత్యుప్రదమనియును, ఈదోషము రెండుపాపగ్రహముల నడుమ చంద్రుఁడుండెనేని యదికర్తరిదోషమని కొందఱు చెప్పుచున్నారు యీచెప్పఁబడిన పాపగ్రహములురెండును వక్రించియున్నను వక్రవర్జితులైయున్నను లగ్నద్వాదశమందు వక్రించియుండి లగ్నద్వితీయమందు వక్రరహితులైయున్న నీచెప్పఁబడిన కర్తరిదోషము లేదని తా॥

### అష్టమలగ్నదోషనిర్ణయము

శ్లో॥ త్యాజ్యం చాష్టమలగ్న మేవజననాల్లగ్నాచ్చ రాశేస్తయో
ర్థంపత్యోరపి మృత్యుకృత్తదధిపో లగ్నస్థితో వాతయోః ॥
చంద్రో ప్యష్టమరాశిగ సముభయో ర్నిత్యం హరిదప్రద ।
స్త్యాజ్యం ద్వాదశలగ్నమ ప్యశుభకృత్తజ్జన్మలగ్నగృహమ్॥

శ్లో॥ [౩౮] [పదవిభాగము] త్యాజ్యం। చ। అష్టమలగ్నం। ఏవ। జననాత్ లగ్నాత్। చ। రాశేః। తయోః। దంపత్యోః। అపి। మృత్యుకృత్। తదధపః। లగ్నస్థిత। వా। తయో। చంద్రః। అపి, అష్టమరాశిగః। తదుభయో। నిత్యం । దరిద్రప్రదః। త్యాజ్యం। ద్వాదశలగ్నం। అపి। అశుభకృత్। తజ్జన్మలగ్నం। గృహం॥

టీక॥ జననాత్—జన్మించిన,లగ్నాత్-లగ్నం-లగ్నముకంటెను,రాశేః-జన్మరాశి కంటెను, యత్ - యే, అష్టం - యెనిమిదవ, లగ్నం-లగ్నముకలదో, తత్—అల గ్నము, తయోః-అ, దంపత్యోః-దంపతులకు, త్యాజ్యం-విడువతగినది. [ఏప్రకార ముచే గుణముకలదయినను విడువవలయు ననుట]

శ్లో॥ అష్టమంతు నకర్తవ్యం యదిసర్వ గుణాన్వితమ్ ॥

ఇతి దైవజ్ఞవిలాసాది గ్రంథములయందుచెప్పుటవలనఁ తదధిపః-అష్టమలగ్నాధిపతి లగ్నస్థితో వాయది - వివాహాదిలగ్నములయందున్నచో; తయోః—ఆదంపతులకు; మృత్యుకృత్- మరణముచేయును; చంద్రోపి - చంద్రుఁడున్ను; అష్టమరాశిగః - జన్మరాశి అష్టమరాశియందున్నచో; తదుభయోః-అదంపతులకిద్దరకు; నిత్యం- సర్వ కాలము; దరిద్రప్రదః-దరిద్రముకలుగచేయును; ద్వాదశలగ్నమపి-జన్మలగ్నజన్మ రాసులకు పండ్రెండవలగ్నము, త్యాజ్యం-విడువతగినది; తజన్మలగ్నం-ఆదంపతుల జన్మకాలలగ్నమున్ను; గృహం - వారల జన్మకాలరాశియు; అశుభకృత్ - మంచిది కాదు ఇచ్చట విశేషము ఏగృహమం దెవనికి జన్మముకలుగునో యదివానికి జన్మ గృహము దానియందు వివాహాదికార్యములు చేయకూడదు,

అవ. అష్టమలగ్నదోషమునుఁ జెప్పుచున్నాఁడు.

తా॥ జన్మలగ్నమునకును; జననకాలచంద్రరాశికిని ౮ వ లగ్నము మృత్యు ప్రదమౌటవలనను నాలగ్నము గుణయుక్తమైనదైనను విషేధింపవలయుననియు; నష్టమలగ్నాధిపతి వివాహలగ్నముల బొందెనేనిదంపతులకు మృత్యుప్రదుఁడనియు చంద్రుఁడు జన్మరాశికి ౮ వ రాశిని బొంధియున్న దంపతులకు నిత్యదారిద్ర్యప్ర దుఁడనియు; జన్మద్వాదశలగ్నమును స్వజన్మలగ్నము నశుభకరమనియు; మఱియు జన్మగృహమనఁగానేయింట బుట్టినవానికాయిల్లు జన్మగృహమనియు జన్మగృహము వివాహాదులకు యోగ్యముకాదని తాత్పర్యము॥

— షష్ఠాష్టరిప్ఫ చంద్రసగ్రహదోషములు —

శ్లో॥ లగ్నాద్ద్వాదశగేశవా రిపుగతే చంద్రేష్టమస్థేతదా ।
రిప్ఫాష్టాంగ చంద్రినా మశమహాదోష స్తయోర్మృతుకృత్ ॥

దోష స్సంగ్రహనామకో నిధనకృ చ్చంద్రే గ్రహేణాన్వితే ॥
దోషో నేతి పరే జగు శ్శశధరే సౌమ్య గ్రహేణాన్వితే ॥

అవ: షష్ఠాష్టరిప్పుచంద్రసగ్రహదోషములను జెప్పుచున్నాడు.

తా॥ చంద్రుడు వివాహాదిలగ్నమునకు ౬ట ౮ట ౧౨ట నుండినప్పుడు రిప్ఫాష్టారిగచంద్రనామకదోషమనియు, నాదోషముదంపతులకుమృత్యుప్రదమనియు చంద్రుడు శుభగ్రహములతోఁగాని పాపగ్రహములతోఁగాని కూడియుండుటయే సగ్రహనామక దోషమనియు నాదోషము దంపతులకు నిధన ప్రదమనియు, మరి యు చంద్రుడు శుభగ్రహములతోగూడియున్నప్పుడీ దోషములేదని తా॥

సూర్యాదియుక్త చంద్రగ్రహ ఫలనిర్ణయము

శ్లో॥ దారిద్ర్యంమరణం త్వపత్యరహితం దౌర్భాగ్యమేవంస్త్రియా
సాపత్న్యంయుతిభావమేవకలహం దుఃఖంచతుర్యాత్క్రమాత్
ఉద్వాహాదిషు చంద్రఏకభవనే సూర్యాదిఖేటైర్యుతో ।
నక్షత్రాంతరగ శ్శుభోయది శశీత్యన్యే జగుర్నేతరే ॥

అవ. సూర్యాదియుక్త చంద్రసగ్రహములకు ప్రత్యేక ఫలములఁ జెప్పుచున్నాఁడు—

తా॥ చంద్రుఁడువివాహాదివిషయమై ఏకరాశియందు సూర్యునితోఁగూడియుండిన వివాహమైన స్త్రీకి దారిద్ర్యప్రదుఁడనియు, అంగారకునితోఁ గూడియున్న మరణప్రదుఁడనియు, బుధునితోఁ గూడిన స్త్రీని పుత్రహీనురాలుగాఁజేయుననియు, బృహస్పతితోఁ గూడిన దౌర్భాగ్యప్రదుఁడనియు శుక్రునితోఁగూడిన స్త్రీకి సపత్నీప్రదుఁడనియు, శనైశ్చరునితోఁగూడిన నైశ్వర్యాభావప్రదుఁడనియు, రాహువుతో గూడినఁ గలహప్రదుఁడనియు, కేతువుతోఁగూడిన దుఃఖప్రదుఁడనియు మఱియు వివాహాదివిషయమై చంద్రుఁడొక రాశియందు సూర్యాదిగ్రహములతోఁ గూడినను నక్షత్రభేదముఁగలిగియున్న శుభకరుఁడని కొందరి యభిప్రాయమనియు నక్షత్రాంతరగతుఁడైన నశుభకరుఁడని మరికొందఱు చెప్పిరని తా॥

— వారజనితదుర్ముహూర్తదోషములు —

శ్లో॥ రుద్రాహిమిత్రపితృవసవో వారాఖ్యపిత్రీన్నిధి ।
బ్రహ్మేంద్రహుతాశదైత్యవరుణా అప్యర్యమాఖ్యోభగః
ఏతేప చదశక్రమాత్తు దివసేక్షయామహూర్తాభగ ।
శ్చంద్రాగ్ని ఆహిదైత్యగౌదపితర స్త్వాజ్యాస్తుశేషాశ్శుభాః ॥

తా॥ ౧ మొదటిది రుద్రమనియు, ౨ రెండవది యురగమనియు ౩ మూడవది మిత్రమనియు: ౪ నాల్గవది పిత్య్రమనియు ౫ నైదవది వసువనియు:౬ నారువది వారమనియు, ౭ ౭ నేడవది విశ్వేదేవ నెనిమిదవది విధియనియు తొమ్మిదవది బ్రిహ్మయనియు(బదియవది యిందరిమనియు(: బదునొకండవది ఇంద్రిహుతాశన మనియు బందెరిండవది చైత్యమనియు బదుమూడవది వరుణ మనియు:బదునాల్గవది యర్యమమనియు, బదునైదవది భగ మనియు నీచెప్పిపంచదశముహూర్తములు ప్రితిదివసమందీక్రిమమున దెలియుననియు నందు భగ ఇంద్రిహుతాశన, ఉరగచైత్య రౌద్రి, పిత్రు ఈ ౬ ను గ్రిచైత్యములౌటవలన శుభకర్మముల విషయమైనిషిద్ధములనియు మిగిలిన తొమ్మిదియును శుభప్రిదములని తా॥

శ్లో॥ రాత్రౌపంచదశేశ్వరాజచరణాహిర్బుధ్న్యపూషాభిధా
నాసత్యాంతకవహ్నిధాతృశశిన శ్చాదిత్యజీవాచ్యుతాః ॥
అర్కస్త్వష్ట్రుసమీరణా శ్శుభవిధౌ చత్వారఏవాశుభా,
రౌద్రాజాంఘ్రియమాగ్నయో యగురుడుసో యుష్మ ఈశేయత్ఫలమ్

శ్లో॥ యస్మిన్దిష్ట్యేయచ్చ కర్మోపదిష్టం తద్దైవత్యే
తన్ముహూర్తేపి కార్యమితి

తసుక ముగ్రిదేవతలు కలవానిని వదలవలయుననుట

తా॥ ప్రితిరాత్రియందును బంచదశముహూర్తములలో మొదటిది యీశ్వరమనియు: రెండవది యజచరణమనియుమూ( డవదియహిర్బుధ్న్యమనియు,నాలవది పూషయనియు: నైదవది నాసత్యమనయు: నారువది యంతకమనియు: నేడవది వహ్నియనియు, నెనిమిదవది ధాతయనియు: తొమ్మిదవదిశశియనియు:పదియవది యాదిత్యమనియు, పదునొకండవదిజీవమనియు: పందెరిండవది యచ్యుతమనియు పదుమూ(డవది యర్కమనియు, పదునాల్గవది త్వష్టయనియు: పదునైదవది సమీరణమనియు నీపంచదశ ముహూర్తములలో రుద్రి, అజాంఘ్రి, యమ, అగ్ని ఈనాలుగున్ను శుభకర్మలవిషయమై యుగ్రిము లౌటవలన నిషేధింపవలయునని ఏనక్షత్రాధిపతి యేక్షణమందెంతమాత్రము ఫలము నిచ్చుచున్నా(డో యావ్రికార మీముహూర్తాధిపతులును దమతమ స్వరూపమునకు దగినఫలమునిచ్చుచున్నారనియు ఏనక్షత్రమందేకర్మచేయుట శ్రేష్టమని చెప్పియున్నవో యానక్షత్రాధిదేవతముహూర్తములందును శుభకర్మచేయుట ముఖ్యమని తా॥

K

శ్లో॥ ఆదిత్యేర్యమనామక శ్శశిదినే బ్రాహ్మ్యసురాఖ్యౌకుజే ।
పిత్రాఖ్యానలసంజ్ఞితౌ బుధదినేస్యాచ్చే న్ముహూర్తోభిజిత్ ॥
దైత్యాహ్వాగురువాసరే భృగుదినే బ్రాహ్మ్యాఖ్యపిత్ర్యౌశ్శనౌ
రౌద్రాహిత్వభి లేశుభేసిధనదాస్తే దుర్ముహూర్తాః క్రమాత్ ॥

తా॥ ఆదివార మందర్యమమనెడి నామముగల పదునాల్గవ ముహూర్తమును సోమవారమందు బ్రహ్మమను తొమ్మిదవముహూర్తమును; అసురమనెడిపండ్రెండవముహూర్తమును, కుజవారమునందు పగలు పిత్ర్యమను నాలుగవముహూర్తమును; రాత్రిఏడవదగు ననలముహూర్తమును; బుధవారమందభిజిత్తను నెనిమిదవముహూర్తమును; గురువారమందుఁ బండ్రెండవగురు దైత్యమును; వారమను పేరుగల యాఱవముహూర్తమును, శుక్రవారమందు బ్రహ్మమను తొమ్మిదవముహూర్తమును; పిత్ర్యమనునాలుగవ ముహూర్తమును శనివారమందు రుద్ర, అహి అను ప్రథమ ద్వితీయ ముహూర్తములును నీచెప్పిన ౧౨ ముహూర్తములునుగ్రములౌటవలన శుభకర్మలయందు నిషేధింపవలయునని తా॥

## కాలహోరాస్వరూపము

శ్లో॥ యదార్కేచ యదిష్టకాల ఘటికా ద్విఘ్నా శ్శరాప్తాగతాః ।
పూర్వాంశా అథవర్తమానసహయసాన్యత్కాలహోరాక్రమాత్ ॥
వారేశాదిరవిర్భృగుర్బుధవిధూమందో గురుర్మంగళః ॥
శ్చైత్యాప్తగ్రహకాలపానిధనిదాస్త్యాజ్యాపివాహాదిషు ॥ ౮౫

తా॥ ఏవారమందైనను హోరనిర్ణయించువరకు నుదయము మొదలైన గడియలను రెట్టించి ౫ట భాగింపఁగా మిగిలినది తత్కాలహోరయనియు, నేవారమందు హోరచూచిన నావారాధిపతి మొదటిహోరాధిపతియనియు, మొదటిహోరాధిపతికి ౬వ గ్రహము వెంబడి హోరయనియు; దినం ౧కి ౧౨ హోరలకు నధిపతులనియు, నిందుకు నుదాహరణ మాదివారమందు హోరచూచిన పక్షమందు సూర్యుడు మొదటి హోరాధిపతియనియు; భృగు బుధ చంద్ర శని గురు అంగారకు లీక్రమమున నుదయము మొదలు పలుమాఱు హోరాధిపతులనియుఁ దెలియవలెను. కొందరు గ్రంథకర్తలర్ధరాత్రి మొదలు హోరచూడవలెనని చెప్పిరనియు, నీచెప్పిన హోర ౨ న్నర ఘడియయనియు, ౨ న్నరకి ౫ అర్ధఘడియలు నీయర ఘడియలకు సూర్యహోరలో రవి శు కుజ బుధ గురువు లధిపతులనియు, శుక్ర

హోరలో శుక్రి శని రవి చంద్రి అంగారకు లధిపతులనియు; నీక్రి మున నన్ని హోరలఁ జూడవలెననియు, నీహోరలు పాపగ్రిహకాల జనితములయ్యేనేని వివాహాదిశుభకర్మలయందు నిషేధింపవలయునని ఈవారములకు ననేకవిధములైన నిర్ణయాములు చెప్పినసీగ్రింథకర్తమతము కొందఱి గ్రింథకర్తలకు నిష్టము, ఉదయము మొదలుదయపర్యంతమువారమని తా॥ మఱియు-

శ్లో॥ మంత్రిమంగళమార్తాండ శుక్రిక్షేంగుశనైశ్చరః ।
వారేశాఃప్రిథమంపూర్వం ద్వియర్ధఘటికాః క్రిమాత్ ॥ఇతి ।

ఖర్జూరచక్రిలక్షణము

శ్లో॥ ఖార్జూరాకృతిమూర్ధ్వగా మృజు లిఖేదేకాంచ రేఖాంతత ।
స్తిర్యక్చాగ్రశకాస్త్రయోదశతథా ఖార్జూరచక్రిం త్విదమ్ ॥
విష్కంభాదిషు దస్రిభాదిశిరసి స్థాప్యైక రేఖాంగతౌ స్యాతాం
శీతగుభాస్కరౌయదితయోర్దృష్టిర్మిథోమృత్యుకృత్ ౯౬

[పదవిభాగము] ఖార్జూరాకృతిం। ఊర్ధ్వగాం ఋజు। లిఖేత్ । ఏకాం । చ రేఖాం। తతః తిర్యక్। చ। అగ్రశకాః। త్రియోదశ । తథా । ఖార్జూరచక్రిం । తు । ఇదం। విష్కంభాదిషు। దస్రిభాది । శిరసి। స్థాప్యః ఏకరేఖాం। గతౌ । స్యాతాం । శీతగుభాస్కరౌ। యది। తయోః దృష్టిః। మిథః మృత్యుకృత్.

టీక॥ ఏకాం-ఒక: రేఖాం-గీటును, ఖార్జూరాకృతిం - ఖర్జూరాకుమాదిరిగా ఋజు-వంకరలేకుండునట్లుగా; లిఖేత్—వ్రాయవలయును; తతః-పిదప, తిర్యక్-అడ్డముగా, అగ్రశకాః-అగ్రశములను, త్రియోదశ—పదమూడురేఖలు: తథా - అట్లువ్రాసినచో, ఇదం-ఈయరువదియేడు రేఖలుగలది, ఖార్జూరచక్రిం - ఖర్జూరచక్రిమనఁబడును, శిరసి-చక్రిశిరస్సునందు, విష్కంభాదిషు — విష్కంభము మొదలు యోగములయందు, దస్రిభాది-అశ్విని మొదలు నక్షత్రిము నభిజిత్తువదలి, స్థాప్య— వ్రాసి శీతగుభాస్కరౌ-చంద్రిసూర్యులు, ఏకరేఖాం-వకగీతను: గతా — పొందినవారు స్యాతాంయది - అయినటులయిన, తయోః - వారిరువునకు; మిథః పరస్పరము దృష్టిః - చూపు,భవతి-అగునో, సా-అదృష్టిః మృత్యుకృత్ — మరణముచేయును, కనుక శుభకర్మలయందు దానిని వదలవలయును ఇచ్చటవిశేషముగలదుఒక్కొక్క రేఖనుఁబొందుటలో చతుర్థపాదాద్యపాదములనుఁ బొందియున్నను, రెండుమూడు పాదములయందున్నను పరస్పరదృష్టికలదు నాలుగు రెండు పాదములఁబొందినను;

నాలుగు మూడు పాదములఁ బొందినను, మొదటి రెండు పాదములఁ బొందినను, మొదటిపాద మూడవపాదములఁ బొందినను, పరస్పరదృష్టిగలదు.

వైవజ్ఞవిలాసే శ్లో॥ చతుర్థగస్స్యాద్యపాద మాద్యగస్తుచతుర్థగం।
ద్వితీయగ స్తృతీయస్థం తృతీయ స్తాద్వితీయగం।
సమూంఘ్రివేధస్సర్వత్రి విజ్ఞేయం ధిష్ణ్యమండలమ్ ॥

అవ. రెండుశ్లోకములచే ఖర్జూరచక్రలక్షణమును దెలియఁజేయుచున్నవాఁడై యాదోషమునుఁ జెప్పుచున్నాడు.

తా॥ ఖర్జూరపత్రమువలె సూక్ష్మరేఖ యొకటివ్రాసి యారేఖమీఁద ౧౩ అడ్డగీతలు గీచిన సప్తవింశతి రేఖాత్మకమగునది ఖర్జూరచక్రమనియు నీచక్రము శిరస్సునందశ్వినీనక్షత్రమును విష్కంభనామయోగమును లిఖించి యక్కడనుండి సవ్యముగా లిఖించుచురాగా సూర్యచంద్రులొకరేఖయందున్నదక్షత్రములయందుండి యొకరినొకరు చూచిన నది మృత్యుప్రదము కనుక వివాహాది శుభకర్మలయందు నిషేధింపవలయునని తా॥ ఇచ్చట సూర్యచంద్రులకు నేకరేఖాగత నక్షత్రములయందున్నమాత్రము చేతనే పరస్పరవీక్షణముఁగలుగదనియు, మఱియేమన్నను వీరిలో నాలుగవ పాదమున నొకగ్రహమును మొదటిపాదమున నొకగ్రహముఁడఁగాను రెండవపాదమున నొకగ్రహమును; మూఁడవపాదమున నొకగ్రహముండఁగాను॥ పరస్పర వీక్షణముఁ గలుగునని తెలియవలయును. [పాదవీక్షణచక్రము ఈక్రిఁద చూడదగును] (ఖర్జూరచక్రమును చివర చూడఁదగును)

పా ద వీ క్ష ణ చ క్ర ము

| | | | |
|---|---|---|---|
| ౧ | ౨ | ౩ | ౪ |
| గ్ర | గ్ర | గ్ర | గ్ర |
| | ౩ | ౨ | ౧ |
| గ్ర | గ్ర | గ్ర | గ్ర |

శ్లో॥ విష్కంభవ్యతిపాతశూలపరిఘా గండాతిగండాశని।
వ్యాఘాతాఅపి వైధృతి ర్నిధనదా యోగావివాహాదిషు॥
దస్రాహీందుమఖా స్తథా దితసుతానూరాధపుష్యాదితి।
త్వాష్ట్రార్యమ్ణః క్రమశః ప్రదక్షిణవిధాజ్ఞేయాశ్విరస్థోడుతః॥౭౭

[పదవిభాగము] విష్కంభవ్యతీపాతశూలపరిఘాః, గండాతిగండాశనివ్యాఘాతాః। అపి। వైధృతిః । నిధనదాః । యోగాః । వివాహాదిషు । దస్రాహీందుమఘాః। తథా। దితిసుతానూరాథపుష్యాదితిత్వష్ట్రాఖ్యాః । క్రమశః । ప్రదక్షిణవిధౌజ్ఞేయాః । శిరస్థోడుత ॥

టీక॥ విష్కంభవ్యతీపాతశూలపరిఘాః- విష్కంభ - విష్కంభము, వ్యతీపాత-వ్యతీపాతము, శూల-శూలము, పరిఘాః - పరిఘనామయోగము, గండాంతర గండాశనివ్యాఘాతాః- గండ - గండనామయోగము, అతిగండ — అతిగండనామ యోగము, అశని - వజ్రనామయోగము, వ్యాఘాతాః - వ్యాఘాతనామయోగము, వైధృతిః-వైధృతినామయోగము, ఏతే-ఈః, యోగాః-యోగములు, వివాహాదిషు-వివాహాదిశుభకర్మలయందు, నిధనథాః-మరణమునుచేయునవి, దస్రాహీందుమఘాః-దస్ర-అశ్విని, అహి-అశ్రేష, ఇందు-మృగశీర్ష, మఘాః—మఖయు, తథా-అప్రకారము, దితిసుతానూరాథ పుష్యాదితిత్వష్ట్రాఖ్యాః- దితిసుత-మూలయు, అనూరాథ-అనూరాథయు, పుష్య - పుష్యమి, అదితి - పునర్వసు, త్వష్ట్రాఖ్యాః - చిత్తయు పేరుగల నక్షత్రములు, శిరస్థోడుతః-శిరస్సునందున్న నక్షత్రముమొదలు, క్రమశః-క్రమముగా, ప్రదక్షిణవిధౌ—ప్రదక్షిణక్రియయందు, జ్ఞేయాః - తెలియఁదగినవి, ఏయోగమునకు ఏనక్షత్రమో ఆనక్షత్రమునుశిరస్సునవ్రాసి యదిమొదలు లెక్కింపవలయును. అది యెట్లనిన విష్కంభమునకు నశ్వినియు, వ్యతీపాత కాశ్రేషయు, శూలమునకు మృగశీర్షయు,పరిఘకు మఖయు, గండమునకు మూలయు, అతిగండమున కనూరాథయు, వజ్రమునకు పుష్యమియు, వ్యాఘాతమునకు పునర్వసుయు, వైధృతికి చిత్తయు క్రమముగా నగును,

తా॥ విష్కంభము, వ్యతీపాతము, శూల, పరిఘ, గండము, అతిగండము, వజ్రము, వ్యాఘాతము, వైధృతి యీయోగములు వివాహాదిశుభకర్మల కయోగ్యములనియు, అశ్విని, అశ్రేష, మృగశిర, మఖ,మూల,అనూరాధః, పుష్య, పునర్వసు, చిత్త ఈ ౯ నక్షత్రముల నుచ్ఛస్థానమందుండెడి నక్షత్రము మొదలు ప్రదక్షిణ క్రమముగాఁ దెలియవలయుననియు, నేయోగమునకు నేనక్షత్రమును జెప్పియున్నదో యదిమొదలుచేసి ప్రదక్షిణక్రమముగా లిఖింపవలయుననఁగా విష్కంభమునకు నశ్విని, వ్యతీపాతకు నాశ్రేష యీక్రమమున లిఖింపవలయునని తా॥

## గ్రహాణోత్పాతదోషనిర్ణయము

శ్లో॥ ఉత్పాతగ్రహాశీభ్యఏవతు పరం సప్తాహమేవంత్యజే ।
ధిష్ణ్యం తత్తద్వృతుత్రిరే ఖలశుభే నేష్టంచ మృత్యుప్రదమ్ ॥

గ్రస్తే స్తేపురతోర్ధమేవపరతో గ్రస్తాదయేహ్నాం త్రయం ।
సంధ్యాయామపి సప్తసప్తదివసాన్ని శ్చషవపవంత్యల్ జే॥ ౮౨

శ్లో॥ పర్వాగ్రాసేషుషణ్మాస మర్ధగ్రాసేతదర్ధకం ।
తదంతరేమపాతేన త్యజేద్భంగ్రహణాహతమ్ ।

అవ॥ గ్రహణోత్పాతదోషములఁజెప్పుచున్నాఁడు

తా॥ ఉత్పాతములనఁగా భూకంపము: ధూమకేతువు మొదలగు నుత్పాతములును. సూర్యచంద్రగ్రహణములునుఁ గలిగెనేని యనంతరమందేడువాసరముల పర్యంతం శుభకర్మలు చేయఁగూడ దనియు, నేనక్షత్రమందీ చెప్పినభూకంపనాద్యుత్పాదములుఁగలుగు చున్నవో యానక్షత్రము మృత్యుప్రవమౌటవలన నాఱునెలల పర్యంతము వివాహాదిశుభకర్మలవిషయమై యయోగ్యమనియు: నర్ధగ్రహణమైగ్రస్తాస్తమయమైన పక్షమునకు ముందు ౩న్నర దినము కూడ దనియు; నర్ధగ్రహణ గ్రస్తోదయ విషయమై యనంతరము మూఁడు దివసములు కూడవనియు, సాయంకాలమున గ్రస్తాస్తమయమైన సర్వగ్రస్తగ్రహణముందు ౭ దివసములు గ్రస్తోదయసర్వ గ్రస్తగ్రహణ మందనంతరమందేడు దినములును కూడవనియు మఱియు గ్రహణవిద్ధనక్షత్రము పూర్ణగ్రహణమునందు, ౬ మాసములవరకు నర్ధగ్రహణమునందు ౩ మూఁడుమాసములవరకు నీరీతిగా శుభకర్మల విషయమై యోగ్యముఁగాదని తా॥

## క్రూరయుక్తధిష్ణ్యదోషము

శ్లో॥ తద్ధిష్ణ్యంజ్వలితంతు పాపసహితం మృత్యుప్రదం పృష్ఠభం ।
భస్మాఖ్యం త్వథ ధూమితంచ పురతో ధిష్ణ్యం వివాహాదిషు॥
రాశిః క్రూరయుత స్తదాఖ్యఫలద శ్చాన్యౌచతౌతాద్భశౌ।
పృష్ఠాగ్రశుభసంయుతౌ యదిశుభౌస్యాతాంతురాశీతుతౌ ॥

టీక॥ పాపసహితం-పాపగ్రహముతో కూడిన: తద్ధిష్ణ్యం — ఆనక్షత్రము, జ్వలితం—జ్వలితమను పేరుగలది,పృష్టభం-వెనుకనక్షత్రము,భస్మాఖ్యం-భస్మయను పేరుగలది, అథ-తర్వాత, పురతః ముందుదైన: ధిష్ణ్యం - నక్షత్రము: ధూమితం-ధూమితమను పేరుగలది, వివాదిషు-వివాహాదిశుభకర్మలయందు: మృత్యుప్రదం - మరణము కలుగఁజేయును: క్రూరయుతః - పాపగ్రహముతోగూడిన: రాశిశ్చ - రాశియున్ను: తదాఖ్యఫలదః జ్వలతమను పేరుచే నట్టిఫలమునిచ్చునది, అన్యౌ - ఇతరమగు, తౌ-దనుకముంతుందు, రాశీచ - రాసులున్ను: తాదృశౌ - పాపగ్రహ

యు క్తము లగునట్టి ఫలములనిచ్చును: పృష్ఠాగ్రో- వెనకముందురాసులు;శుభయుతో యది-శుభగ్రహయు క్తములైనచో శుభా-మంచిని చేయునవి: స్యాతాం- అగుచున్నవి

అవ॥ క్రూరయు క్తధిష్ణ్యమను దోషమునుఁజెప్పుచున్నాడు

తా॥ పాపగ్రహముతోఁగూడిన నక్షత్రము జ్వలితసంజ్ఞిక మనియు పాప గ్రహమునకు వెంబడియున్న నక్షత్రము భస్మసంజ్ఞికమనియు పాపగ్రహమునకు ముందున్న నక్షత్రము ధూమిత సంజ్ఞికమనియు యీమూడు నక్షత్రములు మృత్యు ప్రదము లౌటవలన వివాహాదివిషయమై నిషేధింపవలయునని పాపగ్రహయు క్త మైన రాశియును జ్వలితసంజ్ఞికమే గనుక ముందుఁజెప్పిన ఫలప్రద మనియు: మిగి లిన పృష్టాగ్రగతరాసులు భస్మితధూమిత సంజ్ఞికములైనను శుభగ్రహయు క్తము లాయెనేని శుభప్రదములని తా॥

పంచశలాకదోషలక్షణము

శ్లో॥ తిర్యక్పంచ తథోర్ధ్వగా శ్శరమితా ద్వేద్వేచ కోణద్వయే।
చక్రేత్రైవ విలిఖ్యశంభువిదిశాద్వైతీయ రేఖాదితః ।
అష్టావింశతిభానిచ జ్వలనభాదీన్యేన రేఖాగ్రత ।
స్థాప్యానిగ్రహవేధవర్జితముడుగ్రాహ్యంవివాహేబుధైః॥

టీ॥ పంచ-ఐదురేఖలు; తిర్యక్ - అడ్డముగాను; తథా — అప్రకారము; శర మితాః-ఐదురేఖలు; ఊర్ధ్వగాః-నిలువుగాను; కోణద్వయే — ఈశాన్యనైఋతికోణ ములయందు అగ్నేయవాయువ్యకోణములయందు; ద్వేద్వే-రెండురెండురేఖలు;విలి ఖేత్—వ్రాయవలయును; అత్రైవతః; చక్రే-చక్రమందు శంభువిదిశి— ఈశాన్య దిక్కునందు, ద్వైతీయరేఖాదితః-రెండవరేఖమొదలు; జ్వలనభాదీని- కృత్తికమొద లైన అష్టావింశతి - యిరువదియెనిమిది; భాని నక్షత్రములు స్థాప్యాని- వ్రాయతగి నవి గ్రహవేధవర్జితం-ఏరేఖయందుండునక్షత్రమున కేరేఖయందుండునక్షత్రమం దుండుగ్రహముతో వేథకలుగునోనట్టి వేధలేనట్టి, ఉడు-నక్షత్రము: వివాహే - వివా హాది సకల శుభకర్మలయందు: బుధైః-పండితులచేత; గ్రాహ్యం - గ్రహించతగినది

అవ. పంచశలాకచక్రమును దెలియఁజేయుఁవాడై పాపగ్రహక్రాంతదోష మును జెప్పుచున్నాడు.

తా॥ ౫ అడ్డగీతలువ్రాసి దానిమీఁద ౫ నిడుపుగీతలువ్రాసి ఈచక్రకోణము లయందు రెండేసి గీతలువ్రాసి ఈ చక్రమందీశాన్య కోణమందు వ్రాయఁబడిన

రెండవరేఖ మొదలుకొని యన్నిరేఖా గ్రహములయందును క్రమముగాఁ గృత్తికాది ౨౮ నక్షత్రములను వ్రాసి పరిశోధించి పాపగ్రహవేధ లేని నక్షత్రమందు వివాహాది శుభకర్మలఁ జేయుట పండితసమ్మతమని తా॥ [పంచశలాకచక్రమును చివర చూడఁదగును]

## నక్షత్రత్యాజ్యదోషనిర్ణయము

శ్లో॥ శైశంవీరనలంనభోభయకరం నీలంనరంఫాలనా । గోనీరం
హాయకారనీరభయభూపోనేకభేకంతమః । నారంనీరనకం నయం
హాయతపోవారం నగందస్రతఃస్సంఖ్యోర్ధ్వం విషనాడికాహ్యు
దధయో లగ్నస్పృశో మృత్యుదాః ॥

[పదవిభాగము] శైశం। వీరనలం। నభోభయకరం। నీలం। నరం। ఫాలనా గోనీరం। హయకారనీరభయభూపోనేకభేకంతమః। నారం। నీరనకం। నయం। హయతపోవారం। నగం। దస్రతః। సంఖ్యోర్ధ్వం। విషనాడికా। ఉదధయః। లగ్నస్పృశః। మృత్యుదాః ॥

టీక॥ దస్రతః-అశ్వని మొదలు శైశం-శ-౦, శం-౫-ఏబదిగడియలు, వీరనలం- వీ-౪, ర - ౨-౨౪ గడియలు, న-౦, ల-౩, ౩౦ గడియలు; నభోభయకరం న-౦, భ ౪-౪౦ గడియలు, భ-౪, య ౧-౧౪ గడియలు. క-౧; ర ౨-౨౧ గడియలు; నీలం న-౦; లం ౩-౩౦ గడియలు; నరం న-౦; రం ౨-౨౦ గడియలు; ఫాలనాగోనీరం ఫా-౨; ల ౩-౩౨ గడియలు; నా-౦; గ ౩-౩౦ గడియలు; నీ-౦; రం ౨ ౨౦ గడియలు; హయ హ-౮; య ౧-౧౮ గడియలు; కార కా-౧; ర ౨-౨౧ గడియలు: నీ-౦ ర ౨.౨౦ గడియలు: భ-౪; య ౧-౧౪ గడియలు; భూ-౪; ప ౧-౪౧ గడియలు; నే-౦; క ౧-౧౦ గడియలు; భే-౪; క ౧-౧౪ గడియలు; త-౬; మః ౫-౫౬ గడియలు; నారం నా-౦; రం ౨-౨౦ గడియలు; నీనరకం నీ-౦ ర ౨-౨౦ గడియలు; న-౦ కం ౧ పదిగడియలు; నయం న-౦; యం ౧ పదిగడియలు; హయతపోవారం హ-౮; య ౧-౧౮గడియలు; త-౬; ప ౧-౧౬ గడియలు: వారం వా-౪౪-౧-౨౪గడియలు: నిగం ని-౦; గం ౩ ౩౦ గడియలు: సంఖ్యా—ఈసంఖ్యలయొక్క ఊర్ధ్వం—పైన: ఉదధయః-౪గడియలు; విషనాడికాః—విషఘడియలు: లగ్నస్పృశః-లగ్నకాలమునకున్న చో; మృత్యుదాః-మరణముచేయును.

అవ. విషఘటికానిర్ణయమునుఁ జెప్పుచున్నాఁడు.

తా॥ ౫౦ - ౨౪ - ౩౦ - ౪౦ - ౧౪ - ౨౧ - ౩౦- ౨౦-౩౨-౩౦
౨౦ - ౨౮ - ౨౧ - ౨౦ - ౧౪- ౧౪- ౧౦- ౧౪- ౫౬- ౨౪- ౨౦- ౧౦

విషఘటికాచక్రము

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| అ ౫౦ | భ ౨౪ | కృ ౩౦ | రో ౪౦ | మృ ౪౧ | ఆ ౨౧ | పున ౩౦ | పుష్య ౨౦ | ఆశ్లే ౩౨ |
| నై-౦ శ-౫ | వీ-౪ ౪౦-౨ | న-౦ ల౦-౩ | న-౧ భ-౪ | భ-౪ య-౧ | క-౧ ౪-౨ | న-౦ ల౧-౩ | న-౦ ౪౦-౨ | ఫా-౨ ల౧-౩ |
| మ ౩౦ | పు ౨౦ | ఉ ౧౮ | హ ౨౧ | చి ౨౦ | స్వా ౧౪ | వి ౧౪ | అ ౧౦ | జ్యే ౧౪ |
| న-౦ గ-౩ | ని- ౪౦-౨ | హూ-౮ య-౧ | కా౧- గ-౨ | న-౦ ౪-౨ | భ-౪ య-౧ | భూ-౪ ప-౧ | న-౦ క౦-౧ | ఖే-౪ క౦౧- |
| మూ ౫౬ | పూ ౨౪ | ఉ ౨౦ | శ్ర ౧౦ | ధ ౧౦ | శ ౧౮ | పూ ౧౬ | ఉ ౨౪ | రే ౩౦ |
| తి-౬ మః-౫ | వా-౪ ౪౦-౨ | ని-౦ ౪౦-౨ | న-౦ క౦-౧ | న-౦ య-౧ | హా-౮ య-౧ | తి-౬ షః-౧ | వా-౪ ౪౦-౨ | న-౧ గ౧-౩ |

౧౦, ౧౮, ౧౬, ౨౪, ౩౦ అశ్విన్యాదులగు ౨౭ నక్షత్రములను గ్రమంబుగఁ బైన వ్రాయఁబడినయిరువది యేడువిధముల సంఖ్యగల ఘడియలనఁబైన నాలుగుఘడియలువిషఘటికలు గావునవివి వివాహాదిలగ్నము స్పృశించిన మృత్యుప్రదంబులగునని తా ॥

## లగ్నాస్తదోషనిర్ణయము

శ్లో॥ లగ్నాంశేభ్యుదితే తదంశపతినా దృష్టేయుతేవాశుభై ॥
ర్మిత్రేణాపీ కరగ్రహస్తు శుభదో నోచ ద్వరస్యాంతకృత్ ॥
అస్తాంశేపి తథైవ తత్పతియుతే దృష్టే శుభైర్వాగ్రహైః ॥
కన్యాయాశ్శుభదో నచే న్నిధనదః పాణిగ్రహోలగ్నతః ॥

టీక॥ లగ్నాంశే-లగ్నముయొక్క-నవాంశము, అభ్యుదితే-పుట్టినదగుచుండగా [అనగా నవాంశముచేయబడినదగుచుండగాననేయర్థము]తదంశపతినా-ఆనవాంశాధిపతిచేతనైన శుభైః - శుభగ్రహములచేతనయిన, మిత్రేణాపి - నవాంశాధిపునకు మిత్రగ్రహచేతనయనా, దృష్టే — చూడబడినను, యుతేవా-కలిసినను, కరగ్రహః-వివాహము, శుభదః-శుభమునిచ్చును,నోచేత్-అట్లు అంశాధిపశుభగ్రహమిత్రగ్రహములచే చూడబడక కలవకయుండిన, వరస్య-పెండ్లికుమారునకు, అంతకృత్-మరణముచేయును, లగ్నత-లగ్నముకన్న, అస్తాంశే, ఏలగ్నమందేసంఖ్యగల నవాంశము పుట్టినచో దానికి నేడవరాశియందాసంఖ్యగల నవాంశము, తథైవ - ఆప్రకారమే, తత్పతియుతే-అయంశాధిపుగూడినను, దృష్టేవా-చూడబడినను, లేక శుభైః-శుభులగుః గ్రహైః-గ్రహములచేత, యుక్తే-గూడినను, దృష్టే — చూడబడినను, పాణిగ్రహః-వివాహము, కన్యాయాః- స్త్రీకి, శుభదః - శుభమునిచ్చును. నచేత్ — అట్లుగానున్న, నిధనదః-మరణముచేయునది, భవేత్-అగును

అవ॥ లగ్నాస్తదోషమునుఁ జెప్పున్నాఁడు

తా॥ వివాహమునకు నవాంశమును నిర్ణయించినపిమ్మట లగ్నముయొక్క-నవాంశాధిపతిచేతనైనను శుభగ్రహములచేతనైనను నవాంశాధిపమిత్రగ్రహముచేతనైనను జూడఁబడుచున్నను లేక వీనితోఁగూడియున్న నట్టిలగ్నమునఁ జేయఁబడిన వివాహము వరునికి శుభకరం బగునట్లు గాకున్నహానికరం బగును ఏలగ్నమునందె న్నవయంశము నవాంశమగునో యాలగ్నమున కేడవలగ్నమునందన్నవ యంశము అస్తాంశ మగునట్టియస్తాంశమానవాంశాధిపతిచేతనైననుశుభగ్రహములచేతనైనను జూడబడుచునైనను లేక వీనితో గూడియున్న నుండెనేనియిట్టిసమయముననొనర్చిన వివాహము కన్యకు శుభప్రదంబగును అట్లుగాకున్న మృత్యుప్రదంబగునని తా॥

## గండాంతరదోషనిర్ణయము

శ్లో॥ గండాంతస్తు యదంతరాళముభయో ర్మీనేంద్రయో రశ్వినీ
రేవత్యోఃపితృసార్పయోస్తు ఘటికా అష్టౌచమృత్యుప్రదాః॥

చాపాళ్యోర్ఝషమేషయోశ్చమృగరాట్కుళీరయోర్మధ్యమే
న్నాడ్యేకైవ మృతిప్రదై వయది సావర్గోత్తమాంశాన్వితా॥ ౮3

టీక॥ ఉభయోః—రెండునక్షత్రములయొక్క, యత్—ఏ, అంతరాళం- మధ్యముకలదో, తత్-అది, గండాంతః - గండాంతము,మూలేంద్రయోః—మూలాజ్యేష్ఠలయొక్క, అశ్వినీరేవత్యోః—అశ్వనీ రేవతులయొక్క: పిత్రుసార్పయోః - మఘాశ్లేషలయొక్క, మధ్యమే-మధ్యయందు, అష్టౌ-ఎనిమిది: ఘటికాః-గడియలు, మృత్యుదాః - మరణముచేయును, చాపాళ్యోః - ధమర్వృశ్చికములయొక్క: ఝషమేషయోః - మీనమేషములయొక్క: మృగరాట్కుళీరయో - సింహకర్కటకములయొక్క: మధ్యమే-మధ్యయందు, నాడీ-గడియ, ఏకైవ - ఒక్కటి:మృత్యుప్రదా-మరణమునిచ్చును: సా-అరాసులయొక్క మధ్యగడియ: వర్గోత్తమాంశాన్వితాపి - వర్గోత్తమాంశతో గూడినను, మృత్యుప్రిదా-మరణమునేచేయును,

అవ॥ గండాంతదోషమునుఁ జెప్పుచున్నాఁడు

తా॥ జ్యేష్ఠా మూలలు, అశ్వనీ రేవతులు: మఘాశ్లేషలు ఈ నక్షత్రముల మధ్యకాలమున ౮ ది ఘడియలు గండాంత మగుననఁగా జ్యేష్ఠ, రేవతి, ఆశ్లేష నక్షత్రముల తుదయందు ౪ ఘడియలును, మూల, అశ్విని, మఘ: ఈనక్షత్రముల యాదియందు ౪ ఘడియలును నక్షత్రగండాంతములుగాన నిదియునువృశ్చిక: మీన కర్కటరాసుల తుదయందరఘడియయు ధనుర్మేషసింహరాసులయాదియందర ఘడియయు రాశిగండాంత మగుటవలన నిది వర్గోత్తమాంశయుక్తమైయున్ననిదియను వివాహాదిశుభకర్మల విషయమై మృత్యుప్రదమని తా॥

తిథిగండాంతము

శ్లో॥ మాసాదే రథ పంచపంచతిథయో నందాచ భద్రాజయా।
రిక్తాస్యాచ్ఛ పునఃపునస్తదభిధాః పూర్ణాక్రమాత్పంచమీ ॥
నందాదా ఘటికాద్వయం నిథనకృత్పూర్ణాంత్యనాడిద్వయం
గండాంతా స్త్రివిధాస్సదా సిధనదాస్త్రాజ్యావివాహాదిషు ॥

టీక॥ మాసాదేః—శుక్లప్రతిపత్తుమొదలు, అథ-పిమ్మట,పంచ పంచ,ఐదైదు తిథయః-తిధులు: క్రమాత్ - క్రమముగా, నందా - నందయనియు భద్రా - భద్రయనియు: జయా - జయయనియు: రిక్తా — రిక్తయనియు: పంచీమీ-ఐదవదైన, పూర్ణా - పూర్ణయనియు: పునఃపునః-అవృత్తిగా, తదభిధాః - ఆనామములు

గలవి: భవంతి - అగుచున్నావి. నందదౌ - నందతిథులకు ప్రతిపత్షష్ట్యేకాదశ తిథులమొదలు, ఘటికాద్వయ - రెండుఘడియలు, నిధనకృత్ — మరణము చేయును. పూర్ణాంత్యనాడీద్వయ౦ - పూర్ణతిధియొక్క చివర రెండుఘడియలు: నిధనకృత్ — మరణముచేయును. త్రివిధాః-నక్షత్రరాశితిధులను పేరుగల, గండాంతాః—గండాంతములు, వివాహాదిషు - వివాహాదికర్మలయందు; సదా — ఎల్లప్పుడు; నిధనదాః-మరణము నిచ్చునవి: త్యాజ్యాః-విడువతగినవి.

అవ. నందభద్రాది తిధినిర్ణయపూర్వకం బునతిధిగండాంతమును జెప్పుచున్నాడు

తా॥ శుద్ధపాడ్యమి మొదలైదేవి తిధులుక్రమంబుగ నంద: భద్ర, జయ: రిక్త, పూర్ణ, యనుసంజ్ఞగలవై యుండును అందు నందతిధుల యాదియందు ౨ ఘడియలును; బూర్ణతిధులయంత్యమందు ౨ ఘడియలును తిధిగండాంతము లనంబడునుగాన నివి వివాహాదివిషయమై మృత్యుప్రదములగునని తా॥

## వ్యతీపాతదోషనిర్ణయము

శ్లో॥ త్యాజ్యౌతౌ వ్యతిపాతవైధృతిమహాదోషౌ వివాహాదికే ।
ప్యానీతౌ గణితానుసారత ఇమౌ యోగౌ చ మృత్యుప్రదౌ ।
దోషాణామపి సర్వతశ్చ సతతం సర్వేషు కర్మస్వపి ।
ప్రోక్తాస్తే ప్యఖిలైకవింశతిమహాదోషాస్తు మృత్యుప్రదాః॥ ౯౨

టీక॥ గణితానుసారతః - గణితశాస్త్రమునననుసరించి; ఆనీతౌ - తీసుకురాబడి: ఇమౌ - ఈః; యోగౌ - యోగములు: వ్యతిపాతవైధృతిమహాదోషౌ - వ్యతీపాతవైధృతులను మహాదోషములు, వివాహాదికే - వివాహమొదలగు శుభకర్మలయందు, దోషాణామపి - ఏకవింశతిమహాదోషములలో సర్వతః - అన్ని ప్రయత్నములచేత, సతతం- నిత్యముగా: మృత్యుప్రదౌ-మరణమునిచ్చునవిగనుక త్యాత్యౌ - విడువదగినవి; ప్రోక్తాః - ఈరీతిగఁజెప్పఁబడిన, తే - అఖిలైకవింశతిమహాదోషాస్తు-సమస్తమైనమహాదోషములు: సర్వేషు -సమస్తమైనః కర్మసు కర్మలయందు; మృత్యుప్రదాః — మరణముకలుగఁజేయును.

అవ. వ్యతీపాతవైధృతి మహాదోషములఁ జెప్పుచున్నాఁడు

తా॥ గణితశాస్త్రానుసారముచేతదోషతరములుగా నేర్పఱుపఁబడిన వ్యతీపాత వైధృతి యోగంబు లనెడిదోషంబులను ముందుచెప్పఁబడియున్న[౨౧]ఏకవింశతి మహాదోషములును వివాహాది శుభముల విషయమై మృత్యుప్రదంబులని తా॥

### దోషపరిహారము

శ్లో॥ తల్లగ్నంచ శుభైస్త్రిభి ర్యుతమపి స్వోచ్చస్థితైః స్వాలయ స్వాంశస్థైర్యది మిత్రిగై ర్గుణశతై ర్లగ్నంచ పంచేష్టికమ్। క్రూరేషు త్రిభవారిగేషు యదివా వర్గోత్తమాంశాన్వితం। లగ్నం దోషవిదూషితం యది తదామృత్యుప్రదం స్యాత్తయోః॥

టీక॥ స్వోచ్చస్థితైః- తనయుచ్చస్థానమునుబొందిన, స్వాలయస్వాంశస్థైః- తనరాశియందున్నట్టియచ్చటనున్నను తనఅంశయందున్నట్టి, మిత్రిగైః-మిత్రక్షేత్ర మిత్రాంశలయందున్నట్టి, త్రిభిః-ముగ్గురగు; శుభైః -శుభగ్రహములచేత; యుక్తమపి - కూడినదైనను; తల్లగ్నం—వివాహాదిలగ్నం; గుణశతైః - అనేకగుణములతో; యుక్తమపి - కూడినదైనను; పంచేష్టికం - పంచేషికలబలముకలదయినను క్రూరేషు—పాపగ్రహములు; త్రిభవారిగేషు—తృతీయైకాదశషష్ఠములయందుండగా; లగ్నం-లగ్నము; వర్గోత్తమాంశాన్వితం—వర్గోత్తమాంశతోగూడిన; దోషవిదూషితంయది - మహాదోషయుక్తమైనచో; తదా — అప్పుడు; లగ్నం — లగ్నము; తయోః - ఆదంపతులకు; మృత్యుప్రదం - మరణముచేయునది; స్యాత్ - అగును.

అవ. ఏకవింశతి మహాదోషములు యెన్నిసుగుణములతోఁ గూడియున్నను మిగులనింద్యంబులని వచింపుచున్నాఁడు.

తా॥ వివాహాదిలగ్నము స్వకీయోచ్చస్థాన, స్వక్షేత్రస్వాంశమిత్రక్షేత్రమిత్ర నవాంశములయందున్న మూఁడుశుభగ్రహములతోఁగూడి; పంచేష్టికబలయుక్తమై ౩-౬-౧౧ ఈ స్థానములయందు పాపగ్రహముగలదై వర్గోత్తమాంశసహితమై యత్యంతాధిక బలముగలదైయున్నను పూర్వము చెప్పఁబడియున్నదోషములు ఏకవింశతి మహాదోషములలో నొక దోషముచేత దూషితంబాయనేని శుభకర్మల విషయమై మృత్యుప్రదంబగునని తా॥

### గ్రహసంపత్తి

శ్లో॥ కేంద్రోపాంత్య శవత్రికోణసహిత స్సౌమ్యాస్తుఖేటాస్తథా పాపాస్తుత్రిభవారిగా శ్శుభఫలాస్సర్వే వివాహాదిషు।
శుక్రష్షష్ఠగతో నచేదవనిజో మృత్యుస్థితోవానచే
జ్జామిత్రే గ్రహవర్జితేహితమతో లగ్నాత్తరిప్ఫారిగః॥ ౯౨

టీక॥ సర్వే-సమస్తమైన, సౌమ్యాః - శుభగ్రహములు కేంద్రపాంత్యధవత్రికోణసహితాః- కేంద్ర — ఏడవకేంద్రముతప్ప లగ్నచతుర్థశమములు [ఏకవ

కేంద్రిమైతేవెంటనే జామిత్రిదోషమును చెప్పుటపల్ల విడువవలయు]ఉపాంత్య-పద కొండవయిల్లు: ధన-రెండవయిల్లు: త్రికోణ—నవమపంచమములు ఏతైః - వీటితో సహితా—కూడినవారగుచూ, వివాహాదిషు - వివాహాదికర్మలయందు, శుభఫలాః — శుభమునిచ్చునని: పాపాః — క్రూరులగు, ఖేటాః-గ్రిహములు, త్రిభవారిగాః - లగ్నముకంటె ౩—౧౧-౬ ట నున్నవారగుచూ, శుభఫలాః - యోగ్యమగుఫలము నిచ్చునవి, శుక్రః - శుక్రుడు: షష్టగతః — అరింటనున్నవాడగుచూ; అవనిజః - కుజుడు; మృత్యుస్థితః - యెనిమిదింటనున్నవాడగుచూ; నచేద్యది - కానటులయిన జామిత్రే-లగ్నముకన్న సప్తమకేంద్రిము, గ్రిహవర్జితే-గ్రిహములేనిదగుచుండగా హిమకరః - చంద్రుడు; లగ్నాష్టరిప్ఫారిగః - లగ్న లగ్నమును, అష్ట - ఎనిమిదింటిని, రిప్ఫా - పంన్రెండింటిని, గః - పొందియున్నవాడును, నచేత్, కానట్టయిన, యిదివరకుచెప్పబడిన శుభగ్రిహములు కేంద్రిలాభ ధననవమపంచస్థానములపొందియు పాపగ్రిహములు తృతీయైకాదశ షష్టస్థానములపొందియుఫలము నిచ్చును లేనిచో నాఫలముకలుగడు

అవ॥ వివాహాదిలగ్నమునకు గ్రిహసంపత్తినిఁజెప్పుచున్నాడు.

తా॥ లగ్నమునకు శుక్రుఁడారింటను: కుజుడెనిమిదింటను: సకలగ్రిహబు లేడింటను, చంద్రుఁడు ౬ టను; ౮ టను, ౧౨టను,లేక యుండిన౧:౨,౪:౫,౯, ౧౦; ౧౧ ఈ స్థానములయందున్న శుభగ్రిహములును ౩,౬,౧౧ఈస్థానములయందున్న పాపగ్రిహములు శుభప్రిదంబులగునని తా॥

జామిత్రిస్థాన స్థిత గ్రిహాఫలం

శ్లో॥ జామిత్రేచశరగ్రిహేస్థితఇనో వైధవ్యమిందుః స్త్రియా।
సాపత్న్యం మరణంకుజస్సుతహృతింసౌమ్యోవినాశంగురుః।
శుక్రోవ్యాధి మథార్కజస్తుకురుతే మృత్యుం తమోబంధనం।
శుక్లేందుశ్చశుభగ్రిహాశ్శుభఫలా శ్చేత్యాహురన్యేబుధాః॥

టీక॥ శరగ్రిహే-వివాహమందు: జామిత్రే — ఏడింట, స్థితః - వున్నట్టి, ఇనః - సూర్యుఁడు, స్త్రియాః - కన్యకకు, వైధవ్యం — వైధవ్యమును, కురుతే చేయుచున్నాడు: ఇందుః - చంద్రుఁడు: సాపత్న్యం - సపత్ని: కురుతే - చేయు చున్నాడు: కుజః — కుజుడు, మరణం - మరణమును; కురుతే - చేయుచున్నాడు సౌమ్యః - బుధుడు: సుతహృతిం పుత్రినాశమును: కురుతే — చేయుచున్నాడు:

గురుః - బృహస్పతి: వినాశం - నాశమును: కురుతే - చేయుచున్నాఁడు శుక్రః-శుక్రుఁడు; వ్యాధిం-రోగమును: గురుతే-చేయుచున్నాడు: అథ - పిమ్మట, అర్కజస్తు-శని: మృత్యుం - మరణమును: కురుతే - చేయుచున్నాడు. తమః - రాహువు, బంధనం-బంధనమును, కురుతే - చేయుచున్నాఁడు: అన్యే - కొందఱు బుధాః - పండితులు;శుక్లేందుః - శుక్లపక్షచంద్రుఁడు, శుభగ్రహాః- బుధ గురు శుక్రులు; జామిత్రగాః - ఏడింటినిఁబొందినవారగుచు, శుభఫలాః — మంచిఫలము నిచ్చువారు; భవంతి-అగుచున్నారు. ఇతి-అని; ఆహుః-చెప్పిరి.

అవ॥ జామిత్రిదోషమునుఁ జెప్పుచున్నాఁడు.

తా॥ వివాహలగ్నమునకు ౭ ట సూర్యుఁడున్న వైధవ్యమును: చంద్రుఁడున్న సపత్నియుఁ గుజుఁడుండిన: బుధుడుండిన పుత్రహాని గురుడుండిన నాశము-శుక్రుండిన రోగంబును ప్రికి గలుగును: శనియుండిన మరణమును,రాహువుండి నబంధనమును, దంపతులకు గలుగును, శుక్లపక్షచంద్రుఁడును శుభగ్రహంబులును ౭ ట నుండినను శుభకరంబులని తా॥

జ్యోతిషవల్లభే శ్లో॥ శుద్ధిస్థానేశుభయుతే శుద్ధిదోషోనవిద్యతేతి॥

అబ్దాదిసంధిషు త్యాజ్యకాలనిర్ణయము

శ్లో॥ అబ్దేషు క్షయవత్సరోనశుభకృత్పక్షోబ్దసంధౌ తథా।పంచాహానితుమాసయోర్దివసయోర్నక్షత్రయోర్యోగయోః।యామార్థం ఘటికాద్వయం కరణయోశ్చేల్లగ్నయోర్నాడికా ।
సంధ్యాయాంఘటికాత్రియంద్విఘటికేత్యాజ్యాస్తుసంధౌనిశి ॥

టీక॥ అబ్దేషు - ప్రభవాదిసంవత్సరములయందు: క్షయవత్సరః - క్షయ సంవత్సరము, నశుభకృత్ - శుభముచేయునదికాదు. అబ్దసంధౌ — సంవత్సరముల సంధియందు: పక్షః — పదునైదురోజులు: మాసయోః-మాసములయొక్క:సంధౌ— సంధియందు, పంచహాని కష్ణపక్షత్రయోదశి మొదలు శుక్లపక్షవిదియవఱకు నైదు రోజులు: దివసయోః - దినములయొక్క, నక్షత్రయోః - నక్షత్రములయొక్క, యోగయోః - యోగములయొక్క: సంధౌ - సంధియందు: యామార్ధం - నాలుగు గడియలు, కరణయోః - కరణములయొక్క: సంధౌ - సంధియందు: ఘటికా ద్వయం - రెండుగడియలు: లగ్నయోః లగ్నములయొక్క: సంధౌచేత్ - సంధి యందైనచో, నాడికా-ఒకగడియ: సంధ్యాయాం — సూర్యోదయ సూర్యాస్తమయ

కాలములయందు, ఘటికాత్రియం-మూడుగడియలు, నిశి-రాత్రియందు, ద్విఘటికే-రెండుగడియలు, త్యాజ్యాః-విడువదగినవి: సంవత్సరములలో క్షయసంవత్సరమనుచోట దేశభేదముచే భేదముగలదు అట్లు భాగురిచెప్పెను.

శ్లో॥ వింధ్యస్యోత్తరదిగ్భాగే మధ్యాంతంవత్సరంత్యజేత్ ।
తస్యదక్షిణదేశేతు త్రిమాసం వర్జయేత్సదా ।
అంగవంగకళింగేషు మాసషట్కంవివర్జయేత్ ।
ప్రభవాదౌతుమాసస్యాత్సర్వకర్మసుగర్హితః ॥

అబ్దసంధియందు పక్షమువదలవలయుననుచోఁగూడ వ్యవస్థగలదు, ఎప్పుడుఫాల్గున మీనము లొక్కమాటు సమాప్తిఁజెందునో యప్పుడుపక్షమువిడువవలయును ఏట్లనిన

శ్లో॥ యథాఫాల్గునమీనౌద్వౌ యుగపద్విరతింగతౌ ।
తదైవపక్షోవర్జ్యాంతే హేయోనాన్యత్రికుత్రచిత్ ।
కించ,-దశచాంద్రేతువర్జ్యాంతే సౌరాబ్దేతుహి వాసరం ।
తథాద్విరాత్రంచైవాఽఽతే వర్జయేత్సుశుభకర్మసు ॥

అవ. అబ్దాది సంధికాలములయందు శుభకర్మలవిషయమై వర్జింపఁదగిన కాలపరిమాణమునుఁ జెప్పుచున్నాఁడు.

తా॥ సంవత్సరములలో నక్షయ సంవత్సరంబును, ప్రతిసంవత్సరసంధికాలములయందు ౧౫ దినములు, మాసములసంధియందు ౫ దినంబులును, దినసంధియందును, నక్షత్రసంధియందును, యోగసంధియందు నర్ధయామకాలము, కరణసంధియందు ౨ ఘడియలు లగ్నసంధియం దొకగడియయుఁ, బ్రతస్స్వాయంకాలమందు మూఁడుఘడియలు రాత్రియందు నిశీథకాలము. ఇవి శుభకార్యముల కయోగ్యంబులు మఱియు నీవిషయమై వ్యాఖ్యయందు దేశభేదమువలనఁ దెలియఁజేసియున్న గ్రంథాతశ్లోకముల యభిప్రాయమని తా॥

మఱికొన్ని స్వల్పదోషనిర్ణయములు

శ్లో॥ వృష్ట్యభ్రభ్రమణాభ్రఘోషపరిధిబ్రధ్నేందువర్ణాన్వితా ।
విద్యుచ్చాపహిమప్రతీందురవిదిగ్దాహవాతాదయః కాలజాః ॥
దుర్యోగా బహవశ్చ దుష్టశకునం దుస్స్వప్నదుర్వీక్షణే ।
దుర్వాక్యశ్రవణంచ దుష్టమరుతౌ దుఃఖప్రదా మంగళే ॥

టీక॥ వృష్టభ్రభ్రమణాభ్రఘోషపరిధిబ్రధ్నేందువర్ణాన్వితాః- వృష్టి వర్షము అభ్రభ్రమణ-మేఘాడంబరము, అభ్రఘోష-ఉరుము, పరిధి-సూర్యచంద్రులపరి

ధియః బ్రిధ్నేందువర్ణాన్వితాః — చంద్రవర్ణముగల సూర్యుఁడు, కాలజాః - ఆయా కాలములందుకలిగిన,విద్యుచ్చాపహిమపరిశీందురవిదిగ్ధూమాదయః-విద్యుత్—మెరుపు చాప-ఇంధ్రధనస్సు, హిమ—మంచు, పరిశీందురవి-ప్రతిచంద్రప్రతిసూర్యులు:దిక్ దిక్కు, ధూమాదయ - ధూమకేతువు మొదలుగాగల; బహవః — అనేకములగు. దుర్యోగాః- దుష్టయోగములు; దుష్టశకునం - దుష్టశకునము; దుస్వప్నదుర్వీక్షణే — దుష్టస్వప్నముదుష్టవస్తువును చూచుట, దుర్వాక్యశ్రవణం - దుష్టవాక్యమునువినుట, దుష్టమరుతౌ - దుష్టవాయువలు, మంగళే-శుభకార్యమందు; దుఃఖప్రదాః-కష్టమును చేయునవి.

అవ. స్వల్పదోషములఁ జెప్పుచున్నాఁడు.

తా॥ వర్షము, మేఘాడంబరము, మేఘగర్జితము, సూర్యచంద్రుల పరివేషము సూర్యుఁడు చంద్రునివలె తెల్లవన్నె గలిగియుండుట మెఱుపును; ఇంద్రధనస్సును ప్రతిచంద్రుఁడు మంచు; ప్రతి సూర్యుడు, దిగ్దాహము, ధూమకేతువు, పెనుగాలి ఇవి మొదలగు దుష్టయోగంబులును, దుశ్శకున; దుస్స్వప్న: దుష్టవస్తుదర్శనదుర్వాక్యశ్రవణంబులును శుభకర్మవిషయమై దుఃఖప్రదములగునని తా॥

మఱికొన్ని స్వల్పదోషములు

శ్లో॥ ఋక్షోల్కాశనిపాతనాని గురుభృగ్వోర్న్యస్తమస్థితి
దిగ్దాహోయమకంటకశ్చ గుళికా ప్యర్ధప్రహారస్తతః ॥
లత్తోపగ్రహసౌమ్యవిద్ధఖచరా శ్శూన్యాఖ్యతిథ్యాదయో ।
దగ్ధాఖ్యాఅపి పంగుకాణబధిరాఖ్యాంధాఖ్యలగ్నాదయః॥

టీ॥ ఋక్షోల్కాశనిపాతనాని — నక్షత్రఉల్కాశనులయొక్క పతనములు గురుభృగ్వోర్న్యస్తస్థితిః - గురుశుక్రులకు పరస్పరము సప్తమమందునికియు, దిగ్దాహః, యమకంటకగుళికార్ధప్రహారాః-ఇవివారమువల్లకలిగిన ప్రసిద్ధమగుదోషములు; లత్తాః-లత్తదోషములు; ఉపగ్రహ- సర్వతోభద్రచక్రమందుండు ఏనిమిదుపగ్రహములు, సౌమ్యవిద్ధ-పంచశలాకమందుచెప్పఁబడిన శుభగ్రహవేధయుఖచరాః-ఖచరయోగము; శూన్యాఖ్యతిథ్యాదయః శూన్యమను పేరుగల తిథివారనక్షత్రములు, దగ్ధాఖ్యా-అపిదగ్ధములను తిథివారనక్షత్రములు పంకాగుణబధిరాఖ్యాం ధాఖ్యలగ్నాదయః-పంగుకాణబధిరాంధములను లగ్నతిథివారనక్షత్రములు ఇవి వివాహాదులయందు పనికిరావు.

అవ॥ మఱికొన్ని స్వల్పదోషములఁజెప్పుచున్నాఁడు.

తా॥ నక్షత్రములు: కొఱవులు, పిడుగులివి మొదలగునవి యాకసమునుండి క్రిందబడుట, గురుశుక్రులొకరికొకరు ఒకట నుండుట, దిగ్దాహము, యమకంటకము, గుళిక, అర్ధప్రహారము, లత్తలు, ఉపగ్రహములు, శుభగ్రహవేధ; ఖచరయోగము: శూన్యతిథివార నక్షత్రములు: దిగ్ధతిథివారనక్షత్రములు పంగుకాణబంధిరాంథములనెడి లగ్నతిథివారనక్షత్రంబులివి వివాహాదుల కయోగ్యంబులని తా॥

## స్వల్పదోషములకు దేశవ్యవస్థలు

శ్లో॥ ప్రోక్తాని స్తరభీతితశ్చ కతిచి త్స్వల్పాశ్చదోషా మయా॥
సౌరాష్ట్రాంగకళింగవంగమగధావంతీషు కాశ్మీరకే।
గౌడద్రావిడసాల్వమధ్యమకురుమ్లేచ్ఛేషు దేశేష్వతే।
బాహ్లీకాదిషు మంగళే నిధనదా శ్శేషేతు దేశే శుభాః॥ ౧౦౨

టీక॥ విస్తరభీతితః — గ్రంథవిస్తార మనుభయముచే, కతిచిత్ - కొన్నైన స్వల్పాః-కొంచమైన, దోషాః — దోషములు; మయా - నాచే ప్రోక్తాః-పలుకఁబడినవి; తేపి - అస్వల్పదోషములు, సౌరాష్ట్రాంగకళింగవంగమగథావంతీషు సౌరాష్ట్రాంగకళింగవంగమగథావంతులయందు; కాశ్మీరకే - కాశ్మీరదేశమందు;గౌడద్రావిడసాల్వమధ్యమకురుమ్లేచ్ఛేషు — గౌడద్రావిడ సాల్వమధ్యమకురుమ్లేచ్ఛదేశములయందు, బాహ్లీకాదిషు-బాహ్లీకము మొదలగుదేశములయందు,మఙ్గళే—శుభకర్మయందు నిధనదాః-మరణముచేయును, శేషే-మిగిలిన దేశే-దేశమందు, శుభాః-మంగళకరము

అవ॥ స్వల్పదోషములకు దేశవ్యవస్థను జెప్పుచున్నాఁడు

తా॥ ఈ చెప్పఁబడిన దోషములుగాకయనేక స్వల్ప దోషములుగలవైనను గ్రంథవిస్తరభయముచేత సంగ్రహముగఁ జెప్పఁబడినవి యీస్వల్పదోషములును సౌరాష్ట్రాంగకళింగవంగమగథావంతి కాశ్మీరగౌడద్రావిడసాల్వమధ్యమకురుమ్లేచ్ఛ బాహ్లికాదిదేశములకుఁ దక్కఁ దక్కినదేశములయందుఁ బనిలేదని తా॥

## వివాహలగ్నమునకు దోషాపవాదము

శ్లో॥ స్వోచ్చస్థానగతో వివాహసమయే మూలత్రికోణస్థితః।
స్వక్షేత్రే యది సంస్థితశ్చ బలవాన్ మిత్రాలయస్థోపివా॥
ద్యూనాఖ్యంచవిసృజ్య కేంద్రమితర త్కేంద్రత్రికోణస్థిత॥స్సా
మ్యోవాగురు రేవవా సురగురు ర్హంత్యేవదోషార్బుదమ్॥ ౧౦౩

టీక॥ సౌమ్యః - బుధుడైన;గురుర్వా - బృహస్పతియైనా; అసురగురుః - శుక్రుడైనా, వివాహసమయే - వివాహకాలమందు; స్వోచ్ఛస్థానగతోవా . స్వోచ్ఛ యందున్నను; మూలత్రికోణస్థితః-మూలత్రికోణమందున్నను;బలవాన్—బలముకల వాడగుచూ, స్వక్షేత్రే—స్వక్షేత్రమందు; సంస్థితః-వుండినను; ద్యూనాఖ్యం - ద్యూన మనునేతవదైన, కేంద్రం—కేంద్రమును, విసృజ్య-విడచి;[జామిత్రిదోషముండుట వలన] ఇతరత్-యితరమగు; కేంద్రత్రికోణస్థితోయది - కేంద్రత్రికోణములయం దున్నచో; దోషార్బుధం-అర్బుదసంఖ్యగల దోషములను: హంత్యేవ-కొట్టివేమును.

అవ॥ రెండుశ్లోకములచే స్వల్పదోషభంగమును జెప్పుచున్నాఁడు

తా॥ బుధ గురు శుక్రులలో నొకరు వివాహసమయంబున స్వోచ్ఛమూలత్రి కోణమిత్రక్షేత్ర స్వక్షేత్రములయందైనను: లగ్నమందైనను: ౪-౫-౯-౧౦ ఈ స్థానములయందైనసుండిరేని యర్బుదసంఖ్యాకంబులగుదోషములఁ దొలగొట్టుననుటకు సంధియంబులేదని తా॥

శ్లో॥ క్రూరష్షష్ఠభవత్రిగోయది బలీ హంత్యాశు దోషాయుతం ।
లగ్నేశశ్చ బలీ యథోక్తగృహగో లగ్నంచ పంచేష్టికమ్ ।
రాత్రావేవ నిశాకరోయది బలీ హ్యేకాదశస్థోపివా ।
లగ్నైకాదశగోరవిస్తుసకలాన్ దోషాన్ నిహంతిస్ఫుటమ్॥ ౧౧౪

టీక॥ బలీ-బలవంతుఁడగు; క్రూరః-క్రూరగ్రహము; షష్ఠభవత్రిగ-షష్ఠై కాదశతృతీయములఁ బొందినవాడైనచో: ఆశు-శీఘ్రముగా: దోషాయుతం-పదివేల దోషములను; హంతి—నశింపఁజేయుచున్నది. లగ్నేశ- లగ్నాధిపతియు: బలీ - బల వంతుఁడగుచు: యథోక్తగృహగ-పూర్వమందు చెప్పఁబడిన కేంద్రత్రికోణైకాదశ ములయందున్నచో, దోషాయుతం- పదివేలదోషములను, నిహంతి - కొట్టివేయు చున్నాఁడు పంచేష్టికం-పంచేష్టికమనుగుణముతో గూడిన; లగ్నంచ- లగ్నమున్ను దోషాయుతం—పదివేలదోషములను। నిహంతి - కొట్టివేయుచున్నాఁడు: బలీ - బల వంతుఁడగు నిశాకరశ్చ-చంద్రుఁడున్ను। ఏకాదశస్థోయది-పదునొకండింటనున్నచో రాత్రావేవ-రాత్రియందే: లగ్నముయొక్క-పదివేలదోషములనుకొట్టివేయుచున్నాడట ఏవకారణముచే చంద్రుడు పగటిలగ్నముయొక్క దోషములనుకొట్టదనితాత్పర్యము రవిస్తు-సూర్యుఁడైతే లగ్నైకాదశగః—లగ్నముయొక్క పదునొకండవ స్థానమును బొందినచో, సకలాన్-సమస్తమగు; దోషాన్-దోషములను: స్ఫుటం- స్పష్టముగా నిహంతి కొట్టివేయుచున్నాఁడు: తు యనుశబ్దము పగటిలగ్నమునకు కలిగిన దోష

ములని భేదము తెలియుటకు, సూర్యుఁడు పగటియందుఁ బలముగలవాఁడగుటవలన

శ్లో॥ నక్తంబలాభౌమశశాంకమందాగుర్వార్కశుక్రాదివిశక్తయశ్చేతి శ్రీపతికారునియొక్క వాక్యమువల్ల.

తా। బలయుక్తమగు పాపగ్రహము ౩-౬-౧౧ ఈ స్థానములయందున్నను బలవంతుఁడైన లగ్నాధిపతి లగ్నముననున్నను ౪-౫-౯-౧౦-౧౧ ఈస్థానముల యందున్నను లగ్నము పంచేష్టికబలయుక్తమైయున్నను, పదివేలదోషములునాశము నొందును ౧౧ ట నున్న బలయుక్తఁడగుచంద్రుఁడు రాత్రిలగ్నము బొందియున్న పదివేల దోషముల లగ్నైకాదశగతుం డగుసూర్యుండు పగటిలగ్నమునొందియున్న సకలదోషములను హతంబులు గావించునని తా ॥

దోషప్రసంగ నుపసంహారము

శ్లో॥ ఉద్వాహాదిషు చైకవింశతిమహాదోషాన్ విసృజ్యేతరాన్ ॥
స్వల్పాన్ దోషగణాన్ గుణాంశ్చగణితాన్నిశ్చిత్యశాస్త్రాత్స్ఫుటమ్
లగ్నం యత్ర గుణాధికంచ సకలై ర్గ్రాహ్యాం సదోషాధికం ॥ ౧౨॥
బ్రహ్మావా పరిహర్తు మత్ర సకహాన్ దోషాన్ సమర్థోనహి ॥

టీ॥ ఏకవింశతిమహాదోషాన్ - ఏకవింశతిమహాదోషములను,విసృజ-విడచి ఇతరాన్-ఇతరమగు: స్వల్పాన్ - కొద్దివగు, దోషకణాన్—దోషసమూహములను, గుణాంశ్చ-గుణములనున్ను, గణితాత్ - గణితమను: శాస్త్రాత్ - శాస్త్రమువల్ల; స్ఫుటం-స్పష్టముగా: నిశ్చిత్య, నిశ్చయించి యత్ర-ఏలగ్నమందు, గుణాధికం - గుణములయొక్క ఆధిక్యము: దృశ్యతే - చూడఁబడుచున్నదో: తత్—అ: లగ్నం—లగ్నము, ఉద్వాహాదిషు-వివాహము మొదలగు వానియందుః సకలైః-సమస్తమగు వారిచే: గ్రాహ్యం—గ్రహించదగినది: దోషాధికం - అధికదోషములుగల లగ్నము నగ్రాహ్యం - గ్రహించఁదగ్గదికాదు: దీనిచే కొద్దిదోషములుగలలగ్నముగ్రహించ తగినదని తెలియవచ్చుచున్నది. స్వల్పదోషములైనను లేనిది దుర్లభమని వచించు చున్నాఁడు, అత్ర-ఈవివాహాదిలగ్నమందుః సకలాన్- సమస్తమగుదోషాన్-దోష ములను: పరిహర్తు-పోగొట్టుటకొరకు బ్రహ్మావా - బ్రహ్మైనను సమర్థః - సమ సమర్థుఁడు నహి - కాడు మనుష్యులు సమర్థులుకా రనుమాట చెప్పనక్కరలేదు

**అవ॥ దోషప్రసంగము నుపసంహారము చేయుచున్నాఁడు**

**తా॥ ఏకవింశతిమహాదోషములు గాక తక్కువ స్వల్పదోషములనుగుణము లను జ్యోతిశ్శాస్త్రమువలన నిర్ణయించి ఏలగ్నంబున దోషములకంటె గుణములధిక**

ముగనుండునో యాలగ్నమును వివాహాదిశుభకార్యములవిషయమై గ్రహింపవలయు గాన యధిక దోషములుగల లగ్నమును గ్రహింపవలదు. స్వల్పదోషములైన గలి యకయుండెడి లగ్నమును నిర్ణయించుట బ్రహ్మకైన వశంబు గాదు గావునస్వల్ప దోషయుక్తలగ్నము గ్రాహ్యమని తా॥

## వింశతివర్గనిర్ణయము

శ్లో॥ నాడీరాశితదీశయోనివనితాదీర్ఘా గణశ్చాపిష ।
ద్వర్గాముఖ్యతరా వివాహసమయే శేషాస్తుమధ్యాస్తతః ॥
మాహేంద్రో గణితాయవశ్యదివసా వర్ణోడువిద్ధాండజా ।
రజ్జుర్యోగినిలింగభూతశశియుగ్గోత్రాహ్వయా వింశతిః ॥

టీక॥ నాడీరాశితదీశయోనివనితాదీర్ఘాః- నాడీ - నాడి-నాడికూటము, రాశి-రాశి వర్గము, తదీశ-గ్రహమైత్రివర్గము, యోనిః-యోనివర్గము,వనితాదీర్ఘః-స్త్రీదీర్ఘ వర్గం గణశ్చ-గణవర్గము, షడ్వర్గాః-అరువర్గములు, వివాహసమయే-వివాహకాలమందు, ముఖ్యతరాః - మిక్కిలి ముఖ్యమైనవి, తతః - తర్వాత, శేషాః - మిగిలినవరులు మధ్యాః-మధ్యమమైనవి, మహేంద్రః-మాహేంద్రివర్గంగణితవర్గం, గణితవర్గము అయః-అయవర్గము, వశ్యః-వశ్యవర్గము, దివసః-దినకూటము, వర్ణ-జాతికూటము ఉడువిద్ధి—వేథాకూటము, అఢంజః - పక్షికూటము, రజ్జుః — రజ్జుకూటము యోగిని గోత్రాహ్వయాః, యోగినీ—యోగినీవర్గము, లింగ -లింగవర్గము, భూత-భూతవర్గం శశియుక్-చంద్రయోగవర్గము, గోత్ర-గోత్రవర్గము అనేపేరుగలవి, కలసి ౨౦ వర్గములు కూటములు వర్గములు కలుగుచున్నవి.

అవ. వింశతివర్గనామములఁ దెలుపుచున్నాఁడు.

తా॥ నాడీకూటము, రాశివర్గువు గ్రహమైత్రియోని స్త్రీదీర్ఘ వర్గువులును,గణ కూటమీ ౬ ను మిగుల ముఖ్యములు మాహేంద్రిగణితవర్గువులును, అయశ్యవర్గు వులును, దినవర్గువు జాతికూటము, వేథాకూటము, పక్షి రజ్జుకూటములును యోగి నీలింగభూతవర్గువులును చంద్రయోగకూటము, గోత్రవర్గునీ ౧౪ ను మధ్యమంబు లన్నియుంజేరి ౨౦ వర్గువులని తా॥

## నాడీకూటలక్షణము

శ్లో॥ యాతస్యాస్తు కరగ్రహేయది చతుస్త్రిద్వ్యంఘ్రిధిష్ణ్యోదితా ।
దస్రిగ్నాత్రిషు వహ్నిబాద్యది చతుర్వేందుభా త్వంచసు ।
నాడీపర్వసు తత్క్రమాచ్ఛ గణనాభిన్నాంగుళిస్థాశుభా ॥
నాడీశుద్ధి రిహైవ భాగ్యజననీ మాంగల్యసూత్రింతుసా॥౧౦౭

టీక॥ యా - ఏనాడి, చతుస్త్రిద్వ్యంఘ్రిధిష్ణ్యోద్భవా - చతుష్పాత్త్రిపాద్ద్విపాన్నక్షత్రములయందు పుట్టిన, త్రిపాన్నక్షత్రములకృత్తికాపునర్వసూత్తరఫల్గునీవిశాఖోత్తరాషాఢా పూర్వాభాద్రలను ఆఱును త్రిపాన్నక్షత్రములు, మృగశీర్షా చిత్తా ధనిష్ఠాలను మూడునుమిగిలినపదునెనిమిదిచతుష్పాన్నక్షత్రములు, చతుష్పాన్నక్షత్రములకు, దస్రాత్ - అశ్వనిమొదలు, త్రిషు - మూఁడగు, పర్వసు - వేలికణుపులయందు, త్రిపాన్నక్షత్రములకు, వహ్నిభాత్-కృత్తికమొదలు, చతుర్షు-నాలుగగు పర్వసు—పర్వలయందు, ద్విపాన్నక్షత్రములకు, ఇందుభాత్-చంద్రనక్షత్రమగుమృగశిరమొదలు, పంచసు-ఐదగు, పర్వసు—పర్వములయందు, తత్క్రమాత్-ఆక్రమముగా, యా - ఏ, గణనా - లెక్క, క్రియతే - చేయబడుచున్నదో, సా-ఆలెక్క, భిన్నాంగుళిస్థాయది—వర్గనక్షత్రముల స్థానమందుండంగుళులకన్న వేరగునంగుళులయందున్నచో, శుభా - మంచిది, నాడీశుద్ధిః - నాడీశుద్ధి, ఇహైవ -ఇహజన్మమందే భాగ్యజననీ - సౌభాగ్యముకలుగఁజేయును, తస్యాః - ఆస్త్రీకి, కరగ్రహే- వివాహమందు, మాంగల్యసూత్రం—మంగళసూత్రమువలె శుభముఁజేయును.

అవ. నాలుగుశ్లోకములచే నాడీకూటమును జెప్పుచున్నాఁడు.

తా॥ చతుష్పాదనక్షత్రములయందుఁ బుట్టిన స్త్రీకి అశ్విన్యాదిగ మూఁడుఁ వ్రేళయందును కృ, పున, ఉత్తర, వి, ఉషా, పూభా ఈత్రిపాన్న క్షత్రములయందుఁ బుట్టిన స్త్రీకి, కృత్తిక మొదలు నాలుగువ్రేళ్ళయందును; మృ, చి, ధనిష్ఠ ఈద్విపాన్నక్షత్రములయందుఁ బుట్టిన స్త్రీకి; మృగశిరమొదలైదువ్రేళ్ళయందుమ లెక్కింపఁగాగన్నియ జన్మనక్షత్రమువరునిజన్మనక్షత్రమున్న వ్రేలియందు లేకమఱియొక వ్రేలియందున్న శుభకరంబగుటయుఁగాక స్త్రీకి మంగళసూత్రముఁ బోలెమిక్కిలి సౌభాగ్యప్రదంబగును.

మఱియొక నాడీకూటము

శ్లో॥ త్రిణిత్రీణ్యథదస్రభాది గణయేద్భానక్రమాద్వ్యుత్క్రమా-
ద్దంపత్యోరపి జన్మభే శుభఫలేభిన్నాంగుళిస్థేయది ।
పార్శ్వస్థాంగుళిసంస్థితే యదివధూంహంత్యేవధిష్ణ్యద్వయం।
తన్మధ్యాంగుళిసంస్థితంయదిపతింహంత్యేవపాణిగ్రహే॥౧౦౮

టీక॥ త్రిణిత్రీణి - మూడుమూడు, భాని-నక్షత్రములు, దస్రాది-అశ్వనీనక్షత్రముమొదలు, క్రమ-క్రమముగాను, వ్యుత్క్రమాత్-తల్లక్రిందుగాను, గణయేత్-లెక్కింపవలయును, దంపత్యోః—దంపతులయొక్క, జన్మభే_జన్మనక్షత్రము భిన్నాంగుళిస్థేయది—వేరగు వ్రేళయందున్నచో, శుభఫలే-మంచిఫలములనిచ్చును

ధిష్ణ్యద్వయం-రెండునక్షత్రములు, పార్శ్వాకాంగుళిసంస్థితం యది-ప్రక్కనుండు నొకవ్రేలియందు చేరినచో, పాణిగ్రహే-వివాహమందు, వధూం-పెండ్లికుమార్తెను, హంత్యేవ-చంపును; తన్మధ్యాంగుళిసంస్థితం-ఆదంపతుల నక్షత్రద్వయముమధ్యాంగుళియందుండిన; పతిం-పెండ్లికుమార్తెని; హంత్యేవ-చంపును.

అవ. నాడీకూటము మఱియొకవిధంబునఁజెప్పుచున్నాఁడు.

తా॥ అశ్వనిమొదలు మూఁడేసి నక్షత్రముల మూఁడువ్రేళ్ళయందు గ్రమవ్యుత్క్రమములచే గణనచేయఁగా వధూవరులనక్షత్రము లొకవ్రేలియందుండక వేఱుపడియున్న శుభకరంబు లగుననియు; నిరువురినక్షత్రము లొకవ్రేలియందున్న మిక్కిలియాపత్కరంబగుననియు ముఖ్యాభిప్రాయమని తా॥

పార్శ్వకాంగుళిదోషాపవాదము

శ్లో॥ పర్యాయైస్త్రిభిర్యది వ్యవహితం స్త్రీభంచపుంభంద్వయం
పార్శ్వకాంగుళిసంస్థితం యది తదా తద్రాశికూటేశుభే ।
సద్రజ్జౌ వరయోర్నియోగసమయే ప్యేకాధిపత్యే ద్వయో ॥
ర్మైత్రే కేచిదథైకనాడిజనితో దోషస్తునే త్యూచిరే॥ ౧౦౯

టీక॥ స్త్రీభం - స్త్రీనక్షత్రము; పుంభం - పురుషనక్షత్రము, ద్వయః - ద్వయము త్రితయై-మూఁడగు, పర్యాయై-ఆవృత్తులచేత; వ్యవహితం-వ్యవధికలదగుచు పార్శ్వకాంగుళిసంస్థితం — పార్శ్వాంగుళులలో నొకయంగుళియందున్నను; తదా-వివాహసమయమందు; తద్రాశికూటే — దంపతుల రాశికూటము; శుభేవా -శుభకరమైనదైనను నియోగసమయే: వివాహసమయమందు; వరయోః - వధూవరులకు; సద్రజ్జౌ-యోగ్యమగు రజ్జుగూటమున్నను; ద్వయోః—దంపతీజన్మరాసులకు రెంటికి ఏకాధిపత్యే-ఒకదే యధిపతిగానున్నను, ద్వయోః—దంపతీ రాశ్యధిపతులకు మైత్రే మిత్రత్వమున్నను, ఏకనాడీజనితః-ఏకనాడివల్లకలుగు; దోషః—దోషము; నేతి-లేదని కేచిత్-కొంతమంది; ఊచిరే-చెప్పిరి.

అవ. దంపతులజన్మనక్షత్రము లొకవ్రేలికి వచ్చినను దోషము లేక యుండెడివిధమును జెప్పుచున్నాఁడు.

తా॥ పూర్వశ్లోకమునఁజెప్పబడిన క్రమంబున; దంపతుల జన్మనక్షత్రములు అశ్వనిమొదలు ముమ్మారు గణనచేయునపుడొక వ్రేలిని బొందియుండి యాపిమ్మట

నొకవేళ్రలిని బొంధియున్నను, దంపతుల రాశికూటరజ్జుకూటములు శుభకరంబులై యున్నను, ఉభయులజన్మరాసుల కొకగ్రహ మధిపతియైయున్నను జన్మరాశ్యధిపతులు పరస్పరమిత్రత గలవారైయున్న నట్టిసమయమున నేకాంగుళస్థిత నక్షత్ర దోషము పనిలేదనియు కొందఱియభిప్రాయమని తా॥

ఏకాంగుళస్థితనక్షత్రపరిహారము

శ్లో॥ ఇంద్రాగ్నీ వసుమిత్రపూషసవితృస్వాతీశివాజైకపా।
ద్భేష్వేవాష్టసు దంపతీజననభే ద్వేహ్యేకధిష్ణ్యే శుభే।
అంత్యోపాంత్యపిధిద్విదైవ గిరిశ శ్రీశార్యపిత్ర్యేష్వవా।
నానాపాదయోజర్యమేందువరుణ బ్రధ్నాహ్యసార్పేష్వవా॥

అవ. ఏకాంగుళస్థిత నక్షత్రజన్యదోషములకు విధ్యంతరములచేతఁ బరిహారము జెప్పుచున్నాఁడు.

తా॥ దంపతులు, ధ, అనూ, స్వా, పూభా ఈ నక్షత్రముల యందైనను, ఈనక్షత్రములలో నొకనక్షత్రంబున నొకపాదమునందైనను, ఉభా, రో, శ్ర, పుష్య, మఖ, భ, మృ, శ, పూషా, ఆశ్రే ఈ నక్షత్రముల భిన్నపాదములయందైనను రే, వి, అర్ద్ర, హ ఈనక్షత్రములయందైనను యీనక్షత్రముల భిన్నసమాన పాదముల యందైనను జన్మించియుండిరేని ఏకాంగుళస్థితనక్షత్రదోషము లేదనితా॥

రాశికూటము

శ్లో॥ జ్ఞేయాన్యంఘ్రిచతుష్టయాని సకలా న్యశ్విన్యాదితో।
హ్యేకైకస్యనవాంఘ్రికం ప్రతిగృహం జ్ఞేయంచ మేషాదితః।
రాశ్యంతం గణయేద్వరస్యతు సదా స్త్రీజన్మరాశ్యాదితః।
ప్రోక్తాద్దోషనిరూపణే ప్రథమతో మేషాదిరాశీశ్వరాః॥

టీక॥ దస్రాదితః- అశ్వనిమొదలగు, సకలాని-సమస్తములగు, ఋక్షాణి-నక్షత్రములు; అంఘ్రిచతుష్టయాని—నాలుగుపాదములుగలవై; జ్ఞేయాని-తెలియతగినవి మేషాదితః-మేషరాశిమొదలు ఏకైకస్య-ఒక్కొక్కరాశికి; ప్రతిగృహం-ప్రతిఇల్లు నవాంఘ్రికం; తొమ్మిదిపాదములుగలదై; జ్ఞేయం-తెలియతగినది; సదా-యెల్లప్పుడు స్త్రీజన్మరాశ్యాదితః - స్త్రీజన్మరాశిమొదలు; వరస్య - వరునియొక్క; రాశ్యంతం— రాశివఱకు; గణయేత్- లెక్కించవలయును; దోషనిరూపణే - ఏకవింశతిమహాదోషముల చెప్పుకాలమందు; ప్రథమతఏవ-ముందుగానే: మేషాదిరాశీశ్వరాః—మేషము మొదలు రాశ్యధిపులు; ప్రోక్తాః-చెప్పబడియున్నారు.

అవ॥ మూఁడుశ్లోకములచేత రాశికూటమును జెప్పుచున్నాఁడు

తా॥ ఒక్కొక్క నక్షత్రమునకు నాలుగుపాదములు;అట్టిపాదములలొమ్మిది చేరిననొకరాశియగును. రాశికూటాదివిచారము జేయునపుడు కన్నియ జన్మరాశి మొదలు వరుని జన్మరాశివరకు లెక్కింపవలయునని తా॥

గణనఫలనిర్ణయము

శ్లో॥ దంపత్యోస్సమసప్తమౌచ సుతదౌ తౌ వేకరాశిస్థయోః ।
ర్ముఖ్యౌ తౌ త్రిభవౌచతుర్దశమౌ తద్వ్యత్యయౌ వాశుభౌ ।
ఉద్వాహే నవ పంచమౌత్వశుభదౌ తద్వ్యత్యయౌ వాశుభౌ ।
మిత్రత్వే గ్రహయోరిమావపి శుభౌ వేకాధిపత్యేపివా॥౧౧౧

టీక॥ దంపత్యోః-వధూవరులకు: రాశీ-రాసులు; సమసప్తమౌ — సమసప్తకములైనచో: సుతదౌ-కొమాళ్ళనిచ్చును; తయోః— ఆదంపతులకు,ఏకరాశిః - రాశియొకటైనచో, ముఖ్యౌ-ఉత్తమమైనవి; త్రిభవౌ - తృతీయైకాదసులు; చతుర్దశమౌ-నాలుగుపదిరాసులు; తద్వ్యత్యయౌ - దానికి విపరీతమైనప్పుడు; అనగా స్త్రీ రాశ్యాది పురుషరాశివరకు ౧౦-౩ రాసులును; ౧౦-౪రాసులునుశుభౌ—శుభకరములు; ఉద్వాహే-వివాహసమయమందు, నవమపంచమౌతు- నవమపంచములైతే; అశుభదౌ-అమంగళకరములు, తద్వ్యత్యయౌవా - పంచమనవమములైనచో: శుభౌ-శుభకరములు; గ్రహయోః-వధూవరరాశ్యధిపులకు; మిత్రత్వేసతివా- స్నేహమున్నను ఏకాధిపత్యేసతివా - ఒకడేయధిపుడైనను; ఇమావపి - యీనవమపంచములున్నా శుభౌ — మంచివి.

అవ॥ కన్యక జన్మరాశిమొదలు గణనచేసినందుఁ గలిగెడ ఫలమును జెప్పుచున్నాఁడు.

తా॥ కన్యకజన్మరాశిమొదలు వరజన్మరాశివఱకు గణనముచేయఁగా సమసప్తకము ౭-౭ రాసులుగా నుండియున్నఁ బుత్రప్రదంబనియును; స్త్రీజన్మరాశి పురుషజన్మరాశి ఏకమైనప్పుడు శుభప్రదంబనియును, స్త్రీజన్మరాశి మొదలుపురుషజన్మరాశివఱకు ౩—౧౧ తృతీయ ఏకాదశములును, ౪-౧౦ చతుర్దశములునుఅశుభప్రదము లనియును; మఱియు ౧౧౩-, ౧౦-౪ గా నుండిన అశుభప్రదంబనియును,౯-౫ రాసులుగా నుండిన అశుభప్రదంబనియును; ౫-౯ రాసులుగా నుండిన శుభప్రదంబనియు, వధూవరులరాశ్యధిపతులు మిత్రత్వముకలవారైనప్పుడునువధూవరులజన్మరాశ్యధిపతులు ఏకమైనప్పుడు ౯-౫ రాసులలు వచ్చినప్పటికినిదోషములేదని తా॥

శ్లో॥ స్యాద్ద్విర్ద్వాదశ ఆర్తిదః కలహదః షష్ఠాష్టమస్తుస్త్రియా ।
తత్సర్వత్రాపి సమాలయాది రథవాద్విర్ద్వాదశోప్యుత్తమః ।
దంపత్యోర్విషమాలయాది రథవా షష్ఠాష్టమ శ్శోభనో।
వర్గాయద్యప రేశుభా అథశుభా స్తద్వ్యత్యయామధ్యమా॥ ౧౧౩

టీ॥ ద్విర్ద్వాదశః - స్త్రీపురుషుల జన్మరాసులకు ౨ - ౧౨ రాసులైనచో॰ ఆర్తిదః-పీడనుచేయును, ద్వాదశద్వికమైతే శుభము, షష్ఠః — ఆఱవది; అష్టమః- ఎనిమిదవది; కలహదః-కలహముచేయును ౮-౬శుభములు,సర్వత్ర—అంతట;సమాలయాదిః-సమరాశ్యాద్యయినచో, ఉత్తమః- శ్రేష్ఠము; అధవా - కాకున్న; ద్విర్ద్వాదశోపి—౨-౧౨న్ను సమాలయాదియైనచో శుభము; దీనిచే స్త్రీరాశి సమరాశియైనచో మంచిది; షష్టాష్టమస్తు -౬—౮వదైలే; విషమాలయాదిశ్చేత్-విషమాలయాదియైనచో: దంపత్యోః-దంపతులకు; శోభనః-మంచిది, వర్గాయది - శుభషడ్వర్గమైనచో; శుభాః-మంచివి, అశుభాశ్చేత్ - అశుభవర్గము, అశుభాః - మంచివికావు; తద్వ్యత్యయా-దానికి విపరీతముగా నుండుట; మధ్యమాః- మధ్యమఫలమునిచ్చును.

తా॥ స్త్రీ జన్మరాశిమొదలు పురుషజన్మరాశివరకు గణనచేయఁగా స్త్రీరాశికి; బురుషరాశి౨-వదిగానుండిపురుషరాశికి స్త్రీరాశి ౧౨-వదిగా నున్న దుఃఖకరంబగుననియు; స్త్రీరాశి ౬ వదికానుండిపురుషరాశి ౮వదిగా నున్నఁగలహకరంబగుననియు స్త్రీరాశ్యౌ ౮—౬ గా నుండినపుత్ర పదమనియును ౧౨-౨గానుండినశుభపదమనియును స్త్రీరాశి వృషబాది సమరాసులలోనొకటిగ నుండెనేని అపుడు౨ వదిగానున్న పురుషరాశియు; ౧౨ వదిగానున్న స్త్రీ రాశియు శుభకరంబగును. స్త్రీరాశి మేషాది విషమరాసులలో నొకటిగనున్నప్పుడు, ౬ వదిగానున్న పురుషరాశియు ౮ వదిగా నున్న స్త్రీరాశియుశుభకరంబగును; షడ్వర్గులుశుభసంబంధులైయున్న శుభకరంబగులగుననియు; నశుభకరంబులైయున్న నశుభకరంబులగునని తాత్పర్యము:

## గ్రహామిత్రత్వములు

శ్లో॥ సూర్య స్యార్యసుజేందవశ్శ్చ సుహృదా శ్శతూసితార్కి విధోః
సూర్యజ్ఞా సుహృదా నశత్రు రవనీపుత్రస్యమిత్రాణితే ।
అరార్క్యేందవశిందుజోప్యహితకృత్ జ్ఞస్యార్క శుక్రౌహితౌ ।
చంద్రోఽరిఃసుహృదోగురోః కుజశశిబ్రధ్నాస్సితజ్ఞౌరిపూ॥ ౧౧౪

టీక॥ సూర్యస్య - సూర్యునకు ఆర్యకుజేందవః—గురుకుజచంద్రులు, సుహృదః—స్నేహితులు; సితార్కీ--శుక్రశనులు, శత్రూ-శత్రువులు, మిగిలినబుధుడుసముడు విధోః-చంద్రునకు; సూర్యజ్ఞౌ-సూర్యబుధులు, సుహృదౌ - స్నేహితులు; శత్రుః - శత్రువు, న-లేదు, కుజగురుశుక్రశనులు సములు; అవనీపుత్రస్య - అంగారకునకు తే-ఆసూర్యగురుచంద్రులు; మిత్రాణి—స్నేహితులు; ఇందుజః - బుధుడు; అహితకృత్ శత్రువు; చంద్రశుక్రులు, సములు; జ్ఞస్య-బుధునకు; అర్క-శుక్రౌ— సూర్యశుక్రులు; హితౌ-స్నేహితులు, చంద్రః—చంద్రుఁడు, అరిః - శత్రువు; గురోః—బృహస్పతికి; కుజశనిబ్రధ్నాః-కుజశనిసూర్యులు, సుహృదః స్నేహితులు, సితజ్ఞౌ శుక్రబుధులు, రిపూ - శత్రువులు; శనిసముడు.

శ్లో॥ సౌమ్యార్కీ సుహృదౌ భృగోశ్శశిరవీ శత్రూ భృగుజ్ఞౌ హితౌ
మందస్యారరవీందవశ్చ రిపవో ఉనుక్తాః క్రమాన్మధ్యమాః।
దంపత్యోర్యతి జన్మరాశ్యధిపయోః రేకాధిపత్యే శుభో మైత్రే
వా సమయోస్సమస్త్వహితయో ర్వర్గస్సదా మృత్యుకృత్ ।

టీక॥ భృగోః-శుక్రునకు; సౌమ్యార్కీ—బుధశనులు; సుహృదౌః — స్నేహితులు, శశిరవీ చంద్రసూర్యులు; శత్రూ-శత్రువులు; ఇతరౌ - మిగిలినవారు కుజగురులు సములు, మందస్య- శనికి - భృగుజ్ఞౌ-శుక్రబుధులు; హితౌ -స్నేహితులు ఆరరవీందవః-అంగారకసూర్యచంద్రులు, రిపవః శత్రువులు అనుక్తాః చెప్పబడనివి క్రమాత్-క్రమముగా; మధ్యమాః-సములు; దంపత్యోః - దంపతులయొక్క; జన్మరాశ్యధిపయోః-జన్మరాసులకగు నధిపతులు; మైత్రే—స్నేహితముకలిగినను; ఏకాధిపత్యే-ఒకడే యధిపతియైనను; శుభః శుభుడు; సమయోః-సములైనచో; సమః - సమఫలమునిచ్చువాడ; అహితయోః-తయో- ఆదంపతులకు శత్రువులగుచుండగా వర్గః-రాశివర్గము; మృత్యుకృత్-మరణముచేయును-ఇచ్చటకొంచమువ్రాయుచున్నను యీశత్రుమిత్రత్వములు స్వతసిద్ధములు; తాత్కాలిక శత్రుమిత్రత్వము లెట్లనిన - గ్రహమునకు ఆకాలమందు౨—౩-౪-౧౦-౧౧-౧౨రాసులయందుండువాడుమిత్రుడు: ౧-౫-౬-౭-౮—౯ రాసులయందుండువాడు శత్రుఁడు; యివి తాత్కాలికశత్రుమిత్రులు: నైసర్గికమిత్రుఁడుతాత్కాలికమిత్రుఁడైనచో నధిమిత్రుఁడగునునైసర్గిక శత్రుడు తాత్కాలికశత్రుఁడైనచోనధిశత్రుఁడగును- నైసర్గికమిత్రుతాత్కాలికశత్రులైనచో సముఁడగును నైసర్గికసముఁడు తాత్కాలికశత్రువైనచో శత్రుఁడేయగును తాత్కాలికసముఁడు కాకుడుంటచే అట్లు బృహజ్జాతకశ్లోకము

శ్లో॥ అన్యోన్యస్యశ్య ధనవ్యయాయసహజ వ్యాపారబంధుస్థితా ।
స్తత్కాలేసుహృదస్స్వతుంగభవనో ప్యేతేరయ స్త్వన్యథా ।
ద్వ్యేకానుక్త భవాంత్యసహృత్సమరిపూస్సంచిత్యనైసర్గికాం ।
స్తత్కాలేచ పునస్తుతానధిసుహృస్మిత్రాదిభిః కల్పయేత్ ॥

అవ. రెండు శ్లోకములచేత గ్రహమైత్రివర్గమునుపక్షించుచున్నాడు

తా॥ సూర్యునికి కుజగురుచంద్రులుమిత్రులు, శనిశుక్రులుశత్రువులు, బుధుఁడు సముఁడు, శత్రుశూన్యుండైన చంద్రునికిరవిబుధులు మిత్రులు, కుజగురుశుక్రశనులు సములు, కుజునికి రవిగురుచంద్రులు మిత్రులు, బుధుఁడు శత్రువు, శనిశుక్రులు సములు, బుధునికి రవి శుక్రులు మిత్రులు, చంద్రుఁడు శత్రువు, కుజశనిగురువులు సములు, గురువునకు కుజచంద్రసూర్యులు మిత్రులు, బుధశుక్రులుశత్రువులు శని సముఁడు శుక్రునకు శని బుధులు మిత్రులు, సూర్య చంద్రులు శత్రువులు, గుర్వంగారకులు సములు, శనైశ్చరునకు బుధ శుక్రులు మిత్రులు: కుజరవిసోములు శత్రువులు, గురుఁడు సముఁడు ఈచెప్పఁ బడిన శత్రుమిత్రత్వములు స్వభావసిద్ధంబు లిదియునుఁగాక యాకాలములయందు సంభవించు శత్రుమిత్రత్వములు చెప్పెయునిన, గ్రహమునకు ౨-౩-౪-౧౦-౧౧-౧౨ ఈ స్థానములయందున్న గ్రహములు తాత్కాలికమిత్రములు ౧-౫-౬-౭-౮-౯ ఈ స్థానములయందున్న గ్రహములు తాత్కాలికశత్రువులు నైసర్గికమిత్రగ్రహముతాత్కాలికమైయున్న నధిమిత్రమగును, నైసర్గికశత్రువు తాత్కాలికశత్రువైన నధిశత్రువగును. నైసర్గికశత్రువు తాత్కాలికమిత్రుండైన సముండగు: నైసర్గికమిత్రుఁడు తాత్కాలికశత్రువైన సముండగు, నైసర్గికసముఁడు తాత్కాలికశత్రువైన నతండును శత్రుండగునని నిర్ణయింపవలయు నీశత్రుమిత్రనిర్ణయమునకుఁ బ్రయోజనం బేమి యనిని వధూవరుల జన్మరాశ్యధిపతులకు మిత్రత్వము గలిగియున్న నేకాధిపత్యము గలిగియున్న శుభకరంబగును, సమత్వము గలిగియున్న సామాన్యఫలంబులుగలుగును. శత్రుత్వముగలిగియున్న దంపతులకు మృత్యుకరంబులగునన తా॥

యోనికూటము

శ్లో॥ భానాం యోనిరియంతు దస్రవరుణా వశ్వాయమాంత్యౌగజౌ॥
పుష్యాగ్నీ సదజా వహీ విధివిధూ శ్వానౌతు మూలేశ్వరౌ ;
మార్జాలౌ వురగాదితీ పితృభగౌ వాఖూ పశూచార్యమా ।
హిర్బుధ్న్యౌ మరుదర్క భేతు మహిషావింద్రాగ్ని చిత్రాఖ్యభే ॥
వ్యాఘ్రౌశక్రభమైత్రభేతు హరిణౌ తోయాచ్యుతౌ మర్కటౌ ।
సింహాఖ్యౌ వజపా దసూ ఫణిపూ విశ్వాభిజిద్భే క్రమాత్ ।
శ్వైణం బభ్రుసరీసృపం హరిగజం శాఖామృగాజం భవే ।
ద్దంపత్యోరపివైరమశ్వమహిషం గోవ్యాఘ్రమోతాఖుచ॥ ౧౧౭

టీక॥ దస్రవరుణౌ-అశ్వనిశతభిషములు, అశ్వౌ-గుఱ్ఱములు; యమాంత్యౌ-భరణిరేవతులు; గజౌ-యేనుఁగులు; పుష్యాగ్నీ-పుష్యకృత్తికలు, సదజౌ-మేకలు; విధివిధూ-రోహిణీమృగశీర్షలు; అహీ - సర్పములు; మూలేశ్వరౌ - మూలార్ద్రలు; శ్వానౌ-కుక్కలు; ఉరగాదితీ-ఆశ్రేషాపునర్వసులు; మార్జాలౌ-పిల్లులు; పితృభగౌ-మఖపుబ్బలు; అఖూ - యెలుకలు; అర్యమాహిర్బుధ్న్యౌ - ఉత్తరఉత్తరాభాద్రలు; పశూ-గోవులు; మరుదర్కభే-స్వాతిహస్తలు; మహిషా-గేదెలు; ఇంద్రాగ్నిచిత్రాఖ్యభే-విశాఖచిత్తలు; వ్యాఘ్రౌ-పులులు; శక్రభమైత్రభే-జ్యేష్ఠానురాధలు; హరిణౌ లేళ్లు; తోయాచ్యుతౌ - పూర్వాషాఢశ్రవణములు; కపీ - కోతులు; అజపాద్వసూ-పూర్వాభాద్రధనిష్ఠలు; సింహాఖ్యౌ - సింహములు; విశ్వాభిజిద్భే - ఉత్తరాషాఢాభిజిన్నక్షత్రములు ముంగిసలు; క్రమత్-క్రమముగాదెలియతగినది; శ్వైణం- కుక్కలేళ్లు; బభ్రుసరీసృప - ముంగిసపాములు; హరిగజం-సింహముయేనుఁగులు; శాఖామృగాజం-కోతిమేకలు; అశ్వమహిషం-గుఱ్ఱముదున్న; గోవ్యాఘ్రం-ఆవుపులులు; ఓత్వాఖు-పిల్లియెలుకలు; ఏతేషాం-వీట్లకు; వైరం-శత్రుత్వము; దంపత్యోరపి-దంపతులకు; వైరం-శత్రుత్వము; భవేత్-అగుట.

అవ. రెండుశ్లోకముచేత యోనికూటమును జెప్పుచున్నాఁడు.

తా॥ అశ్వినీశతభిషఙ్నక్షత్రములు గుఱ్ఱములు, భరణీరేవతులేనుఁగులు, పుష్యకృత్తికలజములు, రోహిణీమృగశీర్షములు సర్పములు, మూలార్ద్రలు కుక్కలు, ఆశ్రేషపున పిల్లులు, మఖపుబ్బ ఎలుకలు, ఉత్తర ఉభా గోవులు, స్వాతి హస్త లెనుబోఁతులు, విశాఖ చిత్త పులులు, జ్యేష్ఠ అనూరాధ మృగములు పూషాశ్రవణ,

కోతులు, పూర్వాభాద్ర సింహములు, ఉత్తరాషాఢ అభిజిత్ ముంగిసలు. ఈరీతి నక్షత్రములకు సంజ్ఞలనెఱుంగవలయు నిందుఁ బరస్పరవైరము గల జంతువు లెవ్వియనిన శునకహరిణంబులు, పాము ముంగిసలు, సింహగజములు, కపిచ్ఛాగంబులు, అశ్వమహిషంబులు, గోవ్యాఘ్రములు ఇవి చిరకాలము వైరముగలవై యుండుఁ గావున పరస్పర విరోధిజంతుసంజ్ఞగల నక్షత్రముల యందుఁబుట్టిన స్త్రీపురుషులకు దాంపత్యము ఘటించిన మిక్కిలి కలహాకరంబగునీ చెప్పఁబడిన క్రమంబున బరస్పరవిరోధములు లేకయుండెడి నక్షత్రములయందుఁబుట్టిన స్త్రీపురుషులకు దాంపత్యము యోగ్యంబగునని తా॥

శ్లో॥ యుగ్మాద్యంపురుషస్యభం చయువతేర్ధిష్ణ్యంతుయుగ్మాంత్యభం।
పుంధిష్ణ్యే ప్రభవ శ్శుభశ్చ పురుషః స్త్రీధిష్ణ్యజాస్త్రీశుభా ।
స్త్రీధిష్ణ్యే ప్రభవా వుభావపిశుభౌ పాణిగ్రహే ద్వేషదా ।
తే ద్వావాహపురుషర్క్ష జౌతుయదివాస్వవ్యత్యయర్క్షోద్భవౌ ॥

టీక॥ యుగ్మాద్యం—యుగ్మ - దస్రవరుణాశిత్యాదిశ్లోకమందు వివరించబడిన జంటనక్షత్రములలో, ఆద్యం—మొదటిదగు, భం - నక్షత్రము, పురుషస్య-పురుషునిది, యువతేః- స్త్రీయొక్క, ధిష్ణ్యం—నక్షత్రము, యుగ్మాంత్యభం - ఆజంటలలో చివరనుండు నక్షత్రము, యెట్లనిన-అశ్విని శతభిషములలో మొదటిదగు అశ్వినీ పురుషునిది రెండవదగు శతభిషము స్త్రీనక్షత్రము యిట్లంతట నూహించవలయునుదీనికి ఫలము చెప్పుచున్నాఁడు. పుంధిష్ణ్యే-పురుషనక్షత్రమందు, ప్రభవః-పుట్టిన, పురుషః - పురుషుడు, శుభః - శుభుఁడు, [అనగా యోగ్యుడనుట] స్త్రీధిష్ణ్యజా - స్త్రీనక్షత్రమందు పుట్టిన, స్త్రీ - స్త్రీ; శుభా - యోగ్యురాలు; ఉభావపి - స్త్రీపురుషులిరువురు; స్త్రీధిష్ణ్యే - స్త్రీనక్షత్రమందు; ప్రభవౌ - పుట్టినవారయినచో; శుభౌ—మంచివారలు; పాణిగ్రహే - వివాహమందు; తౌ - ఆ; ద్వౌ—స్త్రీపురుషులిరువురు; పురుషర్క్షజౌయది - పురుషనక్షత్రములయందు; పుట్టిననూ స్వవ్యత్యయర్క్షోద్భవౌ—స్వ-తమతమనక్షత్రములకు; వ్యత్యయర్క్షోద్భవౌ-విపరీతనక్షత్రములయందుపుట్టినవారైనను [అనగా పురుషనక్షత్రమందు స్త్రీయును స్త్రీనక్షత్రమందు పురుషుడు పుట్టినను] ద్వేషదౌ—కలహమునుచేయును.

తా॥ "భానాంయోనిరియంతు" యనుశ్లోకమునఁ జెప్పఁబడియున్న యశ్వనీ శతతారలు మొదలగు నక్షత్రములజంటలలో మొదటి నక్షత్రము పురుషనక్షత్రము రెండవది స్త్రీనక్షత్రమను సంజ్ఞలందు పురుషనక్షత్రమునఁ బుట్టినవరుండునుస్త్రీనక్షత్రమునఁ బుట్టినకన్నెయు వివాహవిషయమై శుభకరులగుదురు. స్త్రీనక్షత్రమునఁ బుట్టినదంపతులును శుభకరులగుదురు. ఉభయులు పురుషనక్షత్రమునఁబుట్టినవారై యున్నను కన్నియపురుషనక్షత్రంబున బుట్టినదై యుండి పురుషుఁడు స్త్రీనక్షత్రమునఁ బుట్టినవాఁడై యున్నను నిత్యకలహములు గలుగుచుండునని తా॥

## స్త్రీదీర్ఘకూటము

శ్లో॥ స్త్రీభాద్యం వరభాంత మేవగణయేత్ స్త్రీదూరమాద్యేయది
ద్వేషం మధ్యఫలం ద్వితీయనవకే దద్యాత్తృతీయే సుఖమ్ ।
స్త్రీధిష్ణ్యస్య యదా త్రయోదశ పరం పుంజన్మ ధిష్ణ్యంభవే ।
దేవం వాబహుపుత్రకృత్పరిణయే నో చేత్తయోర్వైరకృత్ ॥

టీక॥ స్త్రీభాద్యం — స్త్రీనక్షత్రము మొదలు; వరభాంతం - పురుషనక్షత్రము వరకు; గణయేత్—లెక్కించవలయును; ఆద్యే-మొదటినవకమందు; పురుషనక్షత్రమున్నచో; తదా - అప్పుడు; స్త్రీదూరం - స్త్రీదూరకూటము; దంపత్యోః -దంపతులకు; ద్వేషం-విరోధమును; దద్యాత్-యిచ్చును; ద్వితీయనవకే-రెండవనవకమందు మధ్యమఫలం-మధ్యమఫలము; దద్యాత్-యిచ్చును; తృతీయే-మూడవనవకమందు; సుఖం - సుఖముచేయును; యిదియొకపక్షము. మరియొకపక్షము చెప్పుచున్నాఁడు: స్త్రీధిష్ణ్య-స్త్రీనక్షత్రమునకు; పుంజన్మధిష్ణ్యం-పురుషజన్మనక్షత్రము; త్రయోదశ పరం-పదమూడునక్షత్రములకు పరమై; యదా-యెప్పుడు; భవేత్-అగునో; తదా-అప్పుడు; స్త్రీదూరకూటం - స్త్రీదూరకూటము; బహుపుత్రకృత్— అనేకపుత్రుల కలుగచేయునది; భవేత్—అగును; నోచేత్—పదమూడునక్షత్రములకులోగా పురుషనక్షత్రమున్నచో; పరిణయే-వివాహమందు; తయోః—ఆదంపతులకు; వైరకృత్-కలహములగఁజేయును.

అవ. స్త్రీదీర్ఘవర్గువును జెప్పుచున్నాఁడు.

తా॥ కన్యకనక్షత్రము మొదలు తొమ్మిదేసినక్షత్రముల వరుసన ౨౭ నక్షత్రములను మూఁడునవకములుగావింపఁగ వరనక్షత్రము మొదటినవకమున నున్నఁ గలహకరంబును రెండవనవకముననున్న మధ్యమఫలంబును ౩ - వ నవకమున నున్న సుఖకరంబునకు మఱియొక్క పక్షంబునఁగన్ని యనక్షత్రమునకు

౧౩ నక్షత్రములపైన వరనక్షత్రమున్న శుభకరంబు నంతకు లోపలనున్న నశుభకరంబు నగునని తా॥

## గణకూటము

శ్లో॥ మిత్రాశ్వ్యాద్యదితీందుపౌష్ణపవనశ్రీశార్క తారా స్సురా ।
మర్త్యాఖ్యానవచోత్తరాత్రియహర బ్రహ్మత్రిపూర్వాంతకాః।
ఇంద్రాగ్నీ వసుమూలపిత్ర్యవరుణ జ్యేష్ఠాగ్న్యహిత్వష్ట్రభా ।
న్యేతా న్యాసురసంజ్ఞి కానినవ తద్వక్ష్యేగణానాంఫలమ్ ॥

టీక॥ మిత్రాశ్వ్యాద్యదితిందు పౌష్ణపవనశ్రీశార్కతారాః అనూరాధ పుష్యాశ్వనీపునర్వసూమృగశీర్ష రేవతీస్వాతీశ్రవణహస్తలు, సురా-దేవగణములు, ఉత్తరాత్రియహర బ్రహ్మత్రిపూర్వాంతకాః - ఉత్తరాషాఢోత్తరా భాద్రార్ద్రా రోహిణీ పూర్వఫల్గునీపూర్వాషాఢాపూర్వాభాద్రాభరణలు, నవ – తొమ్మిదియు, మర్త్యాః– మనుష్యగణము, ఇంద్రాగ్నీవసుమూలపిత్ర్యవరుణజ్యేష్ఠాగ్న్యహిత్వష్ట్రభాని - విశాఖాధనిష్టమూలమఖా శతభిషజ్యేష్ఠాకృత్తికాశ్లేషా చిత్రానక్షత్రములు, ఆసురసంజ్ఞి కాని - రాక్షసగణముగలవి, తత్ - ఆహేతువచే, గణానాం – గణములయొక్క ఫలం-ఫలమును, వక్ష్యే-ముందుచెప్పగలను.

అవ. గణకూటమును వచింపుచున్నాడు.

తా॥ అశ్వి, పునః పుష్య, హ, స్వా, మృ, అనూ, శ్ర, రే ఈ ౯ నక్షత్రములు దేవగణములు ఉత్తర, ఉషా, ఉభా, ఆర్ద్ర, రో, పూఫ, పూషాః పూభా, భ, ఈ ౯ నక్షత్రములు మనుష్యగణములు. విశా, ధనిః మూ, మ, శత, జ్యేష్ఠ, కృ, ఆశ్లే, చి, ఈ ౯ నక్షత్రములు రాక్షసగణములు. ఇత్తెఱంగున నీనక్షత్రములకు గణసంజ్ఞ చేయుటకు ఫలము వక్ష్యమాణశ్లోకమందుఁ జెప్పఁబడునని తా॥

శ్లో॥ దంపత్యోః స్వగణ శ్శుభః పరిణయేమర్త్యామరాణాంగణో ।
మధ్య శ్చామరరక్షసామశుభకృ న్మర్త్యాసురాణాంమృతిః।
హిత్వా దైత్యగణేన మానుషగణం హిత్వామరాణాంగణం।
చావ్యంశోభనమామనంతిమునయః కేచిత్తుపాణిగ్రహే ॥

టీక॥ పరిణయే-వివాహమందు, దంపత్యో–దంపతులకు, స్వగణః-స్వకీయ గణము [అనఁగాయిరువురకు నొకగణముగలిగియుండిన] శుభః-మంచిది, మర్త్యామరాణాం–మనుష్యదేవతలయొక్క, గణః-గణము, [అనఁగా నొకనికిమనుష్య

గణమన్యునకు దేవతాగణము; మధ్యమః—మధ్యమము, అమరరక్షసాం-దేవతారాక్షసులయొక్క; గణః-గణము: [అనఁగా నొకనికి దేవతాగణము అన్యునకు రాక్షసగణమైనచో] అశుభకృత్ - మంచిదికాదు: మర్త్యాసురాణాం - మనుష్యరాక్షసుల - యొక్క; గణః-గణము: [అనగా నొకనిది మనుష్యగణము అన్యునిది రాక్షసుల యొక్క గణమునైనచో మృతిః - మరణముకలుగును; దైత్యగణేన్య - రాక్షసగణముతో; మానుషగణం- మనుష్యగణము హిత్వా - విడచి, అమరాణాం - దేవతల యొక్క: గణంచ-గణమునున్నూ, హిత్వా-విడచి: అన్యం—ఇతరగణము:శోభనఁ- మంచిదిగా, మునయః—మునులు, అమవంతి - చెప్పుచున్నారు.

శ్లో॥ స్త్రీరాక్షసం నకర్తవ్యం కర్తవ్యం నరరాక్షసం ।
స్త్రీరాక్షసం భవేన్మృత్యుః స్సద్యఏవ నసంశయః ॥

అవ॥ పూర్వశ్లోకమునఁ జెప్పబడిన గణములకు ఫలమును జెప్పుచున్నాఁడు

తా॥ దంపతులగణమొకటియైయున్న శుభకరంబగును: మనుష్యదేవగణములు మధ్యమంబులగును; కొందఱిపక్షంబున నివియుశుభకరంబులగును: దేవరాక్షసగణములశుభకరంబులగును: మనుష్యరాక్షసగణములు మృత్యుప్రదంబులగును వ్యాఖ్యానమున వ్రాయఁబడియున్న గ్రంథాంతర వచనమువలన పురుషునిది రాక్షసగణమై యున్నను యోగ్యంబగునని తా॥

మాహేంద్రకూటము

శ్లో॥ స్త్రీభాద్యం వరభాంతమేవగణయేన్మాహేంద్రవర్గాస్వమీ।
వేద స్సప్తమదిక్ త్రయోదశరసక్షోణీనిధక్షోణయః ।
దృజ్ఞేత్రే శరలోచనే పరిణయే న్యాస్తా సుపుత్రప్రదా ।
దంపత్యోరితరే సహాకలహాదావరేషు ముఖ్యాస్త్వయమ్ ॥

టీక॥ స్త్రీభాద్య - వధూనక్షత్రము మొదలు; వరభాంతమేవ - పెండ్లికొమరుని నక్షత్రమువరకే, గణయేత్ - లెక్కింపవలయును, ఏవకారము వధూనక్షత్రం మొదలు వరనక్షత్రమువరకే లెక్కింపనగునని నిర్ధారణచేయును ఇట్లు 'గణించగా వేదః-నాల్గవనక్షత్రము: సప్తమదిక్త్రయోదశరసక్షోణీనిధిక్షోణయః, సప్తమ- ఏడవది దిక్-పదివది, త్రయోదశ పదమూడవది, రస—ఆరు, క్షోణి-ఒకటి; కలసి వామాంకనిక్షేపముచే పదునారు, నిధి-తొమ్మిది; క్షోణయః-ఒకటి; కలసిపందొమ్మిది.

దృక్-రెండు, నేత్రే-రెండు కలసి యిరువదిరెండు; శర - ఐదు; లోచనే - రెండు కలసి యిరువదియైదు. అష్ట-ఆష్ట - యెనిమిదివర్గులు, మాహేంద్రివర్గాః - మహేంద్రివర్గములుః పరిణయే-వివాహమందు, సుపుత్రప్రదాః-పుత్రసంతానముకలుగఁజేయునవి ఇతరరే-యితరవర్గములు - ఎల్లప్పుడు, కలహప్రదాః — కలహము చేయునని-వర్గేషువర్గములన్నిటిలో, అయం-ఈమహేంద్రివర్గం, ముఖ్యః శ్రేష్ఠమైనది

అవ॥ మాహేంద్రివర్గమును చెప్పుచున్నాఁడు.

తా॥ వధూనక్షత్రము మొదలు ४-७-१०-१३-१६-१९-२२-२५ఈనక్షత్రములు మాహేంద్రవర్గం లనంబడుఁగాన నీనక్షత్రములలో నొకటివరనక్షత్రమై యున్న వివాహవిషయమై యుత్తమంబగుననీ మహేంద్రివర్గ శుభకరంబగునట్లు గాకున్నఁగలహకరంబగును.

గణితాగతాయుష్యవర్గు

శ్లో॥ స్త్రీభాదేర్వరధిష్ణ్యయుక్తగణనా సంగుణ్య తాం సప్తభి
స్సప్తావింశతిసంఖ్యయా పరిణయే భక్త్యైన పుంభాద్యది।
తద్వత్తాం గణనాంచ భాగకరణం చాయుష్యవర్గస్త్వయం
యచ్ఛేషేఽధికేపురో వమృణాంతస్యైవమత్యేతయోః॥

తా॥ కన్యజన్మనక్షత్రము మొదలు జన్మనక్షత్రమువరకు గణనచేసి యాసంఖ్యను ౭ టి చే గుణించి, ౨౭ చేత భాగింపఁగా శేషించినసంఖ్యనట్లుంచిమరల వరనక్షత్రము మొదలు కన్యానక్షత్రమువరకు గణనచేసి యాసంఖ్యనుఁబూర్వము వలెగుణించి భాగింపఁగా, శేషించినసంఖ్య ముందు శేషించియున్న సంఖ్యకంటె నధికముగనుండెనేని పురుషునికంటె ముందు వనితకాలము సేయును గొదువయై యుఁడెనేని పురుషుఁడు ముందు కాలము సేయును. సంఖ్యా ద్వయము సమంబుగా శేషించియుండెనేని యుభయులకు సమకాలమున మరణముసిద్ధించునని తా॥

ఆయువర్గనిర్ణయము

శ్లో॥ అమూస్స్వర్ధ్వజధూమసింహశునకా ఉక్షాఖరాఖ్యోగజః
కాకోష్ట్రావితి చైకమేకముదు తత్త్వాగాది దసాద్యపి।
శిష్టం భతిత్రయంభవేత్పరిణయే స్వస్యాయధిష్ణ్యాదితః
స్తత్త్వంచమభంతయోః కలహకృత్యాద్యదాయవర్గస్త్వయమ్

టీక॥ ధ్వజధూమసింహశునకాః-ధ్వజము ధూమము సింహము శునకము ఉక్ష యెద్దు; ఖరాఖ్య-గాడిదె, గజఃథియేనుగ; కాకః-కాకి, ఇతి - ఇట్లు, అష్టౌ - యెనిమిది, ఆయాః-ఆయములు: స్యుః-ఉన్నవి, దస్రాది- అశ్వినిమొదలు: ఏకమేకం - ఒక్కొక్క; ఉడు - నక్షత్రము: తత్ప్రాగాదితత్-అధ్వజాద్యాయములకు ప్రాగాది- తూర్పుమొదలుగలదై, త్రివారం-మూడుపర్యాయములు: గణయేత్- లెక్కించవలయును [యిరువదినాలుగౌను] శిష్టం-మిగిలిన: భత్రితయం - నక్షత్రత్రయము: స్వస్య-తనయొక్క: అయ-ఆయముయొక్క: ధిష్ణాదితఃనక్షత్రము మొదలు, భపేత్- అగును పరిణయే-వివాహమందు, తత్తత్పంచమభం-ఏఆయమందు పురుషనక్షత్రముండునో దాని నైదవఆయమందు స్త్రీనక్షత్రముండిన, తయోః- ఆదంపతులకు, కలహకృత్ విరోధముచేయును, ఆయం-ఇది ఆయవర్గః-ఆయవర్గము.

తా॥ తూర్పుమొదలు ౮ దిక్కులయందు క్రమంబున ధ్వజ, ధూమ: సింహ: శునక, వృషభ, ఖర, గజ: కాకాయము లగుచున్నవి. అట్టియాయములలో ధ్వజాయము మొదలు ౮ ఆయములయందును, అశ్విన్యాదికముగ ౨౭నక్షత్రములు ముమ్మారు గణనచేయఁగా శేషించిన మూడునక్షత్రములు ధ్వజాద్యాయత్రయమున గణనచేయవలయు నిట్లుగణనచేయఁగా వరునినక్షత్రమున్న ఆయమునకు ౫వఆయమున వరనక్షత్రమునకు ౫ వ దగు కన్నియనక్షత్రమున్నను గలహకరంబగును.

వశ్యవర్గ

శ్లో॥ కన్యాకుంభతులాధనుర్నరయుజాం త్యక్త్వామృగంకర్కటం
సింహంచైవ ఝషం వివాహసమయే వశ్యాశ్చ శేషాగ్రహాః
త్యక్త్వా వృశ్చికమేవ సర్వనిలయా సింహస్య వశ్యాస్తథా।
జ్ఞాత్వావ్యాప్రపితౌళికాశ్చభకరావశ్యాఖ్యయోగా స్వమీ॥౧౦౫॥

టీక॥ కన్యాకుంభతులాధనుర్నరయుజాం-కన్యా-కన్యకు: కుంభ - కుంభమునకు తులా-తులకు: ధనునరయుజాం - నరభాగమగు పూర్వార్ధధనుస్సుకు: [పూర్వార్ధమశ్వమని ప్రసిద్ధికలదు] మృగం-మకరమును: కర్కటం -కర్కాటకమును, సింహం-సింహమును: ఝషం-మీనమును, [క్రమముగా] త్యక్త్వా-వదలి, వివాహ సమయే-వివాహకాలమందు, శేషాః-మిగిలిన, గృహాః-యిండ్లు;వశ్యాః-వశ్యములను పేరుగలవి. సింహస్య-సింహమునకు: వృశ్చికమేవ వృశ్చికరాశినే త్యక్త్వా - విడచి సర్వనిలయాః-మిగిలిన రాసులన్నియు తథా - అట్లు, వశ్యాః - వశ్యములని జ్ఞాత

వ్యాః—తెలియతగినవి: అమీ—ఈ వశ్యాఖ్యయోగాః-వశ్యయోగములు తౌశికాఅపి — తౌశికాయోగములు: శుభకరాః-మంచినిచేయునవి.

అవ. వశ్యవర్గువును జెప్పుచున్నాఁడు

తా॥ వివాహకాలమునందుఁగన్యారాశికి:మకరరాశినికుంభరాశికి కర్కాటరాశిని తులారాశికి సింహరాశిని: ధనురుత్తరార్ధమునకు మీనరాశిని సింహమునకు వృశ్చిక రాశినింబరిత్యజించి తక్కిన సకలరాసులు సకలరాసులకును వశ్యంబులనంబడుఁగాన నీవశ్యయోగంబులును దైవజ్ఞవిలాసమునుగ్రంథమున విశదంబుగ జెప్పబడియున్న తౌశికాయోగంబులును వివాహవిషయమైశుభకరంబు లగునని తా॥

దినవర్గము

శ్లో॥ పర్యాయత్రితయే నవోడుషు వధూధిష్ణ్యాదిత స్తత్ఫలం ।
మృత్యుప్రీతివిపత్సుఖా ర్తిపశుకృద్రోగప్రజామిత్రకృత్ ।
పుంభాంతం గణయేత్తయోః పరిణయేవర్గోదీనాఖ్య స్త్వయం
పుంభాదీతి జగుఃపతే త్వధఫలం పూర్వోక్తమత్రాపిచ ॥

టీక॥ వధూధిష్ణ్యాదితః-పెండ్లికుమార్తె నక్షత్రము మొదలు-పుంభాంతం- వర నక్షత్రమువరకు గణయేత్ - లెక్కింపవలయును: పర్యాయత్రితయే- మూడుమార్లు నవోడుషు-తొమ్మిదితొమ్మిదినక్షత్రములయందు [క్రమముగా]తత్ఫలం-ఆలెక్కకు వచ్చుఫలము, వివాహసమయే - వివాహకాలమందు, తయోః—దంపతులకు,మృత్యు ప్రీతివిపత్సుఖా ర్తిపశుకృత్ మృత్యు - మరణము: ప్రీతి - ప్రేమను విపత్— ఆప త్తును, సుఖ-సుఖమును, ఆర్తి-పీడను: పశు— పశువులను, కృత్ — కలఁగచేయును రోగప్రజామిత్రకృత్ - రోగ-రోగమునుప్రజా-సంతానమును, అమిత్ర-శత్రుత్వ మును కృత్-చేయును, అయం- ఇది, దినాఖ్యః-దినమును వర్గః-వర్గము;పరేతు-కొం దరైతే పుంభాది- పురుషనక్షత్రము మొదలు స్త్రీనక్షత్రమువరకు గణనఅనియు:అథ పిమ్మట ఫలం-ఫలము అత్రాపి-ఈపక్షమందుపూర్వోక్తం-పూర్వముచెప్పినదే;ఇతి- అనియు జగుః-చెప్పిరి.

అవ॥ దినకూటమును జెప్పుచున్నాడు

తా॥ వధూనక్షత్రము మొదలు వరనక్షత్రమువరకులెక్కించగావరనక్షత్రము మొదటిదైయున్న మృత్యువు: ౨దై ప్రీతియు౩ వ దైన నాపత్తు:౪ వదైనసుఖము ౫ వ దైన మనోవ్యథ. ౬ వదైన పశులాభము: ౭ వ దైనరోగము ౮ వ దైన

సంతానము, ఆ వద్దైన శత్రుత్వమును చేయును. తిరుగ నాకీతిగానే తొమ్మిదినక్షత్ర ముల కొక్కసారి ఫలములు తిరుగుచుండును వరనక్షత్రము మొదలు లెక్కచేసి ఫలము చెప్పవలయునని మఱికొందఱు చెప్పిరని తా॥

జాతివర్గము

శ్లో॥ విప్రా మీనకుళీరవృశ్చికగృహా స్సింహాజచాపా నృపా।
వైశ్యా గోమృగకన్యకాఘటతులాయుగ్మాలయాశ్శూద్రజాః ।
దంపత్యో శ్శుభ దైకజాతిరశుభా శ్రేష్ఠాతు జాతి స్త్రియా ।
హీనాచే దథ మధ్యమాపరిణయే పుంజాతరాశేస్తయోః ౧౨౮

టీక॥ మీనకుళీరవృశ్చికగృహాః- మీన-మీనము, కుళీర-కర్కాటకము, వృశ్చిక-వృశ్చికమును, గృహాః-రాసులు, విప్రాః-విప్రజాతులు, సింహాజచాపాః-సింహ సింహము: అజ-మేషము, చాపాః-ధనస్సు, నృపాః - క్షత్రియజాతులు, గోమృగ కన్యకాః - గోవృషభము, మృగ- మకరము, కన్యకాః-కన్యయు, వైశ్యాః-కోమట జాతులు ఘటతులాయుగ్మాలయాః- ఘట - కుంభము, తులా - తులయు, యుగ్మ- మిధునమునను, ఆలయాః-రాసులు, శూద్రజాః-శూద్రజాతులు, దంపత్యోః-దంప తులకు, ఏకజాతిశ్చేత్ - ఒకజాతియైనచో, శుభదా - మంచినిచేయును, పుంజాతి రాశేః - పురుషజాతికన్న, స్త్రియాః - స్త్రీయొక్క, జాతిః - జాతి, శ్రేష్ఠాచేత్- ఏక్కువైనచో, అశుభా-మంచిదికాదు, హీనాచేత్-తక్కువైనచో, అథ-పిమ్మట మధ్యమా - మధ్యమమున్ను, తయోః - ఆదంపతులకు, పరిణయే-వివాహమందు, భవతి-అగుచున్నది-

అవ: రెండు శ్లోకములచే జాతివర్గను జెప్పుచున్నాడు.

తా॥ మీన కర్కాటక వృశ్చికరాసులు బ్రాహ్మణవర్ణములు సింహ మేష ధను వులు క్షత్రియవర్ణములు వృషభమకరకన్యలు వైశ్యవర్ణములు, కుంభ తులామిధున ములు శూద్రవర్ణములు. ఇందుకు ఫలంబేమియనిన దంపతులరాసు లొకవర్ణముగల వైయున్న శుభకరంబులగును, వధూరాశివరరాశికంటె సుత్తమవర్ణముగలదైయున్నా నశుభకరంబగును. హీనవర్ణముగలదైన మధ్యమఫలదంబగువని తా॥

శ్లో॥ విప్రక్షత్రవిశ శ్చతుర్థకులజా యే పంచమా స్సంకరా ।
షష్ఠా ష్షడ్విధవర్ణజా భువిజన విప్రాది దసాదితః ।
శిష్టం భత్రితయాత్వజాంఘ్రిభముఖం త్రైవర్ణికానాంభవే।
దృక్షాణామపి రాశిజాతిఫలవ ద్వరాఖ్యవర్గ స్త్వయమ్ ॥

టీక॥ విప్రక్షత్రవిశః—బ్రాహ్మణక్షత్రియవైశ్యులు, చతుర్థకులజాశ్చ-శూద్ర జాతివారున్ను, పంచమాశ్చ-పంచములున్ను, సంకరాః-సంకరులగు, షష్ఠాశ్చ—షష్ఠములు, యే- యె జనాఃజనులు, తే – ఆ, షడ్విధవర్ణజాః - ఆరువర్ణములు, భువి-భూమియందు, [ప్రసిద్ధములు] దస్రాదితః- అశ్వనిమొదలాటుచొప్పున,విప్రాది—బ్రాహ్మణాదిగా నాలుగువర్ణములకు నక్షత్రములగుచున్నవి, అజాంఘ్రిభముఖం-పూర్వాభాద్రమొదలుగాగల, శిష్టం-మిగిలిన, భత్రితయం- నక్షత్రత్రయము, త్రైవర్ణికానాం-బ్రహ్మక్షత్రియవైశ్యులకు (క్రమముగా) భవేత్-అగును,ఋక్షాణామపి - నక్షత్రములకున్ను, రాశిజాతిఫలవత్-రాశిజాతులవలెనే ఫలము కలుగును, అయం ఇది, వర్ణాఖ్యవర్గః-వర్ణవర్గమనఁబడును.

అవ. నక్షత్రజాతివర్గువును జెప్పుచున్నాఁడు.

తా॥ పుడమియందు బ్రాహ్మణ క్షత్రియవైశ్యశూద్ర పంచమసంకరంబులను నారువర్ణములుగలవు. ఆయారువర్ణములలో బ్రాహ్మణాదివర్ణములమీద గ్రమంబున నశ్వన్యాదినక్షత్రముల నలుమారులెన్నగా శేషించిన మూడునక్షత్రముల బ్రాహ్మణాదివర్ణత్రయమందు నెన్నవలయు. నిట్లుగణింపగా దంపతులనక్షత్రము లొకవర్ణముగలదై యున్న శుభకరంబులగును. వధూనక్షత్రము వరనక్షత్రముఁనకంటె నుత్తమవర్ణముగలదై యున్న నశుభకరంబగును. హీనవర్ణముగలదై యున్న మధ్యమంబగును.

## వేధావర్గము

శ్లో॥ దస్రాదీని శివాదిభాని పితృభాదీని క్రమాద్గణయేద్వ్యుత్క్రమాత్ ।
జ్యేష్ఠాది శ్రవణాది రేవతిముఖం చత్వారి చత్వారి చ ।
దంపత్యోర్యశ్చ గణద్వయే జననభే త్వేకైకభం వైరకృ ।
చ్చిత్రాచంద్రవసూడునాం పరిణయే వేధాఖ్యవర్గస్త్వయమ్॥

టీక॥ దస్రాదీని - అశ్వనిమొదలు, చత్వారి-నాలుగునక్షత్రములను, శివాదిభాని—ఆర్ద్రానక్షత్రముమొదలు నాలుగు, పితృభాదీని - మఖనక్షత్రము మొదలు నాలుగు, క్రమాత్-క్రమముగాను, గణయేత్ - లెక్కించవలయును, వ్యుత్క్రమాత్-తల్లక్రిందులుగ, జ్యేష్ఠాది-జ్యేష్ఠమొదలు; చత్వారి-నాలుగు, శ్రవణాది-శ్రవణము మొదలు [నాలుగు] రేవతిముఖం-రేవతిమొదలు, [నాలుగు] వైరకృత్- ఆదస్రాదికమునకు విరోధముచేయునది, దంపత్యోః-దంపతులకు, జననభే—జన్మనక్షత్రము గణద్వయే—రెండుకణములయందున్నదగుచుండగా,ఏకైకభం-ఒక్కొక్కనక్షత్రము వైరకృత్-విరోధముచేయును, చిత్రాచంద్రవసూడునాం- చిత్తామృగశిర ధనిష్ఠలకు,

పరస్పరం-అన్యోన్యము; వైరకృత్-విరోధము, అయం - ఇది, పరిణయే వివాహమందు, వేధాఖ్యవర్గమనఁబడును.

అవ. వేధావర్గమును జెప్పుచున్నాఁడు

తా॥ అశ్వినీజ్యేష్ఠలకు, భరణ్యనూరాధలకు, కృత్తికావిశాఖలకు రోహిణీస్వాతులకు, ఆర్ద్రాశ్రవణములకు, పునర్వసూత్తరాషాఢలకు, పుష్యపూర్వాషాఢలకు ఆశ్లేషామూలలకు, మఘారేవతులకు, పూర్వఫల్గున్యుత్తరాభాద్రలకు, ఉత్తరఫల్గునీపూర్వాభాద్రలకు, హస్తశతతారలకునుపరస్పర వేధకల్గియుండునుగాన నీనక్షత్రముల జంటలలో నొకజంట దంపతులజన్మ నక్షత్రద్వయమై యుండెనేని దంపతులకుఁ గలహకరంబగును ద్విపాన్ననక్షత్రములను చిత్రామృగశీర్ష ధనిష్ఠలును పరస్పర వైరముగలవై యుండునని తా॥

## పక్షివర్గము

శ్లో॥ తార్క్ష్యః పింగళకాకకుక్కుటఖగా బర్హీ చ పంచక్రమాత్ ।
తేషాం బాణరసర్తుమార్గణశరా దస్రాది తార్క్ష్యాద్యపి ।
దంపత్యోరపి జన్మభే పరిణయే యద్యేకపక్షిస్థితే ।
ప్రీతిస్స్యాత్కలహః ఖగద్వయగతే చేత్పక్షివర్గస్త్వయమ్ ॥ ౧౩౦

టీక॥ తార్క్ష్యః-గరుత్మంతుడు; పింగళః-పక్షివిశేషము; కాకః- వాయసము కుక్కుటః-కోడి; బర్హీ - నెమలి; క్రమాత్ - క్రమముగా; పంచ - ఐదుపక్షులు; తేషాం_ఆ ఐదుపక్షులకు; దస్రాది- దస్రాది అశ్విన్యాదిగను తార్క్ష్యాద్యపి-గరుత్మంతుఁడాదిగాను; బాణ—ఐదు; రస - ఆఱు; ఋతు - ఆఱు; మార్గణ- ఐదు; శరాః-ఐదు ఈపంచకములకు గరుత్మంతుడాదిగా నధిపతులు; దంపత్యోః - దంపతులయొక్క; జన్మభే-జన్మనక్షత్రములు; పరిణయే - వివాహమందు; ఏకపక్షిస్థితేయది - ఒకపక్షియందుండినచో: ప్రీతిః - ప్రేమ: స్యాత్- కలుగును: ఖగద్వయగతేచేత్-రెండు పక్షులయందుండినచో; కలహః-పోట్లాట: అయం-ఇది; పక్షివర్గః-పక్షివర్గము.

అవ. పక్షివర్గమును జెప్పుచున్నాఁడు.

తా॥ అశ్వనిమొదలు ౫ నక్షత్రములకు గరుడపక్షియు ఆర్ద్రమొదలు ౬ నక్షత్రములకు పింగళమనుపక్షి, ఉత్తరమొదలు ౬ నక్షత్రముల కాకము: జ్యేష్ఠాదిపంచకమునకు క్రోడయు: ధనిష్ఠమొదలు ౫ నక్షత్రములకు నెమలియు నధిపతుల గుటవలన, నీయాధిపత్యములో వివాహవిషయమై వధూవరుల జన్మనక్షత్రముల

బొకపక్షి యధిపతియైయున్న దంపతుల కొకరియందొకరికిఁ బ్రీతిగలిగియుండును. రెండు పక్షులైన కలహము. ఇదిపక్షివర్గమని తా॥

## రజ్జువర్గము

శ్లో॥ లింగాని త్రితయాని తాని విలిఖ్య రేఖా శ్చతస్రో గతా ।
స్తిర్యక్తత్రహి లింగరజ్జురితి తద్వాయవ్యకోణాదితః ।
దస్రాదిక్రమశః ప్రదక్షిణవిధా తిర్యగ్విరేఖాం గతే ।
దంపత్యోర్యది జన్మభే పరిణయే స్యాతాంసువైరప్రదే ॥

టీక॥ తాని-ప్రసిద్ధమైన, త్రితయాని—మూడగు, లింగాని-లింగాకారములను విలిఖేత్—వ్రాయవలయును, తత్ర-ఆలింగాకారములయందు, తిర్యగ్గతాః-అడ్డముగానుఁడు, చత్రసః-నాలుగు, రేఖాః-రేఖలను, విలిఖేత్ - వ్రాయవలయును, తద్వాయువ్యకోణాదితః-దానివాయవ్యదిక్కు-మొదలు, ప్రదక్షిణవిధౌ - ప్రదక్షిణముగా, దస్రాదిక్రమశః-అశ్వినిమొదలుక్రమముగా, విలిఖేత్-వ్రాయవలయును: దంపత్యో-దంపతులయొక్క, జన్మభే—జన్మనక్షత్రములు, పరిణయే-వివాహమందు, తిర్యగ్విరేఖాంగతే- అడ్డమగునొకరేఖలను పొందినచో, వైరప్రదే - కలహముచేయునవి, స్యాతాం-అగుచున్నవి, అయమేవ-ఇదే, లింగరజ్జుః-లింగరజ్జువనఁబడును.

అవ. రజ్జువర్గమును జెప్పుచున్నాఁడు.

తా॥ నిడుపుగ మూఁడు లింగాకారరేఖలువ్రాసి యారేఖల మీఁద నాలుగడ్డ దిట్లుగీచి యందు వాయవ్యకోణము మొదలు ప్రదక్షిణక్రమముగ నశ్వినిమొదలు ౨౭ నక్షత్రములు నుంచఁగా నవుడు వధూవరుల జన్మనక్షత్రము లాయడ్డగీట్లలో నొక రేఖయందున్నపుడు దంపతులకు గలహప్రదము లగునని తా॥

## యోగినీవర్గము

శ్లో॥ బ్రహ్మాణీచ కుమారశక్తి రథ సా వారాహశక్తిః క్రమా।
త్సిద్ధాసాప్యథ వైష్ణవీ తదను సా మాహేంద్రశక్తిస్తతః ।
చాముండిచ మహేశ్వరీతదను సాశ్రీ శ్చాష్టదిక్షుక్రమా ।
త్సృష్టిస్థితినాశనేచ గదితాః స్యుర్హేతుభూతా ఇతి ॥

టీక॥ బ్రహ్మణీ-బ్రహ్మణీశక్తియు, అథ-పిమ్మట: కుమారశక్తిః-కుమారశక్తియు: సా-ప్రసిద్ధమైన: వరాహశక్తిః-వరాహశక్తియు: అథ-పిదప: సా-ప్రసిద్ధమైన: సిద్ధా—సిద్ధాశక్తియు: వైష్ణవీ-విష్ణుశక్తియు: తదను-తర్వాత: సా-ప్రసిద్ధమైన: మాహేంద్రశక్తిః-మహేంద్రశక్తియు: తతః-పిమ్మట: చాముండీ-చాముండి

శక్తియు: తదను-అనంతరము, సా— ప్రసిద్ధమైన: శ్రీః లక్ష్మియు, మహేశ్వరీ - మహేశ్వరశక్తియు, అష్టదిక్ఛక్తయః - యెనిమిదిదిక్కులనుండు శక్తులు; ఉత్పత్తి స్థితినాశనే—ఉత్పత్తి—జన్మమందు: స్థితి—పరిపాలనయందు, నాశనే—సంహారమందు హేతుభూతాః—కారణములైనవి: ఇతిః-అని, గదితాః-చెప్పఁబడినవి,

అవ, యోగినీవర్గము జెప్పుచున్నాఁడు

తా॥ బ్రహ్మణి; కౌమారి, వారాహి, సిద్ధ, వైష్ణవి: మాహేంద్రి, చాముండి శ్రీమాహేశ్వరి అనునివి క్రమంబునఁ బ్రాగాద్యష్టదిక్ఛక్తులనంబడుటయు గాక యుత్పత్తిస్థితినాశములకుఁ గారణభూతంబులునగునని తా॥

అష్టశక్తుల ప్రయోజనము

శ్లో॥ బ్రాహ్మ్యద్యష్టసు యోగినీష్వపి భవే దైకైకభం దస్రత!
శ్శిష్టం భత్రితయం సజాతిరివతత్ప్రాగాదిసంస్థాస్వపి ।
దంపత్యోరపి జన్మభే పరిణయే యద్యేక వర్గంగతే ।
ప్రీతిఃస్యాత్కలహోన్యదంతదుభయోస్స్యాచ్ఛక్తివర్గ స్త్వయం

టీ॥ బ్రాహ్మ్యద్యష్టసు—బ్రాహ్మిమొదలుయెనిమిదైన: యోగినీషు — యోగినులయందు: అథ-పిమ్మట: దస్రత: అశ్వనిమొదలు:ఏకైకభయం—ఒక్కొక్కనక్షత్రము: భవేత్-అగును శిష్టం—మిగిలిన: భత్రితయం- నక్షత్రత్రయము:సజాతిరివ సమానజాతివలె ప్రాగాదిసంస్థాసి తూర్పుమొదలుంచతగినవి; దంపత్యోరపి- దంపతులయొక్క: జన్మభే-జన్మనక్షత్రములు: పరిణయే-వివాహమంధు, ఏకవర్గం- ఒకవర్గును; గతేయది—పొందినచో: తదుభయోః-ఆదంపతులకిద్దరకు: ప్రీతిః-ప్రేమ: స్యాత్-అగును, అన్యథా- విపరీతమైనచో: కలహః - విరోధము: స్యాత్ - అగును. అయం—ఇది: శక్తివర్గఃశక్తివర్గమనఁబడును

అవ॥ పూర్వశ్లోకమందుఁ జెప్పబడిన యష్టశక్తులకుఁ బ్రయోజనమును జెప్పుచున్నాడు

తా॥ తూర్పుదిక్కుమొద లష్టదిక్కులకు నశ్వినిమొద లొక్కొక్కదిక్కున కొక్కొకనక్షత్రమువరుసన క్రమముగ ౨౭ నక్షత్రములు సంపూర్ణమగువరకును విభజింపగా వధూవరుల జన్మనక్షత్రము లొకశక్తిసంబంధులైయున్న పరస్పరప్రీకరంబగు నటుగాకున్న గలహకరమగునని తా॥

(లింగవర్గము స్త్రీపుంనపుంసక తారలు)

శ్లో॥ విశ్వాశ్లేష చతుష్టయోదకసుస్వాత్యంత్యశక్రాంతక ।
త్వష్ట్రాదిత్రితయాభిధాః పరిణయే స్త్రీలింగతారాస్త్విమాః ।

తారాస్యుశ్చ నపుంసకా శ్శతభిషఙ్మూలేందవ శ్చాపరాః।
పుంతారా స్స్వశుభాన్యలింగజనితాప్రీతిః స్వలింగర్క్షజా॥ ౧౩౪

టీక॥ విశ్వ—ఉత్తరాషాఢా, ఆశ్లేషాచతుష్టయం—ఆశ్లేషా, మఘా, పుబ్బ, ఉత్తరానక్షత్రములు, ఉదక-పూర్వాషాఢా; వసు-ధనిష్ఠా; స్థాణు-ఆర్ద్రా, అంత్య — రేవతీ; శక్రః-జ్యేష్ఠా.అంతక భరణీ.త్వష్టాదిత్రయం-చిత్రా-స్వాతీ,విశాఖా.ఇమాః— ఈపదునాల్గుతారలు; స్త్రీలింగతారాః- స్త్రీలింగనక్షత్రములు, శతభిషఙ్మూలేందవః - శతభిషక్-శతభిషము; మూల-మూల; ఇందవః-మృగశీర్ష, నపుంసకాః-నపుంసకములను,తారాః-నక్షత్రములు; స్యుః - అగుచున్నవి అపరాః — మిగిలినవి, (అనగా నశ్విని; కృత్తికా; రోహిణీ, పునర్వసూ;పుష్య,హస్త,అనూరాధా,శ్రవణ—పూర్వాభాద్రా. ఉత్తరాభాద్రా ఈపదియు] పుంతారాః-పుంలింగనక్షత్రములు, స్యుఃఅగుదు- అన్యలింగజనితా-ఇతరలింగమందుండుతార; అశుభా—మంచిదికాదు; స్వలింగర్క్షజా- స్వంతలింగనక్షత్రమందున్నది. ప్రీతిః-ప్రేమనుచేయునది.

అవ॥ లింగవర్గము జెప్పుచున్నాడు

తా॥ ఉషా ఆశ్రే, మః పుబ్బః ఉత్తరః పూషాః ధః ఆర్ద్రః రేః జ్యేః భః చి, స్వా- విశా ఈ ౧౪ నక్షత్రములు స్త్రీలింగములు శ, మూ, మృ, ఈ ౩ నక్షత్రములు నపుంసకలింగములు తక్కిన అశ్వి, కృః రో, పునః పుష్యః హస్త అనూః శ్రవః పూభాః ఉభా, ఈ ౧౦ నక్షత్రములు పుంలింగములు,ఈలింగనిర్ణయమునకు ఫలమేమనిన దంపతులజన్మనక్షత్రము ఏకలింగముగలపైయున్న పరస్పరప్రీతికరంబగు నటుగాకున్న కలహకరంబగునని తా॥

భూతవర్గము

శ్లో॥ భూవార్యగ్నిమరున్నభాంసిచ మహాభూతానిపంచక్రమా
త్తేషాం బాణరసర్తుమార్గణశరాదస్రాది భూమ్యాద్యపి।
ఏక స్యోడు జలే భవే దపరభం వహ్నా భవేచ్చేత్తయో
ర్మైత్ర్యే స్స్యాదపరేశుభాఃపరిణయే భూతాఖ్యవర్గ స్త్వయమ్॥

టీక॥ భూ-పృథివీ; వారి-జలము; అగ్ని-నిప్పు; మరుత్— గాలి;నభాంసి — ఆకాశము, ఏతాని—ఇవి, క్రమాత్- క్రమముగా; పంచ - ఐదగు, మహాభూతాని - మహాభూతములు; భూమ్యాది—భూమిమొదలుగామన్నూ; దస్రాది — అశ్వనిమొదలు గానూ; తేషాం-ఆపంచమహాభూతములకు; క్రమాత్—క్రమముగా; బాణరసర్తుమార్గణశరాః-బాణ ఐదు; రస-ఆరు, ఋతు - ఆరు, మార్గణ—ఐదు శరాః - ఐదు

ఏకస్య—దంపతులలో నొకనియొక్క, ఉడు - నక్షత్రము, ఇలే - జలభూతమందు భవేచ్చేత్—ఉన్నట్లులైన, అపరభం—యెవరిదొకరినక్షత్రము, వహ్నౌ - అగ్నిభూ; మందు: భవేచేత్—ఉన్నటులైన, తయోః- ఆదంపతులకు: మృత్యుః - మరణముత స్యాత్-కలుగును, అవరే-మిగిలినభూతములయందుండు నక్షత్రము: పరిణయే - వివాహమందు, శుభాః మంచిని చేయునవి. అయం- ఇది,భూతాఖ్యవర్గః-భూతమను నామముగలవర్గము,

అవ॥ భూతవర్గువును జెప్పుచున్నాఁడు

తా॥ ప్రసిద్ధంబులగు పృధివ్యప్తేజో వాయ్వాకాశములనెడు పంచభూతములకు నశ్వినిమొదలు ౨౭ నక్షత్రములలోఁ గ్రమంబునపృధివికి ౫ నక్షత్రములు జలమునకు ౬ నక్షత్రములు; తేజస్సునకు౬ నక్షత్రములు: వాయువునకు ౫ నక్షత్రములు ఆకాశమునకు ౫ నక్షత్రములు నీరీతిన విభజింపఁగా దంపతులజన్మనక్షత్రములలో నొకనక్షత్రము తేజోనక్షత్రముగనుండి మఱియొక నక్షత్రము జలభూతనక్షత్రముగనుండేనేని మృత్యుప్రదంబగు నట్లుగాకున్న శుభకరంబగునని తా॥

ఒక్కొక్క భూతమునకు నక్షత్రవివరము

పృథివి —౫ అశ్వి, భరణి, కృత్తిక, రోహిణి, మృగశీర్ష
జలం —౬ ఆర్ద్రా, పున, పుష్య, ఆశ్లేష, మఖ, పూఫ
తేజ —౬ ఉఫ, హస్త, చిత్ర, స్వాతి, విశా అనూ
వాయు —౫ జ్యేష్ఠ, మూల, పూషా, ఉషా, శ్రవణం
ఆకాశం—౫ ధనిష్ఠ, శతభిషం, పూభా, ఉభా, రేవతి

చంద్రయోగవర్గము

శ్లో॥ ఇంద్రాగ్నీ యమ అసురశ్చ వరుణో వాయుః కుబేరశ్శివః।
ప్రాగాదిప్రభవో దినాదితిథయో హ్యేకైకశష్షోడశ ।
నాసత్యాదిక మేకమేక మునుం తచ్ఛిష్టత్రయం పూర్వవ ।
న్మూర్ద్వాదష్టఖగాశ్చ కేతురహితాః ప్రాగాదిషుస్థాపితాః॥

టీక॥ ఇంద్రాగ్నీ-ఇంద్ర- ఇంద్రుఁడు; అగ్నీ-అగ్నిహోత్రుఁడు, యమః యముఁడు: అసురః—నిఋతియు, వరుణః - వరుణదేవుఁడు; వాయుః - వాయువు కుబేరః-కుబేరుఁడు, శివః-రుద్రుఁడు: ఏతే-వీరలు, ప్రాగాదిప్రభవః - తూర్పుమొద లధిపతులు దినాదితిథయోపి - దినాది పాడ్యమిమొదలు తిథయః - తిధులున్నూ

షోడశ-పదునారు;ఏకైకశః - ఒక్కొక్కటిచొప్పునయష్టదిక్కులకుద్విరావృత్తిచేత సరిపుచ్చవలయును; నాసత్యాదికం-అశ్విని మొదలుగాగల; ఏకంఏకం - ఒక్కొక్క ఉడు-నక్షత్రమున్నూ; తచ్ఛిష్టత్రియం-త్రిరావృత్తిచే పంచగా మిగిలినమూడునక్షత్రములనున్నూ; పూర్వవత్—జాత్యాదులకు పంచినట్లుగా; స్థాప్యాః ఉంచవలయును కేతురహితాః-కేతుగ్రహమునువదలి, సూర్యాద్యష్టఖగాశ్చ - సూర్యుడుమొదలుఏనిమిదిగ్రహములు:ప్రాగాదిషు-తూర్పుమొదలష్టదిక్కులయందు,స్థాపితాః-ఉంచబడినవి

శ్లో॥ దంపత్యో రపి జన్మధిష్ణ్యవశతో జ్ఞాత్వా చ తాం తాంశం
తత్రిస్థోడుపతిగ్రహేంద్రతిథిదిజ్నాథారిసామ్యేష్టతామ్ ।
తేషాం మైత్రవశాచ్చ మైత్రముభయోస్సామ్యేసమత్వం తథా
శత్రుత్వే యదిశత్రుతైవశశభృద్యోగాఖ్య వర్గ స్త్వయమ్ ॥

టీ॥ దంపత్యోః-దంపతులకు, జన్మధిష్ణ్యవశతః జన్మనక్షత్రమువల్ల; తాం-పురుషనక్షత్రముకలిగినట్టిన్ని; తాం - స్త్రీనక్షత్రముకలిగిట్టిన్ని; దిశం - దిక్కును; జ్ఞాత్వా-తెలుసుకొని; తత్రిస్థోడుపతిగ్రహేంద్రతిథిదిఙ్నాథారిసామ్యేష్టతాం - తత్రిస్థ-ఆదిక్కునయున్న-ఉడుపతి—నక్షత్రాధిపతియొక్క,గ్రహేంద్రస్య-గ్రహశ్రేష్ఠముయొక్క; తిథిదిఙ్నాథ- తిథ్యధిపతిగదివులయొక్క; అరిసామ్యేష్టతాం — శత్రుత్వసమత్వమిత్రత్వమును, జ్ఞాత్వా-తెలుసుకొని, తేషాం - ఆనక్షత్రాధిపగ్రహతిథ్యధిపతిగధిపులకు, మైత్రవశాత్ — స్నేహమువల్ల ఉభయోః-దంపతులకు; మైత్రం - స్నేహమున్నూ; సామ్యే-సమత్వమందు, సమత్వం-సమత్వమున్నూ; తథా-అట్లు, శత్రుత్వంయతి-శత్రుత్వమైనచో, శత్రుతా-శత్రుత్వము,స్యాత్-కలుగును,అయం ఇది; శశభృద్యోగాఖ్యవర్గః-చంద్రయోగవర్గము

అవ॥ రెండుశ్లోకములచేతఁ జంద్రయోగవర్గువును జెప్పుచున్నాఁడు.

తా॥ ఇంద్రాద్యధిపతులుగల ప్రాగాద్యష్టదిక్కులయందును బ్రతిపత్తుమొదలు ౧౬ తిథుల నొక్కొకటిగ రెండుమార్లు నశ్విన్యాది నక్షత్రముల నొక్కొకటిగ ౨౭ నక్షత్రముల పూర్తివరకును, సూర్యాద్యష్టగ్రహంబులనొక్కొక్కటినుగ్రమంబున స్థాపింపగా వరనక్షత్రమున్న దిక్కుయందేర్పడిననక్షత్రాధిపతినాధిప గ్రహాధిపతిగాధిపతులకును వధూనక్షత్రమున్న దిక్కుయందేర్పడిన నక్షత్రాద్యధిపతులకును, మిత్రత్వము గలిగియున్న దంపతులకు మిత్రత్వముగలుగును, సమత్వము గలిగియున్న వీరలకును సమత్వము గలుగును, శత్రుత్వము గలిగియున్న వీరికిని శత్రుత్వముగలుగునని తా॥

## గోత్రవర్గము

శ్లో॥ గోత్రేశాః క్రమశో మరీచిభగవానత్రిర్వసిష్ఠోఽంగిరాః ।
పౌలస్త్యః పులహః క్రతుః పరిణయే చత్వారి చత్వారిచ ।
దస్రాదీన్యపి సాభిజింతి కలహ స్స్యా దేకగోత్రంగతే ॥
దంపత్యోర్యదిజన్మ భేచసతతంగోత్రాఖ్యవర్గస్త్వయమ్ ॥

టీక॥ మరీచిభగవాన్-మరీచిబ్రహ్మయు, అత్రిః-అత్రిమహర్షియు, వసిష్ఠః వసిష్ఠమహర్షియు, అంగిరాః-అంగిరసమహర్షియు, పౌలస్త్యః పులస్త్యబ్రహ్మయు, పులహః-పులహబ్రహ్మయు, క్రతుః-క్రతువు, ఏతే-ఈసప్తమహర్షులు, క్రమశః-క్రమముగా, గోత్రేశాః-గోత్రాధిపులు, సాభిజింతి - అభిజిన్నక్షత్రముతో గూడిన, దస్రాదీని – అశ్విన్యాదినక్షత్రములు, చత్వారిచత్వారి - నాలుగునాలుగు: భవంతి-కలుగుచున్నవి: దంపత్యోః-దంపతులయొక్క: జన్మభే-జన్మనక్షత్రములు: ఏకగోత్రం-ఒకగోత్రమును: గతేయది-పొందినచో: సతతం—సర్వకాలము: కలహ-విరోధము. స్యాత్—అగును: అయం-ఇది: గోత్రాఖ్యవర్గః-గోత్రవర్గము.

అవ. గోత్రవర్గువును జెప్పుచున్నాఁడు.

తా॥ గోత్రాధిపులగు మరీచ్యత్రివసిష్ఠాంగిరఃపౌలస్త్యపులహ క్రతువు అనెడి సప్తఋషులయందును గ్రమంబున నభిజిత్సహితాశ్విన్యాదినక్షత్రముల నాలుగేసినక్షత్రముల వరుసన నెన్నఁగా వధూవరుల జన్మనక్షత్రము నొకగోత్రము నొంది యున్న గలహకరంబగును.

## బ్రాహ్మణాదులకు తత్తద్వర్ణోచితవర్గములు

శ్లో॥ వర్గాణామపివింశతిపరిణయే జ్ఞేయాఃస్ఫుటం భూసురైః ।
ర్విప్రాణాం గ్రహమిత్రతైవ నియతా రాజ్ఞాంప్రధానంగణః
స్త్రీదూరంతు విశాంప్రధానమపరో యోన్యాఖ్యవర్గోమహాన్।
నన్యేషాంశుభదోషవేత్స్ఫుటమిదంశాస్త్రం విచింత్యంబుధైః

టీక॥ భూసురైః-జ్యోతిశ్శాస్త్రముతెలిసిన ద్విజులచేత: పరిణయే - వివాహమందు: వర్గాణాం—వర్గములయొక్క: వింశతిః - యిరువది: స్ఫుటం- స్పష్టముగా: జ్ఞేయాః-తెలియతగినవి: విప్రాణాం—బ్రాహ్మణులకు:గ్రహమిత్రతైవ-గ్రహమిత్రత్వము: నియతా-ముఖ్యమైనవి: రాజ్ఞాం-క్షత్రియులకు: గణః-గణవర్గము ప్రధానం-ముఖ్యము: విశాం-వైశ్యులకు: స్త్రీదూరం - స్త్రీదూరవర్గము: ప్రధానం-ముఖ్యము: అన్యేషాం – శూద్రాదులకు; అపరః—మరియొక: మహాన్—గొప్పదగు: యోన్యాఖ్య

వర్గః-యోనివర్గము, శుభదః-శుభముచేయునది. భవేత్-అగును, ఇదం- ఈ శాస్త్రం శాస్త్రము, బుధైః-పండితులచే, స్ఫుటం-స్పష్టముగా, విచింత్యం-విచారించతగినది యిట్లు నాలుగువర్గములకే ఉపయోగమున్నచో యితరవర్గముల వ్యర్థమగును. వాట్ల కుపయోగమేమనిన దేశభేదముచే గ్రంథాంతరమందుపయోగముగలదు.

శ్లో॥ మాహేంద్రం మాగధేగౌడే పాంచాలే పంచనాడికా। యామ్యేనాడిరాశికూటౌగ్రహమైత్రంతథైవచ॥ చోళేవిదేహేలింగం స్యాద్వశ్యః కాశ్మీరమండలే। వేధాసౌరాష్ట్రవిషయే మాళవే రజ్జుసంజ్ఞకమ్। సర్వేరాశిగణౌయోనిర్గ్రహమైత్రంచశోభనమ్॥

తా॥ జ్యోతిశ్శాస్త్రజ్ఞు లగువిప్రుల కావశ్యకముగఁ జూడఁదగిన ఈ ౨౦వర్గు లలో బ్రాహ్మణులకు గ్రహమైత్రివర్గును, రాజులకు గణవర్గును, వైశ్యులకు స్త్రీ దీర్ఘవర్గమును, తక్కిన శూద్రాదులకు యోనివర్గమును ముఖ్యంబులు శేషించిన ౧౬ వర్గులును దేశభేదముచే వ్యాఖ్యయందుఁ జెప్పియున్న తెలుఁగున నాయాదేశముల యందుపయోగింపఁబడునని తా॥

జన్మనామనక్షత్రనిర్ణయము

శ్లో॥ జన్మర్క్షేణ వరస్య యోజ్య మనిశం స్త్రీ జన్మధిష్ణ్యంబుధైః। జన్మర్క్షం పురుషస్య యోజ్య మనిశం స్త్రీనామభేనాథవా। పున్నామ్నా నకదాచనాపి యువతే ర్జన్మర్క్ష యోగః పున। ర్దంపత్యోర్యదినామధిష్ణ్యయుగళంయద్వాశుభంస్యాత్తయోః॥

టీక॥ బుధైః—జ్యోతిషశాస్త్రజ్ఞులచేత, వరస్య - వరునియొక్క, జన్మర్క్షేణ - జన్మనక్షత్రములో, స్త్రీజన్మధిష్ణ్యం-స్త్రీజన్మనక్షత్రము, అనిశం-యెప్పుడు, యోజ్యం కూర్చతగినది, అథవా - లేక, స్త్రీనామభేన - స్త్రీనామనక్షత్రముతో, పురుషస్య - పురుషునియొక్క, జన్మర్క్షం - జన్మనక్షత్రమైన, అనిశం- తప్పక, యోజ్యం-కూర్చ తగినది, పుంనామ్నా - పురుషనామనక్షత్రముతో, యువతేః - స్త్రీయొక్క, జన్మర్క్ష యోగః - జన్మనక్షత్రయోగము, కదాచన - ఎప్పుడు, న — కూడదు, యద్వా-లేక దంపత్యోఃపునః—దంపతులకైతే; నామధిష్ణ్యయుగళంయది- నామనక్షత్రద్వయమై, వచో-తయోః—ఆదంపతులకు, శుభం-మంచి; స్యాత్-కలుగును.

అవ. ఈచెప్పఁబడిన వింశతివర్గలను విచారించుటకు జన్మనామనక్షత్రముల యోగ్యాయోగ్యత్వములఁ జెప్పుచున్నాఁడు.

తా॥ వరుని జన్మనక్షత్రముతో స్త్రీజన్మనక్షత్రముఁజేర్చుట ముఖ్య మటుగా కున్న స్త్రీనామనక్షత్రముతో వరునిజన్మనక్షత్రముఁ జేర్పవలయునువదియునుఁగావి పక్షంబున నుభయులనామనక్షత్రములఁ జేర్చిచూడవలయుగాక వరనామనక్షత్రము తో వధూజన్మనక్షత్రము నొకప్పుడుఁ జేర్చవలదని తా॥

## సందిగ్ధరాశి నక్షత్రస్వరూపము

శ్లో॥ జాతాయాః పద మేకమేవ యువతేర్జాతస్య పాదత్రయం ।
పుంసశ్చే ద్విషమాంఘ్రిభే పరిణయే సందిగ్ధరాశిర్భవేత్ ।
పూర్వార్ధం పురుషస్యభే సమపదే జాతస్య వధ్వాః పున ।
జాతాయాఅపరార్ధమాధ్యముభయో స్సందిగ్ధమృక్షంత్విదమ్॥

టీక॥ విషమాంఘ్రిభే - విషమపాదములుగల నక్షత్రమందు; జాతాయాః— పుట్టిన; యువతేః - స్త్రీకి; ఏకం-ఒక; పదం-పాదమే; విషమాంఘ్రిభే-విషమపాద ములుగల నక్షత్రమందు; జాతస్య-పుట్టిన; పుంసః- పురుషునికి; పాదత్రయంచేత్- పాదత్రయమైనచో; పరిణయే-వివాహమందు; సందిగ్ధరాశిః—సందిగ్ధరాశి; భవేత్— అగును; సమపదే-సమపాదములుగల; భే - నక్షత్రమందు; జాతాయాః - పుట్టిన; వధ్వాః-స్త్రీకి; అపరార్ధం-ఉపరార్ధమైనను; జాతస్య - పుట్టిన; పురుషస్య - పురు షునకు; పూర్వార్ధంచేత్-పూర్వార్ధమైనను; ఉభయోః - దంపతులకు; ఆఢ్యం-శుభము చేయును; ఇదం-ఇది; సందిగ్ధం-సందిగ్ధమును; ఋక్షం-నక్షత్రము; భవేత్-అగును పదమేకమేవయనిచెప్పుటచే స్త్రీకిపాదత్రయము పురుషునకేకపాదమైననశుభమనుట

అవ. సందిగ్ధరాశినక్షత్రముల స్వరూపమునుఁ దెలుపుచున్నాఁడు.

తా॥ త్రిపాన్నక్షత్రములయందుఁబుట్టిన వనితరాశి; ఆనక్షత్రమం దొకపాద ముతోఁ జేరియుండినఁ ద్రిపాన్నక్షత్రజుఁడగు వరునిరాశి; అనక్షత్రమందుమూఁడు పాదములతోఁ జేరియున్నను శుభకరం బగునునిది సందిగ్ధరాశి యనఁబడును. ద్వి పాన్నక్షత్రపూర్వార్ధమునఁ బుట్టినవరుండును, ద్విపాన్నక్షత్రోత్తరార్ధమందు బుట్టిన కన్యయు; శుభకరులగుదురనునిది సందిగ్ధనక్షత్రమనంబడు నుక్తవ్యతి రిక్తముగ నున్న నశుభకరంబగునని తా॥

## అభిజిద్గోధూళ్యుష కాలనిర్ణయము

శ్లో॥ సూర్యోస్తాలయత శ్చతుర్థ మభిజిద్యద్వాముహూర్తోఽష్టమ
స్స్యాత్స ర్వే వ్యాపీ మంగళేషు శుభకృ ద్గోధూళికంసప్తమమ్

ప్రాక్సూర్యోదయతో ముహూర్త ఉషఇత్యంతద్వయంతూత్తమం ॥
వేశ్యాదేః కరపీడనేనతు పర స్యాన్యత్ర తత్పూర్వవత్ ॥ ౧౩౨

టీక॥ సూర్యస్థాయతః - సూర్యుడుండురాశికన్న: చతుర్థ-నాల్గవలగ్నము: అభిజిత్-అభిజిత్తనుపేరుగలది: స్యాత్-అగును: యద్వా- లేక: అష్టమః-సూర్యోదయముకన్న నెనిమిదవ: ముహూర్తః-ముహూర్తము: అభిజిత్-అభిజిత్తు, స్యాత్-అగును, సర్వేష్వపి-సమస్తమగు, మంగళేషు-శుభములయందు, శుభకృత్-మంచిని చేయును: సప్తమం-సూర్యుడుండురాశికి నేడవలగ్నము: గోధూళికం-గోధూళియను పేరుగలది: సూర్యోదయతః-సూర్యోదయముకంటె: ప్రాక్-పూర్వము: ముహూర్త ముహూర్తము: ఉషః-ఉషస్సనుపేరుగలది: అంతద్వయం- అంత్యములగు గోధూళ్యుషస్సులు రెండు: వేశ్యాదే-వేశ్యలుమొదలగు సంకరజాతులకు: కరపీడనే-వివాహమందు: ఉత్తమం-ముఖ్యము: వరస్య-శ్రేష్ఠమగు బ్రాహ్మణాదివర్ణములకు: న-కూడదు: అన్యత్ర - త్రైవర్ణికులకు: తత్ - అయభిజిన్ముహూర్తము: పూర్వవత్-పూర్వమువలెనే.

అవ. అభిజిద్గోధూళ్యుషఃకాలనిర్ణయమును జెప్పుచున్నాఁడు.

తా॥ సూర్యోదయలగ్నమునకు ౪-వ లగ్నముగాని ౮-వముహూర్తముగాని యభిజన్ముహూర్తమనియు, ౭ - వలగ్నము గోధూళికమనియు: ఉదయమునకుఁ బూర్వముహూర్తముషఃకాలమనియు: వీనిలో బ్రాహ్మణాదివర్ణత్రయమున కభిజిన్ముహూర్తము ముఖ్యమనియుఁ దక్కినవి యశుభకరంబులనియు వేశ్యాదిసంకరులకు ౩ కాలములు ముఖ్యములగును.

## లగ్నప్రశంస

శ్లో॥ యావత్స్పందతి లోచనం శుభకరం తత్కోటిభాగోభవే ।
తల్లగ్నే శుభకాల ఏవ సతతం బ్రహ్మాపి నజానాతి తమ్ ।
అన్యే కిం పున రేవ కర్తు రథ తత్కాల స్సుభో వాశుభః ।
పూర్వాద్దృష్టవశాద్భవే త్సమయవిత్తాన్యేవ మాత్రంసదా॥

టీక॥ లోచనం-నేత్రము: శుభకరం-శుభమౌనట్లుగా:యావత్-ఎంతకాలము స్పందతి - కదులుచున్నచో: తత్కోటిభాగః- తత్ - ఆకదులుటలో: కోటిభాగః-కోటివవంతు: తల్లగ్నే-ఆలగ్నమందు: శుభకాలః-మంచికాలమును: సతతం-సర్వకాలము: భవేత్-అగును: తం - అసూక్ష్మకాలమును: బ్రహ్మావా- బ్రహ్మైనను: నజానాతి-తెలియలేదు: అన్యే - మనుష్యులు: కింపునః-ఏమిచెప్పఁదగినది [తెలుసుకొన

తేరనుట] కర్తుః- శుభకర్మలచేవానియొక్క: పూర్వాదృష్టవశాత్ — పూర్వజన్మాదృష్టమువల్ల; తత్కాలః-ఆకాలము, శుభః - మంచిదైన, అశుభః - చెడుదైనా: భవేత్—అగును: సమయవిత్ - జ్యోతిషము తెలిసినవాడు: సదా - ఎల్లప్పుడు తత్సాక్షిమాత్రం-ఆలగ్నమునకు సాక్షియైయుండును,

అవ. లగ్నపరిశంపఁ జెప్పుచున్నాఁడు.

తా॥ సుఖకరమగునట్లు చరింపఁబడినకనురెప్పపాటిలో కొటియంశపరిమాణ కాలము లగ్నమందు శుభకాలమగును చిత్రవిచిత్రనిర్మాణచతురుండగు విధాతకుఁ గూడఁ దెలిసికొనుటకు సాధ్యంబుగాని యట్టికాలమును మనుష్య లెఱుంగజాలరు గాన నెల్లరుకు జన్మాంతరకృత పుణ్యపాపకర్మాను సరణముగ లగ్నమునంప్రాప్తమనుగు. సకలమైనవారికి జ్యోతిశ్శాస్త్రవిజ్ఞుఁడు సాక్షిమాత్రుఁడే గాకలగ్నప్రదత గాఁడనిభా॥

ముద్రికారంభనిర్ణయము

శ్లో॥ ముద్రారంభవిధౌ త్రయోదశవసుశ్రోణాత్రిపూర్వోత్తరా।
బ్రాహ్మాదిత్యకృశానుశక్రపవనాః పుత్రార్థదాస్తారకాః ।
వారా జీవకవిజ్ఞమందశశినాం శ్రేష్ఠా అథాశోభనా ।
రిక్తామాదివసాదివిష్టితిథయః పాతోఽవమా వైధృతి॥

టీక॥ ముద్రారంభవిధౌ - ముద్రికారంభవిధియందు, వసు - శ్రోణా శ్రవణము, త్రిపూర్వా-పుబ్బ,పూర్వాషాఢ, పూర్వాభాద్ర, త్ర్యుత్తరా - ఉత్తర ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర: బ్రాహ్మ-రోహిణి - ఆదిత్య-పునర్వసు కృశాను — కృత్తిక: శక్ర- జ్యేష్ట, పవనః-స్వాతి, త్రయోదశ-పదమూడుః తారాః - నక్షత్రములు పుత్రార్థదాః-పుత్రసంపత్తునుచేయును జీవకవిజ్ఞమందశశీనాం, జీవ - బృహస్పతియొక్క, కవి-శుక్రునియొక్క: జ్ఞ-బుధునియొక్క, మంద-శనియొక్క: శశీనాం-చంద్రునియొక్క వారాః-వారములు; శ్రేష్టాః - ముఖ్యములు,అథ - పిమ్మట అశోభనాః - అశుభములైతే, రిక్తా - రిక్తతిథులు, అమా - అమావాస్య దివసాదిపాడ్యమి, విష్టి-భద్రావాకరణయుక్తమగు, తిథయః-రోజులు, పాతః-మహాపాతయు అవమా - దినత్రయము వైధృతి-వైధృయోగము

అవ॥ ముద్రికారంభమునకు గాలనిర్ణయమును జెప్పుచున్నాడు

తా॥ ముద్రికారంభవిషయమై త శ్ర, పూఫ. పూషా, పూభా: ఉఫ: ఉషా; ఉభా: రో; పు: కృ: జ్యేష్ట స్వా తి: నక్షత్రములను గురు శుక్ర బుధ

శని, సోమవారములును శుభకరంబులగును. రిక్తతిథులును అమావాస్య ప్రతిపత్తు భద్రకరణతిథి వ్యతీపాత మహాపాతఅవమతిథి, వైధృతినామయోగములని యశుభకరంబులగునని తా॥

శ్లో॥ పూర్వకాలామృతం నామ గ్రంథః ప్రాచీవనిర్మితః ।
పదచ్ఛేద పదార్థోక్తి సహితాస్యాద్యధాక్రమమ్ ।
మచిలీపట్టణే చల్లా లక్ష్మీనృసింహశాస్త్రిణా ।
విరచ్యతే మహాటీకా బాలానాం బోధసిద్ధయే ।

పూర్వకాలామృతే తృతీయబిందు

సమాప్తః

---

ఓమ్

పరబ్రహ్మణేనమః

# పూర్వకాలామృతే

చతుర్థబిందు ప్రారంభః

...(o)...

శ్రావణహోమకాలము శ్లో॥ ౧౮౫

శ్లో॥ శ్రావణ్యాం గురుశుక్రయో ర్విమలయోః కుర్యాదుపాకర్మతత్, తత్కుర్యా ద్వాఖలబహ్వృచః శ్రవణభే సింహంగతే భాస్కరే ।
మాసే కర్కటకేపి మౌఢ్యరహితే శాఖేశ్వరాణాంరవే ।
సంక్రాంతౌ గ్రహణే నకార్యమథవాతత్రోష్ఠపద్యాంచరేత్ ॥

టీక॥ గురుశుక్రయోః-గురుశుక్రులు; విమలయోః- అస్తమించకపూర్వము, శ్రావణ్యాం-శ్రవణనక్షత్రయుక్తపూర్ణిమయందు; తత్-ప్రసిద్ధమైన; ఉపాకర్మ – ఉపా కర్మ యనుకర్మము; కుర్యాత్–చేయవలయును,[యజుర్వేదులకవిశాత్పర్యము]

అఖిలబహ్వృచః—సమస్తఋగ్వేదులకును; శ్రీవణభే-ఏరోజునైన శ్రవణ నక్షత్రమందు కుర్యుః-చేయుదురుగాక; భాస్కరే-సూర్యుడు; సింహంగతే - సింహమందుండగా; మాసే-శ్రావణమాసే; కర్కటకే-కర్కటకమందుండగాను; వా - వికల్పముగా కార్యం-చేయతగినది; సింహంగతేభాస్కరే యనువచనము నర్మదోత్తరదేశ విషయమనుట, ఆవిషయము నిర్ణయసింధునందున్నది. తత్ప్రమాణము

శ్లో॥ కులీరేరవిసంయుక్తే ఉపాకుర్యాత్తుదక్షిణే ।
నర్మదోత్తరదేశేతు కర్తవ్యంసింహగేరవౌ ॥

శాఖేశ్వరాణాం - సామవేదాదర్వణవేదాధిపకుజబుధులయొక్క: మౌఢ్యరహితే - మౌఢ్యములేనికాలమందు; కార్యం—చేతావలయును [ఇదిసామాథర్వణవేదులకేఋగ్యజుర్వేదుకు గురుశుక్రులవల్లనే గ్రాహ్యము] కావుననేశాఖేశ్వరాణామనుబహువచనమునకు ద్వివచనపరత్వము)రవేః—సూర్యునియొక్క:సంక్రాంతౌ-సంక్రమణమందు గ్రహణే-చంద్రగ్రహణములయందు, నకార్యం కూడదు; అథవా-లేకున్న తత్ - ఆ ఉపాకర్మను ప్రోష్ఠపద్యాం - పూర్వాభాద్రా నక్షత్రయుక్త భాద్రపద పౌర్ణమయందు; చరేత్ — చేయవలయును.

అవ॥ రెండుశ్లోకములచేత శ్రావణహోమకాలమును జెప్పుచున్నాఁడు

తా॥ యజుర్వేదులు గురుశుక్రులస్తంగతులుఁ గాకయుండఁగాశ్రావణశుద్ధ ౧౫ యందున్ను; సమస్తఋగ్వేదులున్ను శ్రావణమాసమందేదినమందుశ్రవణనక్షత్రము సంభవించునో యాదినమందునుశాఖాత్రయప్రవర్తకులునుసూర్యుఁడు సింహరాశియందైనను, కటకరాశియందైననుండఁగా తమతమవేదాధిపుల నస్తంగతులైయుండఁగా నుపాకర్మఁజేయవలయుననియు నాదినంబునగ్రహణసంక్రాంతులుసంభవించెనేని భాద్రపదశుద్ధ ౧౫ యందు జేయవలయుననియు తా॥ (సూర్యుఁడుసింహరాశియందుండఁగా నర్మదోత్తరదేశమందును, కటకరాశియందుండఁగా దక్షిణదేశమందు జేయవలయునని గ్రంథాంతరమందు జెప్పఁబడియున్నది.

శ్లో॥ దోషోఽయం సమఏవ చే దనధికోఽనల్పశ్చ మాసద్వయే
తత్ర శ్రావణమాసఏవ విధివత్కుర్యాదుపాకర్మతత్ ।
కర్మోత్సర్జననామకం తదపి వా పూర్వోషధీనాంతదా ।
ప్రాకట్యం యది నాస్తిచే దథ చరేన్మాసేనభస్యేతదా ॥ ౧౮౬

టీ॥ అయం ఈదోషః - పూర్వోక్తదోషము, మాసద్వయే - రెండుమాసములయందు; అనధికః-అధికముగానిదై; అనల్పః-తక్కువకానిదై; సమః సమాన

మైనచో, తత్ర-ఆరెంటిలో; తత్—ఆ ఉపాకర్మను, శ్రావణమాసఏవ-శ్రావణమాస మందే, విధివత్ యథాశాస్త్రముగా, కుర్యాత్-చేయవలయును, ఉత్సర్జననామకం - ఉత్సర్జనమను పేరుగల; యత్ - యే; కర్మ - కర్మగలదో, తదపి - దానిని పుష్య పూర్ణిమయందు చేయవలయును. దానికి దోషమున్న మాఘపూర్ణిమకుచేయవలయును రెంటియందుదోషమున్న పుష్యపూర్ణిమకుతప్పదు. [శ్రావణ్యాంపౌర్ణమాస్యాం—ధ్యాయ ముపాకృత్యమాసంప్రదోషేణాభియాత తైష్యాంపౌర్ణమాస్యాగ్ం రోహిణ్యాం విరమేదిత్యుత్సర్జనకాలసో క్తత్వా దాప స్తంబేన్] పూర్వోషధీనాం— పూర్వసస్యముల యొక్క, ప్రాకట్యం-ప్రచురత్వము, తదా-ఆశ్రావణమందు, నాస్తిచేత్ - లేనిచో నభస్యే-భాద్రపదమను; మాసే-మాసమందు; చరేత్ - చేయవలయును.

కాశ్యపు డిట్లుచెప్పెను.

శ్లో॥ గురుభార్గవయో ర్మౌఢ్యే బాల్యేవావార్ధకేపిచ ।
తథాధిమాసేసంస ర్పే మలమాసేషుచద్విజం ।
నాకుర్యాదాద్యుపాకర్మ కృతంకర్మచనిష్ఫలం ॥

శ్లో॥ పూర్వశ్లోకములైన మూఢాది దోషములు శ్రావణ భాద్రపదమాసముల యందు సమానములుగానుండెనేని స్వకాలము బలవత్తరమైనందువలన శ్రావణమాస మువందే యుపాకర్మఁజేయవలయునని; పుష్యశుద్ధ ౧౫ యందుఁ జేయఁదగిన యుత్సర్జనమను హోమకర్మ నాకాలము మూఢాదిదోషయుక్తమై యుండెనేని మాఘశుద్ధ ౧౫ యందుఁజేయఁదగినదనియుఁబుష్యమాఘమాసములయందుదోషము సమానముగానుండెనేని పుష్యమాసమందే చేయఁదగినదనియు, శ్రావణమాసమందు మొలటిపైరులయుత్పత్తి లేకయుండెనేని యుపాకర్మ భాద్రపదమాసమందుఁజేయఁ దగినదనియు తా॥ [పూర్వశ్లోకోక్తమైన గురుశుక్రమూఢనిషేధము ప్రథమోపాకర్మ విషయమని కాశ్యపవచనమువలనఁ దెలియవచ్చుచున్నది]

క్షౌరకాల నిర్ణయము

శ్లో॥ నందాపర్వసురిక్తపైత్ర్యకనిశాసంధ్యాష్టమీషు వ్రతే ।
భుక్త్వా మిత్రమఘోత్తరాగ్ని దనుజప్రాజేశజన్మోడుషు ॥
ప్రాతే కర్కటకన్యకాఘటధనుర్మాసేషు మృత్యోప్రదం
క్షౌరం భానుజభౌమభానుదివసే పత్నీ యదాగర్భిణీ ॥ ౧౪౭

టీక॥ నందాపర్వను — నందా- నందతిథులయందు పర్వను - అమావాస్యాది పర్వములయందు రిక్తపైత్ర్యకనిశాసంధ్యాష్టమేషు రిక్త—రిక్తతిథులయందు పైత్ర్యక-

పితృతిధులయందు, నిశా -రాత్రియందు, సంధ్యా - సూర్యోదయాస్తములయందు, అష్టమీషు–రెండుపక్షములనుం డష్టములయందు, వ్రతే- వ్రతదినమందు, భుక్త్వా- భుజించి, మిత్రమఘోత్తరాగ్నిదనుజప్రాజేశజన్మర్క్షేషు- మిత్ర-అనూరాథయందు మఘ-మఘయందు, ఉత్తరా-ఉత్తరయందు, అగ్ని-కృత్తికయందు, దనుజ-మూల యందు, ప్రాజేశ-రోహిణి-యందు, జన్మర్క్షేషు–జన్మనక్షత్రమందు, పాతే-వ్యతీ పాతమహాపాతలయందు, కర్కటకన్యకాఘటధనుర్మాసేషు- కర్కట - కర్కాటక మందు, కన్యకా–కన్యయందు, ధనుః-ధనుస్సుయందు, ఘట–కుంభమందు,మాసేషు ఈమాసములయందు, భానుజభౌమభానుదివసేషు– భానుజ-శనివారమందు, భౌమ- మంగళవారమందు, భాను-ఆదివారమందు, పత్నీ-భార్య, యదా-యెప్పుడు, గర్భిణీ -గర్భవంతురాలగునో అప్పుడు, క్షౌరం-క్షౌరము, మృత్యుప్రదం–మరణముచేయును [మంచిదికాదనుట]

అవ. రెండుశ్లోకములచేత క్షౌరకాలమును జెప్పుచున్నాఁడు.

తా॥ ౧౪ వ శ్లోకమందుఁ జెప్పఁబడిన నందరిక్తతిధులు పంచపర్వంబులు, పితృతిధులు, ఉభయాష్టమలు. ఈతిధులయందును, రాత్రియందును సూర్యోదయ సూర్యాస్తమయకాలములయందును, ప్రతిదినముయందును, భోజనానంతరమందును అనూరాథ, మఘ, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, కృత్తిక, మూల, రోహిణి జన్మనక్షత్రము వీటియందును, వ్యతీపాతమహాపాతలయందును, కటకకన్యాకుంభ ధనుర్మాసములయందును, ఆదిత్యాంగారకశనివారములయందును, భార్యగర్భిణియై యుండఁగా నాఱవనెలమొదలు ప్రసూతికాలమువరకును. క్షౌరంన శుభకరంబని తా॥

## క్షౌరమునకు యోగ్యకాలనిర్ణయము

శ్లో॥ శస్తా హస్తచతుష్టయాదితిగురుశ్రీశత్రయాశ్వేందవో ।
జ్యేష్ఠాంత్యోడుచ మధ్యమంచ శుభకృచ్చంద్రజ్ఞవారాన్వితే
రోగాంతే మృతకర్మసు క్రతువిధౌ పుణ్యస్థలే శోభనే
కారాగారవిమోచనే శుభకరం క్షౌరంతు వర్జ్యాస్వపి॥ ౧౭౨

టీక॥ హస్తాచతుష్టయ-హస్త, చిత్త; స్వాతి, విశాఖలు; అదితి-పునర్వసు; గురు–పుష్యమి, శ్రీశత్రయ-శ్రవణ, ధనిష్ఠ; శతభిషములు; అశ్వఆశ్విని;ఇందవః- మృగశిర; శస్తా - శ్రేష్ఠనక్షత్రములు; జ్యేష్ఠాంత్యోడు-జ్యేష్ఠాదేవతులు; మధ్యమం- మధ్యమములు; చంద్ర-సోమవారము; జ్ఞ-బుధవారములతో; అన్వితే-కూడినదిన మందు; క్షౌరం-క్షౌరము, శుభకృత్-మంచిది,రోగాంతే-రోగముయొక్క-అంతమందు

మృతకర్మసు—మరణకర్మలయందు, క్రతువిధౌ-క్రతుకాలమందు, పుణ్యస్థలే-పుణ్య క్షేత్రములయందు, శోభవే-వివాహాదినమునకు పూర్వదినమందు, కారాగారవిమోచనే -కైదువిడిపించునప్పుడు, వర్జ్యాస్వపి-నషిద్ధదినములయందును, శుభకరం-మంచిది.

అవ. క్షౌరమునకు యోగ్యకాలమును జెప్పుచున్నాఁడు.

తా॥ అశ్వనీ, మృగశీర్షము, పునర్వసు, పుష్యమి, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, శ్రవణము, ధనిష్ట, శతభిషము ఈ౧౧ నక్షత్రంబులును, సోమబుధవారంబులును ప్రశస్తంబులనియు, జ్యేష్ఠ, రేవతి ఈ౨ను మధ్యంబులనియు అరోగ్యస్నాన మృతకర్మయాగారంభకాలములయందు, కాశ్యాది పుణ్యక్షేత్రప్రవేశకాలములయందును, వివాహదినమునకుఁ బూర్వదినంబునందును, గారాగృహవిముక్తి కాలంబునందు నీ కాలములయందు క్షౌరనిషేధతిథ్యాదులును శుభకరంబులని తా॥

రాజకుమారులకు ఛురికాబంధనకాలము

శ్లో॥ బధ్నీయాత్ ఛురికాంచ రాజపురుషః ప్రాగేవ పాణిగ్రహా,
న్మౌంజీబంధనభే సురా న్పితృగణం సంపూజ్య తత్సద్మచ ।
కట్యాం వామతఏవ లక్షయుతాం శేషం వివాహోక్తవ ।
త్తారాచంద్రబలాన్వితః కుజగురు బ్రధ్నాఖ్యవారేష్వపి ॥

టీక॥ రాజపురుషః -క్షత్రియుడు, తారాచంద్రబలాన్వితః - తారాచంద్రబలములను చూచినవాడై, పాణిగ్రహాత్ - వివాహమునకు, ప్రాగేవ - ముందుగానే, మౌంజీబంధనభే-ఉపనయనయోగ్యనక్షత్రమందు, సురాన్-గ్రహాదిదేవతలను; పితృగణం-తల్లిదండ్రిగురువుమొదలగువారిని, సంపూజ్య-పూజించి, తత్సద్మచతుయుతగృహమును, సంపూజ్య-పూజించి, కుజగురుబ్రధ్నాఖ్యవారేషు-మంగళ,గురు, ఆదివారములయందు, లక్షణయుతాం-శాస్త్రోక్తలక్షణములుగలిగిన, ఛురికాం-కత్తి ని కట్యాం-కటిదేశమందు, వామతః - సవ్యభాగమందు, బధ్నీయాత్ - కట్టవలయును, శేషం-వారనక్షత్రములకన్న మిగిలిన లగ్నముమొదలగునవి, వివాహోక్తవత్-వివాహమువలె చూడవలయును,

అవ. రాజకుమారులు కత్తి నిధరించుటకుఁ గాలమును జెప్పుచున్నాఁడు

తా॥ రాజకుమారుఁడు వివాహమునకు మున్నే యుపనయనయోగ్యనక్షత్రముతోడను, భాన్వంగారకగురువారములలో నొకవారముతోడను, వివాహయోగ్యమైన లగ్నాదులతోడను, తారాచంద్రబలములతోడను గూడియున్న యొకశుభదివంబున నిష్టదేవతలఁ దల్లిదండ్రులను సంపూజించి ఆయుధగృహంబునలంక

రించి శస్త్రశాస్త్రోక్తంబులగు లక్షణములు గలనూరుకత్తిని కటిప్రదేశమున కుడి ప్రక్క ధరింపవలయునని తా॥

## నూతనవధూగృహప్రవేశకాలము

శ్లో॥ షష్ఠాందా సమవాసరే నవవధూసద్మ ప్రవేశ శ్శుభః ॥
స్యాదాషోడశవాసరా త్పరిణయా త్పంచాంగశుద్ధిం వినా ।
ఉద్వాహాద్యసమాబ్దఏవ నియమ స్త్వాపంచమా ద్యాత్తులా ।
కన్యాకర్కటచాపగోఝుషన్నృయుక్కుంభా నిషేకేశుభాః ॥

టీక॥ పరియాత్ - వివాహమైనపిమ్మట, షష్ఠాతౌ - ఆరు దినము మొదలు, సమవాసరే—సరిరోజునందు, పంచాంగశుద్ధింవినా- పంచాంగశుద్ధిలేకుండా, ఆషోడశ వాసరాత్—పదునారవరోజువరకు, నవవధూసద్మప్రవేశః-నూతన వధూగృహప్రవే శము, శుభః - మంచిది, స్యాత్- అగును. (అట్లుపదునారురోజులయందుకానిచో) ఉద్వాహాది-వివాహము మొదలుగా, ఆసమాబ్దఏవ-బేసిసంవత్సరములయందే, ఆపంచ మాత్—ఐదవసంవత్సరమునకు, నియమః-నియమము, తులా-తులయు, కన్యా-కన్య యు, కర్కట-కర్కాటము, చాప - ధనుస్సు, గో-వృషభము, ఝుష - మీనము, నృయుక్-మిధునము, కుంభాః కుంభము, నిషేకే - మైధునమందు; శుభాః-మంచిది.

అవ. ఈశ్లోకంబున ३ పాదములచే నూతనవధూ గృహప్రవేశ కాలంబును నాలగవపాదముచే నిషేకయోగ్యకాలంబులఁ జెప్పుచున్నాఁడు.

తా॥ వివాహమై ౬వ దినము మొదలు ౧౬ వ దినమువరకు సమతిథములు యందు తిథివారనక్షత్రయోగకరణములనైనఁ జూడక నూతనవధూగృహప్రవేశము చేయవచ్చుననియు ౧౬ దినములకు వెనుక ౫సంవత్సరములవరకు విషమసంవత్స రములయందొక శుభదినంబునఁ చేయవలయుననియు ౫ సంవత్సరములకు వెనుక విషమసంవత్సరమనియముఁ బనిలేదనియు వృషభ; మిధున; కటక; కన్యా; తులా; ధమః; కుంభ; మీనములు నిషేకయోగ్యంబులనియు తా॥

## నిషేకకాలనిర్ణయము

శ్లో॥ దస్రార్ద్రానిలమిత్రమూలవరుణబ్రాహశ్రుత్యంత్యచ్యుతాః।
పూజ్యాః పుష్యపునర్వసూవసుశశిత్వష్ట్రాహ్వయా మధ్యమాః।
మధ్యే వాత్రతు పుష్యఏవ విఫలాస్తారా నిషేకే పరా ।
మధ్యే భానుజవాసరశ్చ భృగుజజ్ఞార్కేందువారాశ్శుభాః॥౧౫౧

టీక॥ దస్రి - అశ్విని, అర్క - హస్త, అనిల-స్వాతి, మిత్రి-అనూరాథా, మూల - మూల, వరుణ - శతభిషము, బ్రాహ్మ్య - రోహిణీ, ఉత్తరా-ఉత్తరోత్తరాషాఢోత్తరాభాద్రలు, అంత్య—రేవతి, అచ్యుతాః-శ్రవణము, పూజ్యాః - ఉత్తమములు, పుష్య - పుష్యమి, పునర్వసూ - పునర్వసువు, వసు- ధనిష్ఠ; శశి-మృగశీర్ష, త్వష్ట్రిహ్వయాః-చిత్రియనుపేరుగలవి,మధ్యమాః-మధ్యమములు; అత్రి-మధ్యమ నక్షత్రిములలో; మధ్యే—మధ్యయందు; పుష్యః - పుష్యమి; విఫలఏవ- వ్యర్థమైనదే అపరాః-మిగిలిన; తారాః-నక్షత్రిములు; విఫలాః-వ్యర్థమైనవి; (విడువతగినవనుట) భానుజవాసరశ్చ—శనివారమున్నూ; మధ్యః - మధ్యమము; భృగుజజ్ఞార్యేందువారాః భృగుజ-శుక్రివారము; జ్ఞ-బుధవారము; ఆర్య-గురువారము; ఇందు - సోమవారము; శుభాః-మంచిని చేయునవి.

అవ. నిషేకవిషయమై నక్షత్రివారములఁ జెప్పుచున్నాఁడు.

తా॥ అశ్విని; రోహిణీ; ఉత్తర; హస్త;స్వాతి; అనూరాధ; మూల; ఉత్తరాషాఢ; శ్రవణము; శతభిషము; ఉత్తరాభాద్రి; రేవతి ఈ నక్షత్రింబులును; సోమ; బుధ; గురు; శుక్రివారంబులును నిషేకమునకు ముఖ్యంబులనియు: మృగశీర్ష-పునర్వసు-చిత్రి-ధనిష్ఠ ఈ నక్షత్రింబులును: శనివారంబును మధ్యమంబులనియు: పుష్యనక్షత్రి మత్యంతమధ్యమంబనియుఁ దక్కిన నక్షత్రివారములు నిషిద్ధంబులు.

శ్లో॥ షష్ఠీ పర్వచతుర్దశీ పితృతిథీ రిక్తార్ధరాత్రాష్టమీ ।
హిత్వా విష్టివమా దినాదిదినకృత్కామపి్రదోషానపి ।
మూఢాదిష్వపి పంచ సూదితమహాదోషా న్పరిత్యజ్య తాః ।
శ్రావణ్యామపి కార్తికే సహసివా మాసే నిషేకశ్శుభః॥

టీక॥ షష్ఠి -రెండుపక్షములయందుగల షష్ఠియు; పర్వ-అమావాస్యపూర్ణిమ మొదలైనవి; చతుర్దశీ-రెండుపక్షములయందుండు చతుర్దశియు, పితృతిథి-శ్రాద్ధదినములు; రిక్త-రిక్తతిథులు; అర్ధరాత్రి-నిశీథియు; అష్టమీః-రెండుపక్షములయందుండు అష్టములు; విష్టి-భద్రివాకరణము; అవమా-దినక్షియము; దినాది-పాడ్యమి; దినకృత్-సప్తమీ; కామ - త్రియోదశీ-తయోః - వానియొక్క; ప్రిదోషానపి - ప్రిదోషములనున్నూ; హిత్వా - విడిచి; తాః - ప్రిసిద్ధములయిన; ఉదితమహాదోషాః-చెప్పఁబడిన మూఢాదిమహాదోషములను:పరిత్యజ్య-విడిచి; మాఘాదిషు-మాఘమాసం మొదలు; పంచసు-ఐదుమాసములయందు; వా-లేక;శ్రావణ్యాం-శ్రావణమాసమందు

కార్తికే-కార్తికమాసమందు. సహసి-మార్గశీర్షమను, మాసేవా — మాసమందైనను నిషేకః-నిషేకము, శుభః—మంచినిచేయును.

అవ॥ నిషేకకాలమును జెప్పుచున్నాఁడు.

తా॥ మాఘఫాల్గున చైత్రవైశాఖ జ్యేష్ఠశ్రావణ కార్తికమార్గశీర్షమాసముల యందు, పక్షద్వయగతములగు షష్ఠ్యష్టమీ చతుర్దశీప్రతిపత్తులును,పర్వతిథులును శ్రాద్ధదినంబులును,రిక్తతిథులును,త్రయోదశీన ష్టములప్రదోషంబులను,అర్ధరాత్రంబును, మూఢాదిమహాదోషంబులను. వీనింబరిత్యజించితక్కినదినంబులయందునిషేకము శుభావహమనియు, ముందుజెప్పఁబడిన మాసములుగాకయితరమాసములయందేదిఁంబునఁ జేయవలదని తా॥

శ్లో॥ రేవత్యాదిషు షట్సు భేషు యువతిః పత్యుర్నిషేకే ప్రియా।
దంపత్యోశ్చ పరస్పరం ప్రియమపి స్యాద్ద్వాదశ స్వీశభాత్।
జ్యేష్ఠాద్యాది నవోడుషు ప్రియతమో వధ్వాః సితార్కౌ శుభౌ
స్యాతాం భర్తృగృహప్రవేశసమయే చేద్వామగౌ పృష్ఠగౌ॥

టీక॥ రేవత్యాదిషు—రేవతిమొదలగు: షట్సు- ఆఱుగు: భేషు — నక్షత్రముల యందు, నిషేకేసతి-నిషేకముకలుగుచుండగా; యువతిః - పడుచు,పత్యుః - పెనిమిటికి; ప్రియా-ప్రియముచేయును: ఈశభాత్ — ఆర్ద్రానక్షత్రముమొదలు,ద్వాదశసు-ఉత్తరాషాఢవఱకునుండు పండ్రెండునక్షత్రములయందు: దంపత్యోః-దంపతులకు:పరస్పరం-అన్యోన్యము; ప్రియమపి-ప్రియమున్ను: స్యాత్—అగును;జ్యేష్ఠాది-జ్యేష్ఠనక్షత్రముమొదలు; నవోడుషు తొమ్మిదినక్షత్రములయందు, వధ్వాః-స్త్రీకి: ప్రియతమః—పెనిమిటి ప్రియతమః-మిక్కిలి ప్రేమగలవాడగును. భర్తృగృహప్రవేశసమయే—క్రొత్తసంగమముకై పెనిమిటితో గృహము ప్రవేశించుకాలమందు. సితార్కౌ — శుక్రసూర్యులు: వధ్వాః - స్త్రీకి. పృష్ఠగౌ - వెనుకనున్న, వామగౌ - కుడిప్రైపుననున్న. శుభౌ-మంచివారు—స్యాతాం-అగుదురు.

అవ॥ దంపతుల కన్యోన్యప్రీతికరంబు అగునక్షత్రముల జెప్పుచున్నాఁడు.

తా॥ రేవతిమొదలు ౬ నక్షత్రములయందు నిషేకముఁజేయ వనిత పురుషున కిష్టురాలగుననియు; ఆర్ద్ర మొదలగు ౧౨ నక్షత్రములయందు నిషేకముఁజేయుదంపతులకన్యోన్యప్రీతిగలుగుననియు. జ్యేష్ఠమొదలు ౯ నక్షత్రములయందునిషేకముఁజేయు స్త్రీకిఁబురుషుండత్యంతప్రియుండగుననియు వనిత నూతనసంగమమునకై

భర్తృగృహమునఁ బ్రవేశించునపుడు రవిశుక్రులు ప్రీక వెనుకనైనను కుడిప్రక్కనైన నుండిరేని శుభకరులనియు తా॥

## నూతనవస్త్రభూషణధారణకాలనిర్ణయము

శ్లో॥ కుర్యాన్నూతనవస్త్రభూషణధృతిం విష్ణుత్రయార్క త్రయా
బ్రహ్మాదిత్యగురూత్తరాద్యశశభృన్మిత్రాంత్యమూలేష్వపి।
వారావారదినేశయోః ప్రతిపదం రిక్తావమావష్టమీ।
నందావైధృతవిష్టిపాతపరిఘాన్ హిత్వాధమందేఽధవా॥ ౧౫౪

టీ॥ విష్ణుత్రయ-శ్రవణధనిష్టాశతభిషములు: అర్కత్రయ- హస్తచిత్తాస్వాతులు: బ్రహ్మారోహిణి: ఆదిత్య-పునర్వసు: గురు — పుష్యమి: ఉత్తరా - ఉత్తర ఉత్తరాషాఢ ఉత్తరాభాద్రలు: ఆద్య-అశ్వని: శశభృత్-మృగశీర్ష: మిత్ర - అనూరాథ: అంత్య రేవతి: మూల-మూల: ఏషు-ఈనక్షత్రములయందు:నూతన- క్రొత్తవైన: వస్త్ర-బట్టలయొక్క: భూషణ — అలంకారములయొక్క: ధృతిం - ధరించుటను: కుర్యాత్ - చేయవలయును. ఆరదినేశయోః — అంగారకసూర్యులయొక్క వారౌ-వారములును: ప్రతిపదం-రెండుపక్షములపాడ్యములును:రిక్త- రిక్తతిధులును అవమౌ—దినత్రయమును: అష్టమీ—రెండుపక్షములాష్టములను;నందా-నందతిధులను వైధృతి-వైధృతినామయోగమును: విష్టి—భద్రకరణమును: పాత— వ్యతీపాతమహాపాతలను: పరిఘాన్-పరిఘనామయోగమును: హిత్వా-వదలి: కుర్యాత్ - చేయవలయును: అదవా-లేక: మందే—శనివారమందు: నకుర్యాత్—చేయకూడదు.

అప॥ నూతనవస్త్రభరణముల ధరించుటకుఁ గాలమును జెప్పుచున్నాఁడు.

తా॥ ఆదిత్యాంగారక శనివారంబులును, ఉభయాష్టమిప్రతిపత్తులును ౯౪-వ శ్లోకమునందుఁజెప్పఁబడిననందరిక్తతిధులును;తిధిత్రయముతోఁ జేరినదినంబునుపరిఘ వైధృతినామయోగంబును: భద్రకరణమును వ్యతీపాతమహాపాతంబులును; వీనిఁ బరిత్యజించి; తక్కినదినంబులయందును; అశ్వని: రోహిణి:మృగశీర్షము:పునర్వసు పుష్యమి:ఉత్తర:హస్త:చిత్ర:స్వాతి:అనూరాధ:మూల:ఉత్తరాషాఢ,శ్రవణము:ధనిష్ఠ శతభిషము: ఉత్తరాభాద్ర రేవతి ఈ నక్షత్రములయందు నూతనవస్త్రభరణముల ధరించిన శుభములు గలుగునని తా॥

## ద్వాదశలగ్నములకు ఘటికాప్రమాణముశ్లో॥ ౧౫౫

శ్లో॥ మేషే మీనగృహే చతస్రఉభతో స్యార్ధం చతస్రోవృషే।

కుంభే పాదయుతాశ్చ పంచ మకర స్త్రీయుగ్మతౌలీషుచ ।
సార్ధం పంచ కుళీరకేసరిధనుఃకీటేషు చేన్నాడికా ।
లగ్నానాం ఘటికాప్రమాణగణనా జ్ఞేయాక్రమాద్బ్రాహ్మణై ॥

టీక॥ మేష — మేషమందు, మీనగృహే-మీనమందు, ఉభయోః — రెండు లగ్నములయందు. చతస్రః-నాలుగు. నాడికాః-గడియలు. వృషే — వృషభమందు కుంభే-కుంభమందు; సార్ధం - అరఘడియతో కూడునట్లుగా. చతస్రః — నాలుగు ఘడియలు; మకర-మకరమందు, స్త్రీ—కన్యయందు యుగ్మ-మిధునమందు తౌలీషు-తులయందు, పాదయుతాః-పాదముతో కూడిన, పంచ - ఐదుఘడియలు, కుళీర — కర్కాటమందు, కేసరి—సింహమందు, ధనుః-ధనస్సునందు; కీటేషు- వృశ్చికమందు సార్ధం-అరఘడియకలుగునట్లుగా, పంచ - ఐదుఘడియలు, ఏవం ఇట్లు; లగ్నానాం ద్వాదశలగ్నములకు, ఘటికాప్రమాణగణనా-ఘడియలయొక్క-ప్రమాణము; బ్రాహ్మణైః—పండితులచే, జ్ఞేయా-తెలుసుకొనతగినది.

అవ॥ మేషాదిద్వాదశలగ్నఘటికాప్రమాణమును జెప్పుచున్నాడు

తా॥ మేషమీనములకు ఘడియలు ౪, వృషభకుంభములకు ఘడియలు ౪౻; మకరకన్యామిధునతులలకు ఘడియలు ౫౼,కటకసింహధనుర్వృశ్చికములకుఘడియలు ౫౻ ఈరీతిని లగ్నముల ఘటికాప్రమాణమని తా॥

| మీ - మే | వృ - కు | మ - క | మి - తు | క - సిం | ధ - వృ |
|---|---|---|---|---|---|
| ఘ - వి | ఘ - వి | ఘ - వి | ఘ - వి | ఘ - వి | ఘ - వి |
| 4 - 0 | 4 - ౩0 | 5 - 15 | 5 - 15 | 5 - 30 | 5 - 30 |

స్వదేశలగ్న ప్రమాణసాధనమ్ మతీవకవిధం

శ్లో॥ స్వదేశచరఖండోనా మేషాద్యా రాశయస్త్రయః ।
వ్యస్తైస్తైశ్చరఖండైస్తే కర్కటాద్యాస్త్రయో యుతా॥ ॥

టీక॥ అందు, మేషాద్యాః - మేషాదులగు,త్రియ, మూడైన, రాశయః రాసులు, స్వదేశచరఖండోనాః-స్వదేశ- ఆయాదేశములయొక్క; చరఖండః - అక్ష మధ్యాంత్యచరఖండములచేత క్రమంబుగ; ఊనాః- తగ్గుచు స్వదేశీయరాసులగును. వ్యస్తైః-తలక్రిందులగు, తైః — ఆ: చరఖండైః-చరఖండములచేత యుతాఃకూడిన

తే-అలంకాలగ్నములగు, కర్కటాద్యా- కటకసింహకన్యలు; త్రయః -మూడును స్వదేశరాసులగును-

శ్లో॥ క్రమతశ్చరఖండైస్తైః తులాద్యాస్త్రయోయుతాః ।
వ్యుత్క్రమైశ్చరఖండైస్తై త్రయోహీనామృగాదయః ॥

టీక॥ తే-అలంకాలగ్నములగు, తులాద్యాః తులాదులకు; త్రయః-మూడును క్రమతః-క్రమంబుగ, తైశ్చరఖండైః-ఆపరఖండములచేత;యుతాఃకూడినవగుచును మృగాదయః-మకరాదులగు; త్రయః-మూడైన; తే - అవి; వ్యుత్క్రమైః - తలక్రిందులగు; చరఖండైః-చరఖండములచేత, హీనాః-తగ్గినవగుచునుస్వదేశలగ్నములగునని తా॥

శ్లో॥ వినాడికాత్మకాశ్చైతే భవేయుస్స్వస్వదేశజాః ।
స్వదేశచరఖండోనయుక్తలంకోదయైఃక్రమాత్ ॥

టీక॥ క్రమాత్ పూర్వోక్తక్రమంబునస్వదేశచరఖండోనయుక్తలంకోదయైః ఆయా స్వదేశచరఖండములతో న్యూనాధిక్యములగు లంకాలగ్నప్రమాణముల చేత, స్వస్వదేశజాః - ఆయాస్వదేశీయములగు; ఏతేః - ఈమేషాదిద్వాదశరాసులు; వినాడికాత్మకాః-విఘటికారూపముగలవి, భవేయుః-కాగలవు

తా॥ లంకాలగ్నములగు మేషమందుఆదిచరఖండమును;వృషభమందుమధ్యచరఖండమును మిధునమందుఅంత్యచరఖండముమతివచవలెను.మఱియులంకాలగ్నములగు కర్కటకమందు అంత్యచరఖండమును; సింహమందు మధ్యచరఖండం, కన్యయందు ఆదిచరఖండమును, కూడవలెను. మఱియు లంకాలగ్నములగుతులాదిరాశిత్రయమందు క్రమంబున చరఖండములఁగలపవలెను. మఱియులంకాలగ్నములగు మకరాది రాశిత్రయమందు చరఖండములను వ్యుత్క్రమముగ తివచవలెను. ఇట్లు చేయబడినలంకాలగ్నప్రమాణములేఆయాస్వదేశలగ్నప్రమాణంబులువిఘటికారూపములంగలవగుననుట.

అకాది సకలదేశములకు విషువచ్ఛాయాంగుళ వియంగుళములను ఆయాదేశముల చరఖండములను ఆయాదేశములయొక్క మేషాదిద్వాదశలగ్నప్రమాణఘడియావిఘడియలను తెలుపుచక్రము పృష్ఠాంతగణకానందములో చూడవలయును.

పూర్వకాలామృతే చతుర్థబిందుస్సమాప్తః

ఓమ్

పరబ్రహ్మణేనమః

# పూర్వకాలామృతే

పంచమబిందు ప్రారంభః

...(0)...

యాత్రాప్రకరణము శ్లో॥ ౧౫౭.

శ్లో॥ ప్రష్టుర్జాతక మీక్ష్య తస్య గమనం చాయుష్మతస్సంవదేత్
ప్రష్టా విస్మృతజాతకోయది భవేత్తస్యాపి కృచ్ఛ్రాద్వదేత్ ।
తల్లగ్నే గ్రహదృష్టిచారుశకునైరన్యైర్నిమిత్తైశ్శుభైః ।
స్తారాచంద్రబలాన్వితో గ్రహముఖంకృత్వా శుభేఽహ్నివ్రజేత్ ॥

టీక॥ ప్రష్టుః- ప్రయాణలగ్నమడుగువానికి; జాతకం-జన్మకాలగ్రహస్థితిని ఈక్ష్య-పరీక్షించి, ఆయుష్మతః-ఆయుర్దాయముగలవానికి, గమనం-ప్రయాణమును సంవదేత్ - బాగుగాచెప్పవలయును, ప్రష్టా-అడుగువాడు, విస్మృతజాతకః-మరచిన జన్మకాలగ్రహస్థితిగలవాడు, భవేద్యది- ఐనచో, తస్యాపి — వానికిన్ని, కృచ్ఛ్రాత్- కష్టముగా. వదేత్—చెప్పవలయును, తతః-అట్లుచెప్పినపిదప, తారాచంద్రబలాన్వితః తారాచంద్రబలములుగలవాడై, గ్రహముఖం-గ్రహయజ్ఞమును, కృత్వా-చేసి గ్రహ దృష్టిచారుశకునైః—ప్రయాణలగ్నమునకు గ్రహదృష్టివల్ల సుందరమగుశకునముల తోను, అన్యైః-ఇతరమగు, శుభైః-యోగ్యమగు, నిమిత్తైః-శకునములచేత, శుభే హ్ని - పంచాంగశుద్ధిదినమందు, తల్లగ్నే - ఆజ్యోతిష్కుడు చెప్పినలగ్నమందు వ్రజేత్-ప్రయాణముచేయవలయును.

అవ. యాత్రాప్రకరణమును జెప్పుచున్నాఁడు

తా॥ యాత్రయందభిలాషగలనరుఁడు జ్యోతిష్కుని శుభలగ్నప్రశ్నజేయగా నాజ్యోతిష్కుఁడు ప్రయాణకర్తజాతకమును జక్కఁగా నాలోచించి యతఁడుదీర్ఘా యుష్మంతుఁడుగా నుండెనేని ప్రయాణలగ్నమునఁజెప్పవలయునవియు నాప్రయాణ కర్తజాతకముదెలియనివాడై యున్నపక్షమందుఁగష్టముచేతనైన నష్టజాతకాదివిచా రముచేసి యతనియాయుఃప్రమాణమునుఁదెలిసికొని ప్రయాణమునకు లగ్నమునఁ జెప్పవలయుననియుఁబిమ్మట ప్రయాణకర్త జ్యోతిష్కునిచేఁ జెప్పఁబడిన తారా చంద్ర బలయుక్తలగ్నమందు నవగ్రహహోమాదుల జేసి శుభశకునములగుమంద గాఁమంగళవాద్యఘోషములతోఁ జూడబోవలయునని తా॥

## యాత్రాప్రశ్నఫలము

శ్లో॥ షష్ఠాష్టవ్యయగశ్శశీ శుభఖగైర్నప్రేక్షితో భంగకృత్ ।
క్రూరో లగ్నగతోఽష్టగోప్యశుభకృత్తత్ప్రశ్నలగ్నాద్బలీ।
ఏకో లగ్నగత శ్శుభస్తు ధనదో ద్వౌలగ్నగౌ చేచ్ఛుభౌ,
రత్నస్త్రీపశుభూమియానసుఖదౌ యాతుర్బలిష్ఠేయది॥ ౧౫౭

టీక॥ షష్ఠాష్టవ్యయగః - ప్రశ్నలగ్నమునకు ౬-౮-౧౨టనున్న, శశీ—చంద్రుడు, శుభఖగైః - శుభగ్రహములచేత, నప్రేక్షితోయది- చూడఁబడకపోయిన ట్లయిన, భంగకృత్ - విఘ్నముచేయువాడు, బలీ - ఉచ్చమిత్రాదిబలయుక్తుఁడగు, క్రూరః—పాపుఁడు, తత్ప్రశ్నలగ్నాత్-ఆప్రశ్నలగ్నముకన్న, అష్టగః-అష్టమును పొందినను, లగ్నగతః-ఆప్రశ్నలగ్నమునుపొందినను, అశుభకృత్-అశుభముచేయును, ఏకః-ఒక, శుభస్తు-శుభగ్రహమైతే, లగ్నగతః-లగ్నమునుపొందినదై; యాతుః-ప్రయాణముచేయువానికి, ధనదః—ధనమునిచ్చునదగును, బలిష్ఠౌ-మిక్కిలిబలముగల, ద్వౌ—రెండు, శుభౌ—శుభగ్రహములు, లగ్నగౌచేత్-లగ్నమందున్నచో, రత్న-రత్నములను, స్త్రీ-స్త్రీని, పశు-పశువులను, భూమి-భూమిని, యాన-వాహనమును, సుఖ - సుఖమును, దౌ - ఇచ్చునవి, స్యాతాం-అగుచున్నవి. [ఇట్లు జ్యోతిష్కుఁడు చెప్పవలయుననుట]

అవ. ౩ శ్లోకములచే యాత్రాప్రశ్నఫలమును జెప్పుచున్నాఁడు.

తా॥ చంద్రుడు శుభగ్రహములచేఁజూడఁబడకప్రశ్నలగ్నమునకు ౬టనైన ౮-టనైన ౧౨-టనైన నుండెనేని ప్రయాణమునకు విఘ్నముగలుగుననియు:ఉచ్చమిత్రక్షేత్రాదియుక్తమైన పాపగ్రహము ప్రశ్నలగ్నమందైనను ౮-టనైననుండెనేని యశుభకరంబనియు: నొకశుభగ్రహము ప్రశ్నలగ్నమును బొందియున్న ప్రయాణకర్తకు ధనలాభము గలుగుననియు: నత్యంతబలయుక్తములైన రెండుగ్రహములు ప్రశ్నలగ్నమందుండెనేని రత్నవనితాపశుభూలాభంబులును: ప్రయాణమం దత్యంతసౌఖ్యము కలుగునని జ్యోతిష్కుఁడు ప్రయాణకర్తకు జెప్పవలయును.

శ్లో॥ యాత్రాప్రశ్నగృహస్య సప్తమగతామార్గేఽర్థదాద్విత్రిగాః ।
కన్యాబంధుసహోదరా స్సుతగతా యాతుశ్శ్వమిత్రార్థదా ।
బంధుస్థా స్సుఖదా స్సుభాగ్యవగా స్సత్కర్మగా ధర్మగాః ।
క్షేమాయుష్యపశుప్రశంసకలాస్స్రేతుపూర్ణార్థదాః॥ ౧౫౮

టీక॥ సకలాః-సమస్తమగు: శుభాః-శుభగ్రహములు: యాత్రాప్రశ్నగృహస్య—ప్రయాణప్రశ్నలగ్నమునకు: సప్తమగతాశ్చేత్ ఏడవయింటనున్నచో: మార్గే-

మార్గమధ్యమందే; అర్థదాః-ధనమునిచ్చునవి: ద్వితృగాః - ౨-౩ రాసులనొందినవః కన్యాబంధుసహాయదాః—కన్యాబంధుసహాయములనిచ్చును; సుతగతాః-పంచమమును బొందిన: మిత్రార్థదాః-స్నేహితులను ధనమునిచ్చును; బంధుస్థాః-చతుర్థమునుపొం దినచో; శుభదాః-శుభమునిచ్చును; గగనగాః—దశమమునుపొందినచో, సత్కర్మదా -మంచికర్మనిచ్చును: ధర్మగాః-నవమమును పొందినచో: క్షేమాయుష్యపశుప్రదః- క్షేమఆయుర్దాయపశుపులనిచ్చును: ఉద్యోతు-ఏకాదశమందున్న:పూర్ణార్థదాః-సంపూర్ణ ధనమిచ్చును.

తా॥ శుభగ్రహములు యాత్రాప్రశ్నలగ్నమునకు ౨-పైనను: ౩-పైనమం డిరేని స్వజనసహాయకన్యాలాభంబులును: ౪-పైనుండిరేని శుభఫలంబులను: ౫-ట మండిరేని సుహృల్లాభంబులును; ౩-ట నుండిరేని ప్రయాణమైపోవునపుడు మార్గ మధ్యంబువనే ధనలాభంబును: ౯-ట నుండిరేని దీర్ఘాయుష్య క్షేమపశులాభంబులును ౧౦-టనుండిరేని యుత్తమకర్మంబులును: ౧౧-ట నుండిరేని సర్వాభీష్టసిద్ధులును సిరీతిఁ బ్రయాణకర్తకీ ఫలములుగలుగునని తా॥

శ్లో॥ యాత్రాప్రశ్నగృహంచరం శుభగతిస్స్యాత్తత్ప్రశ్నలగ్నంస్థిరం
నాస్త్యేవాస్య గతిర్ద్విమిశ్రఫలదం చేద్ద్విస్వభావం గృహమ్ ।
వక్రీ లగ్నగతో గ్రహోనహి గతిర్యద్యస్తగోలగ్నగో ।
హానిఃస్యాదథవాస్తగోఽప్యశుభకృత్తత్ప్రశ్నలగ్నేశ్వరః॥౧౫॥

టీక॥ యాత్రాప్రశ్నగృహం—ప్రయాణప్రశ్నలగ్నము: చరంచేత్- చరమై నచో: శుభగతిః-మంచిప్రయాణము; స్యాత్-అగును: తత్ప్రశ్నలగ్నం-ఆప్రయాణ ప్రశ్నలగ్నము: స్థిరంచేత్-స్థిరమైనచో: అస్య - ఈప్రయాణముచేయువానియొక్క: గతిః—ప్రయాణము నాస్త్యేవ-లేదు: గృహం ప్రశ్నలగ్నము: ద్విస్వభావంచేత్-ద్వి స్వభావమైనచో: మిశ్రఫలదం-మిశ్రఫలమునిచ్చును [అనగా పూర్వార్థమైనచో స్థిర సమీపమగుటచే గమనములేదు ఉత్తరార్థమైనచో చరసమీపమగుటచే మంచిగమ నముకలుగునని తాత్పర్యము] గ్రహః - ఏదోఒకగ్రహము: వక్రీ-వక్రగతికలదై: లగ్నగతశ్చేత్-లగ్నమందున్నచో: గతిః-గమనము: న-లేదు: అస్తగః- అవయింటి కధిపతియగువాడు: లగ్నగోయది—లగ్నమందున్నచో: హానిః-నష్టము:స్యాత్-అగును అథవా-లేక: తత్ప్రశ్నలగ్నేశ్వరః-ప్రయాణప్రశ్నలగ్నాధిపుడు: అస్తగోపి—అవ యింటిని పొందినను: అశుభకృత్-చెరుపుచేయును.

తా॥ ప్రియాణప్రశ్న కాలగ్నము స్థిరలగ్నమైయుండినను ద్విస్వభావలగ్నములోఁ బూర్వార్థమైయుండినను ప్రయాణమునకు భంగముకలుగుననియు, చర లగ్నమైయుండినను ద్విస్వభావలగ్నములో నుత్తరార్థమైయుండినను, సుఖప్రియాణము కలుగుననియు ఏ గ్రహంబైనను వక్రించి ప్రశ్నలగ్నమందుండిన ప్రయాణమునకు విఘ్నము గలుగుననియు, ప్రశ్నలగ్నసప్తమ స్థానాధిపతియాలగ్నమందుండిన ప్రయాణకర్తకు హానిగలుగుననియు ప్రశ్నలగ్నాధిపతి సప్తమస్థానమందుండినను శుభకరుండని తా॥

యాత్రాతిథివారనక్షత్రనిర్ణయము

శ్లో॥ రిక్తాపర్వదినాది విష్టితిథయ షష్ఠ్యష్టమీ ద్వాదశీ ।
వర్జ్యా భూమిజభానుపుత్రదినకృద్వారాశ్చ యాత్రాక్షణే ।
హస్తాదిత్యహరిద్వయాంత్యశశభృద్దస్రార్క్యమిత్రాహ్వయా ।
శ్శస్తా మధ్యమతారకా శ్శతభిషఙ్మూలప్రజేశోత్తరాః॥ ౬౦

టీక॥ రిక్తాః-రిక్తతిథులు, పర్వ-పంచపర్వలు, దినాది-పాడ్యమి, విష్టి-భద్రాకరణయుక్తము, తిథయః-తిథులు, షష్ఠి - షష్ఠియు, అష్టమీ - అష్టమియు, ద్వాదశీ-ద్వాదశియు [రెంటుపక్షములయందుండునవి] వర్జ్యాః-వదలతగినవి, భూమిజ-అంగారకునియొక్క, భానుపుత్రి-శనియొక్క, దినకృత్-సూర్యునియొక్క: వారాః-వారములు; [అనఁగా మంగళశన్యాది వారములనుట] యాత్రాక్షణే-యాత్రాకాలమందు; వర్జ్యాఃవదలతగినవి; హస్త - హస్తయు: ఆదిత్య-పునర్వసు; హరిద్వయ-శ్రవణధనిష్ఠలు: అంత్య-రేవతి; శశభృత్-మృగశీర్ష;దస్రి-అశ్వని: అర్క్య-పుష్యమీ; మిత్రి - అనూరాధ: అహ్వయాః - పేర్లుగల నక్షత్రములు; శస్తాః - ముఖ్యములు; [అనఁగా మంచివనుట] శతభిషక్-శతభిషము:మూల-మూలయు, ప్రజేశ-రోహిణి ఉత్తరాః-ఉత్తర: మధ్యమతారకాః-మధ్యమనక్షత్రములు.

అవ. ప్రియాణమునకు తిథివారనక్షత్రంబులఁజెప్పుచున్నాఁడు

తా॥ రిక్తతిథులును: పంచపర్వంబులును:ప్రతిపత్తును భద్రకరణయుక్తదినంబును పక్షద్వయగతంబు లగుద్వాదశీషష్ఠ్యములును భావ్యంగారక శనివారంబులు వివి ప్రియాణమున కయోగ్యంబులనియుఁ దక్కినతిథివారములు నశ్వని: మృగశీర్షము పునర్వసు, పుష్యమి: హస్త: అనూరాధ: శ్రవణ: ధనిష్ఠ: రేవతి ఈ నక్షత్రములు

ప్రయాణమునకు ప్రశస్తంబులనియు, రోహిణీ: ఉత్తర, మూల, ఉత్తరాషాఢ, శత భిషము, ఉత్తరాభాద్ర ఈనక్షత్రములు మధ్యంబులనియుఁదక్కిన నక్షత్రము లయోగ్యములనియు తా॥

వారశూలనక్షత్రశూలాలు

శ్లో॥ శూలాఖ్యే ష్వథ వారభేషు గమనం యాతుర్గద వేద్రోగకృ
చ్చందార్కార్కిజవారయోస్సురపభే ప్రాచీం నగచ్ఛేద్దిశమ్
జీవేఽజాంఘ్రిభవేవ చాంతకదిశం శుక్రార్కయోః స్రష్టృభే,
పశ్చాదర్యమభేకుజజ్ఞదినయోర్యాతాచ సౌమ్యాందిశమ్ ॥

టీక॥ యాతా - ప్రయాణముచేయువాఁడు, చంద్రార్కార్కిజవారయోః — సోమశనివారములయందు, సురపభే—జ్యేష్ఠానక్షత్రమందు, ప్రాచీం — తూర్పుదగు దిశం-దిక్కునుగూర్చి, జీవే—గురువారమందు, అజాంఘ్రిభే - పూర్వభాద్రయందు అంతకదిశం-దక్షిణదిక్కునుగూర్చియు: శుక్రార్కయోః- శుక్రాదివారములయందు, స్రష్టృభే-రోహిణియందు, పశ్చాత్-పశ్చిమదిక్కునుగూర్చియు, కుజజ్ఞదినయోః - మంగళబుధవారములయందు, అర్యమభే-పుబ్బయందు, సౌమ్యాం-ఉత్తరమగు,దిశం దిక్కునుగూర్చియు, నగచ్ఛేత్ — వెళ్ళుటకూడదు శూలాఖ్యేషు-శూలములను, వార భేషు - ఈ వారనక్షత్రములయందు: యాతుః-ప్రయాణముచేయువానికి.రోగకృత్-రోగముచేయునది, భవేత్-అగును.

అవ॥ దిగ్భేదముచేత వారశూలనక్షత్రశూలలఁజెప్పుచున్నాఁడు

తా॥ తూర్పుదిక్కునకు సోమ శని వారంబులును, జ్యేష్ఠానక్షత్రంబునుదక్షిణ మునకు గురువారంబును, పూర్వాభాద్రనక్షత్రంబును, పశ్చిమమునకు భానుశుక్ర వారంబులును, రోహిణీనక్షత్రంబును, ఉత్తరమునకు మంగళ బుధ వారములును పూర్వఫల్గునీ నక్షత్రంబును,ఈ రీతిననీదిక్కున కీవారనక్షత్రములుశూలసంజ్ఞగలవి గావున నట్టివారశూలనక్షత్రశూలలయందుఁబ్రైనముపోయినవానికి వ్యాధికలుగును.

పరిఘాతదండచక్రలక్షణము

శ్లో॥ ఆగ్నేయానిలకోణయోశ్చ విలిఖేదేకాంచ రేఖాం చతు
ష్కోణేప్రాగ్లిఖతే ప్రసిద్ధపరిఘా దండాఖ్యచక్రే శుభే ।
తత్రాప్రాంశుషు సప్తసప్త గమనే వహ్న్యాదితారాలిఖే ।
దష్టావింశతిసంఖ్యయైవపరిఘాదండోనలంఘ్యోఽధ్వగైః ॥ ౧౬౨

టీక॥ అగ్నేయాలకోణయోః — అగ్నివాయుకోణములయందు: ఈః శాన్య నైఋుర్తులయందు; ఏకాం-ఒక; రేఖాం-గీటును, విలిఖేత్ - వ్రాయవలయును. [దీనికి పరిఘాదండచక్రమనిపేరు] ప్రాగ్లిఖితే—ముందువ్రాయఁబడినట్టి;చతుష్కోణే-నాలుగుకోణములుగ; శుభే—మంగళమైన: పరిఘాదండాఖ్యచక్రే — పరిఘాదండమనుచక్రమందు, వహ్న్యాదితారాః-కృత్తిక మొదలగు నక్షత్రములను: అష్టావింశతి సంఖ్యయా-౨౮-వ సంఖ్యచేత, తత్ప్రాగాదిషు- ఆచక్రముయొక్క తూర్పుమొదలగు దిక్కులయందు: సప్తసప్త ౭-౭ చొప్పున: లిఖేత్-వ్రాయునగు;అధ్వగైః—ప్రయాణముచేయువారిచే; గమనే - ప్రయాణమందు పరిఘాదండః-పరిఘాదండము;నలంఘ్య-అతిక్రమించతగనిది; [అనఁగా ఆయాదిక్కుయందుండు నక్షత్రములయందు వాయాదిక్కులకు ప్రయాణముకూడదని ముఖ్యతాత్పర్యము.

—పరిఘాదండచక్రము—



అవ॥ పరిఘాదండచక్రస్వరూపమును దెలియజేయుచున్నాడు.

తా॥ వాయవ్యకోణము మొదలుకొని ఆగ్నేయకోణమువరకు నొకరేఖయును నైరుతికోణముమొదలుకొని ఈశాన్యకోణమువరకు నొక రేఖయును వ్రాసిన పరిఘాదండచక్రమగును ఆచక్రమందు బూర్వదిక్కునకృత్తికమొదలగు ౭ నక్షత్రములును; దక్షిణంబున మఖ మొదలగు ౭ నక్షత్రంబులును, పశ్చిమంబునఅనూరాధ మొదలుకొని అభిజిత్తుతోగూడ ౭ నక్షత్రంబులును; ఉత్తరంబున ధనిష్ఠమొదలగు ౭ నక్షత్రంబులును ఈ రీతినివ్రాయగా ఏనక్షత్రము లేదిక్కునకువచ్చునోయానక్షత్రములయందాదిక్కునకు బోగూడదని తా॥

## నక్షత్రరాసులకు దిగ్ద్వారనిర్ణయము

శ్లో॥ యత్కాష్ఠాస్థితభాని యాని గమనే ద్వారాణి తస్యా దిశః ।
ప్రాక్ప్రోక్తే విహితస్య పుష్యదినకృన్మిత్రాద్యతారాస్సదా ।
సర్వద్వారశుభా స్సుఖార్థఫలదాః ప్రాగాదిమేషాదయో ।
దిగ్ద్వారాఖ్యగృహాః ప్రదక్షిణవిధావేకైకశో౽నర్థదాః॥ ౧౬౩

టీక॥ యత్కాష్ఠాస్థితభాని – ఏదిక్కుయందున్ననక్షత్రములు; యాని–ఏవో; తాని-అవి; తస్యాః-ఆ; దిశః-దిక్కుకు; ద్వారాణి - ద్వారములు, చక్రే - పరిఘాదండచక్రమందు; ప్రాక్-పూర్వశ్లోకమందు; విహితస్య-గమననిషేధమనిచెప్పినఏడు నక్షత్రములయందు; పుష్య-పుష్యమి; దినకృత్-హస్త; మిత్ర - అనూరాధ; ఆద్య అశ్వినియను, తారాః-నక్షత్రములు; సదా - యెల్లప్పుడు; సర్వద్వారశుభః – అన్ని ద్వారములయందు మంచివి సుఖార్థఫలదాః–సుఖధనఫలములనిచ్చుచున్నవి; మేషాదయః- మేషముమొదలైన-ప్రాగాది- తూర్పుమొదలుగా; దిగ్ద్వారాఖ్యగృహాః - దిగ్ద్వారములని పేరుగలరాసులు; ప్రదక్షిణవిధౌ-ప్రదక్షిణముగా; ఏకైకశః-ఒక్కొక్కటి అనర్థదాః - ఆపత్తునుచేయునవి.

అవ॥ నక్షత్రరాసులకు దిగ్ద్వారనిర్ణయమును జెప్పుచున్నాడు

తా॥ పూర్వశ్లోకమందుఁజెప్పఁబడినచక్రమంబున; ఏదిక్కునందుండెడి నక్షత్రములాదిక్కునకుద్వారనక్షత్రంబులనియుఁబూర్వశ్లోకోక్తపరిఘాదండచక్రమునందుగమనవిషయమై దిగ్భేదంబున నిషేధింపబడిన నక్షత్రములలో బుష్యహస్తానూరాధాశ్వినీ నక్షత్రంబులు సకలదిగ్గమనములయందు శుభసుఖార్థఫలప్రదంబులనియు దూర్పు దిక్కునకు మేషసింహధనూరాసులు దక్షిణమునకు వృషభకన్యామకరరాసులును పశ్చిమంబునకు మిధునతులాకుంభరాసులును; ఉత్తరంబునకు కటకవృశ్చికమీన రాసులు నీరీతి నీరాసు లీదిక్కునకు ద్వారరాసులుగావున నిట్టిద్వారరాశిలగ్నములయందాయాదిక్కులకు బోగూడదని తా॥

## ద్వాదశ లగ్నములయందు గమన ఫలము

శ్లో॥ మేషే భద్రిమావాప్నుయాద్గవిసుఖంయుగ్మే మృతింకర్కటే
లాభం శోకభయంహరౌజ్వరంభయంకన్యాగృహే ఉర్ధందటే।
కీటే విగ్రహమేవ చాపనిలయే క్షేమం మృగే స్త్రీధనం।
కౌటిల్యం కలశేనుభోజనసుఖంమీనేప్రియాణేఽధ్వగః॥౧౬౨

టీక॥ అధ్వగః-ప్రయాణముచేయువాడు, మేషే-మేషరాశియందు; భద్రిం-మంగళములు; గవి- వృషభమందు; సుఖం-సుఖమును; యుగ్మే - మిధునమందు; మృతిం-మరణమును; కర్కటే-కర్కటకమందు; లాభం-లాభమును; హరౌ-సింహమందు- శోకభయం-దుఃఖభయమును; కన్యాగృహే-కన్యయందు; జ్వరభయం-జ్వరమును; ఘటే-తులయందు; అర్ధం-ధనమును, కీటే-వృశ్చికమందు; విగ్రహం-విరోధమును చాపనిలయే-ధనస్సు;క్షేమం-క్షేమమును;మృగే-మకరమందు;స్త్రీధనం-స్త్రీరూపధనమును; కలశే కుంభమందు; కౌటిల్యం - కుటిలగమనమును;మీనే-మీనమందు; భోజనసుఖం-భోజనసుఖమును; ప్రయాణే - ప్రయాణమందు; అవాప్నుయాత్-పొందును.

అవ॥ ప్రయాణవిషయమై లగ్నఫలంబుల వివరించుచున్నాడు

తా॥ మేషలగ్నమందుబైనముపోయినవారలకుశుభంబును, వృషభమందు సౌఖ్యంబును; మిధునమునందు మరణంబులును; కటకమందు భూధనాదిలాభంబును సింహమునందు వ్యసనంబును; కన్యాలగ్నమందు జ్వరభయంబును;తులయందుధన లాభమును; వృశ్చికమందు కలహంబును; ధనస్సునందు క్షేమంబును; మకరమందు స్త్రీలాభంబును,కుంభమందువక్రగమనంబును,మీనమందుభోజనసుఖంబునుకలుగును

## ప్రతి శుక్రభౌమ బుధ దోషములు శ్లో॥ ౧౬౫

శ్లో॥ యాత్రాయాం ప్రతిభార్గవం ప్రతికుజం ప్రత్యబ్జజంచార్తికృ
చ్ఛుక్రో దక్షిణతః స్థితోఽప్యశుభకృద్యాతుః ప్రవేశేపివా।
మార్గే యద్యుదితో గ్రత శ్శశిసుత స్తత్రైవ గంతా వసే
త్సైన్యస్యాస్తమవాప్నుతశ్చ పరతోయాతాధ్వశేషంవ్రజేత్

టీక॥ యాత్రాయాం-ప్రయాణమందు; ప్రవేశే-ప్రవేశించుటయందు; ప్రతిభార్గవం-శుక్రునికెదురుగాను;ప్రతికుజం-కుజునకెదురుగాను; ప్రత్యబ్జజంచ - బుధునకెదురుగాను; యాతుః - ప్రయాణమగువానికి; ఆర్తికృత్ - పీడకలుగచేయును. శుక్రః-శుక్రుడు దక్షిణతః వెళ్ళువానికి దక్షిణమందున్న అశుభకృత్ - చెడుపు

చేయును, ఇచ్చటవిశేషముగలదు] శుక్రుఁడు తూర్పునున్న తూర్పు, ఈశాన్యము, ఉత్తరము,వాయవ్యదిక్కులయందు పడమరనున్ననైఋతిదక్షిణాగ్నేయములందు వెళ్లటకూడదని బాలబోధినియందు చెప్పబడినది. శ్లో॥ పూర్వాదివాయువ్యవిలోమకోష్ఠా త్పూర్వేభృగౌతిష్ఠతిచేన్న యాయాత్ । పశ్చాది సప్తార్చి విలోమకోణే పశ్చాద్భృగౌతిష్ఠతిచేన్నయాయాత్ ॥ (బుధునకునిశేషము) శశిసుతః—బుధుఁడు, అగ్రతః - వెళ్ళువానికి ముందుభాగమందు, మార్గే - మార్గమధ్యయందు, ఉదితో యది-ఉదయించినచో, గంతా - ప్రయాణముచేయువాడు, తత్రైవ - ఆమార్గమధ్యమందే, వసేత్ - ఉండును, సౌమ్యస్య - బుధునియొక్క అస్తమవాప్తతః- అస్తమించుటకంటె, పరతః-పిమ్మట, అధ్వశేషం-మార్గశేషమును, వ్రజేత్-వెళ్ళనగును

అవ. ప్రతిశుక్రభౌమబుధదోషములఁ జెప్పుచున్నాఁడు.

తా॥ పయనముపోవునపుడునుమరల గృహంబునకు వచ్చునప్పుడును శుక్రాంగారకబుధ లభిముఖులైయుండిరేని పీడాకరులగుదురనియు, శుక్రుఁడు ప్రయాణకర్తకు దక్షిణభాగమందుండిన శుభకరుఁడు గానఁదూర్పుదిక్కునమండనపుడు పీశాన్యోత్తర వాయవ్యదిక్కులకును పశ్చిమంబునముండువవుడు నైఋతిదక్షిణాగ్నేయ దిక్కులకును పయనముపోఁగూడదనియును బుధుఁడుపయనము పోవుచుండ మధ్య మార్గమందెదుట నుదయించెనేని మరల నస్తంగతుడై యుదయమగువరకుప్రయాణకర్త పయనము పోగూఁడదనియును తా॥

పృతిశుకాృదిదోషములకు గోతృభేదముల పరిహారము

శ్లో॥ భారద్వాజవసిష్ఠవాత్స్యభృగవోఽత్ర్యాంగిరసౌ కశ్యపో ।
గార్గ్యో గౌతమనామకశ్చ మునయస్తద్గోత్రిణామర్థినామ్ ।
ఏకగ్రామవివాహరాష్ట్రవికలక్షుత్పీడితజ్ఞానినాం ।
చార్తానాం ప్రతిభార్గవప్రతికుజప్రత్యారదోషానహి । ౧౬౬

టీక॥ భారద్వాజ - భారద్వాజుఁడు, వసిష్ఠ- వసిష్ఠుఁడు, వాత్స్య-వాత్స్యుఁడు భృగవః—భృగువు, అత్రి-అత్రియు, అంగిరా-అంగిరసుఁడు, కశ్యపః—కశ్యపుఁడు గార్గ్యః - గార్గ్యుడు, గౌతమనామకః - గౌతముఁడు, మునయః-ఏమునటగలరో తద్గోత్రిణాం-అగోత్రముగలవారలకును, అర్థినాం- యాచకులకును, ఏకగ్రామ-ఒక గ్రామమందు, వివాహ-వివాహమందు, రాష్ట్రవికల-దేశోపద్రవమందు, క్షుత్పీడిత-ఆకలిగలవారలకు, జ్ఞానినాం -జ్ఞానులకు, ఆర్తానాం - రోగముచేగాని రాజోపద్రవముచేగాని పీడితులగువారికిని, ప్రతిభార్గవప్రతికుజప్రత్యారదోషాః- ప్రతిభార్గవకుజబుధదోషములు, నహి-లేవు.

అవ. పూర్వశ్లోకోక్త ప్రతికూకార్రిదిదోషములకు గోత్రభేదముచేఁ బరిహార మును జెప్పుచున్నాఁడు.

తా॥ భారద్వాజవసిష్ట వాత్స్య భృగు అత్రి అంగీర కాశ్యప గార్గగౌతమ గోత్రజులకును యాచకులకు నొకగ్రామమందు నొకగృహమందుండి మఱియొక గృహమునకు బోవువారలకును, వివాహమునకుఁబోవువారలకును, దేశోపద్రవంబుచే బరుగుబారెడివారలకు, సన్నాతురులై వెళ్ళెడివారలకు, మహాయోగములకును అర్హు లగువారలకును నీక్రింద జెప్పఁబడియున్న ప్రతికూక్రభౌమ బుధదోషములులేవనుట.

యాత్రాఫణిచక్రలక్షణము

శ్లో॥ త్రీణి త్రీణి శశిస్థభాంతిగణనా కార్యార్క-సంస్థోదుతః ।
పంచ స్యు ర్విషమాణి రోగభయదా న్యన్యాని చత్వారితు ।
యుగ్మాన్యేవ సదిష్టదాని తదిదం యాత్రాఫణే ర్యత్ఫలం ।
కించక్రేణ ఫణిస్వరూప మసుభంత్యాజ్యం శుభేకర్మణి ॥

టీక॥ అర్క-స్థోదుతః—సూర్యుఁడుండు నక్షత్రము మొదలు, త్రీణిత్రీణి-మూడు మూడునక్షత్రములు, శశిస్థ-చంద్రుడున్న, భాంత-నక్షత్రమువరకు, గణనా—లెక్క కార్యా-చేయతగినది, విషమాణి-బేసిమూళ్ళు, పంచ - ఐదు, రోగభయదాని- రోగ భయమునిచ్చునవి, అన్యాని-ఇతరమగు, చత్వారి-నాలుగగు, యుగ్మాని-సరిమూళ్లు, సదిష్టదాని - బాగుగయిష్టఫలములనిచ్చునవి, స్యుః - అగుచున్నవి, యాత్రాఫణేః- ప్రయాణసర్పచక్రమునకు, యత్-యే, ఫలం-ఫలమో, తత్-అ, ఇదం-ఈఫలము చక్రేణ-ఫణిచక్రముచే, కిం-ఏమిప్రయోజనము, ఫణిస్వరూపం-ఫణిరూపము, అ శుభం-చెడుది, శుభే-మంచిదగు, కర్మణి-కర్మయందు, త్యాజ్యం-విడువతగినది.

అవ. యాత్రాఫణిచక్రమునకు సమానఫలమును జెప్పుచున్నాఁడు.

తా॥ పైనముపోవువారు సూర్యస్థిత నక్షత్రము మొదలు చంద్రస్థితనక్షత్రము వరకు మూఁడేసినక్షత్రములను గణనచేయవలయును,ఈక్రమంబున గణనచేయఁగా ఇరువదిఏడు నక్షత్రములు ౯ త్రికంబులగును, అట్టిత్రికంబులలో విషమత్రికంబు లగు ౧, ౩, ౫, ౭, ౯. ఈ త్రిక ప్రతిపాద నక్షత్రములలో పైనముపోయిన రోగభయంబులుకలుగుననియు, మిగతసమ త్రికంబులగు ౪, ౬, ౮. ఈత్రికప్రతి పాదక నక్షత్రములు ఇష్టఫలప్రదములనియు గ్రంథాంతరమందు జెప్పబడియున్న యాత్రాఫణిచక్రార్థం బిదియగావనాచక్రము వ్యర్థంబని తా॥

## చంద్రగర్భచక్రలక్షణము

శ్లో॥ ఆగ్నేయర్క్ష మఘానురాధవసుభే ష్వేకైకభాత్సాభిజి ।
నక్షత్రాణిచ సప్తసప్తగమనేదద్యుః ప్రయాతుః ఫలమ్ ।
మృత్యుర్వ్యాధిభయార్థరాశివసుధాభీత్యామయాఖ్యం క్రమా ।
త్కించ క్రేణతు చంద్రగర్భఫలితం త్వేతన్మయానిశ్చితమ్ ।

టీక॥ ఆగ్నేయర్క-కృత్తిక, మఘ - మఘయు, అనూరాథ - అనూరాథయు, వసు-ధనిష్ఠయునను, భేషు - నక్షత్రములయందు, సాభిజిన్నక్షత్రాణి — అభిజిత్తుతో గూడిన నక్షత్రములు, ఏకైకభాత్-ఒక్కొక్కనక్షత్రమునుండి, సప్తసప్త-ఏడేడు, గమనే-ప్రయాణమందు, ప్రయాతుః- ప్రయాణముచేయువానికి, ఫలం-ఫలమును, దద్యుః—ఇచ్చునవి, మృత్యుః - మృత్యువును, వ్యాధి- వ్యాధిని, భయ-భయమును, అర్థరాశి - ధనరాశిని - వసుధా - భూమిని, భీతి-భయమును, ఆమయ-రోగమును, ఆఖ్యం-ఈపేర్లుగలఫలమును, క్రమాత్-క్రమముగా, దద్యుః-ఇచ్చునవి, [ఇట్లుప్రతి సప్తకమునకు నూహించునది] చంద్రగర్భఫలితం-చంద్రగర్భచక్రఫలము, మయా -నాచే, నిశ్చితం-నిశ్చయించబడినది, చక్రేణతు-చక్రముచేతనైతే: కిం-ఏమిఫలము [ఫలములేదనుట] ఇచ్చట నొకవిశేషమున్నది. ఈ కృత్తికాదిగణనానియమము ప్రయాణమునందును రోగములయందును కుజుడున్నరాశిమొద లెక్కించవలయును యితరములగు శుభకర్మలయందు సూర్యుడుండు నక్షత్రము మొదలు చంద్రుడుండు నక్షత్రమువరకు లెక్కచేయవలయును.

శ్లో॥ రోగేకుజస్థనక్షత్రా ద్యద్దేచపురుషర్క్షతః ।
యాత్రాయాంకృత్తికాదిస్యా దర్కస్థాచ్ఛుభకర్మణి ॥

ఆవ. చంద్రగర్భచక్రమునకు సమానఫలమును జెప్పుచున్నాడు.

తా॥ కృత్తికమొద లాశ్లేషవరకు, మఘ మొదలు విశాఖవరకును, అనూరాథమొద లభిజిత్తుతోఁగూడ శ్రవణమువరకును: ధనిష్ఠమొదలు భరణివరకును: గ్రమంబుగ నేడేసినక్షత్రము లేడేసిఫలంబులఁ గలుగజేయుననియు నదిఎట్లనఁబడిన కృత్తిక మృత్యువును: రోహిణివ్యాధిని: మృగశిర భయమును: ఆర్ద్ర అర్థరాశిని పునర్వసు భూమిని: పుష్యమి భీతిని: ఆశ్లేష రోగమును: మఘ మృత్యువును: పుబ్బవ్యాధిని—ఉక్తక్రమంబున చతుస్సప్తకనక్షత్రములును సప్తవిధఫలంబులును ప్రయాణవిషయమై గలుగఁజేయుననియుఁ జంద్రగర్భచక్రనిర్మాణముచేత గలిగెడు ఫలమును నేనుస్పష్టముగా వివరించితినిగావ నాచక్రములవలన వేఱుఫలంబు లేదనియు తా॥

## అడలస్వరూపలక్షణము

శ్లో॥ చంద్రాదిష్ఠితభాంత మేవ గణయే దర్కాన్వితర్క్షాదితో।
నక్షత్రాణ్యపి సప్త సప్త గమనే దద్యుః ఫలం సాభిజిత్।
క్షేమం తాడన మార్తి మాయు రభయం దేశభ్రమం తాడనం
యాతుః శ్చాడలదోష ఏవ సకలే కార్యే చ చింత్యో౽థవా॥

టీక॥ అర్కాన్వితర్క్షాదితః – సూర్యుడుండునక్షత్రము మొదలు, సాభిజిత్-అభిజిన్నక్షత్రముకలుగునట్లుగా, సప్త సప్త-ఏడేడు, నక్షత్రాణి-నక్షత్రములను, చంద్రాధిష్ఠితభాంత మేవ - చంద్రుడుండునక్షత్రమువరకు, గణయేత్ - లెక్కించవలయును, తాని-ఆనక్షత్రములు, గమనే – ప్రయాణమందు, యాతుః-ప్రయాణమగువానికి, క్షేమం క్షేమమును, తాడనం-తాడనమును, ఆర్తిం-పీడను, ఆయుభయం- అయుః-ఆయుర్దాయమును, అభయం-అభయమును, దేశభ్రమం-దేశచాలనమును, తాడనం తాడనమును, ఫలం-ఫలమును, క్రమాత్-క్రమముగా, దద్యుః-ఇచ్చుచున్నది, యాతుః-ప్రయాణమగువానికి, అడలదోషఏవ- అడలదోషమే, చింత్యః-విచారించవలయును, అథవా-లేక, సకలేఃసమస్తమగు, కార్యే-కార్యములయందును, విచింత్యః-విచారించతగినది.

అవ. అడలస్వరూపమును జెప్పుచున్నాడు.

తా॥ సూర్యుడున్ననక్షత్రము మొదలభిజిన్నక్షత్రములోc గూడునటుల చంద్రుడుండెడి నక్షత్రమువరకు నేడేసినక్షత్రముల గుణింపవలయు ననియు నిటుల గుణింపcబడిన యేడేసినక్షత్రము లేడేసిఫలంబుల cగలుగజేయును, ఎట్లనగా బనిన ప్రథమనక్షత్రము క్షేమము, రెంతవది ప్రహారమును, మూడది మనఃపీడను నాల్గవది అయువును, అయిదవది భయరహితమును; ఆఱవదిదేశసంచారమును; ఏడవది తాడనమును; ఈక్రమంబున సప్తనక్షత్రములు సప్తవిధఫలంబులc గలుగజేయు ననియును; ఏవకారార్థమున ప్రయాణవిషయమై యీ చెప్పిన అడలదోషవిచారము ఆవశ్యముగా గూడదగినదియు లేక మతియొక్క పక్షంబున సమస్తశుభకార్యముల యందును అడల దోషముజూడదగినదని తా॥

## త్ర్యంశస్వరూపము శ్లో॥ ౧౩౦

శ్లో॥ యాత్రావారభవాసరాంశ్చ మిళితాన్ స్వస్వాబ్దితస్తాన్ క్రమా।
త్కృత్వా ద్విత్రిచతుర్గుణాన్ ప్రశిభ జేత్సప్తాష్టషడ్భిః క్రమాత్।

శూన్యేషు త్రిషు రోగభీతిమరణా న్యాగసు ప్రయాతుః క్రమా ।
చ్ఛేషేషు త్రిషు రాజ్యరత్నపృథివీర్దద్యాత్తు త్ర్యంక స్త్వయమ్

టీ॥ యాత్రా ప్రయాణదినముయొక్క, వారః-వారము, భ — నక్షత్రము' వాసర-తిథి, తాః—వాటిని; సుస్వాదితః—తమతమ మొదలునుండి; మిళితాః-కలః; పఁబడినవగుచూ, [మూడుప్రతులుగానుంచి] ద్వి-రెండు, త్రి—మూడు, చతుఃనాలుగు గుణాః—రెట్లుగలవానిగా, కృత్వా-చేసి, (అనగా ప్రయాణదినవారనక్షత్రతిథి సంఖ్యలకలిపి మూడుప్రతులుగానుంచి మొదటిప్రతిని ౨ చేత; రెండవప్రతిని ౩ చేత మూఁడవప్రతిని ౪ గింటిచేత గుణించవలయుననుట) క్రమాత్—క్రమము, సప్తాష్టభిః— ౭-౮-౯-టిచే: ప్రవిభచేత్ - భాగించవలయును, త్రిషు-భాగించబడినమూడు మొత్తములు, శూన్యేషు-శేషములేనివగుచుండఁగా: ప్రయాతుః-ప్రయాణముచేయు వానికి, రోగభీతిమరణాని-రోగభీతిమరణములను, క్రమాత్—క్రమముగా-దద్యాః-ఇచ్చును, త్రిషు - మూఁడు, శేషేషు-శేషముగలవగుచుండగా, రాజ్యరత్నపృథివీ - రాజ్యరత్నభూములను; క్రమాత్ - క్రమముగా [వరుసగా] దద్యాత్-ఇచ్చును;[లబ్ధముతో పనిలేదు) అయమేవ-ఇదే, త్ర్యంకః-త్ర్యంకమనబడును.

అవ॥ త్ర్యంకస్వరూపమును దెలియజేయుచున్నాడు:

తా॥ ప్రయాణకర్త పైనముబోవు సమయమున తిథివారనక్షత్రముల మొదటి నుండిలెక్కపెట్టి యనగా శుక్లపాడ్యమి మొదలు ప్రయాణదినమువరకును భాను వారము మొదలు ప్రయాణవారమువరకును, అశ్వినీనక్షత్రము మొదలు ప్రయాణనక్షత్రమువరకును, గణనచేసి అయినగుణకమును నొకరాశిగాజేర్చి యారాశిని మూడు భాగములుగాచేసియందుప్రథమభాగమునురెంటనుద్వితీయభాగమునుమూడనుతృతీయ భాగమును ౪ టను ఎచ్చు గుణించియాత్రవిభరాసులునీక్రమముగప్రథమభాగమును ౭ టను ద్వితీయభాగమును ౮టను తృతీయభాగముమ ౯ టను భాగింపగా నాత్రి విధరాశియందు గణనశేషముండెనేని ప్రమాణకర్తకు రోగభీతిమరణములను, మూడు రాసులు శూన్యములై యుండెనేని రాజ్యరత్నభూలాభములును ఉక్తక్రమంబుగ గలుగుననియును ఇది త్ర్యంకస్వరూపముగాన గ్రంథాంతరమందు జెప్పబడియున్న లబ్ధమువలన వేఱుప్రయోజనము లేదని తా॥

యాత్రాపంచక శుద్ధిస్వరూపము

శ్లో॥ యాత్రా వారవిలగ్నధిష్ణ్యదివసాః స్వస్వాదితః స్వర్ణ తో ।
రాశికృత్య దినార్క-దిగ్వసుజలే ష్వైకైకసంఖ్యాంక్రమాత్ ॥

క్షిప్త్వా ప్రాగ్ధృతమేవ తం ప్రవిభజే దంకైశ్చ సర్వంధ్రువం ।
శేషః ప్రాక్తనపంచకేబహుధనం శూన్యే ఫలం వక్ష్యతే॥ ౧౭౧

టీక॥ యాత్రావారవిలగ్నధిష్ణ్యదివసాః - ప్రయాణమందేవారలగ్నతిథినక్షత్రములుండునో వానిని, న్యస్యాదితః-వానివాని మొదలునుంచి సర్వతః-అన్నిటిని రాశీకృత్య-ఏకముచేసి, ఏకైకసంఖ్యాః-ఒక్కొక్కసంఖ్యను,క్రమాత్- క్రమముగా దినార్కదిగ్వసుజలేషు, దిన-౧౫ యందు, అర్క-౧౨ యందు, దిక్-౧౦యందు వసు-౮యందు,జలేషు-౪యందు,క్షిప్త్వా-కలిపి,ప్రాగ్ధృతం-పూర్వమందొక్కొక్క సంఖ్యచేర్చగా వున్న ఐదువిధములగుధృవము లైన, తం-దానిని, అంకైః-తొమ్మిదిచే ప్రవిభజేత్-భాగించవలయును, ప్రాక్తనపంచకే-పూర్వమగు పంచకమందు, శేషశ్చేత్-మిగిలినచో. బహుధనం-మిక్కిలిధనముకలుగును. [అనగా నైదుమిగిలిన శూన్యమగుటచే దానికి నధికముగా మిగిలినమంచిఫలము కలుగుననుట]శ్లో॥ తిధ్యుడుదినలగ్నం మిశ్రితంపంచథాకృత్తిధిరవి దశనాగై ర్వేదసంఖ్యాయుతంచయత్ నవహృతశరశేషం శోభనేవర్జనీయం ఋగనలనృపచోరై ర్మృత్యునామాషితంతత్ ॥ శూన్యే-ఐదుమిగిలినచో, ఫలం-ఫలమును, వక్ష్యే - ముందుశ్లోకమందుచెప్పఁగలను.

అవ॥ రెండుశ్లోకములచేయాత్రాపంచక శుద్ధిస్వరూపమును దెలియఁజేయుచున్నాడు

తా॥ ప్రయాణవారలగ్ననక్షత్రదినములనుపూర్వశ్లోకమందుజెప్పఁబడియున్న క్రమమున మొదటనుండి గణనచేసి అయినసర్వగుణకమునునొకరాశిజేసియారాశిని నైదుభాగములుగాజేసి యందు ప్రథమభాగముతో పదియయిదునురెండవభాగముతో పండ్రెండును మూడవభాగముతో నెనిమిదియు నైదవభాగముతో నాలుగునుజేర్చి ఒక్కొక్కభాగములు వేర్వేఱున తొమ్మిదింట భాగించగా ప్రథమ భాగమందైదు మిగిలెనేని రోగపంచకమనియు, రెండవభాగమందైదుమిగిలెనేని యగ్నిపంచకమనియును, మూడవభాగమున నైదుమిగిలినేని రాజపంచకమనియును: నాల్గవభాగమందైదుమిగిలినేనిమృత్యుపంచకమనియును,సిద్ధాంతంబుగానినీపంచకలగ్నములయందు ప్రయాణము మొదలగు శుభకార్యములఁ జేయఁగూడదని తా॥

అంగీకారార్థ స్వరూపము

శ్లో॥ వ్యాధ్యగ్నిక్షితిపాలచోరమృతితోభీతిశ్చ శూన్యేక్రమా ।
దేత త్పంచదశాదిసోఽజితఫలం మృత్యోర్భయంసర్వదా ।

చోరవ్యాధిభయం నిశాసు దివసే భూపాగ్నిభీతిర్భవే ।
ద్యాత్రాపంచకశుద్ధిరేవ గమనే సంజీవనీయాఖిలు ॥ ౧౨౨

టీక॥ వ్యాధ్యగ్ని క్షితిపాల చోరమృతితః - రోగాగ్నిచోరమృత్యుపంచకములవల్ల, శూన్యకర్మాత్—ఐదుమిగులుటవల్ల, భీతిః—భయము; భవేత్ — అగును ఏతత్పంచదశాదియోజితఫలం-ఇది ౧౫ మొదలగువానియందుకూర్పగావచ్చినఫలము గమనే-ప్రయాణమందువిచారించవలయును; మృత్యోః-మృత్యువుయొక్క,భయం—భయము; సర్వదా-సర్వకాలములయందు కలుగును; చోరవ్యాధిభయం -చోరరోగభయములను: నిశాసు—రాత్రులయందుకలుగును.భూపాగ్నిభీతిః- రాజాగ్నిభయము; దివసే-పగలున; భవేత్-కలుగును ఇయం-ఈపంచకశుద్ధి; సంజీవనీయాఖలు-సంజీవివంటిదిగనుక;గమనే-ప్రయాణమందు;విచారణీయా-విచారించతగినది[ముఖ్యమనుట

అవ॥ అంగీకారార్థమును జెప్పుచున్నాఁడు

తా॥ ప్రథమపంక్తియందైదుమిగిలినేనివ్యాధిభయమును;ద్వితీయ పంక్తియందగ్నిభయమును;తృతీయపంక్తియందురాజభయమును;చతుర్థపంక్తియందుచోరభయమును; పంచమపంక్తియందు మృత్యుభయమునుగలుగునుగానసీపంచదశాదియోజితఫలము గమనవిషయమై యావశ్యకముగా నాలోచింపఁదగినదనియును మిగత కాలభేదములచే నంగీకారమనియును; అంగీకారకర్మమందెప్పినిన మృత్యుభయముసర్వదా త్యాజ్యమనియును; చోరవ్యాధిభయములు రాత్రులయందునను: భూపాగ్నిభయములు పగటియందుబలిష్టములుగాననాకాలములయందు పశ్యముగనాలోచింపతగినవనియును ఈ పంచకశుద్ధి సంజీవనియును నౌషధివిశేషమువలె ప్రాణసంరక్షకమైనది గాన ప్రయాణవిషయమై యావశ్యకముగా విచారింపఁదగినదని తా॥

యాత్రాచంద్రికంటక నిర్ణయము శ్లో॥ ౧౨౩

శ్లో॥ జీవేచ్ఛుర్యది చంద్రికంటకగృహే ష్వేతేషు నైవవ్రజే ।
న్మేషే సింహగృహే ధనుష్యపి సుధీ ర్యాతా ప్రతీచీం దిశమ్
కౌబేరీం మకరే వృషే చ యువతౌ యుగ్మేతులా కుంభకే ॥
ప్రాచీం మృత్యుదికంటక గృహమీనాల యే వృశ్చికే ॥

టీక॥ సుధీః-పండితుఁడు; జీవేచ్ఛుర్యది-జీవించవలయుననుకోరికయున్నచో ఏతేషు-ఈ; చంద్రికంటకగృహేషు—చంద్రికంటకములనురాసులయందు; నవ్రజేత్ ప్రయాణముకూడదు [అవి ఏవియనగా) మేషే-మేషమందు;సింహగృహే- సింహ

రాశియందు; ధనుషిచ-ధనూరాశియందును; ప్రతీచీం- పడమటి; దిశం - దిక్కును గూర్చి; నవ్రజేత్.-వెళ్ళుటకూడదు; మకరే-మకరమందు. వృషే — వృషభమందు; యువతౌ - కన్యయందు; ఉదీచీం-ఉత్తరపు; దిశం — దిక్కునుగూర్చి: [కూడదు] యుగ్మే—మిధునమందు; తులాయాం-తులయందు; ఘటే—కుంభమందు; ప్రాచీం - తూర్పుదగు; దిశం-దిక్కునుగూర్చి; కర్కటగృహే—కర్కాటకమందు మీనాలయే- మీనమందు: వృశ్చికే—వృశ్చికమందు;మృత్యుదిశం—దక్షిణదిక్కునుగూర్చియు;నవ్రజేత్-వెళ్ళఁగూడదు.

అవ. యాత్రాచంద్రకంటకనిర్ణయము దెలియఁజేయుచున్నాఁడు.

తా॥ మేషసింహధనురాసులుపశ్చిమదిక్కునకును;మకరవృషభకన్యలుఉత్తర దిక్కునకును; మిధునతులాకుంభములు తూర్పుదిక్కునకును;కటకమీనవృశ్చికములు దక్షిణపుదిక్కునకును; చంద్రకంటకరాసులుగాన జీవితాశగలప్రయాణకర్తఃజెప్పఁబడిన చంద్రకంటకరాసులలో నాయాదిక్కులకుపైనముపోఁగూడదనితా॥

యాత్రాలలాట స్వరూపము శ్లో॥ ౧౭౪

శ్లో॥ ప్రాచ్యాదిప్రభవోఽర్కశుక్రకుజరాహ్వార్కీందువిట్సూరయో
యద్దిగ్రాజిని తద్దిగుక్తగృహగే తాం తాం దిశంనవ్రజేత్ ।
ప్రాగాదిక్రమశః ప్రదక్షిణవిధౌ భానుప్రవిష్టాలయా ॥
ద్దిక్ష్వేకై ద్వితయం విదిక్షు మృతికృ ద్యాత్రాలలాటంత్విదమ్॥

టీక॥ అర్క-సూర్యుఁడు; శుక్ర - శుక్రుఁడు; కుజ - కుజుఁడు; రాహు - రాహువు; ఇందు-చంద్రుఁడు; అర్కి-శని; విట్-బుధుఁడు; సూరయః- బృహస్పతి ప్రాగాదిప్రభవః—తూర్పుమొదలు ప్రభువులు; యద్దిగ్రాజి -ఏదిక్కుయొక్కరాజు; తద్దిగుక్తగృహగే-ఆదిక్కుకుచెప్పిన గృహమందుండగా; తాంతాం - ఆయా; దిశం దిక్కునుగూర్చి: నవ్రజేత్-వెళ్ళఁగూడదు; భానుప్రవిష్టాలయాత్ - సూర్యుఁడుండు రాశిమొదలు; అప్రదక్షిణవిధౌ-అప్రదక్షిణముగా; క్రమశః - క్రమముగా; ప్రాగాది తూర్పుమొదల్కుగా; దిక్షు-దిక్కులయందు; ఏకైకం — ఒక్కొక్కటి; విదిక్షు - విదిక్కులయందు; ద్వితయం- రెండురెండు. నిక్షిపేత్ - ఉంచవలయును; ఇదం - ఈ యాత్రాలలాటం-ప్రయాణలలాటము; మృత్యుకృత్-మరణముచేయును.

అవ॥ యాత్రలలాటస్వరూపమును జెప్పుచున్నాఁడు

తా॥ తూర్పుదిక్కుమొదలుప్రదక్షిణక్రమంబునసూర్యుఁడు: గురువు:బుధుఁడు చంద్రుఁడు; శని: రాహువు:అంగారకుఁడు: శుక్రుఁడువీరలెనమంద్రు నెనిమిదిదిక్కు

లకుఁ ప్రభువులుగాన సూర్యుఁడున్న రాశిని తూర్పుననుంచియారాశిమొదలు తక్కిన రాసులను ప్రదక్షిణక్రమముననే సమదిక్కులయం దొక్కొక్కటినిమూలలయందు రెండేసిగాఁ బెండ్రెండురాసులనుంచఁగా నేరాశి యేదిక్కునకు వచ్చుచున్నదో యారాశియందాదిక్కునకుఁ బ్రభువైన గ్రహముండగా నాదిక్కునకుఁ బయనము పోవ మృతికరంబని తా॥

యుద్ధగమన రాహుఫలము

శ్లో॥ రాహుక్రాంతభత స్త్రయోదశ ముఖం భాన్యగ్రతః పృష్ఠతః
పుచ్ఛం కేతురితి త్రయోదశరవి స్థాయీచ యాయీశశీ।
యస్మిన్నాస్యగతే గృహే పరిభవస్తస్మైవ పుచ్ఛంగతే,
యస్మిన్ తస్యజయోగతౌ యుధి చతావేకత్రితత్తద్భవేత్॥

టీక॥ రాహుక్రాంతభతః-రాహువుచే నాక్రమించబడిన నక్షత్రమునుండి, త్రయోదశ-పదమూఁడు, ముఖం-రాహువునకు ముఖస్థానము, పృష్ఠతః—పృష్ఠభాగ మందు, త్రయోదశ-పదమూడు, పుచ్ఛం-రాహునకుతోక, కేతుః-పుచ్ఛముకేతువనఁ బడును, రవిః—సూర్యుఁడు, స్థాయీ-స్థిరుఁడు, యాయీ-వచ్చువాఁడు, శశీ-చంద్రుడు యస్మిన్—యెవనియొక్క, గృహే-రాశి, ఆస్యగతే-ముఖమునుబొందునో, తస్మైవ -ఆతనికి, పరిభవః-తిరస్కారము[అనఁగాస్థాయియగుసూర్యుఁడు ముఖమందుండిన స్థాయిగనుండువానికి భంగముకలుగునను యాయియగుచంద్రుఁడుముఖమందుండిన వచ్చినవానికపజయము] యస్మిన్-ఎవనియొక్కగృహము, పుచ్ఛం-తోకను, గతే-పొందియుండఁగా, జయః-జయము, [స్థాయియగుసూర్యుఁడు పుచ్ఛమందుండినస్థానమందుండువానికి, జయము-యాయియగు చంద్రుఁడుతోకయందుండిన వచ్చిన వానికి జయము] తౌ—ఆసూర్యచంద్రులు, ఏకత్ర—ఒకస్థలమును, గతాయది-పొంది, నటులైన, యుధి-యుద్ధమందు, తత్తత్ - పుచ్ఛమందు పుచ్ఛఫలము ముఖఫలము భవేత్-అగును. [అనఁగా ముఖమందుండిన నుభయుల కపజయము. పుచ్ఛమందుండిన నుభయులకు జయము కలుగుననుట. సమత్వము కలుగుననుట]

అవ. యుద్ధమునకుఁబోవునపుడు రాహుఫలమును జెప్పుచున్నాఁడు.

తా॥ రాహుస్థిత నక్షత్రములు ముందు పదుమూడు నక్షత్రములు ముఖమున్ను వెనుక పదమూడునక్షత్రముల తోఁకయుఁగా సూర్యుఁడు స్థాయి యనియుమఁ జంద్రుఁడు యాయి యనియుఁ జెప్పఁబడును, ఈయిరువురిలోఁదోఁకయందున్నవానికి జయము ముఖమందున్నవానికి పరాజయమునని తెలియవలెను. స్థాయి

యగుసూర్యుఁడు తోఁకయం దుఃఖునక్షత్రములలోనుండెనేని గృహగతుఁడగువానికి జయము. యాయియగు చంద్రుఁడుండెనేని రాజువతోఁ యుద్ధమునకు వెడలువానికి జయము సూర్యుడు ముఖమందుండెనేనిస్థాయికిభంగము చంద్రుడుండెనేని యాయికి భంగముసూర్యచంద్రు లిరువురును ముఖస్థానమునందుండెరేని రాజువతోఁ వెడలిపోవు రాజునకును తనపురములోనున్న రాజునకు నుభయులకు నపజయమనియు; నాయిరు వురును పుచ్ఛస్థాన నక్షత్రములయందుండిరేని యిరువురకు సమజయమనియు తా॥

గమనవర్జ్యకాలము

శ్లో॥ దగ్ధే స్వస్య గృహే కళత్రకలహేయ స్యార్తవే శోభనే।
మధ్యేవా యది జాతకేచ మృతకే మాసేఽష్టమే జన్మతః।
పిత్రోర్వా క్షయవత్సరే యది పితృశ్రాద్ధక్రియానంతరే।
జీవార్థీ యది నవ్రజేత్స్వయువతౌ గర్భాన్వితాయామపి॥ ౧౭౬

టీక॥ స్వస్య-తనయొక్క; గృహే - యిల్లు; దగ్ధే - తగలబడినకాలమందు; కళత్రకలహే - భార్యతోపోట్లాట కలిగినప్పుడు; యస్య - భార్యయొక్క; ఆర్తవే-వాకిటనున్న కాలమందు; శోభనే - శుభకార్యమందు; మధ్యే — మధ్యకాలమందు; జాతకే—పురిటయందు; మృతకే—మైలయందు; జన్మతః-జన్మమొదలు; అష్టమే-ఏనిమిదవ; మాసే—మాసమందు; పిత్రోః-తల్లిదండ్రులయొక్క; క్షయవత్సరే-పోయిన సంవత్సరమందు; పితృశ్రాద్ధక్రియానంతరే-తల్లితండ్రులతద్దినమునకు మరునాడును స్వయువతౌ — తనభార్య; గర్భాన్వితాయాపి - గర్భవతియైయుండగాను; [ఐదారు మాసములకుపైన] ప్రయాతా-ప్రయాణమగువాడు: జీవార్థీయది - బ్రతుకునుకోరి నచో: నవ్రజేత్-ప్రయాణముచేయగూడదు.

అవ. ప్రయాణ విషయమై నిషేధకాలమును జెప్పుచున్నాఁడు.

తా॥ జీవితాశగల పురుషుఁడు తనగృహమగ్ని దగ్ధమగునపుడును: భార్యతోఁ గలహముచేసినసమయంబునను: భార్యరజస్వలయై యుండునపుడును: శుభమధ్య కాలంబునను జాతాశౌచమృతాశౌచమధ్యకాలమందును: స్వజన్మమాసమునకెనిమిదవ: మాసమందు తల్లిదండ్రులు మృతిబొందిన సంవత్సరమందును: తల్లితండ్రులశ్రాద్ధ దివసమునకు మఱుదినమందును తనభార్యయాఱునెలలకు పైబడినగర్భము గలదై యుండునపుడును: పయనముపోవునేని క్షేమమును బొంతదనియు తా॥

అభిజిద్ధనిష్ఠాపంచకమందు గమన నిషేధనిర్ణయము

శ్లో॥ స్యాద్యత్ర గోఽభిజిదాహ్వయేచ సలయే థిష్ట్యేముహూర్తే తథా।

రోగ స్స్యా ద్వసుభస్య చోత్తర దళా దృక్షేషు పంచ స్వపి ।
దుఃఖం దక్షిణదిక్ప్రయాతురథవానాన్యత్రయాతు స్త్వయం ।
మీనే చేదథ సర్వదిక్షు గమనంయాతుశ్చవక్రంభవేత్ ॥ ౧౭౭

టీక॥ అభిజిదాహ్వయే—అభిజిదనుపేరుగల, నిలయే-రాశియందును, ధిష్ణ్యే-నక్షత్రమందును, ముహూర్తే - ముహూర్తమందును, ప్రయాతుః- ప్రయాణమగువానికి, భంగః-భంగము, స్యాత్-కలుగును, వసుభస్య-ధనిష్టానక్షత్రమునకు,ఉత్తరదళాత్-ఉత్తరార్థము మొదలు, పంచసు-ఐదగు, ఋక్షేష్వపి- నక్షత్రములయందును, రోగః-రోగము, స్యాత్—కలుగును, అథవా - లేక, దక్షిణదిక్ప్రయాతుః-దక్షిణమునకు వెళ్ళువానికి, దుఃఖం-దుఃఖము, స్యాత్-కలుగును,అన్యత్ర-దక్షిణదిగితరదిక్కులకు, యాతుః—వెళ్ళువానికి, అయం-ఈధనిష్టాపంచకగమననిషేధము: న-లేదు, అథ-అనంతరము, మీనేచేత్-మీనచంద్రుడైనచో,సర్వదిక్షు-సమస్తదిక్కులయందు గమనం-ప్రయాణము, యాతుః-ప్రయాణమగువానికి: వక్రం-వంకర: భవేత్-కలుగును. [ప్రయాణసిద్ధి కలుగదనుట.]

అవ. అభిజిద్ధనిష్టాపంచకమందు గమననిషేధమును జెప్పుచున్నాఁడు.

తా॥ అభిజిల్లగ్నమందును: అభిజిన్నక్షత్రమందు: అభిజిన్ముహూర్తమందును పైనముపోవువారల కశుభకరంబనియు: ధనిష్ఠానక్షత్రోత్తరదళము మొదలు రేవతివరకు ధనిష్టపంచకము గాన నీపంచకమందు దక్షిణదిక్కుకు పయనముబోవువారలకు రోకకరంబనియు నితరదిక్కులకుఁ బోవువారలకు శుభకరంబనియు మఱియును మీనరాశియందుఁ జంద్రుఁడుండగా నేదిక్కునకుఁ బయనముపోయినను ప్రయాణకర్తకు నిష్టసిద్ధిగలుగదని తా॥

నానాయాత్రిలకు లగ్ననిర్ణయము శ్లో॥ ౧౭౮

శ్లో॥ స్త్రీయాత్రా సుఖదా వృషేచ యువతౌయుగ్మే ప్రయాతుర్ఘటే
గోయాత్రా పశులాభదైవ వృషభే మేషే హరౌవామృగే ।
కుంభే కర్కటకే ఝషేచ మకరే యాతు ర్జన స్స్వార్థదా ।
శౌర్యాయుర్వ్యథనప్రదా గవిహరా యుద్దేతు చాపేఽవ్యాజే ॥

టీక॥ వృషే-వృషభమందు, యువతౌ—కన్యయందు, యుగ్మే-మిథునమందు స్త్రీయాత్రా-స్త్రీప్రయాణము సుఖదాసుఖమునిచ్చును, ఘటే - తులయందు, వృషభే-వృషభమందు, మేషే - మేషమందు: హరౌ-సింహమందు: మృగే-మకరమందు;

యాతుః - ప్రయాణమగువానికి, గోయాత్రా-గోయాత్ర; పశులాభదా-పశులాభము చేయును, కుంభే-కుంభమందు, కర్కటకే- కర్కాటకమందు; ఝషే-మీనమందు; మకరే-మకరమందు; యాతుః- ప్రయాణమగు; జనస్య—మనుష్యునికి; అర్థదా-ధన మునిచ్చును; యుద్ధేతు-యుద్ధమందైతే; గవి-వృషభమందు; హరౌ-సింహమందు; చాపే - ధనస్సుయందు; అజే - మేషమందు; శౌర్యాయుష్యధనప్రదా - శూరత్వా యుర్ధనములనిచ్చును.

అవ. సర్వయాత్రావిషయమై లగ్ననిర్ణయమును జెప్పుచున్నాఁడు.

తా॥ వృషభ కన్యా మిథునరాసులయందు స్త్రీయాత్ర సుఖప్రదమనియు; తులా వృషభ మేష సింహ మకరరాసులయందు గోయాత్రపోవువారలకు పశులాభ ప్రదమని; కుంభ కర్కటక మీన మకరరాసులయందు యుద్ధమునకుఁ బోవు వానికి శౌర్యాయుష్యధన ప్రదములని తా॥

యుద్ధగమనకాలమునకు కాలరాహుస్థితిఫలము.

శ్లో॥ వారేఽర్కస్యగురోర్దినే సురపతేస్తత్కాలహోరాసువా ।
యుద్ధేవా భృగుచంద్రయోర్యమదిశం భౌమేదినే వారుణీమ్ ।
సౌమ్యాంభానుజసౌమ్యయోస్తుకలహస్స్యాత్కాలరాహుస్త్వయం
సంస్యాతాం లాభజయౌ ప్రయాతురథవా చేద్వామగః పృష్ఠగః ॥

టీక॥ అర్కస్య—సూర్యునియొకగు; వారే - వారమందు; గురోః - గురుని యొక్క; దినేప- దినమందున్న; తత్కాలహోరాసుచ - ఆవారిసకలవారాధిపతుల హోరలయందును: సురపతేః-ఇంద్రునియొక్క; దిశం - తూర్పుదిక్కునుగూర్చి; యుద్ధే-యుద్ధమందు: ప్రయాతుః-వెళ్ళువానికి [యుద్ధమునకు వెళ్ళువానికి] కలహః కలహము: స్యాత్-కలుగును. [ఆదివారమును నాదిక్కున రాహువుండుటవల్ల] భృగు చంద్రయోః-శుక్రచంద్రవారములయందు: వానిహోరలయందు:యమదిశం-దక్షిణ దిక్కునుగూర్చి: నవ్రజేత్-వెళ్ళగూడదు: భౌమే-కుజునియొక్క: దినే-దినమందు [వానిహోరయందైనా] వారుణీం-పడమరదిక్కునుగూర్చి:నవ్రజేత్—వెళ్ళగూడదు భానుజసౌమ్యయోస్తు - శనిబుధవారములయం దాహోరలయందు; సౌమ్యం-ఉత్తర దిక్కునుగూర్చి: నవ్రజేత్ - వెళ్ళగూడదు: అయం — ఈకాలరాహువు: యుద్ధే- యుద్ధమందు: ప్రయాతుః-ప్రయాణమగువానికి; వామగః-సవ్యమందున్నను:అథవా లేక:పృష్ఠగశ్చేత్-పృష్ఠమందున్నను:లాభజయౌ-లాభజయములు:స్యాతాం—కలుగును

అవ. యుద్ధమునకుఁ బోవునప్పుడు రాహుస్థితికి ఫలము జెప్పుచున్నాఁడు.

టీ॥ భానుగురువారములయందును భానుగురుహోరలయందు రాహువు తూర్పుదిక్కున నుండునుగాన నీవారహోరయందాదిక్కునకు శుక్ర సోమవారములయందువారిహోరల యందునురాహువు దక్షిణమందుండుఁగాన నీవారహోరలయందాదక్షిణదిక్కునకును, అంగారకవారమందునువానిహోరయందునురాహువు పశ్చిమంబున నుండునుగాన నావారహోరలయందుఁ పశ్చిమదిక్కునకు, శనిబుధ వారములయందును వానిహోరలయందును రాహువుత్తరంబుననుండునుగాన నీవార హోరలయందీదిక్కునకును యుద్ధయాత్రపోవువారలకు మిక్కిలి కలహంబుగలుగునని యును, కాలరాహువు యుద్ధమునకు వెళ్ళునపుడు ప్రయాణకర్తకు నిరుపార్శ్వములయందుండినను వెనుకయుండినను లాభజయకరుఁడగునని టీ॥

స్థిరచరయోగినులకు ఫలము

శ్లో॥ పక్షాదిర్నవమీచ దుఃఖభయదే ప్రాచీం ప్రయాతు స్తయో
రానంతర్యతిథి మభేరకుభం తాన్యాగ్నేయకాష్ఠాం తయోః ।
ఆనంతర్యదినే తయోః పరదినే రక్షోదిశం పంచమీ ।
రాకా వాయుదిశం చతుర్దశదినం షష్ఠీ దిశం వారుణీమ్॥ ౧౮౯

శ్లో॥ యామ్యామామయకృత్త్రయోదశ సనంతర్యస్తృతీయాష్టమీ
దర్శస్త్వేకాదశం ప్రయాణసమయే వ్యర్థాస్థిరా యోగినీ ।
షంఘటికా చతుష్టయమితా ప్రాగాదిషు ప్రాంతగా ।
స్యాద్దేవ చరయోగినీదనక్షద్భానూదయాన్నిత్యశః॥ ౧౯౦

టీక॥ పక్షాదిః-పాడ్యమి, నవమి-నవమియు, ప్రాచీం — తూర్పుదిక్కును గూర్చి, ప్రయాతుః—ప్రయాణము గువానికి, దుఃఖభయదే - దుఃఖభయములనిచ్చును తయోః-ఆపాడ్యమినవములకు, అనంతర్యతిథీ-సమీపమందుండు విదియదశములు, కుబేరరకుంభం—ఉత్తరదిక్కుకువెళ్లినచో దుఃఖభయములనిచ్చును,తయోః-ఆవిదియ దశములకు, ఆనంతర్యదినే-సమీపదినములగు తదియ ఏకాదశులు,అగ్నేయకాష్టం— అగ్నేయదిక్కుకు వెళ్ళువానికి దుఃఖభయములనిచ్చును: తయోః—అతృతీయైకాదశు లకు, పరదినే-మరుదినమగు చతుర్ద్ద్వాదశులు, రక్షోదిశం - నైరృతిదిక్కుకు వెళ్ళువానికి దుఃఖభయములు కలుగును: పంచమీ-పంచమియు, రాకా-పూర్ణిమయు వాయుదిశం-వాయువ్యదిక్కుకు వెళ్ళువానికి భయదుఃఖములుకలుగును, చతుర్దశదినం—చతుర్దశియు, షష్ఠి — షష్ఠియు, వారుణీం - వరుణదిదగు పడమరకువెళ్ళ

వానికి భయదుఃఖములు చేయును, త్రయోదశదినం— త్రయోదశియు: సప్తమీచ — సప్తమియు, యామ్యాం-దక్షిణదిక్కునుగూర్చి వెళ్ళువానికి, ఆమయకృత్ - రోగమును జేయునది, స్యాత్-అగును, అష్టమీ-అష్టమియు, దర్శశ్చ — అమావాస్యయు, ఈశదిశం—ఈశాన్యమునకు వెళ్ళువానికి రోగకరమగును, ప్రయాణసమయే—ప్రయాణకాలమందు, ఏషైవ-ఇదే, స్థిరా స్థిరమగు: యోగినీ - యోగినియనఁబడును, భానూదయాత్—సూర్యోదయము మొదలు, నిత్యశః—ప్రతిదినము, చరయోగినీ-చరయోగిని పాదోనఘటికాచతుష్టయం-పాతికతక్కువగా నాలుగుఘడియలను ఇతా - పొందినదగుచు, ప్రాగాది—తూర్పు మొదలు, షష్టాంతగా-ఆఱవదిక్కుయొక్క అంతమును పొందినదై, ఏషా — ఈచరయోగిని, నిధనకృత్ - మరణము చేయును [యెదురుగా వెళ్ళువానికనుట]

అవ॥ రెండుశ్లోకములచే స్థిరచరయోగినులకు ఫలముఁజెప్పుచున్నాఁడు

తా॥ పాడ్యమినవములు తూర్పుదిక్కునను, విదియదశములు త్తరమునను, తదియైకాదసులాగ్నేయదిక్కునను, చతుర్థిద్వాదసులు నైరృతిదిక్కునను పంచమిపున్నిమలు వాయవ్యదిక్కునను: చతుర్దశిషష్ఠులు పశ్చిమదిక్కునను త్రయోదశీ సప్తములు దక్షిణంబునను అమావాస్యాష్టమి లీశాన్యదిక్కునకుస్థిరయోగినియుండుఁగాన నీదివసములయందీదిక్కులకుఁ బైనముపోవువారలకు దుఃఖభయంబులుగలుగునని యును చరయోగినిప్రతిదినమందుసూర్యోదయప్రభృతిసూర్యాస్తసమయపర్యంతము తూర్పున 4॥ ఘడియలును, వాయవ్యమున 3॥ ఘడియలును: దక్షిణంబున 3॥ ఘడియ లీశాన్యంబున 3॥ ఘడియలును, దీని కారవదగుపశ్చిమంబునకు దానికారవదైన నాగ్నేయంబునను దానికారవదగు నుత్తరంబున నాయుత్తరమునకారవదగు నైరృతిదిక్కునందును చరయోగిని యిట్లు సంచరించుచుండఁగాననీయోగిని కభిముఖముగఁ బైనముపోయిరేని మరణముగలుగునని తా॥

పక్షిచ్ఛిద్రములగొరకు వర్జ్యకాలము

శ్లో॥ విఘ్నేశశ్చ చతుర్దశీచ నవమీషష్ట్యష్టమీ ద్వాదశీ।
నాగాస్తత్వ చతుర్దశాంకమనుదిజ్ఞాడ్యశ్చ త్రివా దోత్రిగదా।
సంఖ్యోర్ధ్వా ఘటికా స్తుభాశ్చ తిథయః షట్పక్షరంధ్రాభిదా
మాసాద్యంతదినద్వయంతు మృతికృత్స్వేష్టకర్మస్వపి ॥౧౮౨॥

టీక॥ విఘ్నేశః—చవితి, చతుర్దశీ-చతుర్దశియు, నవమీ-నవమియు, షష్ఠీ - షష్టియు, అష్టమీ — అష్టమియు, ద్వాదశీ - ద్వాదశియు, నాగాః - ఎనిమిదియు

తత్వ-ఇరువదియైదు, చతుర్దశ-పదునాలుగు; అంక-ఐదు; మను-పదునాలుగు దిక్ - పది- నాడ్యః-ఘడియలు; క్రిమాత్-వరుసగా; రోగదాః — రోగముమచేయునవి; సంఖ్యోర్ధ్వాః-ఈసంఖ్యకుమించిన ఘటికాః - ఘడియలు; శుభాః-శుభఫలమునిచ్చును షట్-ఆఱుగు; తిథయః-దినములు; పక్షరంధ్రాఖిదా — పక్షచ్ఛిద్రములని పేరుగలవి మాస-మాసముయొక్క; ఆది-పాడ్యమి; అంత అమావాస్య; దినద్వయం-రెండుదినములు;సర్వేషు-సమస్తముగు;కర్మస్వపి-కర్మలయందు;మృతికృత్-మరణముచేయును

అవ॥ పక్షచ్ఛిద్రములయందు వర్జ్యకాలముఁ జెప్పుచున్నాఁడు

తా॥ చతుర్థియందు మొదట ౮ ఘడియలుకు; చతుర్దశియందు ౨౫ ఘడియలును; నవమియందు ౧౪ ఘడియలును; షష్టియందు౯ఘడియలును;అష్టమియందు ౧౪ ఘడియిలును; ద్వాదశియందు ౧౦ ఘడియలు నశుభకరములుగాన శుభ కార్యములవిషయమై యీదినములయందీఘడియలు నిషేధింపఁదగినవనియు నీయఱుదివసములయందు మిగిలినఘడియలుశుభకరంబులనియు నీచెప్పబడినవిఘ్నేశాది ఆఱు తిధులే ప్రతిపక్షమందును పక్షచ్ఛిద్రసంజ్ఞగలవనియును; శుక్లపాడ్యమి అమావాస్య ఈరెండుదినములు సర్వశుభకర్మలవిషయమైమృత్యుప్రదములుగానసర్వదానింద్యములగునని తా॥

గమననిషిద్ధనక్షత్రములయందు వర్జ్యకాలములు ౧౮౭

శ్లో॥ శాక్రేసప్త నవేశ్వరేదశ యమే పూర్వాత్రియే షోడశ ।
త్వాష్ట్రే పంచదశానలే నవ దశ ద్వావింశతిః పైత్రభే ।
స్వాతే ద్వాదశ సార్పభే నవ దశాప్యైంద్రాగ్నిభే తారకాః
స్త్యేతాయాతృభయాప్రదా అథ శుభాస్సంఖ్యోత్తరా నాడికాః॥

టీక॥ శాక్రే-జ్యేష్టయందు; సప్త- ౭ఈశ్వరే-ఆర్ద్రయందు; నవ-౯ యమే భరణియందు; దశ-౧౦; పూర్వాత్రియే- పుబ్బపూర్వాషాఢ పూర్వాభాద్రలయందు; షోడశ-౧౬; త్వాష్ట్రే-చిత్తయందు; పంచదశ - ౧౫ అనలే-కృత్తికయందు;నవదశ-౧౯; పైతృభే-మఘయందు; ద్వావింశతిః-౨౨. ఇంద్రాగ్నిభే-విశాఖయందు; తారకాః-౨౭; ఏతాః-ఈ-నాడికాః - ఘడియలు; యాతృభయాప్రదాః - ప్రయాణముగువానికిభయమునుపీడయును; జెయును; అథపిమ్మట, సంఖ్యోత్తరాః - చెప్పిన సంఖ్యకు పైననుండు ఘడియలు; శుభాః—శుభకరములు.

అవ॥ గమననిషిద్ధనక్షత్రములయందు వర్జ్యకాలమును జెప్పుచున్నాఁడు.

తా॥ జ్యేష్ఠానక్షత్రమందు ౬ ఆర్ద్రయందు ౯ భరణియందు౧౦పూర్వఫల్గునీ పూర్వాషాఢ పూర్వాభాద్రలయందు ౧౬ చిత్రయందు ౧౫ కృత్తికయందు ౧౯ మఘయందు ౨౨ స్వాతియందు ౧౨ ఆశ్లేషయందు ౧౯ విశాఖయందు ౨౬తఃక్ర మంబునవీనక్షత్రములయందీగడియలుపత్రియాణవిషయమైదుఃఖభయప్రదములనియు ముక్తసంఖ్యాతిరిక్తఘటికలు శ్రేష్టములని తా॥

దినభుక్తి వారభుక్తి స్వరూపయలు శ్లో॥ ౧౮౮

శ్లో॥ దధ్యాజ్యాన్న యవాంబుమాషచణక క్షౌద్రేక్షుపిష్టార్ద్రక
క్షీరవ్యంజనముద్గపాయసతిలా భుక్తిర్దినాద్యాదితః ।
తక్రం పాయసకాంచికే దధి పయో దుగ్ధం తిలాన్నంక్రమా
ద్వారాద్యంశుమతః ప్రయాతృసుఖకృత్స్వవారభుక్తిర్భవేత్ ॥

టీక॥ దినాద్యాదితః - పాడ్యమిమొదలు పూర్ణిమతోఁగలసిన యమావాసవ వరకు పదునాఱుదినములయందు. దధి-పెరుగు, ఆజ్య- నెయ్యి: అన్న - అన్నము యవ—గోధుమలు అంబు-ఉదకము, మాష—మినుములు, చణక-శనగలు, క్షౌద్ర - తేనె, ఇక్షు-చెరకు, పిష్ట-పిండి, ఆర్ద్రక—అల్లము; క్షీర-పాలు, వ్యంజన - వ్యంజన ద్రవ్యములు, ముద్గ-పెసలు, పాయస-పరమాన్నము, తిలాః-నువ్వులు, క్రమాత్— వరుసగా; భుక్తిః- భోజనము: అంశుమతః సూర్యునియొక్క; వారాది - వారము మొదలుగా [అనఁగా నాదివారము మొదలనుట] క్రమాత్-వరుసగా: తక్రం మజ్జిగ పాయసకాంచికే.పరమాన్నధాన్యామ్లములు: దధి పెరుగు: పయః-ఉదకము:దుగ్ధం - పాలు: తిలాన్నం-తిలలతోఁగూడిన యన్నము సా - అభుక్తి: వారభుక్తిః - వార భుక్తి; భవేత్ - అగును ప్రయాతృసుఖకృత్- ప్రయాణముచేయువానికి సుఖమును చేయును.

అవ॥ దినవారభుక్తులస్వరూపమును జెప్పుచున్నాఁడు.

తా॥ పైనముపోవువారలు పాడ్యమిమొదలు పున్నమి అమావాస్యలతోఁగూడ ౧౬ దివసములయందును పెరుగు; నెయ్యి అన్నము;గోధుమలు; ఉదకము: మిను ములు; సెనగలు: క్షౌద్రము: చెరకు: పిష్టము: ఆర్ద్రకము: పాలు:వ్యంజనముపెసలు పాయసము: నువ్వులు:ఈ౧౬పదార్థములనుక్రమంబుగానొక్కొక్కదివసము నం దొక్కొక్కపదార్థమునుభుజించి పైనముపోవలయుననియుతక్రము: పాయసముకల్గి పెరుగుపాలుదుగ్ధము:తిలాన్నమీసప్తవిధపదార్థములనుభానువారప్రభృతిస్థిరవారము వరకు నొక్కొక్కవారమందొక్కొక్క పదార్థమునుభుజింపవలయుననియుపీదిన

భుక్తిని వారభుక్తిని చెప్పుటవలనదినవారభుక్తి ప్రతిపాదకపదార్థద్వయమునుభుజించి పైకముపోయిరేని సుఖవంతులగుదురని తా॥

నక్షత్రదిగ్భుక్తుల స్వరూపము

శ్లో॥ కుల్మాషా స్తిలతండులా దధిఘృతం దుగ్ధంచమార్గామిషం।
తత్సారం ఘృతపాయసంచపృథుకామాంసం మృగేణ్యామధు
శాకం పైష్టిక మోదనం బహువిధం ధాత్రీఫలం మంటపం ।
పిష్టాన్నం కదళీఫలం శశశిరోమాంసం కుళుత్థౌదనమ్ ॥ ౧౮౫॥

శ్లో॥ నైవారం కృసరౌదనం ఝషయుతం చాన్నంసముద్గౌదనం।
శాల్యన్నం చయవాన్న మిష్ట మశనందసాదిభుక్తిఃక్రమాత్
సాజ్యాన్నం కృసరాన్న మాదిదివసే ప్రాగాదిభుక్త్వావజేత్ ।
న్మత్స్యాన్నంఘృతపాయసంచగమనేదిగ్భుక్తిరేషాక్రమాత్

టీక॥ కుల్మాషాః-శనగలు, తిలతండులాః-నువ్వులు బియ్యము, దధి-పెగురు ఘృతం-నెయ్యి, దుగ్ధం-పాలు, మార్గామిషం-మృగమాంసము, తత్సారం-అమృగ మాంసముయొక్క సారము, ఘృతపాయసం-నెయ్యితో గూడినపరమాన్నము, పృదుకాః-అటుకులు, మృగేణ్యాః-లేడియొక్క, మాంసం—మాంసము, మధు-మద్యము, శాకం-కూర, పైష్టికం-మద్యభేదము, బహువిధం-అనేకరీతులగు, ఓదనం-అన్నము [అనఁగాపులగము] ధాత్రీఫలం-ఉసిరిగపండు, మంటపం-భక్ష్యభేదము, పిష్టాన్నం -పిండి, కదళీఫలం-అరటిపండు, శశశిరోమాంసం-చెవులపిల్లియొక్కతలమాంసము కుళుద్ధౌదనం-పులవపులగము, నైవారం-ఎవరిఅన్నము, కృసరౌదనం-పులగము, ఝషయుతం-చేపతోగూడిన యన్నము, సముద్గౌదనం - పెసరపులగము, శాల్యన్నం, వరిఅన్నము, యవాన్నం-గోధుమాన్నము, ఇష్టం-ఇష్టమగు, అశనం-అన్నము, దసాదిభుక్తిః-అశ్వినిమొదలుభుక్తులు, క్రమాత్-క్రమముగా, భవంతి-అగుచున్నవి సాజ్యాన్నం - నెయ్యికలసినయన్నము, కృసరాన్నం-పులగము,మత్స్యాన్నం-చేపల యన్నము, ఘృతపాయసాన్నం-నెయ్యితోగూడినపరమాన్నము, ఆదిదివసే-ప్రయాణమునకు మొదటిరోజున, ప్రాగాది—తూర్పుమొదలు, గమనే-ప్రయాణమందు-భుక్త్వా-భుజించి, వ్రజేత్-ప్రయాణముచేయవలయును, ఏషా-ఇది, క్రమాత్-వరుసగా, దిగుక్తిః-దిగుక్తయనుట.

అవ. రెండుశ్లోకములచేత నక్షత్రదిగ్భుక్తులఁ జెప్పుచున్నాఁడు.

తా॥ సెనగలు, నువ్వులు, బియ్యము, పెరుగు, నెయ్యి పాలు, మృగమాంసము, మృగమాంససారము, ఘృతసహితక్షీరాన్నము, అటుకులు, లేడిమాంసము, శాకము, పైష్టికమును మద్యవిశేషము, అన్నము, చిత్రాన్నము, ఉసిరికపండ్లు, అరటిపండ్లు, కుందేటిశిరోమాంసము, ఉలవలతోఁగలిపినయన్నము, నీవారాన్నము, కృసరాన్నము, మత్స్యసహితాన్నము, పెసరపప్పున్నము, పిశాచబియ్యపుటన్నము ఈ ౨౮ పదార్థము లశ్విన్యాది ౨౮ నక్షత్రములయందు దొక్కొక్కనక్షత్రమునం దొక్కొక్కపదార్థమును భుజించిపైనముపోయిరేని యిష్టసిద్ధిగలుగుననియుఁ దూర్పుదిక్కునకు పైనముపోవునా రాజ్యసహితాన్నము, దక్షిణమునకుఁ బోవుసమయమునఁ గృసరాన్నము, పశ్చిమమునకుఁబోవుసమయమున మత్స్యాన్నమును, ఉదగ్గిగమనసమయమున ఘృతసహితక్షీరాన్నమును, ప్రయాణదివసమునకు పూర్వదినమందు బోజనముచేసి పోవలయుననియు, ప్రయాణవిషయమై ఉక్తనక్షత్రభుక్తియును మిక్కిలి యావశ్యకమగును తా॥

చంద్రద్వాదశావస్థా ప్రకారనిర్ణయము.

శ్లో॥ షష్టిఘ్నం గతధిష్ణ్య మిందుఘటికాస్సంయుజ్య రాశింపున
ర్వేదఘ్నం శరసాగరాప్తమినతో భక్త్వాథ లబ్ధం క్రమాత్
మేషాదౌ తు గృహే గృహే శశభృతో జ్ఞేయా అవస్థా ద్విష
డ్దస్రాదిష్వథ పాదయుక్తఘటికా శ్చైకాదశైకాదశ ।

టీక॥ గతధిష్ణ్యం-జరిగిననక్షత్రసంఖ్యను, షష్టిఘ్నం అఱువదిచే హెచ్చించి ఇందుఘటికాః-చంద్రుఁడుండునక్షత్రఘడియలను, సంయుజ్య-కలిపి. రాశిం-అట్లు కలిపినరాశిని, పునః - తిరుగ, వేదఘ్నం-నాలుగుచే హెచ్చించి, శరసాగరాప్తం-నలుబదియైదుచే భాగించినదాన్నిగా, కుర్యాత్ - చేయవలయును, అథ - పిమ్మట లబ్ధం - భాగించగావచ్చిన లబ్ధమును, ఇనతః - పండ్రెండుచే, భక్త్వా — భాగించి, మేషాదౌ-మేషము మొదలగు రాసులయందు, గృహేగృహే - ప్రతిరాశియందు, క్రమాత్-వరుసగా, శశభృతః-చంద్రునకు, ద్విషట్-పండ్రెండు, అవస్థాః-దశలు, జ్ఞేయాః—తెలియతగినవి, అథ - లేక, దస్రాదిషు-అశ్విన్యాది నక్షత్రములయందు, పాదయుక్తఘటికాశ్చ — సారముతోగూడినఘడియలు, ఏకాదశైకాదశ - పదునొకండు , జ్ఞేయాః-గ్రహించతగినవి.

అవ. గ్రంథకర్త కిష్టానుసారముగఁ జంద్రద్వాదశావస్థల విషయముజెప్పుచున్నాఁడు.

తా॥ జనులు ప్రయాణము పోవు నక్షత్రము వఱకు అశ్విన్యాదిగత నక్షత్రములను ౬౦ ట ఎచ్చిగుణించి యీగుణకములో నిత్యనక్షత్రములోఁ బ్రయాణకాలమువరకు గతించిన ఘడియలనుగూడఁజేర్చి యొకరాశిచేసి దానిని ౪ ట గుణించి ౪౫ చే భాగింపఁగా శేషించిన ఘడియలఁ జంద్రోదయరాశిమొదలుకొని పరశ్లోకమందుఁ జెప్పఁబోయెడి ద్వాదశావస్థల కొక్కొక్కయవస్థకు ౧౧ గడియలచొప్పున భాగించి యెన్నియవస్థలకు సంఖ్యవచ్చునో యాయవస్థలకు నవస్థారూపఫలమునుఁ జూచుకొనవలయునని కాలామృతకారుల యభిప్రాయమని తా॥

## చంద్రద్వాదశావస్థలకు నామనిరూపణము

శ్లో॥ సూక్ష్మంస్థూలమితిద్వయోఃప్రవసనంనాశంమృతాఖ్యంజయం
హాస్యం క్రీడితనామకం ప్రియరతం సుప్తించ భుక్తిం జ్వరమ్।
కంపం సుస్థిరతాం స్వనామసదృశం చేందోర వస్థాఫలం।
యాత్రాయుద్ధవివాహవాస్తుజననక్షేత్రప్రవేశాదిషు॥ ౧౮౮

టీక॥ సూక్ష్మం - సూక్ష్మము, స్థూలం-స్థూలము, ఇతి-ఇట్లు, తయోః-రెండుపక్షములయందు, ప్రవసనం-ప్రవసనము, నాశం-నాశము, మృతాఖ్యం-మరణము, జయం-జయము, హాస్యం-హాస్యము, క్రీడితనామకం-క్రీడితము, ప్రియరతిః-ప్రియరతియును, సుప్తం-సుప్తిని, భుక్తిం-భుక్తిని, జ్వరం-జ్వరమును, కంపం-వణుకును, సుస్థిరతాం-స్థిరత్వమును; ఇతి - అని; స్వనామసదృశం—ఆయాయవస్థపేరుకుతగు, ఇందోః-చంద్రునియొక్క; అవస్థాఫలం-అవస్థలఫలము; యాత్రా-ప్రయాణమందు యుద్ధ-యుద్ధమందు; వివాహ-వివాహమందు; వాస్తు గృహముకట్టుటయందు; జనన—జన్మయందు; క్షేత్ర-వ్యవసాయమందు; ప్రవేశ -నూతనగృహప్రవేశమువందు; ఆదిషు—మొదలగు వానియందు; భవేత్-కలుగును.

అవ. చంద్రాద్వశావస్థలకు నామనిరూపణచేసి నామానురూపఫలములఁ జెప్పుచున్నాఁడు.

తా॥ స్థూలము: సూక్ష్మమనెడు ద్వివిధపక్షముల ద్వాదశయవస్థలకు ప్రవసనము: నాశము: మృతాఖ్యము: జయము: హాస్యము: క్రీడితము: ప్రియరతి: సుప్తి: భుక్తి జ్వరము: కంపము: సుస్థిరతయనెడు ద్వాదశ విధనామంబులనియును చంద్రద్వాదశావస్థలయొక్క నామానురూప ఫలంబనియు: ప్రయాణ యుద్ధ వివాహ గృహనిర్మాణ పుత్రజన్మ కృషికర్మ నూతనగృహప్రవేశాదుల యందీద్వాదశావస్థానురూపఫలవిచార మావశ్యకమనియు తా॥

## ఖచరయోగఫలము

శ్లో॥ ఆర్కాక్రాంతభతః స్తృతీయనవమే చాతుర్థభం పంచమం ।
చైతద్ధిష్ణ్యచతుష్టయం తు ఖచరో నామ్నా భవేత్తత్ఫలమ్ ।
సీమంతే పుంసవనే వ్రతే శిశుహరం నిస్తండులత్వం కృషౌ ।
వైధవ్యం కరపీడనే చ గమనే కుర్యాత్ప్రయాతుర్వధమ్॥ ౧౮౯

టీక॥ ఆర్కాక్రాంతభతః-సూర్యుడుండునక్షత్రము మొదలు, తృతీయనవమే-మూడుతొమ్మిదినక్షత్రములు, చాతుర్థభం - నాల్గవనక్షత్రము, పంచమం-ఐదవనక్షత్రము, ఏతద్ధిష్ణ్యచతుష్టయం—ఈనాల్గునక్షత్రములు, నామ్నా-పేరుచే,ఖచరః-ఖచరమని, భవేత్-అగును, తత్ఫలం-దానిఫలము. సీమంతే - సీమంతమందు, పుంసవనే—పుంసవనమందు, వ్రతే-ఉపనయనమందు, శిశుహరం-శిశువునుచంపుటను, కృషౌ-వ్యవసాయమందు, నిస్తండులత్వం-ధాన్యములేకుండుటను,కరపీడనే-వివాహమందు వైధవ్యం—విధవరికము; గమనే-ప్రయాణమందు; వధం—వధను; ప్రయాతుః-ప్రయాణమగువానికి; కుర్యాత్-చేయును.

అవ. ఖచరయోగఫలమును జెప్పుచున్నాఁడు.

తా॥ సూర్యస్థితనక్షత్రమునకు ౩, ౪, ౫, ౯. ఈ ౪నక్షత్రములు ఖచరాఖ్యయోగమనియు, నీఖచరయోగము పుంసవన, సీమంతము;ఉపనయనములవిషయమై శిశుహరణరూపఫలమును; వ్యవసాయవిషయమై ధాన్యాభావము; వివాహమందువైధవ్యమును ప్రయాణవిషయమై పైనముఁబోవువానికి మరణము నిశ్చయముగ గలుగజేయును.

## కర్మణిఫలము

శ్లో॥ సూర్యాధిష్ఠితతారకాది గణయే చాతుర్థభం ఘాతదం ।
స్యా దేకాదశభం ప్రభంగదమిదం చాష్టాదశం మృత్యుదమ్ ।
కర్తుః స్యాద్దశ పంచవింశ మపి భం హానిప్రదం కర్మణి ।
నామైతద్భశశాంకయుక్ గమనే సాంశిగ్రహాదిష్వపి॥ ౧౯౦

టీక॥ సూర్యాదిష్ఠితతారకాది-సూర్యుడుండునక్షత్రము మొదలు చంద్రుడుండు నక్షత్రమువరకు: గణయేత్-లెక్కించవలయును: చాతుర్థభం-సూర్యుడుండునక్షత్రము మొదలునాల్గవనక్షత్రము:ఘాతదంనామ-ఘాతదమనుపేరుగలది: ఏకాదశభం-౧౧వనక్షత్రము: ప్రభంగదం-ప్రభంగదమనుపేరుగలది:అష్టాదశం-పదునెనిమిదవనక్షత్రం మృత్యుదం-మృత్యుదమనుగలది: పంచవింశం - ఇరువదియైదవ, భమపి-నక్షత్రి

మున్నా, హానిప్రదం-హానిప్రదమను పేరుగలది, ఏతత్—ఈ; కర్మాణినామ-కర్మణి పేరుగల, భచతుష్టయం-నక్షత్రచతుష్టయము గమనే—గమనమందు. కర్తుః-కర్తకు. పాణిగ్రహాదిష్వపి-వివాహాదులయందును, ఫలం—ఆయాపేరుగలఫలము, స్యాత్ — అగును.

అవ॥ కర్మణిఫలమును జెప్పుచున్నాఁడు.

తా॥ సూర్యస్థిత నక్షత్రము మొదలు చంద్రస్థితనక్షత్రమువఱకు గణనజేయఁగా సూర్యస్థితనక్షత్రమునకు నాల్గవనక్షత్రఘాతదమనియు, పదునొకండవనక్షత్రము భంగదమనియు పదునెనిమిదవనక్షత్రము మృత్యుప్రదమనియు ఇరువదియైదవనక్షత్రము హానిదమనియు, ఈచెప్పఁబడిన నాలుగునక్షత్రములు కర్మణి యనుసంజ్ఞగల నిశిప్రియాణ వివాహాదిశుభకర్మలవిషయమై, ఉక్తఫలంబులఁ గ్రమంబుగనిచ్చును గాన నీనక్షత్ర చతుష్టయమందు నేశుభకార్యములును జేయఁగూడదని తా॥

బాల్యాదిస్వరవివేచనము

శ్లో॥ యన్నామప్రథమాక్షరస్వరముఖాజ్జ్ఞేయా అకారాదయో,
బాల్యౌవనరాజ్యవృద్ధమృతయ స్స్వాద్యా ఇతి పంచాభిధాః।
క్లుప్తా దృష్టి రకారఏవ గదితో దైవస్తు ఉకారోభవేత్।
పౌర్ణాఖ్యాది రికారఏవ ముభయో రేకారఓకారకే॥౧౯౧

టీ॥ యన్నామప్రథమాక్షరస్వరముఖాత్- యత్ - యెవనియొక్క, నామ - పేరుయొక్క, ప్రథమాక్షర-మొదటక్షరమందు, స్వర—అచ్చుకలదో, తన్ముఖాత్ — ఆయచ్చుమొదలు, అకారాదయః- అ ఉ ఏ ఓకారములు; జ్ఞేయాః — తెలియదగినవి స్వస్వాది—తమతమనామప్రథమాచ్చుమొదలు, బాల్య-బాల్యము, యౌవన - యౌవనము, రాజ్య—రాజ్యము; వృద్ధ-వృద్ధత్వము, మృతయః—మరణము, ఇతి—అని; పంచాభిధాః-ఐదుపేర్లుగలవి; అకారఏవ - అకారమే; దృష్టిః— దృష్టి; క్లుప్తా—సిద్ధమైనది. ఇకారః-ఇకారము; దైవః-దైవమని; గదితః- చెప్పఁబడినది, ఉకారః — ఉకారము పౌర్ణాఖ్యాదిః పౌర్ణములకుమొదలు; భవేత్ — అగును; ఏకారఓకారకే - ఏకారౌకారములు: ఉభయోః-రెంటికి; ఏవం-ఈపౌర్ణనామమే; భవేత్-అగును.

అవ॥ సర్వచక్రమందుఁజెప్పబడినబాల్యాదిస్వరవివేకమును జెప్పుచున్నాఁడు.

తా॥ అకార; ఇకార; ఉకార; ఏకార; ఓకారము లనుపంచపర్వములలో నేస్వరము నామధేయప్రథమాక్షరమందుఁగలదో; ఆసర్వము మొదలైయుస్వరములకు బాల్య; యౌవన; రాజ్య; వృద్ధ; మృతు లనుపంచవిధనామంబు అని యెట్లనఁగా

అకారాదినామంబుగలపురుషునికి అకారము బాలస్వరము, ఇకారము కుమారస్వరము ఉకారము రాజ్యస్వరము, ఏకారము వృద్ధస్వరము ఓకారము మృతిస్వరము. ఇకారాది నామంబుగల పురుషునికి ఇకారము బాలస్వరము, ఉకారము యౌవనస్వరము. ఇత్తె ఱంగున మిగిలినస్వరంబులకు స్వస్వాదిగా బాలాదిస్వరవివేకము నెఱుంగవలయు నవియు ఆకారాదిపంచస్వరములకు స్వస్వాదిగా దృష్టి, దైవ, పౌత్రిథ, పౌత్రిథ, పాత్రిథ, లనుపంచవిధావస్థలు గలవు వానివిషయ మీగ్రంథమందు సూక్ష్మముగఁజెప్పఁబడి యున్నదిగాన స్పష్టముగ దెలుసుకొననిచ్చయించువారు సర్వోదయ మనుగ్రంథము నఁదెలిసికొనవచ్చునవి తా॥

బాలాదినామములకు తిథివారనక్షత్రకాలములు శ్లో ౧౯౨

శ్లో॥ అల్పార్థాధికలాభహానిమరణం కుర్యుస్స్వబాలాదయః,
పంచ ద్వ్యృతుశ పంచ పంచ భగణా దస్రాది నందాద్యపి ।
వారాః పంచవిధా స్స్యురర్కకుజయోశ్చంద్రజ్ఞయోర్వాక్పతే
శ్శుక్రస్యార్కసుతస్యపంచసమయాస్స్యుః ప్రాతరాద్యాస్స్వరాః॥

టీ॥ స్వబాలాదయః – వారివారినామముయొక్క బాల్యాద్యవస్థలు, అల్పార్థాధికలాభహానిమరణం - అల్ప—కొద్దిలాభమును; అధిక—అధికలాభమును, లాభ — మిత్రిలాభమును, హాని—నష్టమును, మరణం-నాశనమును: కుర్యుః—చేయునవి, పంచ ఐదు, ద్వి-రెండు, ఋతుక-ఆఱు, పంచ-ఐదు, పంచ — ఐదు భగణాః — నక్షత్రి గుంపులు దస్రాది - అశ్విన్యాదిగా; స్వబాలాదయః — అయానామబాలాదులు, స్యుః—అగుచున్నవి. నందాద్యపి - నందాదితిథులునిట్టులనే; వారాః - వారములు- అర్క-కుజయోః—సూర్యాంగారకులకు, చంద్రజ్ఞయోః -చంద్రబుధులకు వాక్పతే — బృహస్పతికి శుక్రస్య-శుక్రునకు, అర్కసుతస్య—శనికి, పంచవిధా-పంచవిధములు స్యుః—అగుచున్నవి ప్రాతరాద్యాః - ప్రాతఃకాలము మొదలు, పంచసమయాః - ఐదుకాలములు, స్వరాః-పంచస్వరములు: స్యుః-అగుచున్నది.

అవ॥ పూర్వశ్లోకమందుఁ జెప్పఁబడియున్న బాలాదినామములకుఫల బులను తిథివారనక్షత్రికాలములకు బాలాదిస్వరూపమును జెప్పుచున్నాఁడు

తా॥ బాలాదిపంచస్వరములలో బాలస్వరము స్వల్పలాభమును: యౌవనస్వరము ధనము, రాజ్యస్వరము ఫలప్రాప్తిని, వృద్ధస్వరము హానిని, మృతిస్వరము మరణమును: పీక్రిమంబునఁ గలుగఁజేయునవియు, అకారమునకునశ్విన్యాదిపంచకము బాల

స్వరమనియు, ఆర్ద్రాదిషట్కము యౌవనస్వరమనియు: ఉత్తరాదిషట్కము రాజ్యస్వరమనియు జ్యేష్ఠాదిపంచకము వృద్ధస్వరమనియు: ధనిష్ఠాదిపంచకము మృతిస్వరమనియు: ఇకారమునకు ఆర్ద్రాదిషట్కము బాలస్వరమనియు: ఉత్తరాదిషట్కము యౌవనస్వరమనియు: శేషంబిత్తెఱంగునదెలుఁగవలయును: అకారమునకునందాది పంచతిధులు బాలస్వరమనియు: భద్రాదిపంచతిధులు యౌవనస్వరమనియు:జయాది పంచతిధులు రాజ్యస్వరమనియు: నీక్రమంబుననే శేషం దెలుఁగవలయుననియు అకారమునకు భాన్వంగారకవారములు బాలస్వరమనియు: సోమ బుధవారములు యౌవనస్వరమనియు గురువారము రాజ్యస్వరమనియు శుక్రవారము వృద్ధస్వరమనియు శనివారము మృతిస్వరమనియు ఇకారమునకు సోమ బుధవారములుబాల స్వరమనియు ఉక్త శేషం బిత్తెఱంగుననూహ్యంబులనియును అకారమునకు ప్రాతః కాలము బాలస్వరమనియు సంగమకాలము యౌవనస్వరమనియు మధ్యాహ్నకాలము రాజ్యస్వరమనియు అపరాహ్ణకాలము వృద్ధస్వరమనియు సాయంకాలము మృతిస్వరమనియు ఇకారమునకు సంగమకాలము బాలస్వరమనియు శేషం బిత్తెఱంగున నూహ్యంబనియు తా॥

పంధారాహా చక్రనిరూపణము. శ్లో॥ ౧౯౩

శ్లో॥ వస్వాద్యార్యవిశాఖమిత్రవరుణాహ్వాభాశ్చ ధర్మాభిధాః ।
అర్ద్రాఖ్యాస్త్వదితీంద్రకాలపితృభశ్రీశాజపాద్వాయవః
కామాఖ్యా అభిజిద్భగాగ్నిదనుజాహిర్బుధ్న్యచిత్రేశ్వరా ।
విశ్వాప్యాంత్యకరార్యమేందువిధయో మోక్షాభిధాస్తారకాః ॥

టీక॥ వసు-ధనిష్ట: ఆద్య—అశ్విని: అర్య-పుష్యమి: విశాఖ-విశాఖ: మిత్ర-అనూరాధ: వరుణాః- శతభిషము: ఆఖ్యాహి - పేరుగల నక్షత్రములైతే దర్మాభిధాః—ధర్మమను పేరుగలవి: ఆదితి-పునర్వసు: ఇంద్ర-జ్యేష్ట: కాల భరణి: పితృభ మఖ: శ్రీశ-శ్రవణ: అజపాత్-పూర్వాభాద్ర: వాయవః- స్వాతి, అర్ద్రాఖ్యాః- అర్థ: ములను పేరుగలవి: అభిజిత్-అభిజితు: భగ-పుబ్బ: అగ్ని: కృత్తిక: దనుజ-మూల అహిర్బుధ్న్య - ఉత్తరాభాద్ర: చిత్ర - చిత్ర: ఈశ్వరాః - ఆర్ద్ర: కామాఖ్యాః - కామములనునవి: విశ్వ—ఉత్తరాషాఢ: అప్య- పూర్వాషాఢ: అంత్య— రేవతి:కర - హస్త: అర్యమ- ఉత్తర: ఇందు- మృగశీర్ష: విధయః — రోహిణి మోక్షాభిధాః — మోక్షములను పేరుగలవి.

అవ ఐదుశ్లోకములచేత మహారాహుచక్రవిపక్షద్వారా ధర్మార్థకామమోక్ష నక్షత్రనిర్ణయముఁ జెప్పుచున్నాఁడు.

తా॥ అశ్విని: ధనిష్ఠ: పుష్యమి, విశాఖ: అనూరాధ: శతభిషము: ఆశ్లేష ఈ 8 నక్షత్రములు ధర్మనక్షత్రములనియును: పునర్వసు: జ్యేష్ఠ:భరణి:మఘ:శ్రవణము: పూర్వాభాద్ర: స్వాతి: ఈ 8 నర్థనక్షత్రములనియును: అభిజిత్తు: పూర్వఫల్గుని కృత్తిక మూల: ఉత్తరాభాద్ర: చిత్ర: ఆర్ద్ర ఈ 8 ను కామనక్షత్రములనియు ఉత్తరాషాఢ పూర్వాషాఢ రేవతి హస్త ఉత్తరఫల్గునీ మృగశీర్షరోహిణిఈ 8 ను మోక్షనక్షత్రములనియును తా॥

శ్లో॥ సూర్యే ధర్మగతే తథా హిమకరే ధర్మాదిసంస్థే క్రమా।
దాయాయీ భంగమవాప్నుయాదథజయంక్రోధాదనర్థంజయమ్
స్థాయీ యా ద్విజయం సభంగవికలం తద్విగ్రహంసంగరం।
భృత్యాజాండజసంగరేచ గమనే సర్వత్ర రాజ్ఞాంయుధి॥

టీక॥ సూర్యే-సూర్యుఁడు: ధర్మగతే - ధర్మనక్షత్రముల బొందియుండగా తథా-అట్లు: హిమకరే-చంద్రుఁడు। ధర్మాదిసంస్థే - ధర్మార్థకామమోక్షములయం దుండగాను: యాయీ-యుద్ధమునకువచ్చినరాజు, క్రమాత్-వరుసగా, భంగం- అపజయమును, జయం-జయమును: క్రోధాత్-కోపమువల్ల: అనర్థ-అపజయమును జయం-జయమును: మును అప్నుయాత్-పొందును:స్థాయీతు-పట్టణపురాజు:విజయం జయమును, సభంగవికల -వైకల్యముగల పరాజయము: తద్విగ్రహం-జయమును సంగరం-విశేషయుద్ధమును, ఇయాత్-పొందును: భృత్యాజాండజసంగరే- భృత్య- భటులకు: అజ-పొట్టేళ్ళకు: అండజ-కోళ్ళకు: సంగరే-యుద్ధమందురాజ్ఞాం - రాజులయొక్క: యుధి-యుద్ధమందు: గమనే ప్రయాణమందు: సర్వత్ర - అంతట విచారించవలయును.

తా॥ సూర్యచంద్రులిరుపురుపూర్వశ్లోకోక్త ధర్మనక్షత్రముల యందుండునపుడు రాణువచేర్చుకొని యుద్ధమునకుఁబోవు రాజునకుభంగమనిచంద్రుఁడర్థాఖ్యనక్షత్రములయందుండునపుడు జయమని కామాఖ్యనక్షత్రగ్రతుఁడై యుండఁగా నపజయమని మోక్షాఖ్యనక్షత్రగతుఁడై యుండగా జయమని, ఈ సూర్యచంద్రులు ధర్మగ్రతులై యుండుసమయంబునఁ తనపట్టణములోనుండి యుద్ధముచేయురాజునకు విజయమని: చంద్రుఁడర్థగతుడై యుండగా భంగమని: కామగతుడై యుండగా పరాజయమని:

మోక్షగతుఁడై యుండగా విశేషయుద్ధమగునని భటుల పొట్టేళ్ల కోళ్ల వీరికిఁ బర స్పరము కలహము చేయించుసమయమున రాజులయుద్ధమునకుఁ బోవుసమయమున నీవిచార మావశ్యకమనియు తా॥

శ్లో॥ ఆదిత్యేఽర్ధగతే తథా హిమకరేఽప్యర్ధాదిసంస్థే క్రమాత్ ।
ర్బంధుద్వేషమిహాఽజ్జయంచవసుధాంయాయీచసర్వాశుభమ్ ।
లక్ష్మీభంగమథాశుభంచవిజయం స్థాయీతుసంప్రాప్నుయాత్ ।
జ్ఞాత్వా చక్రఫలంమయైవరచితంసమ్యక్ప్రకారాంతరమ్ ॥ ౧౯౨

టీక॥ ఆదిత్యే-సూర్యుఁడు, అర్ధగతే- అర్ధనక్షత్రములనున్నచో, తథా-అట్లే, హిమకరే-చంద్రుఁడు, అర్ధాదిసంస్థే-అర్ధాదినక్షత్రములనున్నచో, యాయీ-యుద్ధమునకువచ్చువాఁడు, బంధుద్వేషం-బంధువిరోధమును, జయం-జయమును, వసుధాం-భూమిని, సర్వాశుభం-సమస్తాశుభమును, క్రమాత్-క్రమముగా, ఇయాత్-పొందును, అథ-పిమ్మట; స్థాయీతు - పట్టణపురాజు, లక్ష్మీభంగం- జయలక్ష్మికి భంగమును, అశుభం అశుభము, విజయం-జయమును, సంప్రాప్నుయాత్-పొందును, మయా-నాచే, చక్రఫలం - పంథారాహుచక్రఫలము, సమ్యక్-చక్కఁగా, జ్ఞాత్వా-తెలుసుకొని, ప్రకారాంతరం-మఱివకవిధము, రచితం-కూర్చబడినది.

తా॥ సూర్యచంద్రు లర్ధాఖ్యనక్షత్రగతులై యుండునపుడు యుద్ధమునకు వెడలినరాజునకు బంధుద్వేషము తనపట్టణములోననుండి యుద్ధముచేయురాజునకు నైశ్వర్యంబును చంద్రుఁడుకామగతుఁడై యుండగా యుద్ధమునకు వెడలినవానికిజయము స్వస్థానమందుండి యుద్ధముచేయువారికి భంగము, చంద్రుడుమోక్షగతుడై యుండగా యాయికిభూలాభము, స్థాయికి నశుభము చంద్రుడుధర్మగతుడై యుండగా యాయికి నశుభము, స్థాయికి దీర్ఘద్వేషము గలుగుననియును బూర్వికులచే బూర్వశ్లోకమందు జెప్పబడియున్న క్రమముననే తఱచుగా బ్రతిపాదింప బడియున్న పంథారాహు చక్రము లెన్నగాశోధించిన ఈ కాలామృతకారునిచే సుర్థక్రాము ప్రకారాంతరముగ శ్లోకమందుజెప్పబడియున్నదనియును తా॥

శ్లో॥ అర్కే కామగతే తథామృతకరే కామాది సంస్థేక్రమా ।
ద్యాయీ యుద్ధ మవాప్నుయాదతిధనం సర్వాపదంమంగళమ్ ।
యత్క్రించి ద్విజయం ధనం శుభకరం స్థాయీతు భంగంసదా ।
విద్వద్భిః క్రమశః ప్రయాణసమయేజ్ఞేయంచతుర్ణాంఫలమ్ ॥ ౧౯౩

టీక॥ అర్కే-సూర్యుఁడు, కామగతే- నామనక్షత్రముల బొందినచో, అమృతకరే-చంద్రుఁడున్నూ, కామాదిసంస్థే-కామాదినక్షత్రములనుండినను, యాయీ-యుద్ధమునకువచ్చువాఁడు, క్రమాత్-క్రమముగా, యుద్ధం-యుద్ధమును, అతిధనం-మిక్కిలిధనమును, సర్వాపదం-సర్వాపత్తును, మంగళం-శుభమును, అవాప్నుయాత్-పొందుచుండును, స్థాయీతు-పట్టపురాజైతే, యత్కించిద్విజయం-కొంచెము జయమును, ధనం-ధనమును, శుభకరం-శుభమును, భంగం-అపజయమును, అవాప్నుయాత్-పొందుచుండును, విద్వద్భిః-పండితులచేత, సదా-ఎల్లప్పుడు, క్రమశః-క్రమముగా, ప్రయాణసమయే - ప్రయాణకాలమందు, చతుర్ణాం-ధర్మార్థకామమోక్షముల నాల్గింటికి, ఫలం-ఫలము, జ్ఞేయం-తెలియతగినది.

తా॥ సూర్యుఁడుకామాఖ్యనక్షత్రగతుఁడై యుండునపుడునుచంద్రుఁడు కామమోక్షధర్మార్థనక్షత్రగతుఁడై యుండునపుడునుపట్టణము వెడలి యుద్ధమునకుఁబోయిన రాజు, యుద్ధము అతిధనము, సర్వాపదమంగళ మనుచతుర్విధఫలములను, తనపురమునసేయుండి యుద్ధముచేయురాజుకించిద్విజయము ధనముశుభము భంగమనుచతుర్విధఫలంబులను బొందుననియు విద్వాంసులచేత నీచతుర్విధఫలవిచార మవశ్యముగ జూడఁదగినదని తా॥

శ్లో॥ భానౌ మోక్షగతే గతేతధాప్యుడుపతౌ మోక్షాదిసంస్థే క్రమా ।
ద్భంగం సర్వజయం శ్రియంచసమియాద్యాయీచసంధింసదా ॥
స్థాయీచాశుజయంమహీంచమహతీంభంగం మహద్విగ్రహం॥
పంథారాహుగతం ఫలంచ లిఖితంధర్మాదిచక్రంత్విదమ్॥ ౧౭౭

టీక॥ భానౌ - సూర్యుఁడు, మోక్షగతే- మోక్షనక్షత్రములపొందినచో, ఉడుపతౌ-చంద్రుడున్నూ; మోక్షాదిసంస్థే - మోక్షాదినక్షత్రములనుండినను; క్రమాత్-వరుసగా; యాయీ-యుద్ధమునకు వెళ్లువాడు; భంగం-పరాజయమును; సర్వజయం-సర్వజయమును; శ్రియం-లక్ష్మిని;సంధిం-సంధిని; ఇయాత్-పొందును; స్థాయీతు-పట్టపురాజు; జయం-జయమును; మహతీం-విస్తారమగు; మహీం-భూమిని; భంగం-అపజయమును; మహద్విగ్రహం-గొప్పయుద్ధమును; ఆశు-త్వరలో; సమియాత్-పొందును; పంథారాహుగతం-పంథారాహుచక్రమునుబొందిన; ఫలం-ఫలము; లిఖితం-వ్రాయబడినది; ఇదంను-ఇదైతే; ధర్మాదిచక్రం-ధర్మాదిచక్రమనబడును.

తా॥ చంద్రసూర్యులిరువురు మోక్షాఖ్యనక్షత్రగతులై యుండునపుడును సూర్యుడు మోక్షగతుడై యుండగా చంద్రుడు ధర్మార్థ కామనక్షత్రగతుడై యుండెనేని

యట్టి సమయంబున రాణువనుజేర్చుకొని యుద్ధమునకు వెడలిన ప్రభువు సంగరమును: సర్వజయమును: సంపదను: సామోపాయమును నీచతుర్విధఫలములఁ గ్రమముగాఁ బొందుననియును జంద్రసూర్యులక్రమంబునమంతఁగాఁ దనపురంబుననేనుండి యుద్ధముచేయురాజు జయమును శత్రురాజ్యమును భంగమును విశేషకలహమును నీఫలంబులఁగ్రమంబుగఁ బొందుననియును: పంతారాహుచక్రఫలంబిదియనఁగా శ్లోకచతుష్టయమందుఁ బ్రతిపాదింపఁబడినయర్థమే ధర్మాదిచక్రంబని వ్యవహరింపఁబడుచున్నదని తా॥

సూర్యచంద్రనాడీ నిర్ణయము శ్లో॥ ౧౯౮

శ్లో॥ నాస దక్షిణభాగజాతపవన స్సూర్యాఖ్యనాడీ శుభా ।
సంగ్రామవ్యవహారమైథునభయస్నా నాన్నభంగార్తిషు।
నాడ్యన్యా శశిన శ్శుభైవ గమనాలంకారపాణిగ్రహ ।
క్షేత్రాద్యేషు యదంశవాయుచలనేతత్పాదపూర్వంవ్రజేత్॥

టీక॥ నాసాదక్షిణభాగజాతపవనః — ముక్కు యొక్క దక్షిణభాగమందు పుట్టువాయువు: సూర్యాఖ్యనాడీ—సూర్యుడను నాడీ: సంగ్రామ—యుద్ధమందు: వ్యవహార-వ్యాపారమందు: మైథున-సంగమమందు: భయ-భయమందు: స్నాన-స్నానమందు: అన్న-భోజనమందు: భంగ-అపజయమందు: ఆర్తిషు-పీడలయందు: శుభా—మంచిది: అన్యా—మఱియొక: నాడీ - నాడి [అనగా ముక్కువామభాగమందుండు వాయువనుట]॥శశినః-చంద్రునిది: గమన-ప్రయాణమందు: అలంకార-అలంకారమందు: పాణిగ్రహ వివాహమందు: క్షేత్రాద్యేషు - వ్యవసాయముమొదలగు వానియందు: శుభాః-మంచిది: యదశవాయుచలనే - ఏయంశయందు వాయువు కదులుచుండునో: తత్పాదపూర్వం-ఆపాదము ముందుంచునట్లుగా: ప్రజేత్-ప్రయాణము జేయువలయును. [అనగా యుద్ధాదులదక్షిణపాదము ప్రయాణాదుల వామపాదము ముందుంచవలయునను]

అవ. చంద్రసూర్యనాడీవివేకము జెప్పుచున్నాడు.

తా॥ నాసికమునకు కుడిప్రనున్న రంధ్రమునందు సంచరించుచున్న వాయువు సూర్యనాడియనియు: ఈసూర్యనాడి: యుద్ధము: క్రయవిక్రయాది వ్యాపారము: మైథునము: రాజభయము: మంగళస్నానము: భోజనకాలము, పరాజయము. మనఃపీడ ఇవిమొదలగు కార్యములవిషయమై శుభకరంబనియును: నాశికమునకు నెడమప్రక్కనున్న రంధ్రమందు వంచరించువాయువు చంద్రనాడియనియు: అనాదిభూషణధారణము: వివాహము వ్యవసాయము మొదలగు కార్యములవిషయమై శుభకరం

బనియు: నాసికమునకు నేభాగమునం దేవాయువు సంచరించుచుండునో ఆభాగపాత సంచారము ముందుగా జేయవలయునని యభిప్రాయమని తా॥

సర్వదిగ్గమన నిర్ణయము

శ్లో॥ కౌబేరీ ముదయే రవెస్సురపతే ర్దేశంతు మధ్యందినే ।
సాయం వారుణదేశ మంతకదిశ మాత్రార్ధరాత్రే ప్రవజేత్ ।
గోధూళౌ వభిజి తు పస్యపి గతి స్సర్వాసు ఇత్యర్థదా ।
మందావారోషసి కింపునశ్చ గమనే లగ్నాదిశుద్ధింవినా॥౯౯

టీక॥ రవేః—సూర్యునియొక్క; ఉదయే - ఉదయకాలమందు; కౌబేరీం-కుబేతుసంబంధమగు; దిశం-దిక్కును [అనగా నుత్తరదిక్కును] మధ్యందినే-మధ్యాహ్నమందు; సురపతేః - ఇంద్రునియొక్క; దిశం-దిక్కును [అనగాతూర్పును] సాయం-సాయంకాలమున; వారుణదేశం—వరుణదిక్కును; [అనగా పడమరను] అర్ధరాత్రౌ-నిశియందు; అంతకదిశం-యమదిక్కును [అనగా దక్షిణమును] యాతా-ప్రయాణమగువాడు; వ్రజేత్-వెళ్ళవలయును; గోధూళౌ-గోధూళిలగ్నమందు; అభిజిత-అభిజిల్లగ్నమందు; ఉషసిచ-ఉషఃకాలమందు; సర్వాసు-సమస్తమగు; దిక్షి దిక్కులయందు; అర్థదా—ధనమునిచ్చును; మందాహోషసి-శనివారోషఃకాలమందు లగ్నాదిశుద్ధింవినాపి-లగ్నశుద్ధిమొదలగునవి లేకనున్నా; గమనే-ప్రయాణమందు: అర్థదేతి-ధనమిచ్చునని. కింపునః-ఏమిచెప్పవలయును [ధనము తప్పకనిచ్చుననుట]

అవ. సర్వదిగ్గమన నిర్ణయమును జెప్పుచున్నాడు

తా॥ ప్రయాణకర్త సూర్యోదయకాలమునం దుత్తరమునకు, మధ్యాహ్నకాలమునందు తూర్పునకును: సాయంకాలంబునందుపశ్చిమంబునకు అర్ధరాత్రియందు దక్షిణంబునకును పైనముబోవునేని యిష్టసిద్ధిగలుగుననియు; గోధూళి అభిజిత్ ఉషఃకాలములయందు నేదిక్కునకు ప్రయాణమువెళ్ళినను ధనలాభము గలుగునని యును: శన్యుషః కాలమనగా శుక్రవారచరమయామమనుట ఈకాలము శుక్ర: బుధ: చంద్రహోరాకాలింత మైయుండుగాన లగ్నాది యేవిచారమునుచేయక అట్టి కాలమందు ప్రయాణము వెళ్ళినవారికి సర్వాభీష్టసిద్ధిగలుగునని తా॥

ప్రయాణమునకు నక్షత్రములు శ్లో॥ ౧౦౦

శ్లో॥ పాణిస్థాత్వని కార్యసిద్ధి రనిశం మైత్రే ప్రయాతస్యతు ।
జ్యేష్ఠాయా ముషితస్య తత్రహి పునర్మూలే ప్రయాతస్యతు।

మాండవ్యస్యమనోజయే ఉషసి చేద్గార్గ్యస్య యానంమతం ।
స్యాత్సమ్యక్ఛకునం బృహస్పతిమతంతత్రాపియాత్రార్థదా ।

టీక॥ మైత్రే-అనూరాధయందు, ప్రయాతస్య—ప్రయాణమగువానికి:అధ్వని మార్గమందే, అనిశం-ఎల్లప్పుడు, కార్యసిద్ధిః - కార్యముయొక్క-సిద్ధియు, పాణిస్థా హస్తమందుండును, [అనగా కార్యముతప్పకవగుననుట] జ్యేష్ఠాయాం-జ్యేష్ఠయందు మూలే-మూలయందు ఉషితస్య - ప్రయాణమగువానికి, ప్రయాతస్యచ— ప్రయాణ మగువానికిని, తత్రాపిపునః-ఆమార్గమందే:[కార్యముకలుగుననుట]మాండవ్యస్యతు -మాండవ్యమహామునిమతమందు, మనోజయే-మనస్సునకు సంశయములేనప్పుడు, (కార్యసిద్ధికలుగును) ఉషసి ఉషఃకాలమందు, యానంచేత్-ప్రయాణమైనచో,గార్గ్య స్య-గర్గపుత్రునికి, మతం-ఇష్టము, శకునం - శకునము:సమ్యక్-మంచిదని:బృహ స్పతిమతం-బృహస్పతియొక్క మతము, స్యాత్-అగును, తత్రాపి-వాటియందును, యాత్రా—ప్రయాణము, అర్థదా-ధనమిచ్చును.

అవ॥ ప్రయాణవిషయమై ముఖ్యమగునక్షత్రములను,ఆయామునులకునిష్టం బులగు కాలంబులను జెప్పుచున్నాడు.

తా॥ అనూరాధానక్షత్రమందు జ్యేష్ఠయందును మూలయందునుప్రయాణము వెడలినవారికి కార్యసిద్ధిసుస్థిరమైయుండుననఁగా నిర్విఘ్నంబుగనిష్టసిద్ధిగలుగుననుట చిత్తమందేసంశయముంచక నిపు డిష్టసిద్ధిగలుగునని పైనముపెళ్ళెడివారికికీసర్వలా భంబులు చేకూరుననిమాండవ్యమహామునిమతంబనియుగాగర్గ్యమహర్షిమతము,ఉషః కాలమునందుఁ బైనముపోవువారలకునిష్టసిద్ధిగలుగుననియు,బృహస్పతిమతమెప్పుడు శుభశకునము లగుచున్నవో యప్పుడు ప్రయాణముపెడలుటలాభకరమనియు,ఇట్లు శకునస్వరూపము ముందు జెప్పఁబడుచున్నదనియు జ్యేష్ఠానక్షత్రి ముత్తమమధ్యమ నక్షత్రములలో గ్రహింపఁ బడకపోయినను ఇచ్చట నుదాహరించుటవలన నుత్త మంబనియును తాత్పర్యము

## ప్రయాణలగ్నమునకు గ్రహస్థితిఫలము

శ్లో॥ ఆయుర్ద్రవ్యజయాన్నమిత్రకలహస్త్రీవ్యాధిభాగ్యోత్సవ ।
ప్రాప్త్యప్రాప్తికరాఃక్రమాచ్ఛుభఖగాయాత్రాగృహాదిస్థితాః
క్రూరా స్త్వామయభీతిభూషణరిపుభ్రాంత్యర్థపీడామృతి ।
క్రోధానర్థవసుంధరా వ్యయకరాస్స్యుర్యాతు రేవాధ్వని,

టీ॥ యాత్రాగ్రహాదిస్థితాః—ప్రయాణలగ్నము మొదలుగా మన్న, శుభఖగాః - శుభగ్రహములు, యాతుః-ప్రయాణమగువానికి, అయుః-ఆయుర్దాయమును, ద్రవ్య-ద్రవ్యమును, జయ—జయమును, అన్న-అన్నమును, మిత్రబంధులాభమును, కలహ-పోట్లాటను, స్త్రీ-స్త్రీలాభమును; వ్యాధి—రోగమును, భాగ్య- భాగ్యమును, ఉత్సవ - ఉత్సవమును, ప్రాప్తి-ఫలప్రాప్తిని, అప్రాప్తి—ఫలాభావమును, కరాః—చేయువారు క్రమాత్—వరుసగా; స్యుః-అగుచున్నారు; క్రూరాస్తు-పాపులు, ఆమయ-రోగమును భీతి-భయమును, భూషణ-అలంకారమును, రిపు—శత్రువును, భ్రాంతి - మనోవికలమును, అర్థ-ధనమును, పీడా-బాధను మృతి-మరణమును, క్రోధ - కోపమును: అనర్థ - కార్యభంగమును; వసుంధరా-భూమిని, వ్యయ-ధనవ్యయమును, కరాః - చేయునవి, యాతుః—ప్రయాణమగువానికి, అధ్వన్యేవ—మార్గమందే; స్యుః- అగుచున్నవి.

అవ॥ ప్రయాణలగ్నాది ద్వాదశభావములయందు సూర్యాదిగ్రహస్థితికిఁ బ్రత్యేకఫలములఁ జెప్పుచున్నాఁడు

తా॥ శుభగ్రహంబు లగుగురుశుక్రబుధపూర్ణచంద్రులలో నెవ్వరు ప్రయాణలగ్నమునందుండినను నాయుర్వృద్ధిని, లగ్నద్వితీయస్థానఁగతులై యుండ నపుడు ద్రవ్యమును తృతీయస్థానగతులై యుండిరేని జయమును చతుర్థస్థానగతులై యుండిరేని యన్నమును పంచమస్థానగతులై నుండిరేని బంధులాభమును షష్ఠస్థానగతులై యుండిరేని కలహమును సప్తమస్థానగతులైరేని స్త్రీలాభమును అష్టమస్థానగతులైరేని వ్యాధిని నవమస్థానగతులైరేని భోగమును దశమస్థానగతులైరేని యుత్సవమును ఏకాదశస్థానగతులైరేని ఫలప్రాప్తిని ద్వాదశగతులైరేని వస్త్వభావమును ఈక్రమంబున ఫలంబుల నిత్తురనియు సూర్యాదిపాపగ్రహంబులు ప్రయాణలగ్నాదిద్వాదశలగ్నములయందుండిరేని రోగము; భయము; భూషణలాభము; శత్రుదర్శనము; చిత్తవైకల్యము ధనము శరీరజాడ్యము; మరణము; కలహము; అనర్థము; భూలాభము; పదార్థక్షయములనెడి ద్వాదశవిధఫలం బీక్రమంబునఁ బ్రయాణకర్తకు మార్గమందు గలుగఁజేయుదురవి తా॥

యాత్రాయోగములు శ్లో॥ ౨౨

శ్లో॥ యాత్రాలగ్నగతశ్శుభోఽరసుఖదో యోగాఖ్య ఇందుం వినా।
లగ్నస్థా మణిభూమిజాశుభఖగావార్గేఽధియోగస్త్వయమ్।
లగ్నస్థా స్త్రిశుభాయదీంద్రసుఖా యోగాధియోగస్త్వయం।
సౌమ్యాః కేంద్రగతాస్త్వభీష్టఫలదాస్సాన్వ్యేద్రాజయోగస్త్వయమ్

టీక॥ ఇందువినా-చంద్రునివదలి:శుభః—ఒకశుభగ్రిహము:యాత్రిలగ్నగత శ్చేత్-ప్రియాణలగ్నమందున్నచో:అర్థసుఖదః-ధనసుఖములవిచ్చును. అయం-ఇది యోగాఖ్యం-యోగమనుయోగము; శుభగౌ—రెంశుశుభగ్రిహములు; లగ్నస్థౌయది లగ్నమందున్నచో; మార్గఏవర్గ-మార్గమందే; మణిభూమిదౌ-మణిభూమిలవిచ్చును అయం-ఇది; అధియోగః-అధియోగమను యోగము; త్రిశుభాః - ముగ్గురు శుభ గ్రిహములు లగ్నస్థాః-లగ్నమందున్నచో; ఇంద్రసుఖదాః—స్వర్గసుఖమునిచ్చును అయంతు-ఇదైతే; యోగాధియోగః - యోగాధియోగమనుయోగము; సౌమ్యాః - శుభగ్రిహములు;కేంద్రగతాః-కేంధ్రిములనున్నచో:అభీష్టఫలదాః-ఇష్టములనిచ్చును [అంతట చంద్రునివదలవలయును] అయంతు-ఇదైతే రాజయోగః-రాజయోగము స్యాత్—అగును.

అవ॥ ప్రయాణవిషయమై యోగనిర్ణయమును జెప్పుచున్నాఁడు

తా॥ చంద్రుఁడు వినగా నేశుభగ్రిహమయినను ప్రియాణలగ్న మందుండె నేని యర్థసుఖకరుఁడగుననియు; ఇదియు యోగాఖ్యయోగమనియు;రెండుశుభగ్రహ ములు ప్రయాణలగ్నగతులై యుండిరేని ప్రయాణకర్తకుమార్గమధ్యమందురత్న లాభభూలాభకరులగుదురనియు;ఇది యోగాఖ్యయోగ్యమనియు మూడుశుభగ్రిహము ములు లగ్నగతులయియుండిరేని స్వర్గసుఖముతో సమంబగుసుఖంబును గలుగ జేయుదురనియు; ఇదియ యోగాధియోగమనియు: మఱియు శుభగ్రిహములు లగ్న చతుర్థసప్తమదశమస్థానములయందుండిరేనిసర్వాభీష్టప్రిదులగుదురనియునిదియరాజ యోగమనియు చంద్రుఁడు వినాగా ననునభిప్రాయ మీచెప్పఁబడినయోగము లన్నిటి యందు నూహింపవలయునని తా॥

తారాబలనిర్ణయము ౨౦౩

శ్లో॥ జన్మర్క్షాది పునః పున ర్నవ నవ స్యు స్తారకాచంద్రయు
గ్ధిష్ణ్యాంతం గణయే త్సమాస్సుభఫలాస్సాంత్యాస్సదానేతరాః
తాసు త్ర్యాద్య చతుర్థివీయుచరణాస్త్యాజ్యాశ్చ శాకంగుడం॥
దానం నాళ్ళ్లవణంచ హేమసతిలం తెచ్ఛేషపాదా శ్శుభాః॥

టీక॥ జన్మర్క్షాది-జన్మనక్షత్రము మొదలుగా: చంద్రయుగ్ధిష్ణ్యాంతం-చంద్రుడుండు నక్షత్రమువఱకు: నవనవ-తొమ్మిదితొమ్మిదిని: పునఃపునః-మాటిమాటికి: గణయేత్-లెక్కించిగచో: తారకాః - తారలు: స్యుః - అగుచున్నవి: సాంత్యాః— అంత్యమగు

పరమమైత్రితారతోఁగూనడి, సమాః-సమతారలు: శుభఫలా - మంచిఫలమునిచ్చునవి, ఇతరాః-తొమ్మిదవదిగాక విషమతారలు, న-శుభఫలమునిచ్చునవిగావు. తాసు-ఆజన్మప్రత్యక్నైధనాదివిషమతారలయందు,త్రి-మూడవది,ఆద్య-మొదటిది; చతుర్థ నాల్గవది; ద్వితీయ-రెండవదియగు; చరణాః-పాదములు; త్యాజ్యాః— విడువతగినవి [అనఁగా మించివికావనుట] శాకం-కూర; గుడం-బెల్లము; లవణం—ఉప్పు;సతిలం తిలలతోఁగూడిన; హేమ—బంగారము; దానం-దానము; స్యాత్-అగును; తచ్ఛేష పాదాః-మిగిలినపాదములు; శుభాః-మంచివి.

అవ॥ తారాబలనిర్ణయమును జెప్పుచున్నాఁడు

తా॥ జన్మనక్షత్రము మొదలు చంద్రుఁడుండునక్షత్రమువరకు పలుమారు తొమ్మిదినక్షత్రముల గణనచేయవలయును నట్లు గణనచేయఁగా నవి తారలకునట్టి తారలలో పరమమైత్రిమనఁగా దొమ్మిలవతారతోఁగూడ సమతారలు శుభఫలదములనియు మిగతజన్మవిపత్, ప్రత్యక్;నైధనములనెడినవమాతిరిక్తవిషమతారలలో జన్మతారయందు తృతీయపాదము విపత్తారయందాద్యపాదము ప్రత్యక్తారయందు నాల్గవపాదము నైధనతారలయందురెండవపాదముసశుభకరములుగాననీపాదములను నిషేధింపఁగా శేషించినపాదములు దానపూర్వకముగ యాత్రోపాదేయములనియు వదియెట్లనిన జన్మతారకు శాకదానమును విపత్తారకు గుడమును; ప్రత్యక్తారకు లవణమును; నైధనతారకు నువ్వులతోఁగూడిన సువర్ణమును దానముచేసిరేని నిషిద్ధవ్యతిరిక్తపాదములు శుభకరములగునని తా॥

## చంద్రబల నిర్ణయము

శ్లో॥ షష్ఠైకాదశసప్తమాద్యదశమే ష్విందుస్తృతీయే శుభ।
స్తారాచంద్రబలం త్విదం విగణయే జ్జన్మాది చంద్రాంతతః।
యాత్రాసు ష్వథ పంచమే ద్వినవమే పక్షే వళక్షే శశీ॥
కృష్ణే త్వాంత్యచతుర్థరంధ్రసదనే ష్విత్యాహ రత్యే శుభః॥

టీక॥ ఇందుః-చంద్రుఁడు; షష్ఠ-ఆరింట; ఏకాదశ -పదునొకండింట; సప్తమ-ఏడింట, ఆద్య-జన్మరాశియందు; దశమేషు-పదింట; తృతీయే— మూడింటమున్న చో: శుభః—మంచివాడు; ఇదం - ఈ; తారాచంద్రబలం - తారాచంద్రబలములను జన్మాది-జన్మనక్షత్రి రాశిమొదలుగా; చంద్రాంతతః—చంద్రస్థితరాశినక్షత్రమువరకు విగణయేత్; లెక్కించవలయును; వళక్షే-శుక్లమను; పక్షే - పక్షమందు; శశీ - చం

ద్రుఁడు, పంచమే ఐదింట, ద్వినవమే-రెండుతొమ్మిదింట, శుభః-మంచివాఁడు, కృష్ణేతు-కృష్ణపక్షమందైతే, అంత్య - పండ్రెండింట, చతుర్థ-నాల్గింట, రంధ్ర-యెనిమిదింట, సదనేషు-గృహములయందు, శుభః-మంచివాడు, ఇతి-అని, అన్యే-కొందఱు, ఆహుః-చెప్పెదరు, యాత్రాదిషు - ప్రయాణము మొదల శిలశుభకర్మల యందు శుభుడనుట.

అవ. చంద్రబలమును జెప్పుచున్నాఁడు.

తా॥ జన్మరాశి మొదట చంద్రుఁడుండురాశివరకు గణనచేయఁగాఁజంద్రుఁడు జన్మరాశియందును, జన్మరాశికి తృతీయషష్ఠైకాదశసప్తమదశమరాసులయందునుండె నేని శుభకరుడనియు, తారాబలవిషయమై జన్మనక్షత్రము మొదలు చంద్రస్థితనక్షత్రమువరకును చంద్రబలవిషయమై జన్మరాశిమొదలు చంద్రస్థితరాశి వరకుగణన చేయవలయునని గ్రంథకర్తయభిప్రాయము. మతాంతరంబెట్లనిన శుక్లపక్షమందు పంచమ ద్వితీయ నవస్థానములయందును కృష్ణపక్షమందు ద్వాదశచతుర్థాష్టమస్థానములయందును న్ని చంద్రుడు సకలశుభకర్మలవిషయమై శుభకరుడని తా॥

నిర్గమనలక్షణము శ్లో॥ ౨౦౫

శ్లో॥ తల్లగ్నే గమనం నచేన్నరపతిః ఖడ్గాది సంచాలయే ।
మిత్రైర్మిత్రగృహంపితృగ్రహసురాన్ సంపూజ్యతద్దిక్కృతిమ్ ।
ఏతన్నిర్గమనం త్రిరాత్ర మవధిః పశ్చాద్ర్వజేన్మంగళైః ।
విప్రాదిర్వసుతండులాద్యపినయేత్స్యాత్పంచరాత్రావధిః ॥

టీక॥ తల్లగ్నే-అతారాచంద్రబలముగల లగ్నమందు, గమనం-ప్రయాణము నచేత్-కానిచో, నరపతిః-రాజు, పితృగ్రహసురాన్-పితృ-పితృదేవతలను, గ్రహ-నవగ్రహములను, సురాన్-దేవతలను, తద్దిక్కృతిం- ప్రయాణదిగధిపుని, సంపూజ్య-పూజించి, ఖడ్గాది-కత్తి మొదలగుదానిని, మిత్రైః-స్నేహితబంధువులతో, మిత్రగృహం-స్నేహితబంధుగృహములగూర్చి, చాలయేత్-కదల్పవలయును [అనఁగాబంధుగృహమందుగాని స్నేహితునింటగానినుంచవలయునను] ఏతత్-ఇది, నిర్గమనం-నిర్గమనము, త్రిరాత్రం-మూడురాత్రులు, అవధిః-హద్దు, పశ్చాత్-మూడురాత్రులకుతర్వాత,మంగళైః-మంగళవాయిద్యములతో,వ్రజేత్-ప్రయాణముగావలయును [ఈ విధి రాజులకు] విప్రాదిః-బ్రాహ్మణుడు మొదలగు వైశ్యశూద్రాదులు, వసు-విప్రుకు ధనమును, తండుల-వైశ్యదులియ్యమును, ఆది-ఆదిశబ్దముచేశూద్రుడువస్త్రమును,నయేత్-ఉంచవలయును, పంచరాత్రావధిః-ఐదురాత్రులవది, స్యాత్-వుండును

అవ. విగ్రహమననమునకు లక్షణమును జెప్పుచున్నారు.

తా॥ పూర్వోక్త క్రమంబుగ బలయుక్త మగులగ్నమందు పైనముపోవుట కనుకూలించనియెడల నట్టిసమయంబునక్షత్రియుఁడభ్యుదయకశ్రాద్ధముచేసిమార్యాది నవగ్రహంబుల నిష్టదేవతల నేదిక్కునుగూర్చి పైనముపోవదలచియున్నాడోయాది గధిపతిని భక్తితోడఁ బూజించి రాజచిహ్నంబులగు ఛత్రచామరాదులఁ గైకొని బంధుసమూహంబుతోవెడలి యాఛత్రచామరంబుల బంధుగృహంబుననునిచియనం తరంబు పైనముఁబోవచ్చునిదియ నిర్గమనంబు దీనికి మూడురాత్రులవధియనివిప్ర లుక్తక్రమంబున నిర్గమనముఁ జేయునెడల స్వర్ణమును, వైశ్యులుబియ్యమును శూద్రులు వస్త్రములుమొదలయినవానిని బంధుగృహంబుననునిచి పంచరాత్రపర్యం తము క్షత్రియులుతప్ప, బ్రాహ్మణులు మొదలగువారు పైనముఁ బోవచ్చునని తా॥

యాత్రాశుభశకునములు శ్లో॥ ౨౦౬

శ్లో॥ భారద్వాజమయూరచాషనకులా ముఖ్యాస్త్వముఖ్యాఃఖగా
స్తేషాం చోర్ధ్వగతిః ప్రదక్షిణగతిః సమ్యక్సమీపస్థితిః ।
ఏకస్యైవ గతి శ్శుభాధ యుగపన్నైవోభయో శ్చేతరి ।
తార్క్ష్యక్షీరసృగాలకుక్కుటశునాం వామాగతిస్త్వర్థదా ॥

టీక॥ ముఖ్యాః-ప్రసిద్ధములగు, భారద్వాజ—భరద్వాజము, మయూర—నెమలి చాష-జెముడుకాకి, నకులాః - ముంగిసయు, అముఖ్యాః - అప్రసిద్ధములగు కాకాది లగు, ఖగాః-ఏపక్షులుగలవో, తేషాం-వానియొక్క, ఊర్ధ్వగతిః-పైకివెళ్లుట, ప్రద క్షిణగతిః - ప్రదక్షిణముగా తిరుగుట, సమ్యక్ - తొట్టుబాటులేక, సమీపస్థితిః— దగ్గిరనుండుట, శుభా-మంచిది, ఏకస్యైవ-ఒక్కదానియొక్క, గతిః-ప్రదక్షిణాది గమనము, శుభా-మంచిది, అథ-లేక, యుగపదేవ-ఒక్కసారే, ఉభయోః—ఒక్క జాతి రెండుపక్షులకు, గతిః - గమనము, న - మంచిదికాదు, తార్క్ష్య-గరుత్మంతుని యొక్క, క్షీర-పాలపిట్టయొక్క, సృగాల—నక్కయొక్క, కుక్కుట-కోడియొక్క, శునాం-కుక్కయొక్క, వామా-వామభాగమునకు, గతిః-గమనము, అర్థదా-ధనము నిచ్చును. [అనఁగా మంచిదనుట]

అవ. ప్రయాణవిషయమై శుభశకునముల జెప్పుచున్నాడు.

తా॥ ప్రసిద్ధంబులగు భారద్వాజము, నెమలి, జెముడుకాకి, ముంగిస ఇవి మొదలగువానియొక్కయు నముఖ్యములగు కాకాదులయొక్కయు ప్రదక్షిణగమ

నము సూర్థ్వగమనమును సమీపస్థితియు శుభకరంబనియును, ఉక్త భారద్వాజాది పక్షులలో నొక్కొక్కటిగా వెళ్లినేని శుభకరంబనియు, రెండేసిగాజేరివెళ్లెనేని యశుభకరంబనియు, గరుడపక్షి, పాలపక్షి, నక్క, కోడి, కుక్క, వీనియొక్క వామగమనము శ్రేష్ఠమనఁగాఁ గుడినుండి యెడమప్రక్కకు వెళ్లెనేని ప్రయాణకర్తకు ధనప్రదమని తా॥

ప్రయాణలగ్నమునకు యుపశకునములు శ్లో॥ ౨౦౭

శ్లో॥ భౌమే చోష్ణకరే ప్రయాణసదనా త్కేంద్రే త్రికోణాష్టగే ।
రక్తోగ్రాయుధ ఘోరవాక్యజటిలప్రవ్రాజకాదీక్షణమ్।
కృష్ణాంగారసమీక్షణం రవిసుతే కేతౌ కబంధేక్షణం ।
స్వర్భానౌ పురగేక్షణం ప్రథమతో మార్గే ప్రయాతు ర్భవేత్॥

టీక॥ భౌమే - కుజుఁడు, ఉష్ణకరే-సూర్యుఁడు, ప్రయాణసదనాత్ -ప్రయాణలగ్నముకంటె, కేంద్రత్రికోణాష్టగే- కేంద్రము త్రికోణమును అష్టమమును బొందియుండఁగా, రక్త-రక్తముచే,ఉగ్ర - భయంకరమగు, ఆయుధ- ఆయుధముయొక్క, ఘోరవాక్య-కఠినవాక్యముయొక్క, జటిల-జటలుగల, ప్రవ్రాజిక-సన్యాసియొక్క, ఈక్షణం-చూచుటయు, రవిసుతే-శనియున్నచో, కృష్ణాంగారసమీక్షణం-నల్లనిబొగ్గులనుచూచుట, కేతౌ-కేతువున్నచో, కబంధేక్షణం-మొండెమునుచూచుట, స్వర్భానౌ-రాహువున్నచో, ఉరగేక్షణం-సర్పదర్శనమును, ప్రయాతుః - ప్రయాణమగువానికి, మార్గే-మార్గమందు, ప్రథమత-ముందుగా, భవేత్-కలుగును.

అవ. ప్రయాణలగ్నాదులను బొందిన పాపగ్రహవశమువలనఁ గలుగఁబోయెడి యపశకునములఁ జెప్పుచున్నాఁడు.

తా॥ సూర్యాంగారకులు ప్రయాణలగ్నమునకు ౪-౫-౭-౧౦-౯ ఈ చోట్లనుండిరేని రక్తాయుధము, ఉగ్రాయుధము, కఠినవాక్యశ్రవణము; జటాధారి; యతీశ్వరుఁడు; పాషండులు మొదలైనవారి దర్శనము; శనైశ్చరుఁడు లగ్నపంచమ నవమస్థానగతుఁడై యుండెనేని నల్లబొగ్గుదర్శనము; ఈచెప్పఁబడిన స్థానములయందు రాహువుండెనేని సర్పదర్శనము; కేతువుండెనేని కబంధదర్శనము పైనము బోవుజనునికి త్రోవయందు ముందుగా నగునని తా॥

ప్రయాణలగ్నాదులకు శుభశకునములు

శ్లో॥ శుక్రేపూర్ణనిశాకరేచ శశిజే కేంద్రత్రికోణాన్వితే

పుణ్యస్త్రీఖగపూర్ణకుంభయుగళం జీవేతు విప్రద్వయమ్ ।
భానౌ భూమిసుతే ప్రయాణసదనాల్లాభత్రిషష్ఠాన్వితే ।
తేజశ్చాషఫలేక్షణం రవిసుతే మార్గేమయూరేక్షణమ్॥ ౨౦౮

టీక॥ శుక్రే–శుక్రుడు, పూర్ణనిశాకరే - పూర్ణచంద్రుడు, శశిజేచ-బుధుడు, కేంద్రత్రికోణాన్వితే-కేంద్ర–కేంద్రములతో, త్రికోణ-త్రికోణములతో, అన్వితే కూడియుండఁగా, పుణ్యస్త్రీ - పెనిమిటితోఁగూడినస్త్రీయును, ఖగ - గరుడాదిపక్షులు, పూర్ణకుంభయుగళం - పూర్ణకుంభద్వయము, జీవే - బృహస్పతియున్నచో, విప్రద్వయం-బ్రాహ్మణద్వయము, భానౌ - సూర్యుఁడున్నను, భూమిసుతే- అంగారకుఁడున్నను, ప్రయాణసదనాత్ -ప్రయాణలగ్నముకంటె, లాభత్రిషష్ఠాన్వితే- లాభ-పదునొకండింట, త్రి-మూడింట, షష్ఠ–ఆరింట, అన్వితే-కూడియుండగా, తేజః-మండునగ్ని, చాషః-కాకిభేతము, ఫల-మాంసము, ఈక్షణం–దర్శనము, రవిసుతే - శనియున్నచో, మార్గే-మార్గమందు, మయూరేక్షణం-నెమలిదర్శనము.

అవ. లగ్నాదిస్థానమును బొందియును శుభగ్రహవశమువలనఁ గలుగఁ బోయెడి శుభశకునములఁ జెప్పుచున్నాఁడు.

తా॥ శుక్రుఁడు పూర్ణచంద్రుఁడు బుధుడు వీరలులగ్నచతుర్థపంచమసప్తమ నవమదశమస్థానగతులై యుండిరేని ముత్తయిదువ గరుడాదులు జలాదులచేత బూర్ణమైయుండు కుంభయుగళము నీనియొక్క దర్శనము బృహస్పతియునుక్తలగ్నాది స్థానగతుడై యుండెనేని యిద్దఱుబ్రాహ్మణులయొక్క దర్శనమును సూర్యాంగారకులు ప్రయాణలగ్న తృతీయషష్ఠైకాదశస్థానగతులై యుండిరేని ప్రజ్వలించుచున్న యగ్నియుజేముడు కాకిమామిడిపండ్లు మొదలయిన వానిదర్శనము శనైశ్చరుండు లాభతృతీయషష్ఠగతుడై యుండెనేని మార్గమధ్యమందు నెమలియొక్క దర్శనము నీక్రమంబుగ శుభశకునములగునని తా॥

క్షుతికోష్ట్రుఖుతఫలము లు శ్లో॥ ౨౦౯

శ్లో॥ ప్రాగాద్యా శనివాసరాదిగదితాసూన్వర్యాదయోఽష్టగ్రహాః
నాగా నాగనగా నిధీ నిశీ నభో నాదో నసో నాడికాః
హానిప్రీతిమరుక్తి బంధుకనకస్నిగ్ధా స్నతాపార్తిదా ।
శ్రోతుః క్రోష్టురుతేక్షుతేఫలమిదంమృత్యుస్సదాగోక్షుతమ్

టీక॥ సూర్యాదయః - సూర్యుడుమొదలు: అష్టౌ - ఎనమండ్రు, గ్రహాః - గ్రహములు, శనివాసరాది—శనివారము మొదలుగా, ప్రాగాదౌ తూర్పు మొదలగుదిక్కులయందు, నాగాః—ముప్పదిఘడియలు, నాగనగాఃముప్పదిఘడియలుముప్పదిఘడియలు నిధి—తొంబదిఘడియలు, నిశ-ఏబదిఘడియలు, నఖః-నలుబదిఘడియలు, నాద-ఎనుబదిఘడియలు, నసః డెబ్బదిఘడియలు, నాడికాః — ఘడియలు, గదితాః - చెప్పఁబడినవి, హాని—హానిని, ప్రీతి-ప్రేమను:దురుక్తి—దురుక్తిని:బంధు—బంధుత్వమును కనక—బంగారమును, స్నిగ్ధాన్న-మృదువగుఅన్నమును, తాప-తాపమును, ఆర్తి- పీడను దాః—ఇచ్చునవి, శ్రోతుః-వినువానికి, క్రోష్టురుతే—నక్కకూతయందు, క్షుతే—తుమ్ముయందు, ఇదం - ఇది: ఫలం-ఫలము, గోక్షుతం- ఆవుతుమ్ము, సదా ఎల్లప్పుడు, మృత్యుః—మరణమునుజేయను

అవ॥ ప్రయాణవిషయమై దిగ్భేదములచేఁతుమ్ము నక్కకూతలకుఫలములఁ జెప్పుచున్నాడు.

తా॥ సూర్యచంద్రాంగారక బుధబృహస్పతి శనైశ్చరరాహువులుశనివారాదిగ శుక్రవారమునకు దివారాత్రులు తూర్పుమొదలీశాన్యదిక్కువరకు ఘడియలు, ౩౦ ౩౦, ౩౦, ౯౦, ౫౦, ౪౦, ౭౦; ౮౦ ఈ సంఖ్యాక్రమంబుగ నొక్కొక్క గ్రహము నొక్కొక్కదిక్కునందు సంచరించుచుండుఁగాన నీసూర్యాదిగ్రహంబులాయాదిక్కుల యందుండునప్పుడు తుమ్ముగాని, నక్కకూఁతగాని: వినబడెనేని ప్రయాణాదులుపోవువారిహాని: హాని:ప్రీతిదుర్వార్తశ్రవణము:బంధులాభం:స్వర్ణలాభము: సౌఖ్యాన్నభోజనము: తాపముమనఃపీడయునీఫలంబులుక్రమంబుగగలుగును

గౌళీవాత్పతన ఫలము

శ్లో॥ భాగ్యశ్రీజయయుద్ధలాభగమన క్షేమార్తిపీడార్థకృ ।
త్ప్రాగాది ష్వథరోర్ధ్వయోరపిసదా శ్రోతుః క్రమాద్గౌళివాక్
లక్ష్మీమూర్ధ్ని గళేచమిత్ర ముదరే పుత్రంచపార్శ్వేముదం
కట్యాం వాహన మర్థ మేవ్యతిపదే గౌళీప్రపాతేఫలమ్ ॥

టీక॥ గౌళివాక్-బల్లిపలుకులు: ప్రాగాదిషు - తూర్పుమొదలగుదిక్కులయందును అథతోర్ధ్వయోరపి-ఊర్ధ్వాధోదిక్కులయందు: శ్రోతుః-వినువానికి: క్రమాత్ వరుసగా: భాగ్య-భాగ్యమును: శ్రీ—సంపత్తును: జయ-జయమును:యుద్ధ—యుద్ధము; లాభ—లాభమును: గమన ప్రయాణమును: క్షేమ-క్షేమమును: ఆర్తి— ఆర్తిని; పీడ పీడను: అర్థ—ధనమును. కృత్-చేయునది. భవేత్ - అగును. గౌళిప్రసాదే బల్లి -

యొక్క-పడుట, మూర్ధ్నిచేత్-శిరస్సునయినచో, లక్ష్మీం-లక్ష్మిని, గళే - కంఠమం దైనచో; మిత్రం-బంధులాభమును, ఉదరే-కడుపుననయినచో, పుత్రం- పుత్రలాభ మును, పార్శ్వే-పక్కలనయినచో, ముదం-సంతోషమును, కట్యాం - కటియందు వాహనం-వాహనమును, పదే-పాదమందు,అర్థంచ-ధనమును,ప్రాప్నోతి-పొందగలడు

అవ. బల్లిపాటునకు బలుకునకు ఫలములఁ జెప్పుచున్నాఁడు.

తా॥ తూర్పుదిక్కు మొద లీశాన్యమువఱకు నెనిమిదిదిక్కులయందు నూర్ధ్వా దఃప్రదేశములయందు బల్లిపలుకుచుండఁగా నట్టిసమయంబునఁ బ్రయాణాదులుపోవు వారికి భాగ్యము, సంపద, జయము,యుద్ధము,లాభము,గమనము,క్షేమము,దుఃఖము పీడయు, ధనము, నీదశవిధ ఫలములుక్రమముగ నొక్కొక్కస్థానమునకునొక్కొ క్కఫలముచొప్పునఁగలుగుననియును.పతనమునకుఫల బెట్లనినశిరస్సునందుపడెనేని యైశ్వర్యము, కంఠమందు బంధులాభము.ఉదరమందుఁ బుత్రలాభము.పార్శ్వమందు సంతోషముకటిస్థానమందువాహనము,కాళ్ళయందుధనము, నీఫలంబులఁబొందుచుండు

కాకరుతఫలము శ్లో॥ ౨౧౧

శ్లో॥ ఆదిత్యస్థితిసిద్ధకాలనియమాః ప్రాగాదిదిక్షు క్రమా ।
త్పాదోనం ఘటికా చతుష్టయచరాః కాకాఃపదం త్యాగతిమ్ ।
లాభారాతివినాశనప్రియజనప్రాప్త్యర్థవృష్ట్యాహవ ।
ప్రాణాంత్యాల్పభయంతుకాకమిధునంరోగార్తికృత్పశ్యతామ్॥

టీక॥ ఆదిత్యస్థితసిద్ధకాలనియమాః- సూర్యుడుండుకాలమునకు నిశ్చితమగు నియమముగల, పాదోనం-నాల్గవవంతుతక్కువగా; ఘటికాచతుష్టయచరాః - నాల్గు ఘడియలుసంచరించు, కాకాః-కాకులు. ప్రాగాదిదిక్షు - తూర్పుమొదలు దిక్కుల యందు, క్రమాత్-వరుసగా. లాభ-లాభమును, అరాతి-శత్రువులనువినాశన- నాశ మును, ప్రియజనప్రాప్తి-బంధుజనప్రాప్తిని, అర్థ- ధనమును వృష్టి-వర్షమును ఆహవ-యుద్ధమును.ప్రాణాంత్య-ప్రాణహానిని.అల్పభయం-కొద్దిభయమునుచేయును కాకమిధునం - కాకిమైధునమును, పశ్యతాం - చూచువానికి రోగార్తిక్రుత్ - రోగ పీడనుజేయును.

అవ॥ ప్రయాణవిషయమై కాలదిగ్భేదములచేతఁ గాకికూతకు ఫలము జెప్పుచున్నారు.

తా॥ తూర్పుమొదలీశాన్యమువరకు నెనిమిదిదిక్కులయందు గాకులు సూర్యోదయముమొదలస్తమానమువరకు నొక్కొక్క దిక్కునందు ౭॥ ఘడియల చొప్పున గుంపుగూడి కూయుచున్నపై ప్రయాణాదులకుఁబోవువారికి దిక్కులాను రూపఫలములఁ గలుగఁజేయుగాన మదయానంతరము ౭॥ ఘడియలవరకుతూర్పున నుండిననేని ప్రయాణకర్తకులాభమును ౭॥ ఘడియకు పిమ్మట ౭॥ ఘడియవరకు నాగ్నేయంబుననుండెనేని శతృనాశనమును దక్షిణంబుననుండెనేని బంధులాభమును నైరృతిదిక్కునుండెనేనిధనమునుపశ్చిమంబుపవర్షమును, వాయవ్యముననర్థము; నుదిగ్దిక్కుననుండెనేనిప్రాణహానిఈశాన్యంబుననుండెనేనియుల్పభయమునునీక్రమంబున ఫలముల నిచ్చుననియుఁగాకమైధునదర్శనమాయెనేనితప్పక వ్యాధికరంబగును

ప్రతిప్రయాణలక్షణము ౨౧౨

శ్లో॥ లక్ష్మీలక్షణలక్షితక్షితిపతి క్షీరేక్షుదండేక్షణం ।
పక్షిస్వామిమహోక్షపక్షికులకక్షౌద్రాక్షతప్రేక్షణమ్ ।
రుద్రాక్షక్షితిపాలకోపకరణం క్ష్మాదేవయుగ్మేక్షణం ।
క్షిప్రం క్షేమకరం ప్రయాణసమయే యాతుశ్చ సుక్షేత్రదమ్॥

టీక॥ లక్ష్మీలక్షణలక్షితక్షితిపతిక్షీరేక్షుదండేక్షణం - లక్ష్మీలక్షణక్షిత - లక్ష్మీచిహ్నలుగల; క్షితిపతి-రాజుయొక్క; క్షీర-పాలయొక్క; ఇక్షుదండ—చెరుకుగడయొక్క; ఈక్షణం-చూచుట; పక్షిస్వామి- గరుత్మంతునియొక్క మహోక్ష - వృషభముయొక్క; పక్షికులక - పక్షిసమూహముయొక్క; క్షౌద్ర - తేనెయొక్క అక్షత-అక్షతలయొక్క; ప్రేక్షణం—చూచుటయు; రుద్రాక్ష - రుద్రాక్షముయొక్క; క్షితిపాలకోపకరణ- రాజచిహ్నలయొక్క; క్ష్మాదేవయుగ్మ - బ్రాహ్మణద్వయము యొక్క; ఈక్షణం చూచుట; ప్రయాణసమయే- ప్రయాణకాలమందు యాతుః — ప్రయాణమగువానికి; క్షేమకరం—క్షేమమును చేయునదిన్ని సుక్షేత్రద- మంచిభూమి లాభమును జేయును;

అవ॥ మరల శుభశకునములఁ జెప్పుచున్నాఁడు

తా॥ లక్ష్మీచిహ్నంబులగు ఛత్రచామరాందోళికాదులచేఁ బ్రకాశించుచుననె భూపాలుఁడు పాలు చెరకుగడలు; గరుడపక్షి; వృషభము; పక్షులసంఘము; తేనె; అక్షతలు; రుద్రాక్షలు; ఛత్రచామరాందోళికాదులు ఇద్దరుబ్రాహ్మణులు వీనిదర్శనము ప్రయాణసమయంబునగలిగెనేని ప్రయాణకర్తకు క్షేమమును భూలాభమును గలుగునని తా॥

మాతిరొకశుభశకునములు శ్లో॥ ౨౧౩

శ్లో॥ వేశ్యామంగళఘోషవాక్యకుసుమచ్ఛత్రప్రదీప్తానల
స్నిగ్ధాన్నాంబుజరత్నశుభ్రవసనస్త్రీమద్యభాండధ్వజాః ।
గోవేదధ్వనిలాజపూర్ణకలశశ్రోత్రానుకూలస్వన
ద్రవ్యాజ్యాంబుచరాః ప్రయాణసమయే దృష్టాస్సుఖార్థాన్నదా

టీక॥ వేశ్యా-భోగముది: మంగళఘోష - మద్దెలమొదలగుమంగళవాయిద్యములు; వాక్య-మంగళవాక్యములు; కుసుమ-పుష్పము; ఛత్రం-గొడుగు; ప్రదీప్తానల-మండువగ్ని; స్నిగ్ధాన్న-పరన్నము; అంబుజ-పద్మములు రత్న - రత్నములు శుభ్రవసన-దెల్లనివస్త్రములు స్త్రీ-పుణ్యస్త్రీ: మద్యభాండ - కల్లుకుండలు. ధ్వజాః - జెండాలు; గో-ఆవులు; వేదధ్వని-వేదఘోషః లాజ-పేలాలు; పూర్ణకలశ - పూర్ణకలశము శ్రోత్రానుకూలస్వదః-చెవులకింపగు వీణాదిధ్వనులు ద్రవ్య-మంగళద్రవ్యములు; ఆజ్య-నెయ్యి, అంబుచరాః-చేపలు, ప్రయాణసమయే ప్రయాణకాలమందు దృష్టాః-చూడఁబడినవగుచు;సుఖార్థాన్నదాః-సుఖముధనముఅన్నమునిచ్చుచున్నవి

తా॥ వేశ్యాస్త్రీ మద్దెల మొదలగువానిధ్వనులు- మంగళవాక్యశ్రవణముసువాసనగలపుష్పములు: గొడుగు:అగ్నిజ్వాలలు:సన్నబియ్యపన్నము:కమలములుముత్యములు ప్రవాళాదులు శుభ్రముగా నుదకఁబడినవస్త్రములు ముత్తైదువ సారాయి కుండలు: టెక్కెములు: పశువులు: వేదఘోషము: పేలాలు, పూర్ణకలశములు శ్రోత్రానందకరంబగుధ్వనులనఁగాశివప్రతిపాదకకథలు మంగళద్రవ్యములునెయ్యిమత్స్యములివి మొదలయిన వానియొక్క దర్శనము ప్రయాణము కాలమందాయెనేనిసుఖముధనమునిష్టాన్నము గలుగునని తా॥

శ్లో॥ పుణ్యస్త్రీ పురుషాన్వితా స్వపురతః పుత్రాన్వితావాగతా,
చైవం గోమృగభృంగవానరగురుశ్వాశ్వాండజాభోగదాః
యద్యశ్వాహాగతిః ప్రయాతృసుఖకృత్పత్నీసుపుత్రార్థదా
సర్వం వస్తుసితం శుభంయదిభ వేత్కృష్ణంతునప్రాయశః ॥

టీక॥ పుణ్యస్త్రీ - ముత్తైదువ పురుషాన్విత - తనపురుషునితోఁ గూడియైనను; పుత్రాన్వితా - పుత్రునితోఁగూడియైనను; స్వపురతః — ప్రయాణమగువాని ముందు అగతా-వచ్చినను: ఏవం—ఇట్లు; గోమృగ-గవయమృగముభృంగ-తుమ్మెద వానర - కోతి; గురు మృగము: శ్వా - కుక్క అశ్వ-గుఱ్ఱములు అండజాః-పక్షులు

భోగదాః-భోగమునిచ్చునవి, ఉద్వాహగతిఃయది-వివాహప్రయాణమైనచో, ప్రయా తృసుఖకృత్ - వెళ్ళువానికి సుఖమునుచేయును, పత్నీసుపుత్రార్థదా-భార్యను మంచి పుత్రులను ధనమునునిచ్చును. [అనఁగా వివాహమంచుమంచిదనుట]

తా॥ ముత్తైదువ పెనిమిటితోఁ గాని పుత్రులతోఁగాని కూడి ప్రయాణము పోవువారికి నెదురుగవచ్చినను గురుపోతు, తుమ్మెదలు, కోతుఁలు, రురువను మృగము, కనకము, అశ్వము, పక్షులివి యెదురుగావచ్చినను సుఖకరంబనియు వివాహమునకుఁ బోవువారై వచ్చుచున్నను లెదురైనేవి పత్నీసుపుత్రప్రదులగుదురని యును ముఖ్యం బేమనినఁ బైపముపోవువేళ తెల్లటివస్తు వగుపడెనెని శుభకరమని నల్లటి వస్తువున శుభకరంబని తా॥

అశుభశకునములు ౨౧౫

శ్లో॥ జంతూనాం శ్రుతితాడనేవతి తయోర్యుద్ధే క్షుతేరోదనే
క్రోధే పాదవిషాణపుచ్ఛదళనే దంతక్షతే మైథునే ।
ప్రస్రావేఽపిచ బంధనే స్వపురతో దృష్టేచ కోలాహలే ।
ప్రాణత్యాగనిరోధనార్తి సమయేహానిఃప్రయాతుర్భవేత్ ॥

టీక॥ జంతూనాం—ఏజంతువుయొక్కనా, శ్రుతితాడనేవతి — చెవులుతాడిం చుట కలుగగాను, తయోః-అజంతువులకు, యుద్ధే-యుద్ధముకలుగగా, క్షుతే-తుమ్ము కలుగగా, రోదనే - దుఃఖముకలుగగా, క్రోధే-కోపముకలుగగా, పాదవిషాణపుచ్ఛ దళనే - పాదములయొక్క కొమ్ములయొక్క తోకయొక్క తెగడము కలుగగా, దంతక్షతే-పంట్లూడగాను, మైధునే-మైధునమందు,ప్రస్రావే-మూత్రమువదలుట యందు, బంధనే—నిర్బంధపెట్టుకాలమందు, స్వపురతః-ప్రయాణమగువానిముందు, కొలహలే -గల్లంతు, దృష్టే - చూడఁబడుచుండఁగా, ప్రాణత్యాగ — ప్రాణముమ వదలుగ, నిరోధన-నిర్బంధకాలమందు, ఆర్తి-పీడాకాలమందు, సమయే - ఈసమ యములందు, ప్రయాతుః-ప్రయాణమగువానికిః హానిః-చెరుపుః భవేత్-కలుగును.

అవ. అశుభశకునములఁ జెప్పుచున్నారు.

తా॥ గమనకాలమందేజంతువు గాని చెవులుతాడించినను రెండుజంతువులకు బరస్పరకలహము గలిగినను నేజంతువుయొక్కకొమ్ములుః పాదములుః పుచ్ఛములు దంతములుః విరిగిపడినను మైధునముగాని యేజంతువుల మూత్రపురీషోత్సర్జనము గాని ఏజంతువునైన నరికట్టుటగాని పండడిగాని ప్రాణాపాయముగాని యొకానొక జంతువు నిర్బంధముగాని పీడించుటగాని ప్రయాణముపోవు జనులకెదురుగలిగెనేని యాజనునకు హానికలుగునునని తా॥

మఱియొక అశుభశకునములు శ్లో॥ ౨౧౬

శ్లో॥ వస్త్రాదిస్ఖలనే దురుక్తిసమయే గర్తాదిపాతే భయే ।
స్తంభాద్యైరపి ఘాతనే కృశతనౌ రోగాన్వితేవా తథా ।
భుక్త్వా హేజన గమ్యతా మితి జనైర్నిర్బంధహస్తగ్రహే ।
ప్రత్యాహ్వానవిధౌ ప్రయాణసమయే రోగః ప్రయాతుర్భవేత్ ॥

టీక॥ వస్త్రాదిస్ఖలనే-పొరపాటున వస్త్రపుస్తకాదులుజారినను, [ఆదిశబ్దముచే తనవస్తువేదైనను నరేయునియభిప్రాయము] దురుక్తిసమయే-దుష్టవాక్యములు విను కాలమందును, గర్తాదిపాతే-తానుఁగోతియందుపడినను, ఆశబ్దమువిమ్నోన్నతమును తెలుపును] భయే-భయంకరమగు వస్తువునుచూచినప్పుడు,స్తంభాద్యైరపి-స్తంభము మొదలగువానిచే, ఘాతనే - దెబ్బలుతగులుచుండగాను, కృశతనౌ—దేహము చిక్కి యుండగాను, రోగన్వితే — రోగముకలిగియుండగాను, తథా- అట్లు, హేజన-ఓజ నుఁడా, భుక్త్వా - భుజించి, గమ్యతాం - వెళ్ళగాక, ఇతి—ఈలాగున, జనైః-జనుల చేత, నిర్బంధహస్తగ్రహే-బలవంతముగాచేయిపట్టినను, ప్రయాణసమయే-ప్రయా ణకాలమందు, ప్రత్యాహ్వానవిధౌ-తిరిగిపిలిచినను, ప్రయాతుః-ప్రయాణమగువానికి రోగః-రోగము, భవేత్-కలుగును.

తా॥ గమనేచ్ఛగల పురుషులకుఁ బ్రమాదముచే స్వకీయమగు వస్త్రపుస్తకా దులుజారిపడుట దుర్వాక్యోచ్చారణకాలము తాముపల్లములందు జారిపడుట స్తంభా దులచే గొట్టుపడుట శరీరము మిక్కిలి కృశించియుండుట రోగవతులైయుండుట ఓ జనుఁడా భోజనముచేసి వెళ్లుమా యని నిర్బంధముచేయుట ఓజనుఁడాయొకమాట వినిపోవలెననిపిలుచుట యిట్టిదుష్టశకునములు గలుగుచుండగా ప్రయాణము వెళ్లరేని రోగవంతులగుదురని తా॥

ప్రయాణమునకు మృత్యుశకునములు శ్లో॥ ౨౧౭

శ్లో॥ ఉన్మత్తాంధవిరూపపంగుజటిలవ్యాధ్యన్వితాభ్యంగయు,
క్షుంణ్ణైకస్త్రీజముక్తకేశవిధవానగ్నక్షుధాపీడితాః ।
పాఖండాప్రియషండముండజడవాక్కుండప్రచండాయుధాః,
ప్రాయః ప్రాణహరాః ప్రయాణసమయే సందృష్టమాత్రాః పథి ॥

టీక॥ ఉన్మత్త - పిచ్చివారలు, అంధ -గుడ్డివారు, విరూప-వికారరూపము గలవారలు, పంగు-కుంటివారు, జటిల-జడలుధరించినవారు, వ్యాధ్యన్విత-రోగము

గలవారు, అభ్యంగయుక్ - తలంటుకొనిస్నానముచేయనివారు, ఖంజః- పాదశక్తి లేనివాడు, ఏకద్విజ-ఒకబ్రాహ్మణుఁడు, ముక్తకేశః- జుట్టువిరియబోసుకున్నవారు విధవా- పెనిమిటిలేనిస్త్రీ, నగ్న — వస్త్రముగట్టనివారు, క్షుధాపీడితాః - ఆకలిగలిగిన వారు, పాఖండాః-వేదోక్తకర్మను నిషేధించువారు, అప్రియ-శత్రువుల, షండ— నపుంసకులు, ముండాః - అప్పుడు క్షౌరముచేయించుకున్నవారు, జడవాక్—స్ఫుట వాక్యములు లేనివారు, కుండ-జారత్వమువల్ల కలిగినవారు; ప్రచండాయుధాః - తీక్ష్ణ యుధము ధరించువారు; ప్రయాణసమయే-ప్రయాణకాలమందు; పథి—మార్గమందు దృష్టమాత్రాః—చూడబడిన వారలగుచునే; ప్రాయః-తఱుచుగా; ప్రాణహరాః— ప్రాణములతీయుదురు.

తా॥ మత్తుఁడు అంధకుఁడుఉగ్రరూపి కుంటికాలుగలవాఁడు జడలుధరించిన వాఁడు రోగినూనెనొంటరాచుకొని స్నానముచేయనివాఁడు వకాంగుఁడు ఒంటి బ్రాహ్మణుడు వెండ్రుకలు విరియఁబోసుకున్నజనుడు విధవస్త్రీదిగంబరుడు దప్పి గొన్నమనుష్యుడు పాషండులుశత్రువులు; తత్కాలమందుక్షౌరము జేసుకొన్న పురు షుడు; నపుంసకుడు; నత్తివాఁడు; తండ్రియుండగా జారునివలనఁ బుట్టినవాఁడు తీక్ష్ణాయుధముల ధరించినవాడు ఈ చెప్పబడిన వారిదర్శనములు ప్రయాణసమయ మున కలిగినేని మృత్యుప్రదములని తా॥

శ్లో॥ చర్మాఙ్గారతృణాస్థిపంకలవణవ్యాధేక్షణం భీతిదం ।
గోధాసర్పబిడాలకుబ్జశశకవ్యాఘ్రేక్షణం మృత్యుదమ్ ।
వంధ్యాసూకరతైలతక్రయతిరాడ్భస్మేక్షణం హానిదం ।
కార్పాసేంధనరిక్తభాండతుషకాన్ పశ్యన్నయాత్రాంవ్రజేత్

టీక॥ చర్మ - తోలున్ను; అంగార - బొగ్గు; తృణ—గడ్డి; అస్థి- యెముక; పంక-బురద; లవణ-ఉప్పు; వ్యాధ-వల్లెవాడు; ఏతాన్-వీర్లను; ఈక్షణం-చూచుట; భీతిదం - భయముచేయును; గోధా-ఉడుము; సర్ప-పాము; బిడాల-పిల్లి; కుబ్జ-పొట్టి వాడు; శశక-చెవులపిల్లి; వ్యాఘ్ర-పెద్దపులి; ఏతాన్-వీట్లను; ఈక్షణం - చూచుట; మృత్యుదం-మరణముచేయును; వంధ్యా-గొడ్రాలు; సూకర - పంది; తైల-నూనె; తక్ర-చల్ల; యతిరాట్ - సన్యాసి; భస్మ - విభూతి; ఏతాన్ - వీట్లను; ఈక్షణం- చూచుట; హానిదం- హానిచేయును; కార్పాస—దూది; ఇంధన-కట్టెలు; రిక్తభాండ -వట్టికుండ; తుషకాన్-పొల్లులను; పశ్యన్-చూచుచు; యాత్రాం - ప్రయాణమును, నవ్రజేత్-చేయఁగూడదనుట.

తా॥ చర్మములు: బొగ్గులు: తృణము: ఎముకలు: అడుసు: లవణము: ఒకానొకకిరాతుడు వీనియొక్క దర్శనము ప్రయాణవిషయమై భయంకరమనియును ఉడుము: సర్పము: పిల్లి: కుబ్జుడు: కుందేలు: పెద్దపులి వీనిదర్శనములు మృత్యుప్రదములని: గొడ్డురాలు: పందెనూనె: మజ్జిగ: యతీశ్వరుడు: విభూతివీనియొక్క దర్శనము నిష్టప్రదమని: ప్రత్తి: యెండుకట్టెలు: రిక్తభాండములుమక మొదలగు వస్తువులజూచుచు పైనముపోగూడదని తా॥

శ్లో॥ భల్లూకద్విజరాజవానరరుతం తద్దర్శనం వాశుభం ।
తేషాం కీర్తన మార్తికృచ్చ గమనే దుష్టస్మృతి ర్భీతిదా ।
మాతు ర్మృత్యుకరం కపోతవచనం ప్రోక్తం వివాహేచయత్
జ్ఞేయం తత్సకలం త్విహైవ గమనేచాకాలవృష్ట్యాదికమ్॥ ౨౧౯

టీక॥ భల్లూకము - ఎలుగబంటి: ద్విజరాజ - గరుత్మంతుడు: వానర—కోతి: ఏతేషాం-వీర్లయొక్క: రుతం-కూతలు: తద్దర్శనంవా-వానివిచూచుటైనా: అశుభం-మంచిదికాదు: తేషాం-వానియొక్క: కీర్తనం-స్మరించుట: గమనే-ప్రయాణమందు ఆర్తికృత్-పీడనుజేయును: దుష్టస్మృతిః - సర్పాదిదుష్టజంతుస్మరణ: భీతిదా-భయంకరము: కపోతవచనం - పావురపుకూత: మాతుః- తల్లికి: మృత్యుకరం-మరణము జేయును: వివాహే—వివాహమందు: యత్-యేది: ప్రోక్తం - చెప్పబడినదో: తత్-అ: అకాలవృష్ట్యాదికం — అకాలవృష్టిమొదలగు: సకలం-సమస్తము: ఇహ—ఈ: గమనేచ-ప్రయాణమందున్న: జ్ఞేయం-తెలియదగినది.

తా॥ ఎలుగుగొడ్డు, గరుడపక్షి: కోతి వీనిధ్వని భల్లూకవానరముల దర్శనము స్మరణమును: పీడాకారమని దుష్టస్మరణమనగా సర్పాదులస్మరణము భయప్రదమనియు: పావురాతికూత మృత్యుప్రదమని మఱియు వివాహవిషయమై విషేధింపబడిన యకాలవృష్ట్యాదికము లీప్రయాణమందు నిషిద్ధంబులని తా॥

శకునస్వరూపనిర్ణయము ౨౨౦

శ్లో॥ ప్రాగుక్తాం త్సకలైకవింశతిమహాదోషా న్విసృజ్యాన్యతో ।
యల్లగ్నంచ గుణాధికం యది భవే న్గ్రాహ్యంసదోషాధికమ్॥
నోక్తావిస్తరభీతితశ్చ బహవో దోషా గుణాస్సంతి తే ।
కించిద్వస్తు నిరూపితంచ గమనే శాస్త్రేషు సారాత్మకమ్ ॥

టీక॥ ప్రాగుక్తాః-పూర్వమువివాహప్రకరణమందుచెప్పిన, ఏకవింశతి మహాదోషాః-సమస్తమగునేకవింశతిమహాదోషములను, విసృజ్య-విడిచి, ఏకస్మాత్-మఱియొకలగ్నమువల్ల, యత్-యే, లగ్నం-లగ్నము,గుణాధికం-అధికగుణములు గలది, భవేద్యది-ఐనచో: తత్-అ, లగ్నం-లగ్నము, గ్రాహ్యం-స్వీకరింపతగినది, దోషాధికం-అధికదోషములుగలది, న-గ్రహింపఁదగినదిగాదు,బహవః-అనేకమగు దోషా-దోషములు, గుణాః-గుణములు, సంతి-కలవు; తే-ఆగుణదోషములు:విస్తర భీతితః-గ్రంథము పెరుగు ననుభయముచే; నోక్తాః-చెప్పఁబడుటలేదు; శాస్త్రేషు శాస్త్రములయందు; సారాత్మకం-సారమగు; కించిత్-కొంచెము: వస్తు-పదార్థము- గమనే-ప్రయాణమందు; నిరూపితం-చెప్పఁబడనది,

అవ॥ శకునస్వరూపమును నిశ్చయించుచున్నాఁడు.

తా॥ వివాహప్రకరణమందుఁ జెప్పబడియున్న యేకవింశతిమహాదోషముల విడిచి ప్రయాణమునకు లగ్నవిమర్శచేయు నెడల నేలగ్నము గుణాధికమో యట్టి లగ్నము గ్రాహ్యమనియు దోషాధికలగ్న మగ్రాహ్యమనియు విమర్శచేయు నెడల గుణములు దోషములు ననేకములుగానుండుటవలనగ్రంథవిస్తరభీతిచేనవియన్నియు జెప్పబడలేదనియు బ్రయాణవిషయమై శాస్త్రములయందు సారభూతమగు కించి ద్వస్తువు నాచేతననగా గాలామృతగారులచేత బ్రతిపాదింపబడెనని తా॥

అవసరప్రయాణమునకు ఫలములు

శ్లో॥ విప్రాది శ్శయనాన్న పానవిభవాం స్సంపూర్ణలక్ష్మీం మహీం
రత్నస్త్రీపశుధాన్యయోర్విజయాన్ లబ్ధ్వా స్వధామాప్నుయాత్
ఏతేషా మధికా ప్రయాత్మమనసః శుద్ధిప్రయాణే స్థితే చే ।
త్సర్వేషా మధికైవ యానసమయే శ్రీవేంకటేశస్మృతిః॥ ౧౨౧

టీక॥ మంచిలగ్నమునప్రయాణమైన;విప్రాదిః-బ్రాహ్మణులుమొదలు నాల్గు వర్ణములవారు;శయన-శయ్యాసుఖమును:అన్న-మంచిఅన్నమును;పాన-మంచిపాన మును: విభవాన్-ఐశ్వర్యమును; సంపూర్ణలక్ష్మీం-పూర్ణసంపత్తును: మహీం - భూ లాభమును; రత్న-రత్నములను; స్త్రీ-స్త్రీని: పశు-పశువును; ధాన్య - ధాన్యమును; విజయాన్-జయమును: లబ్ధ్వా-పొంది; స్వధామ -తనగృహమును పునః - తిరుగ; ఆప్నుయాత్-పొందును: ఏతేషాం-ఈలగ్నశుద్ధిమొదలగువాట్లకుప్రయాణే - ప్రయా ణమందు:ప్రయాత్మమనసః-ప్రయాణమగువానిమనస్సునకు;శుద్ధిం:శుద్ధిః ఆస్థితేచేత్ ఉన్నచో; అధికా-ఎక్కువైనది: సర్వేషాం - సమస్తమగువారికి; యానసమయే -

ప్రియాణకాలమందు, శ్రీవేంకటేశస్మృతిః- వేంకటేశ్వరస్మరణ, [అనఁగానిష్టదేవతా స్మరణ] అధికైవ - ఎక్కువమంచిదని యభిప్రాయము.

అవ॥ ఇలయుక్తము ముఖ్యలగ్నాదులయందుఁ బైనముపోవువారికి ఫలముల జెప్పుచున్నాఁడు

తా॥ బ్రాహ్మణ క్షత్రియవైశ్యశూద్రులకుఁ బూర్వోక్తక్రమంబుగ బైనము పోవుటకు శుభముహూర్తముసంభవించి పైనమువెళ్ళిరేని, శయనాన్నపానములుసుఖం ఐశ్వర్యమును:భూలాభమును;రత్నమౌక్తికమణిప్రవాళాదులను,స్త్రీ,పశుధాన్యవాహనములను బొంది యత్యంతసౌఖ్యంబులతో మరల స్వగృహమును బొందుదురనియు శుభలగ్నము మొదలగు నన్నిటికంటెఁబైనముపోయెడివారికి నెప్పుడుశుభముహూర్తమని నిశ్చయమనస్సుకలుగునో యట్టిముహూర్తమధికంబనిమాండవ్యమహర్షిమతము నవలంబించిగ్రంథకర్తచేఁ జెప్పఁబడినదనియును మఱియు ముఖ్యముగ నిష్టదేవతా స్మరణచేసి ప్రియాణమువెళ్ళిరేని సమస్తకార్యములు నెఱవేఱునని తా॥

ప్రయాణంబున రాజున కాశీర్వాదఫలము ౧౨౨

శ్లో॥ ఏవం సత్సమయే వ్రజ న్నరపతి స్సంత్యక్త కేశాంబరః
ప్రాణస్యందనశస్త్రనాగతురగాన్ కృత్వా తృణాస్యానరీన్ ।
కృత్వేచ్ఛాం నకులాంగనాసు విజయాం దత్వాభయం ప్రాణినాం ।
దగ్ధ్వా శత్రుపురాణి శత్రుకమలాం హృత్వా పురీం స్వాం విశేత్

టీక॥ ఏవం—ఇట్లు; సత్సమయే-మంచిసమయమందు,నరపతిః,రాజువ్రజన్-ప్రయాణమగుచు; అరీన్—శత్రువులను;సంత్యక్త—విడువఁబడిన,కేశ-జుట్టు, అంబర వస్త్రములు, ప్రాణ-ప్రాణములు, స్యందన-రథములు; శస్త్ర - శస్త్రములు; నాగ - యేనుగులు, తురగాన్-గుఱ్ఱములుఁగలవానిగాను, తృణాస్యాన్-గడ్డికరచువానిగాను, కృత్వా—చేసి, కులాంగనాసు—పతివ్రతాస్త్రీలయందు, విజయాం-జయసంబంధమగు, ఇచ్ఛాం-ఇచ్ఛను, నకృత్వా-చేయక, ప్రాణినాం—ప్రాణులకు, అభయం - నిర్భయమును, దత్వా-ఇచ్చి, శత్రుపురాణి—శత్రుపట్టణముల, దగ్ధ్వా-తగలపెట్టి, శత్రుకమలాం—శత్రులక్ష్మిని. హృత్వా—అపహరించి; స్వాం—తనయొక్క;పురీం-పట్టణమును విశేత్—ప్రవేశించుము.

అవ॥ శుభలగ్నమందు బ్రియాణముపోయినరాజున కాశీర్వాద రూపముచే విశేషఫలమును జెప్పుచున్నాడు

తా॥ పూర్వోక్తక్రమంబుగ శుభలగ్నమందు బయనము వోయిన ప్రభువు తన శత్రువులను విడువఁబడిన తలవెండ్రుకలు; వస్త్రములు; ప్రాణములు, రథములు; శస్త్రములు; గజములు; గుర్రములుగలవారలగాను కరవఁబడిన తృణముగల ముఖము గలవారగాను అనగా శరణాగతులనుగాఁజేసి శత్రురాజస్త్రీలయందాశక్తియుంచక నచ్చటనుండు ప్రాణులకభయమునిచ్చి శత్రుపట్టణముల దహించి శత్రులక్ష్మినియప హరించి యత్యంతానంద భరితుఁడై మరల తనపట్టణముఁ జేరునని తా॥

## ప్రతిప్రయాణలక్షణము ౨౨౩

శ్లో॥ యాత్రాలగ్నగతేఽబ్దఏవ రవిజే సూర్యే తదర్థం దినం।
శీతాంశౌ త్రిదినం కుజే శశిసుతే మాసద్వయం వాక్పతౌ।
మాసం దైత్యగురౌ చ పక్షమథవా దృష్టే విలగ్నే గ్రహైః।
సంఖ్యాయాః పతితస్సమేష్యతి పునస్స్వస్థానమాప్తార్థవాన్॥

టీక॥ రవిజే-శని యాత్రాలగ్నగతే - ప్రయాణలగ్నమందుండఁగా; అబ్దఏవ సంవత్సరమున్ను; సూర్యే-సూర్యుఁడు లగ్నమందుండఁగా తదర్థం ఆసంవత్సరములో సగము ఆఱుమాసములున్ను; శీతాంశౌ-చంద్రుఁడుండఁగా; దినం—ఒకదినము; కుజే-కుజుఁడున్న. త్రిదినం—మూడుదినములు; శశిసుతే బుధుఁడున్న; మాసద్వయం రెండుమాసములు; వాక్పతౌ—బృహస్పతియున్న; మాసః-ఒకమాసము; దైత్యగురౌ-శుక్రుఁడుండిన: పక్షః-పక్షమున్ను; అథవా—లేక; విలగ్నే - లగ్నము; గ్రహైః - ఈగ్రహములచే; దృష్టే—చూడబడినను; సంఖ్యాయాః-సంఖ్యకు; పతితః- పిమ్మట పునః-తిరుగ- ఆప్తార్థవాన్ తనపనులనుబొందినవాడై; స్వస్థానం - తనయిల్లును; సమేష్యతి-చేరగలడు

అవ॥ ఉక్తలగ్నమందు వెళ్ళినప్రయాణకర్త మరల వచ్చుటకుఁగాలనిర్ణయమును జెప్పుచున్నాడు.

తా॥ శనైశ్చరుడు ప్రయాణలగ్నగతుఁడై యుండెనేని ప్రయాణకర్తయొక్క సంవత్సరమునకు పిమ్మట మరల స్వస్థానముఁజేరుననియు సూర్యుడులగ్నగతుడై యుండెనేని ఆఱుమాసములకుపిమ్మటను చంద్రుడుండెనేని నొకదివసమునకుపిమ్మటను అంగారకుడు లగ్నగతుడై యుండెనేని మూడుదివసములకు పిమ్మట బుధుడుండెనేని రెండుమాసములకుపిమ్మటను బృహస్పతియుండెనేని మాసానంతరమందును శుక్రుడుండెనేని యొకపక్షమనగా ౧౫ దివసములకు పిమ్మటను ప్రయాణకర్తష్ట

సిద్ధిని బొందినవాడై స్వస్థానమును చేరుననియు నీచెప్పబడిన కన్యాదిగ్రహములచే ప్రయాణలగ్నముచూడబడుచుండిన నుక్తక్రమంబుననే వానికి ఫలంబుల నెఱుంగ వలయునని తా॥

మరియొక ప్రయాణలక్షణము ౨౨౪

శ్లో॥ మందాదిగ్రహకాలఏవ గదితో యాత్రాదిలగ్నే క్రమా ।
దేకద్విత్రిగుణశ్చరస్థిరగృహే స్యాద్విస్వభావాభిధే ।
యాత్రాలగ్న చరాదిభాగసహితే ష్వర్క్యాదిఖేటేషు నా ।
స్యాదేవం ప్రతియాన ముక్తగమనం నిశ్చిత్య యాత్రాం వ్రజేత్

టీక॥ యాత్రాలగ్నే—ప్రయాణలగ్నము; చరస్థిరగృహే - చరస్థిరములైనను ద్విస్వభావాభిధే-ద్విస్వభావమైనను, క్రమాత్-క్రమముగా, ఏకద్విత్రిగుణః — ఒకటి రెండుమూడురెట్లే, స్యాత్-అగును; అర్క్యాదిఖేటేషు— శనిమొదలగు గ్రహములు యాత్రాలగ్నచరాదిభాగసహితేషు - ప్రయాణలగ్నముయొక్క చరస్థిరద్విస్వభావ భాగమందున్నవాడగుచుండగా, ఏవం - ఈరీతిగానే, స్యాత్ - అగును, ఉక్తగమనం-చెప్పబడిన గమనముగల. ప్రతియానం-తిరుగమనమును; ఏవం - ఇట్లు నిశ్చిత్య-నిశ్చయించి, యాత్రాం—యాత్రను, వ్రజేత్ వెళ్లవలయును

అవ॥ ఈశ్లోకమున నొకవిశేషమును జెప్పుచున్నాఁడు

తా॥ ప్రయాణలగ్నము, చరము,స్థిరము,ద్విస్వభావమనెడుత్రివిధనామాన్వితముగానుండెనేని పూర్వశ్లోకమంc జెప్పబడియున్న క్రమంబుగ కన్యాదిగ్రహముల యొక్క కాలనిర్ణయము ఏకద్విత్రిగుణంబగుననఁగాప్రయాణలగ్నముచరమైయుండి అట్టిలగ్నమందు శనైశ్చరుఁడుండెనేనిప్రయాణకర్త మఱలవచ్చుటకునొకసంవత్సరమవధియగు స్థిరమైయుండెనేని రెండుసంవత్సరములవధియనియుద్విస్వభావమయ్యెనేని మూఁడు సంవత్సరము లవధియనియు శేషించినగ్రహములకుగాలనిర్ణయమిత్తెఱంగుననే యెఱుంగదగిన దనియు నిదియునుగాక ఈచెప్పబడినకన్యాదిగ్రహములు ప్రయాణలగ్నస్థములగు చరస్థిరద్విస్వభావాంశల బొందియుండినప్రయాణకర్తస్వస్థానమునకు మరలవచ్చుటకు గాలనిర్ణయమును పూర్వోక్తక్రమముననే తెలిసికొనిపైనము బోవలయునని తా॥

యోగాంతర ఫలము ౨౨౫

శ్లో॥ యాత్రాలగ్నగతో గ్రహః ప్రథమతః పశ్చాత్సవక్రీభవే ।

త్తల్లగ్నేశ్వరఏవవా గమనదిక్ఖేటో౽పి వక్రీయది ।
యాతు ర్జన్మవిలగ్న రాశ్యధిపతి ర్వక్రం గత స్తద్దశా ।
ధీశో వా బలయుక్త ఏవ స్వభవనం భూయః ప్రయాతైష్యతి॥

టీక॥ యాత్రిలగ్నగతః-ప్రయాణలగ్నమునుబొందిన, గ్రహః-గ్రహము, ప్రథమతః-ప్రయాణకాలమందు, ఋజుగతిః-చక్కనిగమనముగలవాడై, పశ్చాత్-పిమ్మట, సః-ఆగ్రహమే, వక్రీ-వక్రముఁగలవాడు, భవేద్యది-అయినచో, వా-లేక తల్లగ్నేశ్వరఏవ-అప్రయాణలగ్నాధిపతియైనను, గమదిక్ఖేటో౽పి-ప్రయాణదిగధిపుడైనను,వక్రీ-వక్రముఁగలవాడు, భవేద్యది-ఐనచో, వా-లేక, యాతుః-ప్రయాణమగువానికి, జన్మవిలగ్న రాశ్యధిపతిః-జన్మలగ్నరాశియొక్క-యధిపతి,వక్రం-వక్రమును గతోయది-పొందినను, తద్దశాధీశః - గమనమగువానియొక్క-దశానాథుఁడు, బలయుక్తవా-స్థానాదిషడ్బలములుఁగలవాడైనను, వక్రీ-వక్రముఁగలవాఁడుమ॥ భవతి యది-ఐనచో, యాత్రి-ప్రయాణమువెళ్ళువాడు, భూయః-తిరిగి, స్వభవనం-తన యిల్లును, ఏష్యతి-చేరెడివాడు.

అవ. యోగాంతరములను జెప్పుచున్నాఁడు.

తా॥ నవగ్రహములలో నేగ్రహముగాని ముందుప్రయాణలగ్నమున ఋజుగతుఁడైయుండి ప్రయాణకర్త పైనముపోయినపిమ్మట వక్రించినను,లేకప్రయాణలగ్నాధిపతి వక్రగతుఁడైనను, లేకతానేదిక్కును గూర్చిపైనముపోదలచియున్నదో యాదిక్కధిపతి వక్రగతుఁడైయుండినను,ప్రయాణకర్తయొక్క జన్మలగ్నాధిపతివక్రగతుడైనను, లేక ప్రయాణకర్తయొక్క దశాధిపతిస్థానాదిషడ్బలయుక్తుఁడైయుండి యెప్పుడువక్రగతుఁడగుచున్నాడో అట్టిసమయంబుననుఁబైనముపోయినవాఁడుమరల స్వగృహమును బొందునని జ్యోతిశ్శాస్త్రవిజ్ఞునిచేత నీఫలము జెప్పఁదగినదని తా॥

శ్లో॥ యాత్రాలగ్నగతోదయాంశభవనాద్యాత్రోడుపాదాంత్యగా
యాత్రాకర్తృభపాదతస్స్వరథవాయాత్రేందుభాంశాంత్యగాః
తావంతోహి వినాడికాశ్చ ఘుడికాహాఃపక్షమాసాస్తథా ।
ర్యావన్మధ్యనవాంశకాగతివశాత్స్యాద్యాత్రకాలావధిః॥ ౨౨

టీక॥ యాత్రిలగ్నగతోదయాంశభవనాత్ - యాత్రిలగ్నమందుండు నద యాంశయనుగృహమునుండి, యాత్రోడుపాదాంత్యగాః-ప్రయాణనక్షత్రముయొక్క పాదాంత్యమునుబొందినవియు, అథవా- లేక, యాత్రికర్తృభపాదతః-ప్రయాణము చేయువాని జన్మనక్షత్రపాదము మొదలు, యాత్రేందుభాంశాంత్యగాః - ప్రయాణ

మగుదినముయొక్క నక్షత్రమును బొందిన, తయోః-అశెంటియొక్క, యావన్మత్య నవాంశకాః-యెన్నిమధ్యమందునవాంశములో, తావంత్యః-అన్ని, వినాడికాః-విఘడియలు, ఘటికాహఃపక్షమాసాః - ఘడియలు, రోజులు, పక్షములు, మాసములు, యాత్రాకాలావధిః-ప్రయాణమగువానికి కాలవ్యవధి, స్యాత్-కలుగును.

అవ. మరల యోగాంతరములఁ జెప్పుచున్నాఁడు.

తా॥ ఉక్తక్రమంబునప్రయాణము వెళ్లినవారికి మరలవచ్చెడి నిర్ణయకాలమెద్ధియనిన, ప్రయాణలగ్నస్థనవాంశ మొదలు ప్రయాణ నక్షత్రపాదనవాంశమువరకు గాని, లేక ప్రయాణకర్తయొక్క జన్మ నక్షత్రపాదనవాంశము మొదలు ప్రయాణనక్షత్రాంశము వరకుగాని లెక్కపెట్టగా నెన్నినవాంశములగుచున్నవో అన్నివిఘడియలు,అన్ని ఘడియలు, అన్నిదినములు, అన్నిపక్షములు, అన్నిమాసములుకూడా జేర్చిన నెంతకాలమగునో అంతకాలమునకు పిమ్మట వత్తురని తా॥

శ్లో॥ యాత్రాలగ్నవవాంశపోఽస్తనిలయే స్వాంశేశ్వరో వాయదా ।
వక్రీసప్తమరాశిపోపి నవమాధీశోపి యాత్రాలయాత్ ।
తద్ద్రేక్కాణపతిః స్వకాలబలవాన్ తద్వారలగ్నేశ్వరో ।
యాతుస్స్యాత్పునరాగమస్స్వభవనం వాశేశ్వరో వాతదా॥౨౨

టీక॥ యాత్రాలగ్ననవాంశపః- ప్రయాణలగ్నముయొక్కనవాంశపతి, యదా యెప్పుడు, వక్రీ-వక్రగతికలవాడు, భవతి-అగుచున్నాఁడో, వా-లేక, అస్తనిలయే-ప్రయాణలగ్నమున కేడవలగ్నమందు, స్వాంశేశ్వరః-లగ్ననవాంశాధిపతి, యదా యెప్పుడు, వక్రీ-వక్రించునో,తదా-అప్పుడైనా, యాత్రాలయాత్-ప్రయాణలగ్నము కంటె, సప్తమరాశిప-సప్తమాధిపుఁడైనను, నవమాధీశోపి - నవమాధిపుఁడైనను, యదా-యెప్పుడు, వక్రీ-వక్రగతిఁగలవాడు, భవతి-అగునో, తదావా-అప్పుడైనో, తద్ద్రేక్కాణపతిః-ప్రయాణలగ్నముయొక్క ద్రేక్కాణాధిపుడు, స్వకాలబలవాన్-ప్రయాణకాలమందు బలముగలవాడై, యదా-యెప్పుడు: వక్రీ - వక్రించినవాడు: భవతి-అగునో: యద్వాలేక: తద్వారలగ్నేశ్వర-ప్రయా రాధిపుఁడైనను లగ్నాధిపుఁడైనను: స్వకాలబలవాన్- స్వకాలమందుబలముకలవాడగుచు: యదా-యెప్పుడు: వక్రీ-వక్రముగలవాడు: భవతి-అగుచున్నాఁడో: వారేశ్వరో వా-ప్రయాణవారాధిపుఁడైనా: యదా-యెప్పుడు: వక్రీ - వక్రముగలవాడు: భవతి-అగుచున్నాడో: తదా-

అప్పుడు: యాతుః-ప్రయాణమగువానికి: స్వభవనం - తనయింటినిగూర్చి: పునః- తిరిగి: ఆగమః-వచ్చుట: స్యాత్-అగును.

అవ. మరల వచ్చుటకు యోగాంతరముల జెప్పుచున్నాడు.

తా॥ ప్రయాణలగ్న నవాంశాధిపతిగాని, ప్రయాణలగ్నమునకు సప్తమలగ్న నవాంశాధిపతిగాని, సప్తమలగ్నాధిపతిగాని ప్రయాణ సమయమున ఋజుగతుఁడై యుండి యెపుడు వక్రగతుఁడగునో అప్పుడును లేక ప్రయాణలగ్న ద్రేక్కాణాధిపతి ప్రయాణకాలమందు స్థానాదిషడ్బలయుక్తుడై యుండి పిమ్మట వక్రించినను ప్రయాణవారాధిపతియుందల్లగ్నాధిపతియునుఁ దత్కాలమందు స్థానాదిషడ్బలయుక్తులై యుండి యెప్పుడు వక్రగతులగుదురో అప్పుడును ప్రయాణకర్తయొక్క జన్మవారాదిపతిగాని, జన్మలగ్నాధిపగాని, తత్కాలయందు బలయుక్తులై యుండి యెపుడు వక్రగతులగుదురో అపుడును ప్రయాణకర్త శీఘ్రముగ స్వస్థానమును జేరునని తా॥

శ్లో॥ భూత్వాగమనే ప్రవేశశకునం పశ్చాత్సమీపేపునః ।
ప్రస్థానం శకునం భవేద్యది మహాఁల్లాభః ప్రయాతుస్సదా ।
ప్రోక్తం యత్సకలం ప్రయాణశకునం వ్యస్తం ప్రవేశేశుభం ।
క్షీరాఖ్యం విహగం విహాయ నగరగ్రామప్రవేశాదిషు ॥ ౨౨౮

టీక॥ గమనే—ప్రయాణమందు, అగ్రే-ముందుగా, ప్రవేశశకునం-ప్రవేశకాలముయొక్క శకునము, భూత్వా - కలిగిన, పశ్చాత్-పిదప, పునః-తిరిగి, సమీపే-సమీపమందు, [అనఁగావెంటనే] ప్రస్థానం-ప్రయాణసంబంధమైన, శకునం-శకునము, భవేద్యది-కలిగినచో, తదా - అప్పుడు, ప్రయాతుః - ప్రయాణమగువానికి, మహాఁల్-గొప్ప, లాభః-లాభము, స్యాత్-అగును, యత్-యే, ప్రయాణశకునం—ప్రయాణమునకు శకునము, ప్రోక్తం-చెప్పబడెనో, తత్—అది, ప్రవేశే-ప్రవేశమందు, వ్యత్యస్తం—విపరీతమగుచు, శుభం-మంచిది, క్షీరాఖ్య—క్షీరమనుపేరుగల, విహగం—పక్షిశకునమును, విహాయ-వదలి నగరగ్రామప్రవేశాదిషు - పట్టణగ్రామములప్రవేశప్రయాణములయందు మంచిది.

తా॥ ప్రయాణసమయమున ముందుగాఁ బ్రవేశమునకుఁ జెప్పఁబడియున్న శకునములై పిమ్మట ప్రయాణశకునములాయెనేని ప్రయాణ

కర్తకు విశేషలాభమును పాలపక్షిదక్క్ప్రయాణమునకు చెప్పఁబడి యున్న శకునములు నగరాదిప్రవేశాదులయందు వ్యత్యస్తముగా నా మెనేని ముఖ్యములగుననగాఁ బ్రయాణమునకు శ్రేష్ఠములని చెప్పఁ బడియున్న భారద్వాజమయూరాదిపక్షులయొక్క ప్రదక్షిణగమనము ప్రవేశమునకు శుభకరంబనియు వామగమనము శ్రేష్ఠమనియు బ్ర యాణమునకు శుభకరంబని చెప్పఁ బడియున్న గరుడకుక్కుటాదుల యొక్కవామగమనము ప్రవేశమం దశుభకరంబనియు ప్రదక్షిణగమ నము శుభకరంబనియుఁ బాలపక్షిగమనము ప్రయాణ ప్రవేశాదుల యందు వామగమనమే శ్రేష్ఠము

ప్రయాణవిషయమై విప్రాదులకు నియతఫలములు ౨౭౯

శ్లో॥ యాత్రా ధిష్ణ్యగుణై ర్ద్విజస్య ఫలదా సిద్ధిర్గుణై ర్లగ్నజై ।
ర్నానా యోగగతై ర్నృపస్యతు విశాం సిద్ధిర్దినో త్థైర్గుణైః ।
శూద్రాణాం శకునై శ్శుభై శ్శుభఫలం యాత్రానుకూలా భవే
దన్యేషాంతు ముహూర్తశక్తి బలతస్స్యాత్కార్యసిద్ధిస్సదా ॥

టీక॥ యాత్రా-ప్రయాణము, ద్విజస్య-బ్రాహ్మణునికి, ధిష్ణ్యగుణైః-నక్షత్ర గుణములచేత, ఫలదా-ఫలమునిచ్చునది, నృపస్యతు-రాజుకైతే, నానాయోగగతైః-అనేకయోగములబొందిన, లగ్నజైః - లగ్నమువల్లకలిగిన, గుణైః-గుణములచేత, సిద్ధిః-కార్యసిద్ధి, విశాం-వైశ్యులకు, దినోత్థైః-దినమువల్లపుట్టిన, గుణైః-గుణముల చేత, సిద్ధిః-కార్యసిద్ధి, శూద్రాణాం-శూద్రులకు, శకునైః-శకునములచేత, శుభే-శుభ శకునమగుచుండగా, శుభఫలం - మంచిఫలము, అన్యేషాం-ఇతరసంకరజాతులకు, ముహూర్తశక్తిబలతః-ముహూర్తబలిమివల్ల, యాత్రా-ప్రయాణము, అనుకూలా-మంచిదగుచూ, కార్యసిద్ధిః-కార్యసిద్ధి, సదా-ఎల్లప్పుడు, స్యాత్-అగును.

అవ. ప్రయాణవిషయమై బ్రాహ్మణాదులకునియతఫలమునుజెప్పుచున్నాఁడు

తా॥ ప్రయాణసమయమున బ్రాహ్మణులకు గుణయుక్త నక్షత్రముగానుంటె నేని శుభప్రదమనియు రాజులకు లగ్నయోగాదులు శ్రేష్ఠములుగా నుండెనేని యిష్ట సిద్ధిప్రదమనియు వైశ్యులకు దినశుద్ధిచక్కగానుండెనేని శుభప్రదమనియు శూద్రు లకు ప్రయాణకాలమందు శుభశకునములాయెనేని శ్రేయస్కరమనియు, శేషించిన జనులకు ముహూర్తబలము చక్కగానుండెనేని కార్యసిద్ధిగలుగునని తా॥

పైనముపోవుదివసమందువిడువతగినకార్యములు ౨౩౦

శ్లో॥ క్షౌరం వాక్కలహం సుదీర్ఘగమనం దైన్యం భయం వేపథుం
శోకం దుష్టసహాయ మేకగమనం విప్రత్రియం వక్రితామ్ ।
అభ్యంగం సముపోషణంచ కుటిలం త్యక్త్వాదిమేఽహ్ని వ్రజేత్
పూర్వాదృష్టవశాత్ప్రయాణశకునం యాతి శ్శుభం వాఽశుభమ్

టీక॥ క్షౌరం - క్షురకర్మ; వాక్కలహం - భార్యమొదలగువారితో పోట్లాట; సుదీర్ఘగమనం- మిక్కిలిదూరపు గమనము, దైన్యం-దీనత్వము, భయం-భయమును, వేపథుం-శరీరకంపమును, దుష్టసహాయం-దుష్టులసహగమనం-ఏకగమనం — ఒంటరిగా వెళ్ళుటమ;విప్రత్రియం-బ్రాహ్మణత్రయము,వక్రితాం—దూరమార్గముగాపెళ్లుట లేక కొంచెము దూరము వెళ్లి తిరిగివచ్చుట, అభ్యంగం-తలంటని, సముపోషణం-ఉపవాసముచేయుట, కుటిలం—మనోవైకల్యము, ఆదిమే—మొదటిదగు,అహ్ని-దినమంతు త్యక్త్వా-వదలి, వ్రజేత్—ప్రయాణముచేయవలయును,యాతుః-ప్రయాణమగువానికి పూర్వాదృష్టవశాత్-పూర్వార్జితకర్మవల్ల, ప్రయాణశకునం - ప్రయాణకాలమందు; శకునము; శుభం—మంచిదైనా, అశుభంవా-చెడుదైనా, స్యాత్-కలుగును.

అవ॥ పైనముపోవుదివసమంతు విడువఁదగినకార్యముల జెప్పుచున్నాఁడు-

తా॥ ప్రయాణదివసమందు క్షౌరము భార్యమొదలగువారితోఁగలహము దీర్ఘ మార్గగమనము యజ్ఞాతులచేప్రాప్తమగుదైన్యము,భయము,శరీరకంపము,వ్యసనము దుర్జనులసహాయము ఏకాకిగా బయలుదేరుట బ్రాహ్మణత్రయము బయలువెళ్లడము మార్గమందు వక్రముగ నడవడము అభ్యంగస్నానము ఉపోష్యము చిత్తవైకల్యము ఇవిమొదలగుదుష్టకార్యములఁ త్యజించి ప్రయాణము వెళ్లరేని జన్మాంతర పుణ్యపాప విశేషమువలన శకునములగుననఁగా పూర్వాదృష్టము శుభమైయుండెనేని శుభశకునము అశుభమైయుండెనేని యశుభశకునములు నగునని తా॥

శ్లో॥ ద్వితీయే దివసేపి యానశకునం సమ్యగ్భవే చ్ఛోభనం ।
వ్యాళంవా శశకం వినావశకునం దైవాత్తదన్య ద్భవేత్ ।
పూర్వస్మిన్ దివసేఽపి యత్రి శకునం తత్రైవ గత్వాపున ।
స్తార్తియే దివసే వ్రజేత్పునరపిస్యాదేవయాతుస్సుఖమ్॥ ౨౩౧

టీక॥ ద్వితీయే—రెండవదగు; దివసే—దినమందు,యాశకునం— ప్రయాణశకునము, సమ్యక్—బాగుగా భవేద్యతి—అయినట్లులయిన, తదా—అప్పుడు, శోభనం —

మంగళము: స్యాత్-కలుగును, దైవాత్-దైవవశమువలన, వ్యాళం — సర్పమును, శశకంచ-చెవులపిల్లిని, వినా-విడచి, అన్యత్-మఱివక, అపశకునం— దుశ్శకునము, భవేద్యది—అయినచో, పూర్వస్మిన్దివసేపి-మొదటిదినమందు, యత్ర-ఎచ్చట, శుభశకునం-మంచిశకునము, స్యాత్-అయినచో, తత్రైవ — అచ్చటికే; గత్వా—వెళ్ళి పునః—తిరిగి, తార్తీయే—మూడవదగు, దివసే-దినమందు, వ్రజేత్—వెళ్ళవలయును. ఇట్లుచేసిన; యాతుః-ప్రయాణమగువానికి, సుఖం—సుఖము, స్యాత్-కలుగును.

అవ॥ ప్రయాణదివసమునకురెండవదివసమందుగతిలక్షణమును జెప్పుచున్నారు.

తా॥ రెండవదివసమందు ప్రయాణశకునములు చక్కఁగానాయెనేనిశుభకరం బనియు లేక దైవాధీనమువలన సర్పము: కుందేలు, ఈరెండు వినాగానేమియపశకునములైనను పూర్వదివసమందేప్రతిశమునకుశుభశకునములాయెనో మరలనాప్రదేశమును బొంది యాదిన మచటనేయుండి మూఁడవదివసమందుప్రయాణముఁబోయిరేని సుఖవంతులగుదురని తా॥

శ్లో॥ పూర్వకాలామృతం నామ గ్రంథః ప్రాచీననిర్మితః ।
పదచ్ఛేద పదార్థోక్తి సహితాస్యాద్యధాక్రమమ్
మచిలీపట్టణే చల్లాలక్ష్మీనృసింహాశాస్త్రిణా ।
విరచ్యతే మయాటీకా బాలానాం బోధసిద్ధయే ॥
పూర్వకాలామృతే - పంచమబిందు
సమాప్త

ఓమ్

పరబ్రహ్మణేనమః

# పూర్వకాలామృతే

షష్ఠబిందు ప్రారంభః

...(౦)...

గృహనిర్మాణయోగ్యప్రదేశము

శ్లో॥ క్షేత్రాణాం వసతి శ్శుభా కలియుగే శ్రీవేంకటేశాద్రియా ।
వింధ్యాఖ్యాచలదక్షిణావనితటే శ్రీగౌతమీసన్నిధౌ ।

సంపూర్ణాధ్వరవేదశాస్త్రసహితే స్వర్గాదిభోగప్రదే ।
బ్రహ్మజ్ఞానిభిరన్వితేఽతిశుభదే ముక్తిప్రదే స్థాయినామ్ ॥

టీ॥ క్షేత్రాణాం— కాశ్యాదిక్షేత్రములలో, సంపూర్ణాధ్వరవేదశాస్త్రసహితే - సంపూర్ణ-పూర్ణమైన, అధ్వర- యాగములు, వేద - వేదములు, శాస్త్ర - శాస్త్రములు, తాభిః-వాట్లతో, సహితే - కూడినట్టిన్ని, స్వర్గాదిభోగప్రదే- స్వర్గాది - స్వర్గము మొదలగువానియందుండు,భోగప్రదే-భోగమునిచ్చునట్టిన్ని:బ్రహ్మజ్ఞానిభిః-బ్రహ్మవేత్తలచే; అన్వితే-కూడినట్టిన్ని: స్థాయినాం వుండువార్లకు; అతిశుభదే - మిక్కిలి మంచినిచేయును. ముక్తిప్రదే-మోక్షప్రదమగును: వింధ్యాఖ్య-వింధ్యమను పేరుగల అచల-పర్వతముయొక్క: దక్షిణావనితటే-దక్షిణభూమియందు: శ్రీ - శోభాయుక్తమగు; గౌతమీ-గోదావరినదియొక్క: సన్నిధౌ — సమీపమందు: శ్రీవేంకటేశాజ్ఞయా-వెంకటేశ్వరస్వామియాజ్ఞచేత; కలియుగే-కలియుగమందు; వసతిః - నివాసము- శుభాః—మంచిది.

అవ॥ జనులు వాసముచేయుటకు ప్రదేశమునిర్ణయింపుచున్నారు

తా॥ కలియుగమున వాసముచేయువారలకు ముక్తిప్రదంబును శుభకరంబును నగు వింధ్యపర్వతమునకు దక్షిణభూభాగమున వేదశాస్త్రేతిహాసపురాణ పారంగతులగు బ్రాహ్మణోత్తములు నివసించియున్న గౌతమీనదీసమీపభూములును:జనులకు వాసయోగ్యంబని శ్రీవెంకటేశ్వరాజ్ఞాకరులగు గ్రంథకారులచేఁజెప్పఁబడినదని తా॥

రాజభృత్యోత్పన్నము

శ్లో॥ సేవాయాం ప్రభునామభాది గణయేద్భృత్యాఖ్యధిష్ణ్యాంతత
స్తత్కృత్వాథ చతుర్గుణం ప్రవిభజేత్సైన్యశేషం ధనమ్
తద్వత్పూర్వవిపర్యయాగతమృణం జ్ఞేయంహీనాజ్ఞస్త్వదం ।
భృత్యస్యైవతుభృత్యభాదిగణయేదర్థాదికోరాజ్యకృత్ ॥ ౧౩

టీక॥ సేవాయాం-సేవకుప్రవేశించుకాలమందు; ప్రభునామభాది - ప్రభువుయొక్కనామనక్షత్రము మొదలు; భృత్యాఖ్యధిష్ణ్యాంతతః—భటునియొక్కనామనక్షత్రమువరకు; గణయేత్-లెక్కించవలయును, తత్-ఆలెక్కను; అథ - పిమ్మట చతుర్గుణం-నాల్గింటిచే హెచ్చించుటను; కృత్వా-చేసి; సైన్యైః—యేడింటిచే; ప్రవిభజేచ్ఛ భాగించవలయును. శేషం-మిగిలినది; ధనం-ధనము పేరుగలసంఖ్యయగును;తద్వత్—అటువలెనే; పూర్వవిపర్యయాగతం-మునుపటికన్న వ్యత్యస్తముగా లెక్కిం

చనావచ్చినది, [అనగా భృత్యనామనక్షత్రము మొదలు ప్రభునామనక్షత్రమువరకు లెక్కించగావచ్చిన మొత్తమును నాలుగింటగుణించి యేడింటభాగించగా వచ్చిన శేషమనుట] ఋణం-ఋణమనిపేరుగలదిగా, జ్ఞేయం-తెలియతగినది, ఇదం- ఇది రాజ్ఞః-రాజునకు, భృత్యస్యతు - భటునకైతే, భృత్యభాది – భటునినామనక్షత్రము మొదలు, గణయేత్ . లెక్కించవలయును, అర్థాధికః - ధనాధికము, రాజ్యకృత్ - రాజ్యమునుగలుగజేయును.

అవ॥ పిమ్మట వాస్తుస్వరూపమును దెలుపువాడై ప్రసంగసంగతిచే రాజభృత్యార్వణమును జెప్పుచున్నాఁడు

తా॥ సేవకునివిషయమై యర్వణము చూచునపుడు ప్రభునామనక్షత్రము మొదలు సేవకుని నామనక్షత్రమువరకు గణనచేసి యాలెక్కను ౪ ట హెచ్చ గుణించి ౭ ట భాగహరించగా రాశియందు శేషముండెనేని యది ధనమగును. అట్టిధనసంఖ్యను నొకచోటనుంచి మరల సేవకునినామనక్షత్రము మొదలు ప్రభునామనక్షత్రమువరకు ను త్తక్రమంబున గుణించి భాగహరింపగా శేషము ఋణమగును; ఇట్లేర్పడిన ధనఋణములలో ధనసంఖ్య యధికముగనుండెనేని ప్రభువులకులాభకరమగును. సేవకుఁడు ప్రభువిషయమై అర్వణము చూచునపుడు సేవకనామనక్షత్రము మొదలు ప్రభునామనక్షత్రమువరకు గణనచేసి తక్కినవానిను త్తక్రమంబుగజూచి ఫలమును నెఱుంగవలయునని తా॥

## గ్రామార్వణము ౨౩౮

శ్లో॥ సాధ్యాఖ్యాప్రథమాక్షరోత్తగణానాం సంలిఖ్య తద్వామత
స్తద్వత్సాధకనామతశ్చ ప్రవిభజేన్నాగైశ్చ శిష్టం ధనమ్ ।
తాదృక్పూర్వవిపర్యయా గణమృణం ద్రవ్యాధికంభోగదం
సామ్యం చేత్సమతాస్యదన్నరహితం వైరాఖ్యధామాత్రికృత్

టీక॥ సాధ్యాఖ్యాప్రథమాక్షరోత్తగణానాం-సాధ్య-గృహముకట్టు గ్రామము యొక్క, అఖ్యా-పేరుయొక్క, ప్రథమ-మొదటిదగు; అక్షర - అక్షరముయొక్క గణనాం-అకారాద్యక్షరములలెక్కను; సంలిఖ్య – వ్రాసి; తద్వామతః-తత్ - దాని యొక్క; వామతః-యెడమభాగమందు; సాధకనామ - గృహముకట్టువానియొక్క పేరును; తద్వత్-అకారాదిగా పేరుమొదటియక్షరమువరకు లెక్కించి; సంలిఖ్య - వ్రాసి; నాగైః-అష్టదిగ్గజసంఖ్యచే; ప్రవిభజేత్-భాగించవలయును; శిష్టం-శేషమును, ధనం-ధనమనుపేరుగలది; లబ్దమక్కరలేదు- తాదృక్- పూర్వమువలెగణనాదికము

గలిగిన, పూర్వవిపర్యయాగతం-పూర్వముకంటె విపరీతముగా గుణించుటచే వచ్చిన శేషము, ఋణం - ఋణమును పేరుగలదగును, [అనగా యిల్లుకట్టువానినామ మొదటిఅక్షరము వరకు లెక్కించివ్రాసి దానికియెడమ ప్రక్కగ్రామనామ మొదటి యక్షరమువరకైన లెక్కనువ్రాసి యెనిమిదింటభాగించగా శేషమనుట] ధ్రువ్యాధికంచేత్-ధనమధికమైనచో, భోగదం-శుభకరమగును, సామ్యంచేత్-సమానమైనచో సమతా-సమత్వముకలుగును, అన్యత్-ఋణమధికమైన, అన్నరహితం-అన్నములేని వానిగచేయును, వైరాఖ్యధామ-శతృవనుపేరుగలస్థానమగును, గనుక అరికృత్-పీడకలుగచేయును, అభ్యాసకులకుతెలియుటకభ్యాసముజెప్పుచున్నాఁడు, కుండినమను పట్టణమునకునామాద్యక్షరముకకారము, అకారముమొదలుకకారమువరకులెక్కింపగా ౧౩ అగును, దానినొకచోటవ్రాసి దానికియెడమప్రక్కను ఈశ్వరుఁడను వాని పేరుకు మొదటియక్షరమగు ఈకారమువరకు అకారాదిలెక్కించగా ౪అగును, అది యంతయు ౪౧౩ అగును. దానినెనిమిదింటభాగించగా నొకటిమిగులును అది ధనము దానిచే తల్లక్రిందుచేయగా ౧౩౪ అగును. దానినెనిమిదిచేభాగించగా ౬ మిగులును ఇది ఋణమగును. ఇచ్చట ధనముకన్న ఋణమధికము. ఇట్లంతట వూహించవలె కొందఱు అకారాదివర్గముల లెక్కించవలయునందురు.

అవ. గ్రామార్వణమునకు లక్షణమును జెప్పుచున్నాఁడు.

తా॥ అకారముమొదలు గ్రామనామధేయ ప్రథమాక్షరము వరకు గణన చేయఁగా వచ్చినసంఖ్య నొకచోటనుంచి మరల అకారముమొదలు గృహము కట్టుటకు నిశ్చయించెడి పురుషునినామ ప్రథమాక్షరమువరకు లెక్కపెట్టి యాసంఖ్యను మొదట గణనచేసి యుంచియున్న లెక్కకుకుడిప్రక్కన నుంచి వెరశి రాశిని ౮ ట భాగహరింపఁగా శేషము ధనమగు, మరల అకారముమొదలు గృహాధిపతినామధేయ ప్రథమాక్షరము వరకు లెక్కపెట్టి ఆసంఖ్య నొకచోటవ్రాసియుంచి అకారము మొదలు గ్రామనామధేయ ప్రథమాక్షరము వరకుగణనచేసి యాగుణమును తొల్లింటిలెక్కకు కుడిభాగమునమంచి వెరశి రాశిని ౮ ట భాగహరింపఁగా శేషము ఋణమగు నిట్లేర్పరచఁబడిన ధనఋణసంఖ్యలలో నేగ్రామమున ధనసంఖ్య హెచ్చుగా నుండునో యట్టిగ్రామము వాసయోగ్యంబని తా॥

## క్షే త్రా ర్వ ణ ము

శ్లో॥ క్షేత్రస్యైకచటాః క్రమాత్తపయశావర్గాస్య్ రష్టాస్థితాః।
ప్రాగాద్యా ఖగరాడ్బిడాలమృగరాట్ఛ్వావ్యాఖునాగాశ్శశాః।

స్యాత్వర్గా ద్యది పంచమోఽరిరథదిగ్వర్గేషు యోనిస్స్వయం ।
ద్వౌద్వౌ దిక్షు విదిక్షుచైకమఖిలం మేషాదిపూర్వాదితః ॥ ౨౩౫

టీక॥ క్షేత్రివ్య-గృహముకట్టు స్థలమునకు, క్రిమాత్-వరుసగా, అకచటాః- అ, క, చ, ట అనునవియు, తపయశాః - త, ప, య, శ అనియు, అష్టౌ-యెనిమిది, వర్గాః-వర్గులు, స్థితా - వున్నవై, స్యుః-అగుచున్నవి, ప్రాగాదౌ - తూర్పు మొదలగుదిక్కులయందు, ఖగరాత్ - గరుత్మంతుడు, బిడాల - పిల్లి, మృగరాట్-సింహము, శ్వా-కుక్క, అహి-సర్పము, ఆఖు-యెలుక, నాగాః-యేనుగ, శశః-చెవులపిల్లి, [అనఁగాకుందేలనుట] స్యుః-అగుచున్నవి, వర్గాత్-తనవర్గుకు,అనఁగా యెవతినామాక్షరము యేవర్గుయందుండునో నావర్గుకనుట] పంచమః-ఐదవవర్గము అరిః-శత్రువర్గము, స్యాద్యది-అయినచో, మంచిదికాదనుట [ఆదిక్కునగృహము నిర్మింపగూడదనుట] అథ-లేక, దిగ్వర్గేషు-దిగ్వర్గుయందు, ఇయం-ఇది, యోనిః-యోనివర్గము, పూర్వాదితః-తూర్పుమొదలు, అఖిలం-సమస్తమైన, మేషాది-మేషం మొదలగు రాశి సమూహము; దిక్షు—నాలుగుదిక్కులయందు; ద్వౌద్వౌ-రెంటురెంటు; విదిక్షు—మూలలయందు; ఏకైకం-ఒక్కొక్కటి; యోజయేత్-కూర్చవలయును.

అవ. క్షేత్రివర్ణమునుఁజెప్పుచున్నాఁడు.

తా॥ పంచాశద్వర్ణములలోనుండె అ-క-చ-ట-త-ప-య-శ లనెడి ౮ది వర్గములకు ప్రాగాదిగా నెనిమిదిదిక్కులు స్థానంబులగు నట్టివర్గములకు ప్రాగాదిగా గరుడబిడాలసింహశునకసర్పమూషకగజశశకములధిపతులనియును;పురుషునియొక్క నామప్రథమాక్షర మేవర్గమునందునో ఆవర్గమునకు పంచమవర్గము శత్రువర్గము గాన నావర్గమునకు స్థానంబగు దిక్కునందు గృహనిర్మాణము గూడదనియును పక్షాంతరమున ప్రాగాదీశాన్యమువరకు మేషాదిద్వాదశరాసులను దిక్కుయందు నొక్కొక్కరాశియు దిక్కులయందు రెండేసిగా నుంచితేని ఇదియే దిగ్వర్గలయందు యోనియని చెప్పఁబడునని తా॥

శ్లో॥ ఏకస్మిన్ యది పంచమేచ నవమే స్యాద్బంధుసంరక్షకో ।
నాశః స్యాద్ద్వితయేచ షష్ఠదశమే చేన్నామరాశ్యాదితః ।
తార్తీయే యదిసప్తమే పరజనైః పోష్యస్తథైకాదశే ।
చాతుర్థేచ సుఘాతుకో గృహపతిస్థాయ్యష్టమేద్వాదశే॥ ౨౩౬

టీక॥ నామరాశ్యాదితః - గృహపతియొక్క నామరాశిమొదలు; ఏకస్మిన్—ఒకటియందు; నవమే-నవమందు; పంచయేచ-పంచమమందు;స్థాయీయది-ఉన్నచో

బంధుసంరక్షకః-బంధుపోషకుడు; స్యాత్-అగును; ద్వితీయే-రెంటియందు; షష్ఠే-ఆరింట; దశమేచ-పదింటను; నాశః-నాశము; స్యాత్-కలుగును; తార్తీయే-తృతీయమందు; సప్తమీ-యేడింట; ఏకాదశే - పదకొండింట; పరజనైః - ఇతరజనులచే; పోష్య - పోషించఁదగినవాఁడు; స్యాత్ -అగును; చాతుర్థే-నాల్గింట; అష్టమే-యెనిమిదింట; ద్వాదశే-పండ్రెండింట, సఘాతుకః-హింసకుఁడు; స్యాత్-అగును.

అవ. పూర్వశ్లోకోక్తం బగురాశిచక్రమునకు నామరాశిమొదలు ఫలమునుఁ జెప్పుచున్నాఁడు

తా॥ గృహాధిపతితననామరాశిమొదలు ౧-౯-౫ రాశిస్థానములైన దిక్కుల వాసముచేసిన బంధుపోషకుఁడగును, ౨-౬-౧౦ ట వాసముచేసిన నాశముపొందును ౩-౭-౧౧ ట నుండిన నితరులచే పోషితుఁడగును: ౪-౮-౧౨ ట నుండిన నొకనికిహాని గలుగచేయుచుండునవి తా॥

నామనక్షత్రాదులయందు చేయదగినకార్యములు ౨౩౭

శ్లో॥ సంగ్రామవ్యవహారధామనగరగ్రామేషుమంత్రార్పణే ।
జ్ఞాతేసత్యపి జన్మభేచ సతతం నామర్క్షజం స్యాత్ఫలమ్ ।
అజ్ఞాతం జననోడు యస్య ఫలదం స్యా న్నామభం తస్యతు।
త్రింశద్వత్సరతః పరం ఫలద మిత్యాహుఃపరేనామభమ్ ॥

టీక॥ సంగ్రామవ్యవహారధామనగరగ్రామేషు సంగ్రామ - యుద్ధమందు: వ్యవహార-క్రయవిక్రయవ్యవహారమందు: ధామ-క్షేత్రార్పణమందు: నగర—పట్టణార్పణమందు: గ్రామేషు—గ్రామార్పణమందు: మంత్రార్పణే- మంత్రార్పణమందు: జన్మభే-జన్మనక్షత్రము: జాతేసత్యపి-తెలిసినదైనను: నామర్క్షమేవ-నామనక్షత్రము వల్లనగునదే: ఫలం-ఫలము:స్యాత్-అగును:అనఁగాదీనియందునామనక్షత్రమువల్లనే ఫలము చెప్పవలయుననుట] యస్య-ఎవనికి: జననోడు-జన్మనక్షత్రము: అజ్ఞాతం-తెలియబడదో: తస్య-అతనికి: నామభం-నామనక్షత్రము: ఫలదం-ఫలమిచ్చునది: స్యాత్-అగును [అర్పణముల వదలిన యితర కార్యములయం దనుట] పరేతు-కొందరైతే: నామభం-నామనక్షత్రము: త్రింశద్వత్సరతః-ముప్పదిసంవత్సరముల కంటె: పరం-పిమ్మట, ఫలదం—ఫలమిచ్చునదని: ఆహుః-చెప్పిరి. [అదియుక్తము గాదు యెందువల్లననఁగా ప్రయాణము లేకుండుటచే]

అవ. నామనక్షత్రాదులయందుఁ జేయవలయునవి చెప్పుచున్నాఁడు.

తా॥ యుద్ధము, వర్తకము, గృహము, పురము, గ్రామము, మంత్రము వీనికి నర్వణించుచునపుడు నామనక్షత్రమే ఫలప్రదమగును అర్వణేతరవిషయమందు ముప్పదివత్సరములకుపైన నామనక్షత్రము ఫలప్రదమని కొన్నిగ్రంథములయందు జెప్పబడి యుండినను ప్రయాణముతేమి నది ఫలప్రదము గానేరదని గ్రంథకర్తయభిప్రాయము.

## గృహభూమియొక్క ఫలనిర్ణయము

శ్లో॥ ఈషత్పశ్చిమదక్షిణోన్నతమహీ లక్ష్మీప్రదా నేతరా ।
సమ్యగ్గంధసమన్వితా కనకదా దుర్గంధయుక్తార్తిదా ॥
క్షేత్రం శ్వేత మథాల్పరక్త మఖిలం పీతంచ కృష్ణం క్రమా॥
ద్విప్రాదేర్మధురంభవేచ్చకటుకంతిక్తంకషాయంశుభమ్ ॥

టీక॥ ఈషత్పశ్చిమదక్షిణోన్నతమహీ- ఈషత్-కొంచెము; పశ్చిమదక్షిణ-పడమటదక్షిణభాగములయందు, ఉన్నత - ఎత్తైన, మహీ - భూమి, లక్ష్మీప్రదా-ఐశ్వర్యమునిచ్చునది, ఇతరా-తూర్పుఉత్తరములయెత్తైదక్షిణపశ్చిమముల పల్లమగు భూము, న - లక్ష్మీప్రదముగాదు, సమ్యక్ - బాగుగా, గంధయుతా- సుగంధముల భూమి, కనకదా - బంగారునిచ్చును, దుర్గంధయుక్తాతు — దుర్గంధముగలభూమి, ఆర్తిదా-పీడనిచ్చునది, క్షేత్రం-గృహముకట్టుస్థలము, శ్వేతం—తెల్లనైనది, అథ—పిమ్మట—అల్పరక్తం-కొంచెముయెఱుపుగలది, అఖిలం-సమస్తము:పీతంచ-పచ్చనైనది; కృష్టం-తల్లనైనది; క్రమాత్-క్రమముగా: మధురం-తియ్యనైనది; కటుకం-కారముగలది; తిక్తం-వెకటుగలది; కషాయం-కషాయమనురుచిగలది; విప్రాదేః-బ్రాహ్మణులు మొదలగువారికి:శుభం-యోగ్యమైనది[అనగానివాసమునకుతగినదనుట

అవ. గృహభూమి యొక్క యున్నత రూపగంధ రసములకు ఫలమును జెప్పుచున్నాఁడు.

తా॥ గృహముగట్టెడుభూమి పశ్చిమ దక్షిణభాగములం దించుకమిట్టయియుండిన గృహపతికి భాగ్యముగలుగఁజేయును అటుగాకున్నదరిద్రప్రదమగును; మంచి వాసనతోకూడియుండిన స్వర్ణమునిచ్చు దుర్వాసనాయుక్తమైన పీడాకరమగు తెలుపు వర్ణముగలిగి తియ్యనయియున్న బ్రాహ్మణులకును: ఇంచుకయెఱ్ఱనయి కారముగలదైయున్న రాజులకును: పచ్చనివర్ణముగలిగి చేఁదైయున్న వైశ్యులకును నల్లని వర్ణము గలిగిన యుప్పుగానున్న శూద్రులకును శుభప్రదమగునని తా॥

## పల్లమున జలమునిండించుటకు ఫలనిర్ణయము ౨౩౯

శ్లో॥ ఖాత్వాగర్తమరత్నిమాత్రమథతాంమృత్స్నాంపునః పూరయే

న్యూన్యనాహానికరాసమాతుసమదా వృద్ధిస్తువృద్ధిప్రదా॥
తోయం రాత్రిముఖే ప్రపూర్యఖననే తత్రైవజాత్వామృదం॥
తత్ప్రాతస్సుఖదం జలం త్వవశనం పంకోరజోమృత్యుకృత్।

టీక॥ అరత్నిమాత్రం-యిఱువదినాలుగుయంగుళములుగల,గర్తం-గోతినిఖాత్వా [ఖనిత్వా] త్రివ్వి, తాం—ఆ, మృత్స్నం-మట్టిని: పునః—తిరిగి, పూరయేత్-నింపవలెను ఇట్లుపోయెగా అమట్టి, న్యూనా - తక్కువైనచో, హానికదా - హానిగలుగఁజేయుననుట, సమాతు-సరిపోయినచో, సమదా - సమఫలమిచ్చును, వృద్ధిస్తు [అధికాచేత్] అమృత్తుక ఎక్కువైనచో,వృద్ధిదా-వృద్ధినిచ్చును:ఇంతేగాక,తత్రైవ-అచ్చటనే, ఖననే-గోతియందు, మృదం-మట్టిని, హిత్వా-తీసివేసి, అథ—పిమ్మట, రాత్రిముఖే—సాయంకాలమందు: తోయం-జలమును, ప్రపూర్య—నిండించి,ప్రాతః- ఉదయమున, తత్-ఆజలము, దర్శనీయం చూడతగినది,జలంచేత్—జలమున్నచో:సుఖదం సుఖమునిచ్చును, పంకోయది—బురదైనచో,అనశనం-దారిద్ర్యముకలుగును,రజశ్చేత్ దుమ్ముకలిగిన, మృత్యుకృత్-మరణముచేయునది: భవేత్ — అగును — గృహాధిపతి నట్లు కలుగఁజేయుననుట

అవ॥ పల్లమున మృజ్జలములనిండించుటకు ఫలమును జెప్పుచున్నాఁడు

తా॥ పిడితక్కువమూరెడుపల్లమును త్రివ్వి యాపల్లమునుదానిమట్టిచేపూడ్చిన మన్నుతక్కువ యయ్యెనేని కీడుగలుగఁజేయును సరియైనసమఫలమునిచ్చునుఅధికమయ్యేనేని వృద్ధినిగలుగఁజేయునుఆపల్లముననేముందునాటిసాయంకాలమునజలముపోసి మఱునాఁడుదయమునఁజూడగా నుదకముండెనేని సుఖప్రదమగును నడుసుగానుండినఁనన్నము బెల్లముగఁజేయును దుమ్ముగానుండిన మృత్యుప్రదమగునని తా॥

జలగతికూపఖననములకు దిఙ్నిర్ణయము ౨౮౦

శ్లో॥ అన్యక్షేత్రజలం స్వధామగమనం హానిశ్చకోలాహలః।
ప్రాగీశాన్యకుబేరదేశగళితం స్వక్షేత్రతోయం శుభమ్।
సౌమ్యప్రాగ్జలధీశకూపఖననం కర్తుశ్చ లక్ష్మీప్రదం।
పాషాణాధి లభే త్సుఖంచ ఖననె స్యాత్తస్థిలాభోమృతిః॥

టీక॥ అన్యక్షేత్రజలం-ఇతరులస్థలమునుండి నీరు:స్వధామ-తనస్థలమునుండి గమనం-వెళ్ళుట: హానిః—అశుభమును: కోలాహలంచ—యుద్ధమునుస్యాత్-అగును స్వక్షేత్రతోయం-తనస్థలమునుండి ఉదకము: ప్రాక్—తూర్పుకు: ఈశాన్య-ఈశాన్యదిక్కుకు: కుబేరదేశ—ఉత్తరదిక్కుకు: గళితం-ప్రవహించినదై:శుభం- మంచిదగు

యితరదిక్కులకుప్రవహించిన మంచిదిగాదనుట) సౌమ్యఉత్తరదిక్కునందు,ప్రాక్ పూర్వదిక్కునందు, జలధీశ-పడమటదిక్కునందు, కూపఖననం-నూతిని త్రవ్వుట కర్తుః—గృహాధిపునకు,లక్ష్మీప్రదం—లక్ష్మినిగలుగఁజేయునుఃఖననేత్రవ్వుకాలమందు పాషాణాది—రాళ్లమొదలైనవి, లభేశ్చేత్—దొరకినచో, శుభం—మంచిది, అస్థిలాభో యది—యెముకలుదొరికిన, మృతిః-మరణముః భవేత్-కలుగును.

అవ॥ ఉదకము బైటపోవుటకు బావిత్రొవ్వుటకునుదిఙ్నిర్ణయమును జెప్పుచున్నాఁడు

తా॥ ఇతరులయింటి యుదకము తమయింటికివచ్చునటులనుండెనేనిహానియు గలహముఁగలుగును తమయింటినీళ్ళు ప్రాగీశాన్యకుబేరదిక్కులకు పోవుటశుభకర మగును తనయింటికి ప్రాక్పశ్చిమోత్తరదిక్కులయందు బావి త్రవ్వితేనిగృహపతికి లక్ష్మీకరంబగు నట్లు త్రవ్వఁబడిన బావియందు పాషాణాదులుండెనేని శుభమగు నెముకలుండెనేని మృత్యుప్రదమగునని తా॥

గృహకర్ణికాచక్రలక్షణము ౨౭౧

శ్లో॥ చక్రం స్యాద్గృహకర్ణికాహ్వయమిదం సంలిఖ్యలింగత్రయం
రేఖా స్తత్ర చతస్రఏవ విలిఖేత్తిర్యక్చ దస్రాదికః ।
ఏకైక స్యహి తారకా నవనవ ప్రాగ్లింగవామాధరా ।
దూర్ధ్వస్థా అపిచోర్ధ్వగా శ్శుభఫలా నింద్యా స్త్వధో దేశగాః॥

టీక॥ లింగత్రయం—లింగాకారమగు మూడురేఖలను, సంలిఖ్య-వ్రాసితత్ర అలింగత్రయమందుః చతస్రః—నాలుగు, రేఖాః-రేఖలను, తిర్యక్—అడ్డముగా, విలిఖేద్యది-వ్రాసినచో, ఇదమేవ - యినే, గృహకర్ణికాహ్వయం - గృహకర్ణికయను పేరుగల, చక్రం-చక్రము, స్యాత్ - అగును, ప్రాగ్లి గవామాథరాత్ - ప్రాక్ - ముందుగాః లింగ-లింగములయొక్క, వామ—వామభాగమందు, అథరాత్-అధోభాగ మునుండి, ఏకైకస్య ఒక్కొక్కలింగమునకు,దస్రాదికః-అశ్విని మొదలుగానవనవ తొమ్మిదితొమ్మిది తారకాః-నక్షత్రములు, భవంతి - అగుచున్నది. ఊర్ధ్వస్థాఅపి - పైభాగమందున్న నైనముఃఊర్ధ్వగాః-పైగానున్నవి,శుభఫలాః-మంచిఫలమునిచ్చునవి అధోదేశగాః—క్రిందిభాగమందుంతునవి, నింద్యాః-అశుభఫలమిచ్చునవి

అవ॥ గృహకర్ణికాచక్రలక్షణమును జెప్పుచున్నాఁడు

తా॥ విడుపుగ మూఁడు లింగాకారరేఖలు వ్రాసి దానిపైనాలు గడ్డదిట్లు గీచి యందునెడమప్రక్కనున్న లింగమునకెడమపార్శ్వమునమున్న క్రిందియడ్డగీటు మొద

లొక్కొక్కగీతకునశ్వనిమొదలొక్కొక్కనక్షత్రమువరుస వ్రాయవలయుమనవఁగా లింగమునకు నెడమప్రక్క ౪ నక్షత్రములు; శిరస్సున ౧కుడిప్రక్క౪నక్షత్రము లిరీతునప్రతిలింగమునకువ్రాయగానన్నిలింగములశిరంబున నున్న నక్షత్రములయెడమ ప్రక్కనున్న ౪ నక్షత్రములు స్తంభప్రతిష్ఠ మొదలగుకార్యముల విషయమై శుభ కరంబులగు లింగమునకుఁగుడిప్రక్కనున్న నక్షత్రములశుభకరఁబులగునమటఅశ్వి న్యాదినక్షత్రములలో నీచక్రమందు శ్రేష్ఠములుగా నేర్పడెడు నక్షత్రముల దెలుసు కొనుటకు నాయానక్షత్రజ్ఞాపకంబులగుసంఖ్యలువ్రాయఁబడియున్నవి౧౨:౩:౪:౫, ౧౦:౧౧:౧౨:౧౩:౧౪:౧౯:౨౦:౨౧:౨౨,౨౩( ఈ సంఖ్యగల నక్షత్రములు శుభకరములు.

శ్లో॥ రేఖాయాంచ తిరశ్చితత్ర గృహిణః స్తంభప్రతిష్ఠాగమే ।
సూర్యేణాగ్నిభయంకుజేనసహితో మృత్యుంబుధేనామయమ్।
దౌర్భాగ్యం గురుణా సితేన కలహం మందేన చోరాగమం ।
దారిద్ర్యం తమసాధ్వజేనచలనం కుర్యాచ్ఛశీతద్గృహే॥౨౮॥

టీక॥ శశీ-చంద్రుఁడు; స్తంభప్రతిష్ఠాగమే - స్తంభప్రతిష్ఠాకాలమందు తిరశ్చ-అడ్డముగానున్న; రేఖాయాం-గీటుయందు సూర్యేణ - సూర్యునితో; సహితో యది-కూడినచో; తద్గృహే-ఆగృహమందున్న; గృహిణః - గృహయజమానునికి; తత్ర-అప్పుడు; అగ్నిభయం-అగ్నిభయముకలుగును; కుజేన—కుజునితోఁగూడినచో మృత్యుం—మరణభయమగును. బుధేన-బుధునితోగూడిన; ఆమయం-రోగభయమ గును. గురుణా - బృహస్పతితోచేరిన; దౌర్భాగ్యం - దౌర్భాగ్యమగును; సితేన - శుక్రునితోచేరిన; కలహం-పోట్లాటకలుగును. మందేన-శనితోచేరిన; చోరాగమం. దొంగలబాధకలుగును; తమసా - రాహువుతోచేరిన; దారిద్ర్యం - దారిద్ర్యమును చేయును. ధ్వజేన కేతుతోచేరిన; చలం - స్థానచలమును; కుర్యాత్ - చేయును

అవ॥ స్తంభ ప్రతిష్ఠా కాలమునుగృహకర్ణికాచక్రమందుచంద్రుఁడున్ననక్షత్రము తిర్యగ్రేఖయందుజేరియానక్షత్రముగాని ఆతిర్యగ్రేఖయందుగల యితరనక్షత్రముల యందుగాని; సూర్యుఁడుమొదలగుగ్రహంబులుండునేనివానికిఫలముజెప్పుచున్నాఁడు

తా॥ చంద్రునితోడ సూర్యుఁడు; కుజుఁడు; బుధుఁడు; గురువు- శుక్రుఁడు శని రాహువు కేతువు వీరలు చేరిరేని వరుసగా అగ్ని మృత్యురోగదారిద్ర్య కలహ చోరదారిద్ర్యస్థానచలన భయంబులు గలుగుఁగాన చంద్రునితో నేగ్రహంబునుఁజేరి యుండఁగూడదని తా॥

## క్షేత్రమునకు నవవర్గగణితక్రమము

శ్లో॥ ఆయామేన విశాలమేవ గుణయేత్ క్షేత్రీకృతం యత్పదం।
నాగాస్సైః స్వమృణంభవేత్త్రికరిభిర్నాగరోఽఙ్క్రా శ్చైలైర్దినమ్॥
షట్త్రింశేనభమష్టభైర్నవగజైరాయోఽఙ్కభాస్కైర్వయ।
స్వాంశః షణ్ణవభిః సదేవ విభజేదాయుర్గజైర్దిక్పతిః॥

టీక॥ ఆయామేన—యింటిపొడుగుచేత; విశాలం-గృహభూమియొక్క వెడల్పు గుణయేత్-గుణించవలయును. యత్-యేది; క్షేత్రీకృతం - క్షేత్రమై చేయబడినదో; తత్-అది; పదం-పదమనఁబడును; తత్పదం-ఆపదమును: నాగాస్సైః-నాగ- యెని మిదింటగుణించి: అస్సైః-పండ్రెండింటభాగహరించిన; స్వం ధనము: త్రికరిభిః త్రి-మూటగుణించి, కరిభిః-ఎనిమిదింట విభజించిన మిగిలినది ఋణం-ఋణసంజ్ఞ యగును; అంకశ్శైలైః - అంక-తొమ్మిదిచేగుణించి; శైలైః- యేడింటభాగించఁగా వారః-వారముకలుగును; షట్త్రింశేన-షట్-ఆఱింటగుణించి; త్రింశేన-ముప్పదిచే భాగహరించిన; దినం.దినమగును; అష్టభైఃఅష్ట-యెనిమిదింటగుణించి భైః- ఇఱు వదియేడింట భాగించిన భం నక్షత్రమగును నవగజైః-నవ - తొమ్మిదిచేగుణించి గజైః-యెనిమిదిచేభాగహరించిన;ఆయః-ఆయమగును;అంకభాస్కైః-అంక-తొమ్మి దిచేగుణించి భాస్కైః-౧౨౦ చే భాగహరించిన; వయః-వయస్సగును. షణ్ణవభిః షట్-ఆఱింటగుణించి: నవభిః-తొమ్మిదిచేభాగించిన; అంశః- అంశమగునుతదేవ - యిదివరకువచ్చిన; •ఆయుః-ఆయుర్దాయమును గజైః - యేనిమిదింట భాగించిన దిక్పతిః-దిగీశుఁడగును

అవ॥ గృహము కట్టెడు స్థలములకు ధనము; ఋణము; వారము;దినమునక్ష త్రము; ఆయము; ఆయుస్సు-అంశము దిక్పతులనెడునవవర్గగణితక్రమమునుజెప్పు చున్నాఁడు

తా॥ గృహముఁకట్టుడు ప్రవేశముయొక్క నిడుపునుకొలిచి ఏర్పడినసంఖ్యచే వెడల్పునసంఖ్యను గుణింప నాసంఖ్యకుక్షేత్రీకృతపదమునామంబగు;నట్టిక్షేత్రీకృత పదసంఖ్యనుముందువ్రాయఁగలసంఖ్యలచేఁదొమ్మిదిమారులుగుణించితొమ్మిదిమారులు భాగహరింపగా మిగిలినసంఖ్యలుముందుజెపిన ధన ఋణాదివర్గులగునట్లువర్గజ్ఞాప కములకై పైనవ్రాయబోవు సంఖ్యలలో మొదటియంకె గుణకమనియు రెండవ యంకెహరణమనియు దెలిసికొన గుణించిరేని నవవర్గగణితమేర్పడును.

## గణితక్రమం

| గుణకం | భాగం | పేరు | గుణకం | భాగం | పేరు |
|---|---|---|---|---|---|
| ౮ | ౧౨ | ధనం | ౯ | ౮ | ఆయం |
| ౩ | ౮ | ఋణం | ౯ | ౧౨౦ | వయస్సు |
| ౯ | ౭ | వారం | ౬ | ౯ | అంశ |
| ౬ | ౩౦ | తిథి | ౯ | ౮ | దిక్పతి |
| ౮ | ౨౭ | నక్షత్రం | ... | ... | ... |

### ధనఋణాదులకు ఫలనిర్ణయము    శ్లో॥ ౨౮౮

శ్లో॥ క్షేత్రే పూర్వపదం పునశ్చగుణయేన్నాగాదివాక్యాద్యయా
తద్వాక్యాంతిమసంఖ్యయైన విభజేద్ధ్రవ్యాది శేషైర్లభేత్ ।
కర్తుశ్చే దధికం ధనం శుభ మృణా ద్వర్ద్యల్ప మర్థో ఽశుభం
యద్యాయో విషమ శ్శుభ శ్శుభఫలావారాశ్శుభానాంయది

టీక॥ క్షేత్రే-గృహముకట్టుభూమియందు, పూర్వపదం-ఆయామమచేవిశాలమునుగుణించగా వచ్చినపదమును, నాగాదివాక్యాద్యయా-నాగాదివాక్యములయందు మొదటిదగు, సంఖ్యయా-సంఖ్యచేత, పునశ్చ-తిరిగి, గుణయేత్-గుణించవలయును తద్వాక్యాంతిమసంఖ్యయా- తత్- ఆ, వాక్య - నాగాదివాక్యములయొక్క, అంతిమ సంఖ్యయా-ఆఖరుసంఖ్యచేత, విభజేత్-భాగించవలయును, [అనఁగా పూర్వపదము నష్టయెనిమదిచేగుణించి పండ్రెండింటగుణించవలయును] శేషై-మిగులుచేత, ద్రవ్యాది-ధనఋణములు, లభేత్-తెలియును, అధికంచేత్-అధికమైనచో, కర్తుః-గృహముకట్టువానికి, శుభం-మంచిది, ఋణాత్-ఋణముకంటె, అర్థః-ధనము, అల్పం-యదితక్కువైనచో, అశుభం-మంచిదికాదు, ఆయః-ఆయము, విషమశ్చేత్-విషమమైనచో, శుభః-మంచిది [సమమైనచోమంచిదికాదమట] శుభానాం-శుభులయొక్క-వారాః-వారములు, శుభఫలాః-మంచిఫలముగలవి.

అవ. పూర్వశ్లోకమునఁజెప్పిన ధన ఋణాదులకు ఫలమును జెప్పుచున్నాఁడు

తా॥ ఉక్తక్రమంబుగ గుణకభాగహారములఁజూడగ ధనసంఖ్య ఋణసంఖ్య కంటె నెక్కువాయెనేని గృహపతికిశుభమగు తక్కువాయెనేని యశుభమగు ఆయ సంఖ్య బేసిగనున్న శుభమగు శుభకరంబులగునవి తా॥

### గృహనక్షత్రఫలనిర్ణయము

శ్లో॥ ఆత్మర్క్షాద్గృహభాంతమేవ గుణయే ద్వద్వచ్చ తారాబలం।

చాత్మర్‌క్షం గృహాభం యదేకమశుభం తార్తీయభం స్వక్షయః
దుఃఖం స్యాద్యది పంచమం నిధనదం కర్తుర్భవే త్సప్తమం ॥
క్షేత్రే పుత్రికరా స్సరా గృహపతేరేవేతరాస్తారకాః ॥

టీక॥ తారాబలం-తారాబలము, యద్వత్-యెట్లుగానో, ఆత్మర్‌క్షాత్ - తనజన్మనక్షత్రముమొదలు, గృహభాంతమేవ-యింటినక్షత్రమువరకు,గుణయేత్-లెక్కించవలయును, ఏవం-అట్లులెక్కపెట్టగా, ఆత్మర్‌క్షం-తననక్షత్రము, గృహాభం-గృహనక్షత్రము, ఏకంయది-ఒక్కటైనచో, అశుభం-గృహముకట్టువానికి మంచిదికాదు, తార్తీయభం-మూడవ నక్షత్రమైనచో, స్వక్షయః- గృహపతికి నాశనముగలుగును, పంచమంయది - ఐదవదైన దుఃఖము, స్యాత్ - కలుగును, సప్తమంచేత్ -ఏడవదైనచో, కర్తుః-గృహకర్తకు, నిధనదం - మరణప్రదమగును, ఇతరాః-మిగిలిన, తారకాః-నక్షత్రములు, క్షేత్రే-గృహభూమయందు, గృహపతేః - యిల్లుకట్టువానికి పుత్రికరాః-సంతానముగలుగ జేయునది.

అవ. ఉక్తగణితక్రమంబున వచ్చిన గృహనక్షత్రఫలమునుజెప్పుచున్నాడు

తా॥ తనజన్మనక్షత్రము మొదలు గృహనక్షత్రము వరకు లెక్కపెట్టి యా సంఖ్యను ౯ చే భాగహరింపఁగాఁ తన నక్షత్రము గృహనక్షత్రముమేకమాయెనేని యశుభకరంబనియు, జన్మనక్షత్రమునకు గృహనక్షత్రము మూఁడవది, ఐదవది, ఏడవది యాయెనేని వరుసగా నాశనము, దుఃఖము, మరణము గలుగును. రెండు నాలుగు, ఆరు, ఎనిమిది, తొమ్మిది సంఖ్యలదైన క్షేమపుత్రికరంబులనియును తా॥

గృహారాశ్యంతగణనపు ఫలనిర్ణయము

శ్లో॥ రాశ్యంతం గణయే ద్గృహస్యగృహిణో రాశ్యాదితత్తత్ఫలం
నిస్సంతానకరం త్రికోణ నిలయం ద్వి ర్ద్వాదశోఽనర్థకృత్
షష్ఠాష్టాఖ్యగృహం సదా కలహదం చాన్యేశుభా రాశయో।
దంపత్యోరపి యత్ఫలం పఠణయే త్కర్తృగృహే తత్ఫలమ్ ॥

టీక॥ గృహిణః-గృహయజమానియొక్క, రాశ్యాది-జన్మరాశిమొదలు,గృహస్య-యింటియొక్క, రాశ్యంతం-రాశివరకు, గణయేత్-లెక్కించవలయును, ఏవంచ ఇట్లులెక్కించగా, తత్తత్ఫలం-ఆయాఫలము, భవేత్-కలుగును, త్రికోణనిలయం-గృహస్థుకయిదుతొమ్మిదియైన, నిస్సంతానకరం - సంతానములేకుండచేయును, ద్విః-రెండవది, ద్వాదశ-పండ్రెండవది, అనర్థకృత్-అనర్థమునుచేయును, షష్ఠాష్టా

ఖ్యగృహ-అరవ యెనిమిదవగృహము, కలహదం - కలహమునుచేయును, అన్యే-మిగతరాసులు, శుభాః-మంచిది, పతిణయె-వివాహమందు, దంపత్యోరపి-దంపతుల కున్న, యద్యత్ఫలం-ఏయేఫలము, తత్ఫలం-ఆఫలము, కర్తుః-గృహముకట్టువానికి భవేత్-కలుగును.

అవ. గృహరాశ్యంత గణనకుఫలమును జెప్పుచున్నాఁడు.

తా॥ యజమానునియొక్క జన్మరాశిమొదలు గృహరాశివరకు గణనచేయఁగా గృహపతిరాశికి గృహరాశి అయిదవది, తొమ్మిదవదిగానున్న నిస్సంతానకరం బగు ౨వది, ౧౨వదిగానున్న పీడాకరంబగు; ౬వది; ౮వదిగానున్న కలహప్రదమగును శేషంబులు శుభకరంబులగు మఱియు వివాహవిషయమై దంపతులకు జెప్పఁబడి యున్న ఫలంబులన్నియు నిచ్చట గృహవిషయమై యూహ్యంబులనియును తా॥

శ్లో॥ రిక్తా శూన్యకరా అమా నిధనదా మాసాది రార్తిప్రదా।
తచ్ఛేషా స్తిథయ శ్శుభా గృహపతే రంశస్య చేదంఫలమ్।
నాశో వృద్ధికర శ్శుభశ్చ నిలయే దాహో మృతిస్తస్కరః।
పుత్రో గోధనమిష్టపుష్టిరనిశం గేహే నవాంశాఃక్రమాత్ ॥

టీక॥ రిక్తాః - రిక్తతిధులు; శూన్యకరాః-నాశనముచేయునవి; అమా-అమావాస్య; నిధనదా-మరణప్రదము; మసాదిః-శుక్లపాడ్యమి; ఆర్తిప్రదా - పీడమచేయును; తచ్ఛేషాః-మిగిలినతిధులు; గృహపతేః-గృహయజమానునికి; శుభాః-శుభకరములు; అంశస్య-అంశకు; ఇదం-చెప్పబోవు; ఫలం-ఫలముకలుగును; గృహే-గృహవిషయమై; నాశః-మొదటినవాంశఫలమునాశనము; వృద్ధికరః-రెండవదానికి వృద్ధికలుగును; శుభః-మూడవదిశుభకరము; దాహః - నాల్గవది దాహఫలమిచ్చును; మృతిః-ఐదవదిమృతికరము; తస్కరః-అరవదిచోరభయప్రదము; పుత్రః-యేడవది పుత్రప్రదము; గోధనం-ఎనిమిదవదిగోధనప్రదము; ఇష్టపుష్టిః-తొమ్మిదవది ఇష్టపుష్టినిజేయును; నవాంశాః - నవాంశలు; క్రమాత్ - క్రమముగా చెప్పబడిన ఫలములనిచ్చును.

అవ. పూర్వోక్తగణితక్రమమునవేర్పబడిన దివసమునకునుఅంశమునకును ఫలములఁ జెప్పుచున్నాఁడు.

తా॥ గణితము చేయఁగా శుక్లపాడ్యమియైన గృహపతికి నాశము రిక్తతిధులైన మరణము అమావాస్యయైన పీడయుఁగలుగుననియు మఱియు గృహపతినవాంశమునకు గృహనవాంశము మొదటిగానున్నయశుభకరంబును౨వదిగానున్నవృద్ధియు

౩ వదిగానున్న సంపదయు, ౪ వదిగానున్న గృహదహనము, ౫ వదిగానున్న మరణము, ౬ వదిగానున్న చోరభయము, ౭ వదిగానున్న పుత్రప్రదము, ౮ వది గానున్న పశు ధనప్రదము, ౯ వదిగానున్న నిష్టసిద్ధికరంబగునని తా॥

అయుర్దిక్పతులకు ఫలనిర్ణయము

శ్లో॥ ఆయు ష్షష్ట్యధికం శుభం గృహపతేర్హీనంతు హానిప్రదం।
సౌభాగ్యంసుర రాడ్గృహస్యదహనం వహ్నౌర్యమోఽమంగళమ్
రక్షశ్శత్రుభయం పశు జలపతిః కుర్యాన్మరుచ్చంచలం।
ధాన్యం యక్షపతి శ్శివ శ్శివమిదం స్యాద్దిక్పతీనాంఫలమ్ ॥

టీక॥ ఆయుః- గణితమువల్లవచ్చిన ఆయుర్దాయము, షష్ట్యధికం-అఱువది కధికమైనచో, గృహపతేః-యజమానికి, శుభం-మంగళప్రదమగును, హీనం-అఱు వదికి తక్కువైనచో, హానిప్రదం-హానికలుగచేయును, సురరాట్-ఇంద్రుడైనచో, గృహస్య-యింటికి, సౌభాగ్యం-మంగళప్రదమగును, వహ్నిః-అగ్నిహోత్రుడైన, దహనం-గృహదహనమగును, యమః-యముడైనచో, అమంగళం-అశుభము కలుగును, రక్షః-నైర్‌ఋతియైనచో, శత్రుభయం-శత్రుభయముకలుగును, జలపతిః -వరుణుడైనచో, పశుం - గోలాభమునుచేయును, మరుత్- వాయువు, చంచలం- స్థానచలనముచేయును, యక్షపతిః- కుబేరుడు, ధాన్యం - ధాన్యలాభముచేయును, శివః-ఈశాన్యుడు, శివం-మంగళమును, కుర్యాః-చేయును, ఇదమేవ-ఇదే: దిక్పతీ నాం-దిక్పాలకులకు: ఫలం-ఫలము: స్యాత్-కలుగును.

అవ. ఆయుర్దిక్పతులకు ఫలములఁజెప్పుచున్నాఁడు.

గణితముఁజేయనేర్పడిన ఆయువుయొక్క సంఖ్య ౬౦ యింటికి హెచ్చుగా నుండునేని గృహపతికి శుభకరంబగును: ౬౦ యింటికి తక్కువగానుండెనేని హాని కరంబగు గణితమువలన నేర్పడిన ఇంద్రాద్యష్టదిక్పతుల వరుసగా సౌభాగ్యము గృహదహనము: అశుభము: శత్రుభయము;పశులాభము: స్థానచలనము: ధాన్యము శుభము ఈయష్టవిధ ఫలములఁగలుగఁజేయుదురని తా॥

చైత్రాదిద్వాదశమాసములకు ఫలనిర్ణయము శ్లో॥ ౨౪౯

శ్లో॥ చైత్రాద్యాః క్రమశ శ్శుభంబహుధనంమృత్యుంచగోనాశనం
గోలాభం సుతనాశనం త్వనశనం సంపూర్ణసౌఖ్యం సదా ।
ధాన్యం వహ్నిభయం జయం బహుసుఖం స్తంభప్రతిష్ఠాగమే
కుర్యుస్సద్గృహిణశ్శుభోఽప్యశుభకృన్మాసోమలాఖ్యోయది ॥

టీక॥ చైత్రాద్యాః-చైత్రమాసము మొదలు మాసములు, స్తంభప్రతిష్ఠాగమే స్తంభప్రతిష్ఠాకాలమందు, క్రమశ-వరుసగా, తద్గృహిణః-అగృహస్థునకు, శుభం - శుభమును, బహుధనం—మిక్కిలిధనమును, మృత్యుంచ-మరణమును, గోనాశనం - గోనాశనమును, గోలాభం—గోలాభమును, సుతనాశనం-సుతనాశనమును,అనశనం-అనశనమును, సంపూర్ణసౌఖ్యం-పూర్ణసౌఖ్యమును, ధాన్యం — దాన్యమును, వహ్నిభయం—అగ్నిభయమును, జయం జయమును,బహుసుఖం మిక్కిలిసుఖమునుకుర్యు చేయుచున్నవి, శుభః-శుభమైన, మలాఖ్యః-మలమనుపేరుగల: మాసః-మాసము, అన్య గృహస్థునకు, శుభకృత్ - శుభముకలుగచేయును.

అవ॥ చైత్రాది ద్వాదశమాసములకు ఫలములఁ జెప్పుచున్నారు

తా॥ చైత్రమాసము మొదలు ఫాల్గునమాసమువఱకు ౧౨మాసములలోగృహమునకు స్తంభప్రతిష్ఠ జేసిరేనిక్రమముగ శుభముఅధికధనముమరణముపశునాశము పశులాభము పుత్రనాశము అశనాభావము సంపూర్ణసుఖము ధాన్యము,అగ్నిభయము జయము, బహుసౌఖ్యము ఈ ద్వాదశవిధఫలములుఁగలుగుననియుఈమాసములో శుభకరంబైన మాసమధికమాసముగానుండెనేని నదియు నశుభకరంబని తా॥

చరరాశ్యాదిగతసూర్య ఫలనిర్ణయము ౨౫౦

శ్లో॥ తిగ్మాంశు శ్చరరాశిగః స్థిరగతో వాప్యర్థకృత్సర్వదా ।
మృత్యు స్స్యాద్ద్విశరీరగో గృహపతేః స్తంభప్రతిష్ఠాగమే ।
వారా వారదినేశయో రనలదా క్షీణ శ్శశి శోకకృ
త్పూర్ణః పుత్రకృదర్థదా గురుభృగూజ్ఞః స్థైర్యకృద్భానుజః ॥

టీక॥ తిగ్మాంశుః-సూర్యుఁడు, చరరాశిగః — చరరాశినిపొందినవాఁడగుచు, స్థిరరాశిగోవా-స్థిరరాశినిపొందినవాఁడైన, సర్వదా-యెల్లప్పుడు, అర్థకృత్ — ధనకారకుఁడు, భవతి—అగుచున్నాఁడు, స్తంభప్రతిష్ఠాగమే— స్తంభప్రతిష్ఠాకాలమందుద్విశరీరిగః-ద్విస్వభావరాశినిపొందినచో, గృహపతేః-గృహయజమానికి, మృత్యుః-మరణము, స్యాత్—అగును. ఆరదినేశయోః- అంగారకసూర్యులయొక్క, వారౌ— వారములు అనలదౌ-అగ్నిచేదహింపచేయునవి,[అనఁగాగృహముదగ్ధమగుననుట]క్షీణః క్షీణుఁడైన; శశీ—చంద్రుఁడు: (సోమవారము) శోకకృత్—దుఃఖముచేయును.పూర్ణః పూర్ణుఁడగు శశీ-చంద్రుఁడు; పుత్రకృత్-పుత్రప్రదుఁడు; గురుభృగూ- గురుశుక్రవారములు; అర్థదౌ-సంపత్కరములు, జ్ఞః—బుధవారము; భానుజః శనివారమున్ను, స్థైర్యకృత్—స్థితినిచేయును, [అనఁగా గృహమునందు చిరకాలముండుదురనుట]

అవ॥ చరరాశ్యాదిగతసూర్యఫలమును జెప్పుచున్నారు

తా॥ గృహమునకు స్తంభప్రతిష్ఠజేయుసమయమున సూర్యుఁడుచరస్థిరనామాంకితములగు లగ్నములయందున్నధనప్రదుఁడగుద్విస్వభావలగ్నగతుడై యున్నగృహపతికి మృత్యుకరుఁడగు,భాన్వంగారకవారములయందు స్తంభప్రతిష్ఠచేయఁబడినగృహమగ్ని దగ్ధమగు, క్షీరచంద్రవారము దుఃఖప్రదమగుపూర్ణేందువాతముసుపుత్రప్రదమగు, గురుభృగువారములు సంపత్కరంబులగు బుధశనివారములుస్థిరకరంబగును.

లగ్నఫలనిర్ణయము ౨౫౧

శ్లో॥ సూర్యాంగారకలగ్నవర్గరహితం సర్వం స్థిరం శోభనం ।
లగ్నం వా ద్విశరీర మత్ర గృహిణో లగ్నంచరంచంచలమ్
సూర్యాంగారకలగ్న మప్యథశుభంసౌమ్యగ్రహైస్సంయుతం
సౌమ్యైర్వాయది వీక్షితంసుబలిభిఃకూరైరా త్రిషష్ఠాయగా,

టీక॥ సూర్యాంగారకలగ్నావర్గరహితం-సూర్యాంగారక—సూర్యకుజులయొక్క-లగ్న-లగ్నముయొక్క, వర్గ - షడ్వర్గములతో, రహితం — శూన్యమైన, సర్వం సమస్తమైన, స్థిరం-స్థిరలగ్నములు,శోభనం-మంచిది;ద్విశరీరం-ద్విస్వభావలగ్నము గృహిణః-గృహస్థునికి, అత్ర-ఈ స్తంభప్రతిష్ఠయందు మంచిది, చరం—చరమగు, లగ్నం—లగ్నము, చంచలం-చలనమునుచేయునది, అథ, లేక, సూర్యాంగారకలగ్నమపి సూర్యకుజులలగ్నమున్నూ, సౌమ్యగ్రహైఃశుభగ్రహములతో, సంయుతం — కూడినదగుహూ, మంచిది,సుబలిభిః—మంచిబలముగల,సౌమ్యైః— శుభగ్రహములతో వీక్షితం-చూడఁబడినను, క్రూరాః - పాపగ్రహములు త్రిషషాయగాః - మూట, ఆఱింట, పదునొకొండింట నుంచినను మంచిది.

అవ॥ లగ్నఫలములఁ జెప్పుచున్నాఁడు

తా॥ సింహవృశ్చికలగ్నములును వానిషడ్వర్గములుగాక తక్కిన స్థిరలగ్నములును ద్విస్వభావలగ్నంబులును స్తంభప్రతిష్ఠకు శుభకరంబులగును,చరలగ్నము చాంచల్యమునిచ్చు,మఱియునిషిద్ధములైనసింహవృశ్చికములుశుభగ్రహయుక్తములై యున్నను అధికబలయుక్తములగు శుభగ్రహములచేజూడఁబడుచున్ననుపాపగ్రహములు ౩,౬,౧౧ ఈస్థానములయందుండినపు డీలగ్నములు శుభకరంబులగును.

నక్షత్రతిర్యగధఊర్ధ్వముఖత్వములు

శ్లో॥ పౌష్ణాశ్వ్యర్కకరత్రయాద్యశశభృన్మిత్రద్వయాఖ్యాశ్శుభాః ।
[illegible] తారకా గ హావిధా ముఖాంశ వాధోముఖాః

కూపాదౌతు పిత్రుద్విదైవదనుజాహ్యగ్నిత్రిపూర్వాంతకా ,
శ్శేషాస్తూర్ధ్వముఖాభిధానవశుభా వృక్షాదిసంస్థాపనే॥ ౨౫౨

టీక॥ పౌష్ణాదిత్యకరత్రియాద్యశశభృన్మిత్రద్వయాఖ్యాః-పౌష్ణ - రేవతియు, ఆదిత్య-పునర్వసు, కర-హస్తయు; త్రియ-చిత్తస్వాతులును; ఆద్య — అశ్వినియు శశభృత్—మృగశిరయు; మిత్రద్వయ—అనూరాధ జ్యేష్టలును; ఆఖ్యాః- పేరుగాగల నక్షత్రములు, నవ—తొమ్మిదియు, తిర్యఙ్ముఖతారకాః తిర్యఙ్ముఖములను పేరుగలవి. గృహవిధౌ- స్తంభప్రతిష్టయందు, శుభాః-మంచిది, స్యుః-అగును, పిత్రుద్విదైవ, దనుజాహ్యగ్నిత్రిపూర్వాంతకాః—పిత్రు-మఖయు; ద్విదైవ-విశాఖయు; దనుజ — మూలయు. అహి—ఆశ్లేషయు; అగ్ని-కృత్తికయు; త్రిపూర్వ-పూర్వఫల్గుని పూర్వాషాఢ పూర్వాభాద్రలును; అంతకాః-భరణియు; నవ-తొమ్మిదినక్షత్రములు; అధోముఖాః-అధోముఖముగలవి; కుపాదౌ-కూపవాపీతటాకాదిఖననకర్మలయందు;సదా - ఎల్లప్పుడు; ముఖ్యాః ప్రధానములు;శేషాస్తు-మిగిలినపుష్యార్ద్రాశ్రవణోత్తరాషాఢోత్తరాభాద్రాశతభిషగ్రోహిణీ ధనిష్టానక్షత్రములుతొమ్మిదియు; ఊర్ధ్వముఖాభిధాః — ఊర్ధ్వముఖముగలవి వృక్షాదిసంస్థాపనే - వృక్షాదులనాటుటయందు, శుభాః—మంచివి.

అవ॥ నక్షత్రములకు తిర్యఙ్ముఖాధోముఖోర్ధ్వముఖత్వములను వానికి ఫలములను జెప్పుచున్నారు.

తా॥ అశ్వనిమొదలు రేవతివరకు; నిరువదియేడునక్షత్రముల దెలుసుకొనుట కీక్రింద వ్రాయఁబడియున్న నక్షత్రజ్ఞాపకంబులగు సంఖ్యలచేతనాసంఖ్యావాచ్యనక్షత్రములఁ దెలుసుకొనవలయును. నక్షత్రజ్ఞాపకంబులగు సంఖ్యలు ౧; ౫; ౭; ౧౩ ౧౪;౧౫;౧౭;౧౮;౨౭ ఈ సంఖ్యావాచ్యంబులగు తిర్యఙ్ముఖనక్షత్రములు స్తంభప్రతిష్ఠకు శుభకరంబులనియు ౨; ౩; ౯; ౧౦; ౧౧; ౧౬; ౧౯; ౨౦; ౨౫; ఉపసంఖ్యావాచ్యంబులగు నధోముఖనక్షత్రములు బావులు; గుంటలు;చెఱువులుమొదలైనవాటిని త్రవ్వుటకు శ్రేష్టములనియు ౪; ౬; ౮; ౧౨; ౨౧; ౨౨; ౨౩. ౨౪ ౨౬ ఈ సంఖ్యావాచ్యంబులగు నూర్ధ్వముఖనక్షత్రములు ౯ న్ని వనములు పైరులు మొదలైనవాటిని స్థాపించునెడల శుభకరంబులగునని తా॥

## స్తంభప్రతిష్ఠకు నక్షత్రఫలనిర్ణయము ౨౫౩

శ్లో॥ నాసత్యాదితి రేవతీకరగురుశ్రోత్రత్రయేంద్వుత్తరా ।
మిత్రేశ్వష్ట్రవిధాత్రుభేషు సుతదా స్తంభప్రతిష్ఠార్థదా ।

యన్నిర్మాణగృహేశదేశవివరే స్తంభప్రతిష్ఠాం శుభాం ।
కృత్వా తద్గృహసంయుతాన్యభవనం కార్యం తథాతద్యుతమ్॥

టీక॥ నాసత్యః-అశ్వినియు; అదితి-పునర్వసువును; రేవతి - రేవతియు; కర హస్తము; గురు-పుష్యమియు, శ్రోణత్రయ-శ్రవణధనిష్ఠాశతభిషములును;ఇందు-మృగశిర; ఉత్తరా-ఉత్తరాత్రయమును; మిత్ర-అనూరాధ; త్వష్ట్ర-చిత్తానక్షత్రము విధాతృ-రోహిణియు; ఏషు-ఈనక్షత్రములయందు స్తంభప్రతిష్ఠ - స్తంభప్రతిష్ఠ సుతదా-సంతానప్రదము; అర్థదాచ-సంపత్కరమునగును; యన్నిర్మాణగృహేశదేశ వివరే-యత్-యే; నిర్మాణగృహ-కట్టెడుయిల్లుయొక్క; ఈశదేశ- ఈశాన్యదిక్కు యందు; వివరే గోతియందు; శుభాం-యోగ్యమగు స్తంభప్రతిష్ఠాం - స్తంభప్రతిష్ఠను; కృత్వా-చేసి; తద్గృహసంయుతాన్యభవనం - ఆగృహముతోకలసినమతియొక యిల్లును; తథాఅట్లు తద్యుతం—దానితో కలియుదానిని; కార్యం-నిర్మించునది.

అవ॥ పూర్వశ్లోకమందు సామాన్యముగా స్తంభప్రతిష్ఠకునక్షత్రములఁజెప్పి మరల విశేషనక్షత్రములఁజెప్పుచున్నాఁడు

తా॥ అశ్వి: పున: రేవ: పుష్య: శ్ర: ధని: శత: మృ: ఉత్తర: ఉషా: ఉభా నూ, చి: రో ఈ ౧౩ నక్షత్రములు పుత్రకరంబులును: సంపత్కరంబులునగును ఆ స్తంభమును తాను కట్టఁబొయ్యెడి గృహమున కీశాన్యదిక్కున నొకపల్లముత్రవ్వి అందుఁ బ్రతిష్ఠచేసి పిమ్మట గృహనిర్మాణము చేయవలయుననియిట్లు నిర్మితమైన గృహముతో మరల నెన్నిగృహములుగాని నిర్మాణము చేయునెడల లగ్నాది విచారము లనావశ్యకములని తా॥

## వాస్తుపురుషస్థితిక్రమము

శ్లో॥ మాసేషు క్రమశ స్త్రిషు త్రిషు సదా ప్రాచీనభస్యాదితః-
స్వోపాదేయమహీషు వాస్తుపురుష స్తద్వామశాయీభవేత్ ।
త్యక్త్వా తచ్చరణేక్షణస్థకకుభా తత్పృష్ఠమూర్ధస్థది
గ్భాలాస్వేవ వినిక్షిపే త్తమదరేశంకుంయథోక్తంసుధీః॥౨౫౪

టీక॥ వాస్తుపురుషః-వాస్తుపురుషుఁడు; క్రమశః- చెప్పఁబోవుక్రమముగా ప్రాచీనభస్యాదితః-తూర్పుదిక్కు భాద్రపదమాసము మొదలుగా:త్రిషుత్రిషు-మూడు మూడు మాసేషు మాసములయందు సదా - యెల్లప్పుడు తిష్ఠతి - ఉండుచున్నాఁడు స్వోపాదేయమహీషు-తనచే స్వీకరించఁతగిన భూములయందు తద్వామశాయీ -

ఆపురుషునకు యెడమప్రక్కగా మళ్లి శయనించువాడు, భవేత్-ఉండును, తచ్ఛిరతే క్షణస్త కకుభో-ఆవాస్తుపురుషుని పాదముచూపుగలదిక్కులను, త్యక్త్వా-విడచిపెట్టి, తత్పృష్ఠమార్గస్థదిక్పాలాసు-ఆవాస్తుపురుషునివెనుకను శిరస్సువమన్నకాలలయందు, తదుదతే-ఆకాలామధ్యభాగమందు, సుధీః-విద్వాంసుడు, శంకుం-శంకువును, వినిక్షిపేత్-ఉంచవలయును:

అవ. వాస్తుపురుషుం డుండెక్రమమును దానికి ఫలమును జెప్పుచున్నాఁడు.

తా॥ వాస్తుపురుషుఁడు భాద్రపదముమొదలు ౩ మాసములు తూర్పుతలగా నున్న మార్గశీర్షము మొదలు ౩ మాసములు దక్షిణశిరస్సుగానున్న, ఫాల్గునము మొదలు ౩ మాసములు పడమటితలగానున్న, జ్యేష్ఠమాసము మొదలు ౩ మాసముల వరకు నుత్తరశిరస్సుగానున్న, యెడమప్రక్కగా మళ్లి శయనించియుండునుగాన నతనిపాదములున్న దిక్కునున్ను, నేత్రములచూపున్న దిక్కునున్నువదలి యతని శిరస్సును వీపునున్న దిక్కులయందుఁదాగట్టెడుగృహమునకు మధ్యభాగమున శాస్త్రప్రకారముగ శంకుస్థాపన జేయవలయునని తా॥

శంకులక్షణము ౨౫౫

శ్లో॥ తచ్ఛంకుం త్రివిధం విభజ్య సమశశ్చోర్ధ్వాదభాగత్రయే।
ప్యష్టాశ్రిం చతురశ్రి మధ్రవణ మృజుం చానశ్రమేదంవిధమ్
సర్వేషాంచ వితస్తిమాత్ర మవధిః స్వర్ణాదిరత్నాన్వితం।
గంధాద్యై రభిపూజితం శుభదినే శంకుం న్యసేన్మంగళైః॥

టీక॥ సర్వేషాం-సర్వములకు, వితస్తిమాత్రం - ద్వాదశాంగుళమాత్రము॥ అవధిః-ప్రమాణము, తచ్ఛంకుం - ఆపంద్రెండంగుళములుగల, శంకువును॥ సమశః-సమముగా, త్రివిధం — మూడువిధములుగా, విభజ్య -విభాగించి, ఊర్ధ్వాది భాగత్రయే—పైభాగముమొదలు మూడుభాగములయందు, అష్టాశ్రిం-పైభాగమం దెనిమిదికోణములు, చతుశ్రిం-మధ్యమందు నాలుగుకోణములు, అనశ్రిం-క్రింది భాగమున కోణములు లేకుండ గుండ్రముగాను యుండేగాక, అవ్రణం-తొఱ్ఱలు మొదలగునవి లేకుండునట్లుగా, ఋజుం-వంకరలేనట్టి, ఏవంవిధం- ఈప్రకారము నున్న శంకును, గంధాద్యైః - గంధము మొదలగువానిచే, పూజితం - పూజింపఁ బడిన, శంకుం - శంకువును, కృత్వా - చేసి, స్వర్ణాదిరత్నాన్వితం - సువర్ణనవరత్న మౌక్తికాదులతో కూడునట్లుగా, మంగళైః - మంగళవాద్యములతో, శుభదినే- మంచిదినమందు, న్యసేత్—స్థాపించవలయును.

అవ. శంకులక్షణమును జెప్పుచున్నాఁడు

తా॥ బ్రాహ్మణాది సమస్తవర్ణంబులవారును తొఱ్ఱుముడి వంపు లేకయుండెడు ప్రమాణమున జానెడుపొడవున నొకమేకునేర్పఱచి యామేకును సమాంశములుగా ౩ భాగములు చేసి అందు అధోభాగమున గుండ్రముగనున్న మధ్యభాగమును నాలుగు మూలలుగలది గానున్ను; మొదట నెనిమిదిమూలలు గలుగునట్లుచెక్కి దానివిస్వర్ణ రత్నాదులతో నున్నపల్లమున శుభనక్షత్రయుక్తమగు దివసంబున మంగళవాద్య ఘోషములతోడ నాటవలయునని తా॥

శంకువును స్థాపించుటకు ఫలనిర్ణయము ౨౫౬

శ్లో॥ వాపీకూపతటాక సేతుపరిఘాస్వేతాసుభిత్తైరధో ।
భిత్తీనామపి బాహ్యదేశనికటే సర్వత్ర దేవాలయే ।
భిత్తీనామపి చాంతరేచ నిలయే నృణాం పశూనాంసదా ।
తావత్కాలగృహస్థితి ర్గృహపతే ర్యావచ్చ శంకుస్థితిః ॥

టీక॥ వాపీకూపతటాకసేతుపరిఘాసు- వాపీ - దిగుడుబావులయందు, కూప- నూతులయందు, తటాం-చెరువులయందు, సేతు—అడ్డకట్టలయందు, పరిఘాసు-కందకములయందు, ఏతాసు—వీట్లయందు, భిత్తేః-గోడకు, అధః-క్రిందిభాగమందును, సర్వత్ర-సమస్తమగు, దేవాలయే-దేవాలయములందు, భిత్తీనామపి-గోడలయొక్క, బాహ్యదేశనికటే-వెలుపటిప్రదేశములయందును, నృణాం-మనుష్యులయొక్క, పశూనాం-పశువులయొక్క, నిలయేచ—స్థానమునందు, భిత్తీనాం-గోడలయొక్క, అంతరేచ—మధ్యదేశమందును, సదా-ఎల్లప్పుడు శంకువునుస్థాపించవలయును, శంకుస్థితి -శంకువుయొక్కవుండుట, యావత్-ఎంతకాలమో, గృహపతేః - యజమానునికి, తావత్కాలగృహస్థితిః-అంతకాలము యింటియందుండుట కలుగును [అనఁగా చిరకాలముండు శంకువును స్థాపించవలయుననుట]

అవ. శంకువును స్థాపించుటకు స్థలమును జెప్పుచున్నాఁడు.

తా॥ బావి, చెరువు, గుంటలు నేర్పరచెడిసమయమున వాటి కట్టలక్రిందను దేవాలయములుఁ గట్టెడుసమయమున ప్రాకారమునకు వెలపట సమీపప్రదేశమున నున్న పశువులకొట్టము గృహనిర్మాణము చేయునెడల తామేర్పరచుకొనియున్న ఆయమునకు మధ్యప్రదేశమందును శంకుస్థాపన చేయవలయుననియు మఱియు శంకువెంతకాలము వరకునుండునో అంతకాల మాగృహపతికి సౌఖ్యముగానుండును గాన బహుకాలముండదగిన మ్రాఁకుచే శంకువు నేర్పరచవలయునని తా॥

శంకుగృహశుభాశుభ వృక్షనిర్ణయము ౨౫౭

శ్లో॥ కారంజార్జునశాలనీపకుటజాః పారాదమందారకా।
బిల్వా వైణవయుగ్మపత్రిఖదిరా వృక్షాశ్శుభా స్సద్మసు।
త్యాజ్యా దగ్ధవిభీతికాస్నుహివటానింబాశ్చ యేకంటకా।
అశ్వత్థామ్రకపిత్థతాళవకుళప్లక్షా అగస్త్యాదయః॥

టీక॥ కారంజ—కానుగ, అర్జున - మద్ది, సాల—ఏపి, నీప-కదవ, కుటజాః-కొడిసె, పారాద - తాలవిశేషములు, మందారకాః — పారిజాతములు, బిల్వాః - మారేడు, వైణవ-వెదుళ్ళు, యుగ్మపత్రి-దేవకాంచనములు, ఖదిరాః—ఖదిరములు: సద్మసు-గృహములవిషయమై, శుభాః - మంచిని, దగ్ధాః - తగలపెట్టబడినవి, విభీతకాః-గచ్చచెట్లు, స్నుహి - జెముడుచెట్లు: వటాః - మఱ్ఱిచెట్లు: నింబాః -వేపచెట్లు యే-ఏవి: కంటాః-ముండ్లుగలవో: తే-అవి: అశ్వత్థ-రావి: అమ్ర-మామిడి: కపిత్థ-వెలగ: తాళ - తాటి: వకుళ—బగడ: ప్లక్ష - జువ్వి: అగస్త్య - నల్లవిపి: ఆదయః-మొదలగువృక్షములు: త్యాజ్యాః-విడవతగినవి. [అనఁగావవికిరాతనుట]

అవ. శంకువును స్థాపించుటకును: గృహముకట్టుటకును: శుభాశుభవృక్షములను జెప్పుచున్నాఁడు.

తా॥ గానుక: మద్ది: యేపే: కడవ, కొడిశపాల, శ్రీతాళము: పారిజాతము: వెదురు: దేవకాంచనము: చండ్రి ఇవి శుభకరంబులవియు. కాలినచెట్లు: తాండ్రి జెముడు: అత్తి: అశ్వత్థము: మామిడి: మఱి: ముండ్లుగలచెట్లు: తాటిచెట్లు: అశోకము: వేపచెట్లు జువ్వి అగిశ ఈచెట్లు అశుభకరంబులవియును తా॥

గృహాదిజ్ఞానిర్ణయము ౨౫౮

శ్లో॥ ప్రాచ్యాంస్నానగృహాంచపాకసదనంపహ్నౌతుసుప్త్యాలయో
యామ్యాయామథశస్త్రసద్మ జనుజే సుక్త్యాలయఃపశ్చిమే।
వాయావ్యాం పశుమందిరం శుభకరం భండారవేశ్మోత్తరే
శైవే దేవగృహంప్రశస్తమఖిలంస్వస్వాయకార్యంసదా॥

టీక॥ ప్రాచ్యాం - తూర్పుదిక్కున: స్నానగృహం - స్నానముచేయుఇల్లు వహ్నౌ-అగ్నేయమందు: పాకసదనం-వంటయిల్లును: యామ్యాయాం- దక్షిణమున సుప్త్యాలయః-పడుకుండుయిల్లును: ఓమజే-నైరృతిదిక్కున: శస్త్రసద్మ-ఆయుధశాల

యును, పశ్చిమే-పడమర,భుక్త్యాలయం-భోజనముచేయువిల్లును:వాయవ్యాం-వాయువ్య దిక్కునందు: పశుమందిరం-పశుశాలయును:ఉత్తరే-ఉత్తరమందు:భండారవేశ్మ-ధనధాన్యాదులకొట్లును: శైవే-ఈశాన్యదిక్కున: దేవగృహం - దేవతార్చనయిల్లును: శుభకరం - మంచిచేయును: అఖిలం - సమస్తగృహములు: వ్యాప్యాయ-తమతమ ఆయములు తప్పకుండ: కార్యంచేత్—చేసినచో: ప్రశస్తం—ఉత్తమమైనది.

అవ. గృహములకు దిఙ్నిర్ణయమును జెప్పుచున్నాడు.

తా॥ తూర్పున స్నానగృహమును: అగ్నేయమున వంటయిల్లును: దక్షిణంబున పడకటిల్లును: నైరృతిదిక్కున నాయుధగృహమును: పశ్చిమంబున భోజనగృహమును వాయవ్యమున పశువులగృహమును: ఉత్తరంబున బొక్కసగృహమును: ఈశాన్యభాగమున దేవపూజాగృహమును: నిర్మించిన గట్టిదేని మంగళకరంబులగునవియువాయాగృహములశిల్పశాస్త్రానుసారముగనాయముతప్పకగట్టవలయును:

రాజులనైమిత్తికగృహములకు స్థాననిర్ణయము

శ్లో॥ ఇంద్రాగ్న్యోర్మధ్యమంథనస్యసదనంఘృతం యమాగ్న్యోర్గృహం
దైత్యేయాంతకయోః పురీషసదనం విద్యాగృహం మధ్యమే ।
రక్షోవారుణయోశ్చ రోదనగృహం తోయేశవాయవ్యయో ।
ర్మధ్యేకామగృహంకుబేరమరుతోః కుర్యాత్సదా భూపతిః ॥

టీక॥ ఇంద్రాగ్న్యోః-తూర్పుఅగ్నేయదిక్కులయందు: అత-పిమ్మట:మధ్యే-మధ్యయందు: మంధనస్య-చల్లచేయుటకు: భవనం-యిల్లును:యమాగ్న్యో-దక్షిణాగ్నేయములయొక్క: మధ్యే-మధ్యయందు: ఘృతం-వడ్లుతంపు: గృహం-యిల్లును: దైత్యేయంతకయోః — దక్షిణనైరృతులయొక్క: మధ్యే - మధ్యయందు: పురీషసదనం-పాకీదొడ్డి: రక్షోవారుణయోః - నైరృతిపడమటలయొక్క: మధ్యమే—మధ్యయందు: విద్యాగృహం-చదువుకునేయిల్లును: తోయేశవాయవ్యయోః-పడమరవాయవ్యదిక్కులయొక్క: మధ్యే-మధ్యయందు: రోదనగృహం - దుఃఖసదనము: కుబేరమరుతోః-ఉత్తరవాయవ్యములయొక్క: మధ్యే-మధ్యమందు: కామగృహం క్రీడాగృహమును: సదా-ఎల్లప్పుడు: భూపతిః-రాజు: కుర్యాత్-చేయవలయును.

శ్లో॥ కౌబేరేశ్వరయోశ్చ వైద్యభవనం శక్రేశయో స్నానికం ।
జ్యేష్ఠస్త్రీశ్రీపితృవ్యభ్రాతృభవనం స్వస్మాద్యమే పశ్చిమే ।
శాలానాముపరిస్థితేషు భవనేష్వేవం విచింత్యం బుధై ।
రత్యుచ్చం నహి నాతినీచ మథవాసామ్యాగ్గృహంకారయేత్ ॥

టీక॥ కౌబేరీశ్వరయోః - ఉత్తరేశాన్యములయొక్క: మధ్యే - మధ్యమందు: వైద్యభవనం-ఔషధగృహమును, శాక్రేశయోః-తూర్పుఈశాన్యములయొక్క,మధ్యే మధ్యమందు: సౌతికం-ప్రసవించునిల్లును: స్వస్మాత్-తనయిల్లుకంటె,యమే-దక్షిణ మందు, పశ్చిమేచ-పశ్చిమమందు, జ్యేష్ఠభ్రాతృ-పెద్దన్నయొక్క, పితృవ్య - పిన తండ్రి యొక్క: మాతృ-తల్లియొక్క, భవనం-యిల్లును, కుర్యాత్ -నిర్మించ వల యును, శాలానాం-గృహములయొక్క: ఉపరి- పైభాగమందు, స్థితేషు - ఉన్నట్టి, భవనేషు-యిండ్లయందు, ఏవం - ఈప్రకారమే, వించిత్యః - విచారించతగినది. గృహం-యిల్లును అత్యుచ్చం-మిక్కిలియెత్తైనదానిగాను అతినీచమపి - మిక్కిలి తక్కువైనదానిగాను, నకారయేత్ - కట్టించకూడదు, సామ్యం - సమానముగా, కారయేత్-కట్టించవలయును.

అవ॥ రెండుశ్లోకములచేత రాజులనైమిత్తికగృహములకుస్థానములఁ జెప్పుచున్నారు

తా॥ ప్రాగ్నేయదిక్కులకు మధ్యభాగంబున పెరుగుజిలుకుటకును, దక్షి ణాగ్నేయ మధ్యభాగంబున భాస్యముతంపుటకును: నైఋతి దక్షిణములకు మధ్య భాగంబున మూత్రాద్యుత్సర్జనమునకును,నైర్ఋతిపశ్చిమంబులకుమధ్యంబునవిద్యా భ్యాసమునకు, పశ్చిమవాయవ్యములకు మధ్యంబున దుఃఖించుటకును: ఉత్తర వాయవ్యములకు మధ్యంబున క్రీడించుటకును, ఈశాన్యోత్తరములకు మధ్యంబున వైద్యము చేయుటకును: ప్రాగీశాన్యములకు మధ్యంబున ప్రసూతికిని గృహము నేర్పరచవలయుననియు తనయింటికి దక్షిణంబుననైనను: పశ్చిమంబుననైనను, తనయన్న పెత్తండ్రి పినతండ్రివీరలకు గృహములనేర్పరచ వలయుననియు పై మిద్దెగట్టించునెడల నీగృహములకు జెప్పఁబడినక్రమంబుననే అతుము మొదలగు లక్షణముల నాలోచింపవలయుననియు: మిక్కిలిపొట్టిపొడవులేక సమముగా నుండు నటుల గృహముల గట్టవలయునని తా॥

ప్రశాలు ఫలనిర్ణయము ౧౬౧

శ్లో॥ ఆయా సువ్వర్ణ్వజధూమసింహశునకా ఉక్షా ఖరాఖ్యోగజః।
కాకోఽష్టౌ హి కృతార్థతాంచ మతణాంశశ్చజయించామయమ్
రాజ్యం దుఃఖకరం సదా సుఖకరం తన్నిష్ఫలంచ క్రిమా ।
త్స్యాగాద్విషపి సంయుతా గృహపతేర్థన్యధ్వజాద్యాఃఫలమ్

మిరి: ఆయాః-ఆయములు: స్యుః-అగుచున్నవి: ధ్వజాద్యాః—ధ్వజము మొదలునాయ ములు: క్రమాత్-క్రమముగా:ప్రాగాదిషు-తూర్పు మొదలగుదిక్కులయందు:సంయు తాః-కూడినవగుచు: గృహపతేః - యజమానునికి: కృతార్థతాం: మనోరథసిద్ధిని; మరణం-మరణమును: శశ్వత్-యెల్లప్పుడు: జయం-జయమును; ఆమయం- రోగ మును రాజ్యం-రాజ్యమును దుఃఖం - దుఃఖమును సదా - ఎల్లప్పుడు శుభం - శుభ మును తన్నిష్ఫలం- తత్ఆయజమానునికి నిష్ఫలం - ఫలములేకుండుటను దద్యుః ఇచ్చుచున్నవి:

అవ॥ ధ్వజాయము మొదలగు నెనిమిదింటికి ఫలమునుఁజెప్పుచున్నాఁడు

తా॥ ధ్వజాయము ధూమాయము సింహాయము శునకాయము వృషభాయము ఖరాయము గజాయము కాకాయము ఇవి తూర్పు మొదలుగ నీశాన్యదిక్కు వరకు వచ్చుచుండునవి గృహపతికి సత్ఫలంబునిచ్చు వరుసవప్పునేనిక్రమంబుగ ఇష్టసిద్ధి మరణము జయము రోగము రాజ్యము దుఃఖము శుభము ఫలాభావము ఈఫలంబుల గలుగఁజేయునని తా॥

ధ్వజాద్యాయములు ౨౬౧

శ్లో॥ పాదాధిక్యసమో ధ్వజో యది గజః పాదేన హీన స్సమః ।
పాదోనో విషమో హరిస్తు విషమస్సాంఘ్రిర్వృషాయో భవేత్ ।
ధ్వాంక్షాయస్తు భవేచ్చ కేవలసమస్సార్థో౽సమాయః ఖర ।
శ్వాయస్స్యాద్విషమస్తు సార్థసమో ధూమస్స్వదిక్ష్వర్థదాః ॥

టీక॥ పాదాధిక్యసమో యది- సమాయము పాదాధికముగలదైనచో: ధ్వజః- ధ్వజాయము; స్యాత్-అగును: పాదేన-ఒకపాదముతో; హీనః-తక్కువగు; సమః- సమాయము; గజః—గజాయమగును; విషమః-విషమాయము; పాదోనః - పాదము తక్కువ గాగలదగుచూ:హరిః-సింహాయమగును:విషమః-విషమాయము:సాంఘ్రిః- పాదముతో కూడినదగుచూ; వృషాయః-వృషభాయము: భవేత్—అగును. కేవలసమః పాదాద్యధికన్యూనతలులేకుండునది, ధ్వాంక్షాయః-కాకాయమగును: అసమాయః - విషమాయము: సార్థః—సగముతో కూడినదగుచూ ఖరః—ఖరాయమగును:విషమస్తు- కేవలవిషమాయము: శ్వాయః—శునకాయము: స్యాత్-అగును: సార్థసమః - సగ మధికమగుసమాయము: ధూమః-ధూమాయమగును: (వికాలమంతటను నాలుగుండ వలయును] ఏతే-ఈఆయములు స్వదిక్షు-తమతమదిక్కులు: అర్థదాః- ధనకరములు (ఇతరదిక్కుల నశుభకరములని తాత్పర్యము)

అవ॥ ధ్వజాద్యాయముల స్వరూపమును దెలియజేయుచున్నాఁడు

తా॥ గృహముగట్టుటకై యేర్పరచినప్రదేశము నందాయింటికివిడివిగొలువగానాపరిమాణము పాతికెయధికముగా సమసంఖ్యగలదై యున్న ధ్వజాయమగు,పాతికెతక్కువగా సమసంఖ్యగలదై యున్న గజాయమగు: పాతికతక్కువగా బేసిసంఖ్యగలదై యున్న సింహాయం: పాతికెహెచ్చుగా బేసిసంఖ్యగలదయియున్న వృషభాయం యెచ్చుతగ్గులులేక సమసంఖ్యలుగలదయియున్న కాకాయమగు: అర్ధమధికముగవిషమసంఖ్యగలదై యున్న ఖరాయమగు కేవలవిషమసంఖ్యగలదై యున్న శునకాయమగు అర్ధమతిశయంబుగ సమసంఖ్యగలదై యున్న ధూమాయమగు,నీచెప్పఁబడినధ్వజాద్యాయముల కన్నిటికిని వెడల్పుచతుస్సంఖ్యాకమై యుండవలయు: నీ ఆయములు ముందుఁజెప్పియున్నతెరంగునతమతమ దిక్కులయందున్న శుభకరంబులగును:వ్యత్యాసముగానున్న నశుభకరంబులగునని తా॥

గజతురంగాదిశాలల గట్టుటను ఆయనిర్ణయము ౹= 3

శ్లో॥ ఉష్ట్రాణామపి దంతినాంచ భవనం కార్యం ధ్వజేవాగజే ।
హ్యాశ్వానం సదనం ధ్వజేచ వృషభే యద్వా పశూనామపి॥
స్త్రీశయ్యాసనయంత్రికర్మభవనం సింహే ధ్వజేవా వృషే ।
సర్వేషామపి సర్వకర్మసు సదా కార్యోధ్వజా యోర్థదః ॥

టీక॥ ఉష్ట్రాణాం - ఒంటెలయొక్క, దంతినామపి - యేనుఁగులయొక్క, భవనం-శాల, ధ్వజే-ధ్వజాయమందైనా; గజే-గజాయమందైనా,కార్యం-నిర్మించ, తగినది-అశ్వానాం-గుఱ్ఱములయొక్క, పశూనాం పశువులయొక్క, సదనం-ఇల్లుఁ ధ్వజే-ధ్వజాయమందైనా, వృషభే- వృషభాయమందయినా; కార్యం - యేర్పఱచ, దగినది, స్త్రీ-స్త్రీలయొక్క, శయ్యా-పరుండునట్టియు, ఆసన - కూర్చుండునట్టియు యంత్రికర్మ యంత్రములుచేయునట్టియు,భవనం-ఇల్లు:సింహే-సింహాయమందయినా ధ్వజే-ధ్వజాయమందైన; వృషే-వృషభాయమందయినా, కార్యం-చేయఁతగినది, యద్వా-లేక, సర్వేషామపి-సమస్తమగువాట్లకు, సర్వకర్మసు-సమస్తకర్మలయందు సదా-ఎల్లప్పుడు, అర్థదః-ధనకరమగు, ధ్వజాయః-ధ్వజాయము కార్యః-చేయఁతగినది

అవ॥ గజతురంగాదిశాలలఁగట్టుటకు నాయముల నిర్ణయించుచున్నాఁడు.

తా॥ ఒంటెలకును, ఏనుగులకును, ధ్వజగజాయములతో నొకటిచేతనగుఱ్ఱములకును: పశువులకును, ధ్వజవృషభాయములలో నొకటిచేతను స్త్రీలు శయనించుటకు ఆస్థానమునకును, యంత్రకర్మలకును: సింహధ్వజ వృషభాయములలో నొకటి

చేతను గృహములుగట్టిరేని శుభముగలుగు నిదియుఁగాక పిఱెప్పఁబడినయన్నిటియుం
డ్లకును; ధ్వజాయము శుభకరంబగునని తా॥

## గృహనిర్మాణ నిషిద్ధకాలము

శ్లో॥ అర్కే-పావకధిష్ణ్యగేచ భరణీధిష్ణ్యోత్తరార్థాన్వితే।
బ్రహ్మర్క్షాదిమపాదగేపి యది వా చంద్రేఽగ్నిధిష్ణ్యాన్వితే।
భౌమే చాగ్ని మఘాంత్యభాగ్యసవితృక్రివ్యాదపుష్యాన్వితే।
స్యాద్దుఃఖంబహు దహ్యతే చ భవనం స్తంభప్రతిష్ఠాగమే॥ ౨౬౮

టీక॥ స్తంభప్రతిష్ఠాగమే- స్తంభప్రతిష్ఠాకాలమందు, అర్కే - సూర్యుఁడు;
పావకధిష్ణ్యగే—కృత్తికనుబొందినవాఁడగుచుండగా, భరణీధిష్ణ్య - భరణీనక్షత్రము
యొక్క, ఉత్తరార్థాన్వితే ఉత్తరార్ధముతో; అన్వితే-కూడియుండగాను; బ్రహ్మర్క్ష -
రోహిణీనక్షత్రముయొక్క; ఆదిమపాదగే— మొదటిపాదమును బొందియుండఁగా,
చంద్రేవా-చంద్రుఁడైనా; అగ్నిధిష్ణ్యాన్వితే- కృత్తికావశమును బొందియుండగా;
భౌమే - కుజుఁడు; అగ్ని-కృత్తిక; మఘ-మఘ;అంత్య— రేవతి; భాగ్య- ఉత్తర
సవితృ-హస్త; క్రివ్యాద్యమూల; పుష్య-పుష్యమి; ఏతైః- వీటితో; అన్వితే - కూడి
యుండగను; బహుదుఃఖం_మిక్కిలిదుఃఖం; స్యాత్-కలుగును-భవనం — ఆగృహ
మున్ను; దహ్యతే - భస్మముకాగలదు.

అవ॥ రెండుశ్లోకములచే నిల్లుగట్టుటకు కొరగాని కాలములఁజెప్పుచున్నాఁడు

తా॥ స్తంభప్రతిష్ఠచేయు సవనరంబునసూర్యుండుకృత్తికానక్షత్రమందైనను
భరణీనక్షత్రోత్తరార్థమందయినను రోహిణీనక్షత్రప్రథమపాదమందైననుచంద్రుడు
కృత్తికయందయినను; అంగారకుఁడు కృత్తిక; మఘ రేవతీ ఉత్తర ఫల్గునీహస్త
మూల పుష్యమి ఈనక్షత్రములయందయినను ఈరీతుగ మండిరేని గృహపతికి
బహుదుఃఖముఁ గలుగుటయుగాక యాగృహ మగ్నిదగ్ధమగునవియును తా॥

శ్లో॥ మిత్రేంద్రానిలభాద్రపాద్వయయమేష్వేతేషు సంస్థేశనౌ।
తత్సద్మాశువిగృహ్యతే సుబలిభిర్దైతేయయక్షాదిభిః।
ఏకశ్చతుర్గృహస్థితోంబదశమగో ద్యూనస్థితోవా గ్రహ।
స్తద్గేహాంపరహస్తగం ఖలుభవే న్నిర్మాణలగ్నాద్బలాత్ ౨౬౯

టీక॥ మిత్ర-అనూరాధ; ఇంద్ర-జ్యేష్ఠ; అనిల- స్వాతి భాద్రపాద్వయం
పూర్వాభాద్రోత్తరాభాద్రలు యమేషు- భరణులయందు ఏతేషు - ఈనక్షత్రముల
యందు;శనౌ-శనిః సంస్థే-ఉండగా; యత్ - ఏయిల్లు; క్రియతే - చేయఁబడునో

తత్—ఆ. సద్మ—యిల్లు: ఆశు-శీఘ్రముగా; సుబలిభిః-మిక్కిలిబలముగలదై; తేయ-యక్షాదిభిః - దైతేయాః - బ్రహ్మరాక్షసులు: యక్షాః-క్షుద్రపిశాచములు: ఆదిభిః-మొదలగువానిచే: నిగృహ్యతే - ఆక్రమించఁబడుచున్నది: ఏకః - ఒక: గ్రహః-గ్రహము: శత్రుగృహస్థితః-శత్రుక్షేత్రమునమందును: దశమగః - స్తంభప్రతిష్ఠాలగ్నమునకు పదింటమందుచు: దూన్యస్థితః-సప్తమమందుండుచు: తద్గేహః-అగ్రహము: పరహస్తగం—పరాధీనమైనది: భవేత్తలు-అగునుగదా: నిర్మాణలగ్నాబలాత్-గృహనిర్మాణలగ్నము బలహీనమైనచో.

తా॥ శనైశ్చరుఁడు; అనూరాధ - జ్యేష్ఠ - స్వాతి - పూర్వాభాద్ర-ఉత్తరాభాద్ర-భరణి ఈ నక్షత్రములయందుండుఁగ గట్టినగృహము; పిశాచ బ్రహ్మరాక్షసుల కాలయంబగు నౌకళుతగ్రహముగాని పాపగ్రహముగాని స్వశత్రుక్షేత్రగతమై స్తంభప్రతిష్ఠాలగ్నమునకు ౧౦ట ౭ట నుండగఁకట్టిన గృహమన్యాక్రాంతమగునని తా॥

గృహముకట్టుటకు ముఖ్యకాలములు ౨౯౬

శ్లో॥ చిత్రాద్యార్యమహస్తచంద్రవిధీషు స్థాయీ బుధః శ్రీప్రదో
బ్రహ్మార్యేంద్వహివైష్ణవో త్తరజలే ష్వీజ్య స్థ్సితః పుత్రదః
రుద్రాదిత్యవసుద్విదైవజలరాట్చిత్రాస్థితో ధాన్యద।
శ్శుక్రా స్సప్తగ ఏవచే దృహాగతః స్తంభప్రతిష్ఠాగమే॥

టీక॥ స్తంభప్రతిష్ఠాగమే—స్తంభప్రతిష్ఠాకాలమందు, చిత్ర-చిత్ర, అద్య-అశ్విని, ఆర్యమ - ఉత్తర, హస్త - హస్త, చంద్ర-మృగశిర, విధిషు-రోహిణి, ఏతేషు— వీట్లయందు, బుధః - బుధుఁడు, స్థాయీచేత్ -ఉన్నచో, శ్రీప్రదః-ఐశ్వర్యమిచ్చును, బ్రహ్మ-రోహిణి, ఆర్య-పుష్యమి, ఇందు-మృగశిర. అహి-అశ్లేష, వైష్ణవ — శ్రవణము, ఉత్తర—ఉత్తర ఉత్తరాషాఢ ఉత్తరాభాద్రలుమూడు, జల—పూర్వాషాఢ, ఏతేషు - వీటియందు, ఇజ్యః - బృహస్పతి, స్థితశ్చేత్ -ఉన్నచో, పుత్రదః-పుత్రులనిచ్చును, శుక్రః-శుక్రుఁడు, రుద్ర-ఆర్ద్ర, అదిత్య-పునర్వసు,వసు ధనిష్ఠ: ద్విదైవ-విశాఖ: జలరాట్ - శతభిషము: చిత్రా—చిత్ర: ఏతేషు—ఈనక్షత్రములయందు: స్థితః-ఉన్నవాఁడగుచు: ధాన్యదః - ధాన్యమునిచ్చును: సప్తగశ్చేత్-స్తంభప్రతిష్ఠాలగ్నమునకు ఏడింటమందినను: గృహాగతః-స్తంభప్రతిష్ఠాలగ్నము నబొందినను: ధాన్యదః-ధాన్యమునిచ్చును.

అవ. గృహనిర్మాణమునకు ముఖ్యకాలమును జెప్పుచున్నాఁడు.

అ॥ స్తంభప్రతి కాలమందు చి-అశ్వి-ఉఫ-హ-మృ-రో ఈ ౬ నక్షత్రములయందును బుధుఁడుండిన గృహపతికి నైశ్వర్యప్రదుఁడగును రో-పుష్య-మృ

ఆశ్లే-శ్రీ-ఉప-ఉషా-ఉభా-పూషా ఈ ౯ నక్షత్రములయందు బృహస్పతియుండిన పుత్రప్రదుఁడగును. ఆర్ద్రా-పున-భ-శ-చి ఈ ౬ నక్షత్రములయందయినను స్తంభ ప్రతిష్టాలగ్నమందైనను, లగ్నమునకు ౩నైనను,శుక్రుఁడుండినధాన్యప్రదుఁడగును.

స్తంభప్రతిష్ఠాలగ్నమునకు గ్రహస్థితిఫలము ౨౬౭

శ్లో॥ పాపేషు త్రిభవారిగేషు బలిషు స్తంభప్రతిష్ఠాలయా ।
తే్కంద్రద్వి త్రిభవత్రికోణసహితే ష్వార్యజ్ఞకావ్యేందుషు ।
స్వోచ్చస్వాలయమిత్రరాశిసహితే ష్వర్కాదిషు ద్రవ్యదం
కార్యం సద్మ గురౌ భృగౌ రిపుగతే నీచస్థితే వార్తిదమ్॥

టీక॥ బలిషు-స్థానాదిబలములుగల, పాపేషు-క్రూరగ్రహములు, స్తంభ ప్రతిష్ఠాలయాత్-స్తంభప్రతిష్ఠాలగ్నముకంటె, త్రిభవారిగేషు - త్రి-మూట, భవ-పదకొండింట, అరి-ఆఱింట, గేషు-ఉండఁగా, ఆర్యజ్ఞకావ్యేందుషు - ఆర్య-బృహస్పతి, జ్ఞ-బుధుఁడు, కావ్య-శుక్రుఁడు, ఇందుషు - చంద్రుఁడు, కేంద్ర-కేంద్రములలో, ద్వి-రెంటిలో, త్రి-మూటిలో, భవ-పదకొండింటిలో, త్రికోణ-త్రికోణములలో, సహితేషు-ఉండఁగా, అర్కాదిషు-సూర్యాదిశుభపాపగ్రహములు, స్వోచ్చ-తమ ఉచ్చలయందు, స్వాలయ-స్వక్షేత్రములయందు, మిత్రరాశి-మిత్రగృహములయందు, సహితేషు-ఉండఁగా, సద్మ - ఇల్లు, కారంచేత్-కట్టినట్లయిన, ద్రవ్యదం-సంపత్కరమగును, గురౌ-బృహస్పతియు, భృగౌ - శుక్రుఁడును, రిపుగతే-శత్రుక్షేత్రమందున్న, నీచస్థితే-నీచస్థితియందున్న, అర్తిదం-పీడచేయును.

అవ. స్తంభప్రతిష్ఠాలగ్నమునకు గ్రహస్థితిని జెప్పుచున్నాఁడు.

తా॥ బలయుక్తములైన పాపగ్రహములు లగ్నమునకు ౩-౬-౧౧ ఈస్థానములయందును, గురు-బుధ-శుక్ర-చంద్రులు, ౧-౨-౩-౪-౫-౭-౯-౧౦-౧౧ యీస్థానములయందును సూర్యాది సమస్తగ్రహంబులును, తమతమ యుచ్చస్థానములయందును, స్వక్షేత్రములయందును, మిత్రక్షేత్రముల యందుండగాఁగట్టిన యిల్లుసంపత్ప్రదంబగును, బృహస్పతితనకు శత్రుక్షేత్రమగు మకరరాసిగతుఁడై యుండఁగాను శుక్రుఁడుతనకు నీచక్షేత్రమగు కన్యారాశిగతుఁడై యుండగానుఁ గట్టిన యిల్లు పీడాకరంబగునని తా॥

స్తంభప్రతిష్ఠాలగ్న రాజయోగములు ౨౬౮

శ్లో॥ లగ్నే కర్కటకే యదా గురుదినే జీవేందుసంస్థైర్భవా ।
నిర్మాణే భవనేపి జాతపురుషో రాజా భవేత్సర్వదా ।

లగ్నే చాపగృహే ఝషే గురుదినే శుక్రార్య సంస్థేతథా ।
నిర్మాణే భవనేపి జాతపురుషో భూపోథవా తత్సమః ॥

టీక॥ గురుదినే-గురువారమందు, జీవేందుసంస్థే—బృహస్పతిచంద్రులున్న కర్కటకే కర్కటకమను: లగ్నే—లగ్నమందు, నిర్మాణే – నిర్మించిన, భవనేపి-గృహమందున్న, జాతపురుషః—పుట్టినపురుషుఁడు, సర్వదా-ఎల్లప్పుడు, రాజా-రాజు భవేత్-అగును, గురుదినే-గురువారమందు, శుక్రార్యసంస్థే-శుక్రబృహస్పతులున్న, చాపగృహే-ధనుర్లగ్నమందు, ఝషేవా-మీనలగ్నమందయినా, నిర్మాణే—నిర్మించిన, భవనే-యింటియందు, జాతపురుషః-పుట్టినపురుషుఁడు: భూపః-రాజు: భవేత్-అగును: అథవా-కాకున్న: తత్సమః—రాజసముఁడైనా; భవేత్-అగును.

అవ. స్తంభప్రతిష్ఠాలగ్నమునకు రాజయోగములఁ జెప్పుచున్నాఁడు.

తా॥ గురువారమున గురుచంద్రులుండెడి కటకలగ్నమునందుఁ గట్టినయింటఁబుట్టిన పురుషుఁడు బ్రతికినన్నాళ్లును వసుధాధిపుఁడయియుండును. ఆ గురువారముననే గురుశుక్రులుండెడి ధనుర్మీనలగ్నముల యందుఁగట్టినయింటఁబుట్టినవరుడు నరాధిపుఁడయినను నరాధిపసమానుండయిన నగునని తా॥

లగ్నగ్రహబల ఆయునిర్ణయము — ౨౬౯

శ్లో॥ ఆయుష్యం శతవర్ష మిజ్యసహితే తద్వచ్చ శుక్రాన్వితే ।
తస్యార్థ్యం బుధసంయుతే సుబలిభి స్సౌమ్యైస్త్రిభిస్సంయుతే
లగ్నే నిర్మితసద్మవస్తు బహవ సంవత్సరా స్స్యుశ్శుభా ।
స్తద్గేహే వసతో నరస్య బహవో భోగా భవేయుస్సదా ॥

టీక॥ ఇజ్యసహితే-గురుయుక్తమగు: లగ్నే-లగ్నమందు: నిర్మితసద్మవః-కట్టినయిల్లుకు: శతవర్షం-నూఱుసంవత్సరములు: ఆయుష్యం-ఆయుర్దాయము:శుక్రాన్వితే-శుక్రునితోఁగూడిన లగ్నమందు: తద్వత్ - నూఱువత్సరములాయుష్షు: బుధసంయుతే-బుధునితోగూడినలగ్నమందు: తస్య-ఆనూటిలో: అర్ధం-సగము [ఏబది యనుట] సుబలిభిః-స్థానాదిబలముకలిగిన: త్రిభిః-ముగ్గురగు: సౌమ్యైః-శుభగ్రహములతో: సంయుతే - కూడినలగ్నమందు నిర్మాణమయిన యింటికి: ఆయుష్యం-ఆయువు: బహవః - అనేకమగు: వత్సరాః-సంవత్సరములు: తద్గృహే-ఆయింటియందు: వసతః-నివసించిన, నరస్య-పురుషునికి: సర్వదా-ఎల్లప్పుడు: శుభాః-శుభములు: బహవః-అనేకమగు: భోగాశ్చ-భోగములు: భవేయుః-కాగలవు.

అవ. లగ్నమందుండెడి గ్రహములబలమువలన యిండ్లకు నాయువును వివ్ర యింపు చున్నాఁడు.

తా॥ గురుశుక్రులు లగ్నమందుండఁగ కట్టినయిల్లునూఱుసంవత్సరంబులును బుధుఁడు లగ్నమందుండఁగ గట్టినగృహము ౧౦ సంవత్సరంబులును, స్థానాది బలయుక్తంబగు నీ శుభగ్రహత్రయముతోఁ గూడియున్న లగ్నమందుఁ గట్టిన యిల్లు నూటికి నతిశయించిన సంవత్సరంబులు స్థిరంబుగ నుండుటయేగాక యీ యింటనున్న నరునకత్యంతమంగళభోగంబులు గలుగచుండునని తా॥

క్షణికవాస్తుస్వరూపము ౨౭౦

శ్లో॥ ఏకద్విత్రిచతుష్టయేష్వనుదినం యామేషు సూర్యోదయా-
త్సౌమ్యప్రాగ్యమపశ్చిమేషు దివసే తద్వత్క్షపాయామపి ।
వాస్త్వీశో భువి సంవిశేత్ప్రథమతో యద్వచ్ఛ తద్వత్క్రమా
ద్విజ్ఞేయం క్షణవాస్తు నామ తదిదం స్తంభప్రతిష్ఠాగమే ॥

టీక॥ వాస్త్వీశః-వాస్తుపురుషుఁడు, అనుదినం-ప్రతిదినమందు, దివసే-పగటి యందు, ఏకద్విత్రిచతుష్టయేషు- ఏక - ఒకటి, ద్వి-రెండు, త్రి - మూడు, చతుష్ట యేషు - నాలిగింటియందు, సూర్యోదయాత్ - సూర్యోదయమునుంచి, సౌమ్య ప్రాగ్యమపశ్చిమేషు- సౌమ్య-ఉత్తరమందు, ప్రాక్-తూర్పునందు, యమ-దక్షిణ మందు, పశ్చిమేషు- పశ్చిమమందు, భువి-భూమియందు, సంవిశేత్-ప్రవేశించును క్షపాయాపి-రాత్రులయందును, తద్వత్-అప్రకారము వాస్తుపురుషుడుప్రవేశించును, ప్రథమతః-ముందుగా, మాసేషుక్రమశః-అనుక్రమమందు, యద్వత్-యెట్లో,తద్వత్ అట్లుగానే, క్రమాత్-క్రమముగా, విజ్ఞేయం-తెలియతగినది, [అనఁగా వాస్తుపురు షుఁడు ప్రాతఃకాలమందు ఉత్తరచ్ఛాయగలవాఁడై యుండును కనుక వానిచరణ ప్రదేశమందున్న దక్షిణప్రాగ్దిక్కుల విడువవలయును, ఉత్తరపశ్చిమములైతే వాస్తు పురుషునకు పృష్ఠశిరస్సులనున్నవి కనుకమంచివి. ఇట్లెదిక్కునమందునోఆదిక్కు పాదములుండుదిక్కునువదలిపృష్ఠశిరస్సులుండుదిక్కులగ్రహింపవలయును,తత్-ఆ ఇదమేవ-ఇదే, క్షణవాస్తునామ - క్షణవాస్తువనుపేరుగలది, స్తంభప్రతిష్ఠాగమే- స్తంభప్రతిష్ఠాగమనమందు,విజ్ఞేయం-తెలియతగినది.[పూర్వశ్లోకమందుమాసభేదముచే వాస్తుపురుషస్థితి చెప్పఁబడినది. ఈశ్లోకమందు యామభేదముచే చెప్పఁబడినది.

అవ. క్షణికవాస్తుస్వరూపమును దెలియఁజేయుచున్నాఁడు

తా॥ వాస్తుపురుషుఁడు ప్రతిదినంబును ప్రాతఃకాలము మొదలుగనొక్కొక్క యామమువందుత్తరదిక్కు మొదలుగ నొక్కొక్కదిక్కువరుసనవరాత్రింబగళ్ళునెవి మిదిజాములయందునుక్రమంబునమశ్రితప్రాగ్దక్షిణపశ్చిమ ఃబులరెండుమార్లుపరుండు చుండుసుగాన ముందు జెప్పియున్న తెలుంగున నతనిపాదములును దృష్టియు మన్న దిక్కులఁ బరిత్యజించి తక్కినదిక్కుల గ్రహింపవలయునని తా॥

## గృహప్రవేశవిధానము ౨౭౦

శ్లో॥ కృత్వా వాస్తుమహాత్మనాంచవిధితఃపూజాంసహోమాంసురా।
సభ్యర్చ్య స్వపితృగ్రహాణ్ గణపతిం దత్వా బలింభోజనమ్।
తద్దేహం సుకవాటగోపనయుతం భిత్త్యన్వితం సంవిశే।
ద్వాదిత్రిధ్వజమంగళై శ్శుభదినే పుణ్యాంగనాభిర్ద్విజైః।

టీక॥ వాస్తు—గృహమును, కృత్వా-నిర్మించి, తతః—పిమ్మట,మహాత్మనాం-సత్పురుషులయొక్కః సహోమాం—హోమములోఁగూడిన, పూజాంచ - పూజనున్ను, కృత్వా—చేసి, విధితః - శాస్త్రవిధిగా, సురాన్ - దేవతలను, స్వపితృగ్రహాన్ - తనపితృదేవతలనుసూర్యాదినవగ్రహములను,గణపతిం-గణపతిని అభ్యర్చ్య-పూజించి బలిం-గృహబలిని, భోజనం—బ్రాహ్మణభోజనమును, దత్వా-ఇచ్చి, సుకవాటగోపనయుతం-మంచికవాటములతోఁగట్టిన,భిత్త్యన్వితం-మంచిగోడలుకలిగినతద్గేహం ఆకొత్తయిల్లును, వాదిత్రిధ్వజమంగళైః-వాయిద్యములు జెండాలుమొదలగు మంగళములతో, పుణ్యాంగనాభిః—పుణ్యస్త్రీలతోను: ద్విజైః — బ్రాహ్మణులతోను, శుభ దినే—మంచిదినమందు, సంవిశేత్—ప్రవేశించవలయును.

అవ॥ గృహప్రవేశవిధానమును జెప్పుచున్నాఁడు

తా॥ పూర్వోక్తక్రమంబున నిల్లుకట్టి శుభదినమందు శాస్త్రోక్తప్రకారంబుగ నాయింట జపహోమాదికృత్యముల నెరవేర్చి సత్పురుషుల నిష్టదేవతలందితృదేవతల నవగ్రహములం గణపతిం బూజించిగృహబలిబ్రాహ్మణభోజనాదులంగావించియుభే ద్యములగు కవాటప్రాకారభిత్త్యాదులతోఁగూడియున్న నూతనగృహమునుబహువిధ మంగళవాద్యముల మ్రోయింపుచుంత ధ్వజాదులగుబిరుదులతోమంగళద్రవ్యసహిత ములగు సువాసినీలతో వేదశాస్త్రసంపన్నులగు బ్రాహ్మణులతో బ్రవేశింపవలెను.

## గృహప్రవేశమాసఫలము

శ్లో॥ వైశాఖే బహుపుత్రదశ్చ శుభదో జ్యేష్ఠే ఒర్థదః ఫాల్గునే।
మాఘే ధాన్యసుఖప్రదో గృహపతే ర్మాసే ప్రవేశోభవేత్

ఆదిత్యే మకరాదిషట్సు సహితే కుంభాఖ్యమాసం వినా
సర్వాభీష్టద ఇత్యథాహురపరే శేషేష్వయందుఃఖదః ॥

టీక॥ వైశాఖే-వైశాఖమాసమందు, బహుపుత్రదః— అనేకపుత్రులనిచ్చునది జ్యేష్ఠే-జ్యేష్ఠమాసమందు, శుభదః - శుభమిచ్చును, ఫాల్గునే - ఫాల్గునమాసమందు, అర్థదః - ధనమిచ్చునది, మాఘే - మాసమందు, ధాన్యసుఖప్రదః — ధాన్యమును సుఖమునిచ్చును: ఆదిత్యే—సూర్యుఁడు మకరాదిషట్సు—మకరము మొదలుగ నాఱింటి యందు, సహితే-కూడియుండగా, [అనగా ఉత్తరాయణమందు] కుంభాఖ్యమాసం వినా-కుంభమాసమునువదలి, గృహపతేః—యజమానునికి,ప్రవేశః—గృహప్రవేశము సర్వాభీష్టదః-సమస్తకోరికలనిచ్చునది, భవేత్-అగును,ఇతి-ఇట్లని,అపరే-కొందరు అహుః- చెప్పుచున్నారు: శేషేషు మిగిలినమాసములయందు,అయం-ఈగృహప్రవే శము, దుఃఖదః—దుఃఖమునుచేయును.

అవ॥ గృహప్రవేశవిధానమునకు మాసఫలమును జెప్పుచున్నాఁడు

తా॥ గృహప్రవేశవిషయమై వైశాఖమాసముగృహపతికి బహుపుత్రప్రదంబగు జ్యేష్ఠము శుభప్రదంబగు, ఫాల్గునము సంపత్కరంబగు మాఘము ధ్యానసుఖప్రదం బగు కొందఱ యభిప్రాయానుసారంబగు ఉత్తరాయణమందు కుంభేతరమాసము లన్నియు సర్వాభీష్టసిద్ధిప్రదంబులగు, తక్కిన మాసములు దుఃఖకరంబులగుననితా॥

## గృహప్రవేశవారఫలము

శ్లో॥ వారేఽర్కస్య సుదుఃఖదః కలహదః క్షీణేందువారేఽర్థదః।
పూర్ణేందౌ కుజవాసరే దహనద స్సౌమ్యేతు ధాన్యప్రదః।
జీవాహే పశుపుత్రదో భృగుదినే కల్యాణసౌఖ్యప్రదో
మందాహే స్థిరదశ్చ చోరభయదో వేశ్మప్రవేశో భవేత్ ॥

టీక॥ అర్కస్య-సూర్యునియొక్క, వారే—వారమందు, వేశ్మప్రవేశః- గృహ ప్రవేశము, సుదుఃఖదః-మిక్కిలి దుఃఖముచేయును, క్షీణేందువారే- క్షీణచంద్రవార మందు, కలహదః-కలహముకలుగును, పూర్ణేందౌ - చంద్రవారమందు, అర్థదః - ధనముకలుగును,కుజవారే-మంగళవారమున,దహనదః-గృహదహనమగును,సౌమ్యే బుధవారమున, ధాన్యప్రదః—ధాన్యముకలుగును: జీవాహే-గురువారమున, పశుపు త్రదః—పశువులుపుత్రులుకలుగుదురు, భృగుదినే- శుక్రవారమందు, కల్యాణసౌఖ్య ప్రదః-శుభమును, సౌఖ్యమువిచ్చును మందాహే-శనివారమందుఃస్థిరదః - స్థైర్యము నిచ్చును: చోరభయశ్చ - దొంగలభయమున్ను భవేత్ - కలుగును:

అవ॥ వారఫలమునుఁ జెప్పుచున్నాఁడు

తా॥ ఆదివాసర మత్యంతదుఃఖమును; క్షీణేందువారము కలహమును; పూర్ణేందు వారము సంపదను; కుజవార మగ్నిభయమును; బుధవారము ధాన్యమును; గురువారము పశుపుత్రులను; శుక్రవారము శుభసౌఖ్యంబులను; శనివారము స్థైర్యమునుం జోర భయమునిచ్చునని తా॥

గృహప్రవేశమునకు వర్జ్యకాలములు ౨౨౪

శ్లో॥ రిక్తాం దగ్ధతిథించ విష్టి మవమం । షష్ఠించ కృష్ణాష్టమీం ।
మాసాంతే దినపంచకం ప్రతిపదం శుక్లాం ప్రదోషానపి ।
షడ్వర్గంచ కుజస్య భానుశశినోర్దృష్టిం శశిస్థాలయం
త్యక్త్వా దక్షిణసమ్ముఖేస్థితమినం శుక్రంచ గేహం విశేత్ ॥

టీక॥ రిక్తాం-రిక్తతిథిని; దగ్ధతిథిం - దగ్ధతిథిం; విష్టం — భద్రకరణమును అవమం - దినత్రయమును; షష్టిం - రెండుపక్షములమందిషష్ఠిని, కృష్ణాష్టమీం - కృష్ణపక్షాష్టమిని; మాసాంతే—మాసముయొక్క అంతమందు; దినపంచకం-ఐదుదినములను: శుక్లాం—శుక్లపక్షసంబంధమైన; ప్రతిపదం-పాడ్యమిని; [క్షీణచంద్రుఁడగుట వల్ల] ప్రదోషాన్-ప్రదోషములను: కుజస్య-కుజునియొక్క: షడ్వర్గం - షడ్వర్గును భానుశశినోః-సూర్యచంద్రులయొక్క: దృష్టిం - దృష్టిని: శశిస్థాలయం - చంద్రుఁడుండురాశిని; దక్షిణసముఖే-దక్షిణాయనమందు ఎదురుగాను; స్థితం-ఉన్న; ఇనం— సూర్యుని; శుక్రం-శుక్రుని; త్యక్త్వా - వదలి; గేహం - క్రొత్తయిల్లును; విశేత్ - ప్రవేశించవలయును

అవ॥ గృహప్రవేశవిషయమై వర్జింపతగినకాలములఁ జెప్పుచున్నాఁడు

తా॥ రిక్తదగ్ధతిథులను; భద్రకరణమును; తిథిత్రయస్పృక్కు గలదినంబును షష్ఠిద్వయంబును కృష్ణాష్టమియు బహుళైకాదశి మొదలు శుక్లప్రతిపత్తువరకును ప్రదోషములను; అంగారకషడ్వర్గును; సూర్యచంద్రులచూపును; చంద్రుఁడున్న రాశిని దక్షిణాయనగత సూర్యుని తనకెదుటనున్న శుక్రునివీనిఁ బరిత్యజించి శుభకరంబగుదివసమందు నూతనగృహమును బ్రవేశింపవలయునని తా॥

గృహప్రవేశనక్షత్రఫలము

శ్లో॥ చిత్రామిత్రవసూత్తరాంత్యవరుణ బ్రహ్మేందుతారాదశ
శ్రేష్ఠా స్స్యుర్గృహయప్రవేశ ఉడుషు స్యాన్మధ్యమం పుష్యభమ్॥

తద్గేహం పరహస్తయాతి మదితిస్వాత్యర్కదస్రాచ్యుతే ।
రుద్రాగ్నిజ్వలనప్రదా చగృహిణాశ్శేషాస్తు దుఃఖప్రదాః ॥

టీక॥ చిత్రా-చిత్రానక్షత్రము మిత్ర-అనూరాధ, వసు-ధనిష్ఠ, ఉత్తర - ఉత్తరాత్రయము - అంత్య-రేవతి, వరుణ - శతభిషము, బ్రహ్మారోహిణి, ఇందు మృగశీర్షయును, తారాః నక్షత్రములు, దశ-పదియు, నిలయప్రవేశే- గృహప్రవేశ మందు: శ్రేష్ఠాః-మంచివి, స్యుః-అయినవి, పుష్యభం-పుష్యనక్షత్రము, ఉడుషు నక్షత్రములయందు-మధ్యమం-మధ్యమము, స్యాత్-అగును;అదితి-పునర్వసునందు స్వాతి-స్వాతియందు, అర్క హస్తయందు, దస్ర-అశ్వినియందు,అచ్యుతే-శ్రవణ మందు, యత్-యేగృహము, ప్రవిశ్యతే-ప్రవేశించబడునో; తత్-అగృహం - ఇల్లు పరహస్తయాతం - దిరాధీనము; స్యాత్ - అగును; రుద్రాగ్ని - ఆర్ద్రాకృత్తికలు జ్వలనప్రదా - అగ్నిభయముచేయును శేషాః-మిగిలిననక్షత్రములుగృహిణః-యజ మానునికి; దుఃఖప్రదాః-దుఃఖముచేయునవి-

అవ॥ గృహప్రవేశమునకు నక్షత్రములఁజెప్పుచున్నాఁడు

తా॥ చి: అనూ; ధని; ఉఫ; ఉషా; ఉభా: రే: శత; రో; మృ; ఈ: ౧౦ నక్షత్రములు మిక్కిలి ముఖ్యంబులనియు; పుష్యమి మధ్యంబనియు పున: స్వాహ అశ్వి; శ్రిఃఈ ౫నక్షత్రములయందుఁబ్రవేశింపబడినగృహమన్యాకాంతమగుననియు ఆర్ద్ర; కృత్తిక: ఇవియగ్నిభయప్రదములనియు; శక్కననక్షత్రములు గృహపతికి దుఃఖకరంబులనియుతా॥

## గృహములకు ద్వారనిర్ణయము

శ్లో॥ కృత్వాదౌ నవధా స్వనిర్మితగృహక్షేత్రంనవస్వేవతే ।
ద్భాగేష్వర్కముఖాః నవప్రతిదిశం సంస్థాప్య తత్సద్మసు ।
మర్త్యామర్త్యచతుష్పదాం కవిగురుజ్ఞాంశేషు కుర్యుః క్రమా,
ద్ద్వారాణీశ్వరవహ్ని రాక్షసమరుత్కోణాదిరవ్యాదిషు ॥

టీక॥ అదౌ-ప్రథమమందు స్వనిర్మితగృహక్షేత్రం - తనచేనిర్మించఁబడిన యింటిస్థలమును; ప్రతిదిశం-ప్రతిదిక్కునందు;నవధా తొమ్మిదిభాగములుగా;కృత్వా చేసి; నవస్వేవ-తొమ్మిదైన; తద్భాగేషు- అగృహభాగములయందు: అర్కముఖాః సూర్యాదినవగ్రహములను; సంస్థాప్య-స్థాపనచేసి; తత్సద్మసు-అగృహములయందు మర్త్య-మనుష్యులు; అమర్త - దేవతలు; చతుష్పదాం - గజాశ్వాదులయొక్క; క్రమాత్-వరుసగా: కవిగురుజ్ఞాంశేషు-శుక్రగురుబుధాంశయందు. ఈశ్వర- ఈశా న్యము; వహ్ని-అగ్నేయము: రాక్షస - నైరృతి; మరుత్ - వాయవ్యము అను

కోణాది-కోణములయందును; రవ్యాదిషు-సూర్యుఁడాదిగా నవగ్రహములుండుస్థానములయందు; ద్వారాణి-ద్వారములను; కుర్యుః-చేయవలయును.

అవ. దేవమనుష్యపశుగృహంబులకు వాకిండ్లను నిర్ణయింపుచున్నాఁడు.

తా॥ తానేర్పఱిచియున్న యింటినిడివిని ౯ భాగములయందు పడమటింటికీశాన్యము మొదలుకొని యాగ్నేయమువరకును ఉత్తరపుయింటికాగ్నేయము మొదలు నిర్ఋతివరకు, తూర్పింటికి నిర్ఋతి మొదలుకొని వాయవ్యమువరకును, దక్షిణపింటికి వాయవ్యము మొదలీశాన్యమువరకును సూర్యాదిగ్రహంబులనుంచఁగా నేర్పడిన శుక్రునిభాగంబున మనుష్యగృహంబునకును బృహస్పతిభాగమున దేవతాగృహంబునకును బుధునిభాగమునగజపశుతురంగాదిశాలలకును వాకిడ్లనేర్పరచవలయును

పక్షాంతరద్వారనిర్ణయము ౨౭౭

శ్లో॥ సర్వేషా మథవా యథారుచి గృహద్వారాణి కుర్యుఃకవే।
రాచార్యస్య బుధస్యవా ప్రతిదిశం భాగే సమస్తాలయే।
అష్టస్వష్టసు వాత్రిషు త్రిషు గృహే కార్యేషు భాగేష్వత।
న్మధ్యే వాధికధామభాగసహితం వామే కవాటాన్వితమ్॥

టీక॥ అథవా-లేక, సర్వేషాం - మనుష్యదేవచతుష్పాదులకు, యథారుచి-ఇష్టప్రకారము, సమస్తాలయే — సర్వగృహములయందు, కవేః - శుక్రునియొక్క, ఆచార్యస్య - బృహస్పతియొక్క, బుధస్యవా - బుధునియొక్కనా, భాగే - భాగమందు, గృహద్వారాణి-గృహద్వారములు, కుర్యుః—చేయుదురు, [మనుష్యులకుశక్రిభాగమను నియమములేదు, ఇదియేయీశ్లోకమందువిశేషము] వా-లేక, అష్టష్వష్టసు-యెనిమిదెనిమిదిభాగములయందు, కుర్యుః - చేయుదురు, [అనఁగా కేతువుమనఁతలియెనిమిదిదిక్కులయందెనిమిదిగ్రహములమంచి శుక్రగురుబుధభాగములయందుద్వారములుచేయుదురమట] అథవా-లేక, ప్రతిదిశం-ప్రతిదిక్కువందు, కార్యేషు-చేయతగిన, త్రిషుత్రిషు-మూడుమూడు, భాగేషు-భాగములయందు, తన్మధ్యే-అభాగములమధ్యభాగమందు, ధామ్నః—యింటికి, అధికవామభాగసహితం—ఎక్కువగు ఎడమభాగముకలుగునట్లుగా, కవాటాన్వితం-ద్వారముకలదానిన్నిగా, కార్యం-చేయతగినది.

అవ. పక్షాంతరమువలన వింద్లకు ద్వారములు నిర్ణయింపుచున్నాఁడు.

తా॥ ఉత్తరక్రమంబున నేర్పరచబడిన ౯ భాగములయందును మనుష్యాదులగృహములకుశుక్రాదిభాగములలోనేర్పరచతలయునునమనియమములవదలిమనుష్య

దేవపశ్వాదుల సకలదిగ్గతగృహములకును శుక్రి గురు బుధుల భాగములలో నొక భాగమునందు ద్వారము నేర్పరచవలెనని యు, మఱియొక పక్షమున గృహాయము నెనిమిది భాగములుచేసి సూర్యాదిరాహుపర్యంత మాభాగముల విభజించి శుక్రి బుధ గురు భాగములలో నేర్పరచవలయును నింకొకపక్షమం దింటి నిడివిని మూఁడుభాగ ములుచేసి యందుమధ్యభాగమున నెడమప్రక్కకొంచ మధికముండునటుల ప్రదే శమువదలి తలుపుతోఁగూడునటుల ద్వారము నేర్పఱచవలయునని తా॥

## రాశిభేదముల బహిర్ద్వారనిర్ణయము ౨౨౫

శ్లో॥ ప్రాగ్ద్వారంఝషకర్కటాళిగృహిణాం ద్వారంతుయామ్యంశుభం
యుగ్మస్త్రీమృగసద్మనాం ఘటతులాగోవేశ్మనాం పశ్చిమమ్ ।
ద్వారంతూత్తర మర్థదం హరిధనుర్మేషాలయానాం నృణాం ।
యద్వైకైక మజాదిచ ప్రతిదిశం ప్రాగాది తద్దేహినామ్ ॥

టీక॥ ఝష - మీనము, కర్కట - కర్కాటకము, అళి— వృశ్చికము, జన్మ రాశిగాగల, గృహిణాం-గృహస్థులకు, ప్రాగ్ద్వారం-తూర్పుద్వారము, శుభం-మంచిది, యుగ్మ-మిధునము, స్త్రీ-కన్య, మృగ - మకరము, సద్మనాం—జన్మరాశిగాగలవారికి, యామ్యం-దక్షిణపుదైన, ద్వారంతు-ద్వారము; శుభం - మంచిది, ఘట-కుంభము, తులా-తులయు, గో-వృషభము, వేశనాం-జన్మరాశిగాగలవారికి, పశ్చిమం-పడమటి ద్వారంతు—ద్వారమైతే, శుభం-మంచిది, హరి-సింహము, ధనుః-ధనస్సు, మేష- మేషము, ఆలయానాం - జన్మరాశిగాగల, నృణాం -నరులకు, ఉత్తరం-ఉత్తరపు, ద్వారంతు-ద్వారమైతే, అర్థదం-ధనదాయకము, యద్వా-పక్షాంతరముచేత, అజాది- మేషముమొదలు. ఏకైకం-ఒక్కొక్కరాశిని, ప్రాగాది-తూర్పుమొదలుగా, ప్రతి దిశ-ప్రతిదిక్కున, నిక్షిప్య - ఉంచి, తద్దేహినాం - తత్తద్రాశిజాతులకు, శుభం— మంచిది, [ఏదిక్కున యెవని జన్మరాశియందుండిన యాదిక్కున యాపురుషునకు ద్వారముండవలయుననుట]

అవ. రాశిభేదముచేతఁదలవాకిలి వేర్పరచుటకుదిక్కుల నిర్ణయింపుచున్నాడు

తా॥ మీనకర్కాటకవృశ్చికరాసులయందుఁబుట్టినవరుల తూర్పునను, మిధున కన్యామకరరాసులయందు బుట్టిననరులు దక్షిణంబునను, కుంభతులా వృషభరాసుల యందుబుట్టిన నరులు పశ్చిమంబునను, సింహధనుర్మేషరాసులయందుఁ బుట్టిననరు లుత్తరంబునను: తమతమ యిండ్లకు తలవాకిండ్లనేర్పరచిరేని శుభసంపదలు

కలుగును. మఱియొకపక్షమున: మేషాదిరాసులం బ్రాగాదిదిక్కులయందు మూఁడావర్తులు గణనచేయఁగా గృహపతిరాశి యేదిక్కుకువచ్చునో ఆదిక్కున తలవాకిలి నేర్పరచవలయునని తా॥

## కర్తకుజన్మరాశిలగ్నాదులయందు గృహప్రవేశఫలములు

శ్లో॥ సంవేశ శ్శుభద స్స్వజన్మని గృహేలగ్నే చతుర్థాలయే ।
తాభ్యాం చోపచయే క్రమాత్ఫలమిదం కర్తుస్స్వజన్మాదిషు।
నిర్వ్యాధించ దరిద్రకీర్తిసుహృదో నిష్పుత్రనిశ్శత్రుతాం।
నిర్జాయంనిధనామయస్థిరధనద్వేష్యాః ప్రదద్యాత్సదా॥౨౬౯

టీక॥ స్వజన్మని–తనజన్మగల: గృహే–రాశియందును: లగ్నే-స్వజన్మలగ్నమందును: చతుర్థాలయే - స్వజన్మరాశిలగ్నమునకు నాలిగింటను: తాభ్యాం-ఆజన్మరాశిలగ్నములకు: ఉపచయే-తృతీయషష్ఠదశమైకాదసులయందు: సంవేశః–నూతనగృహప్రవేశము: శుభదః-మంచినిచ్చును: అథవా-లేక; కర్తుః-కర్తకు: స్వజన్మాదిషు-తనజన్మలగ్నమునందైనా రాశిమందైనా: క్రమాత్-క్రమముగా: ఇదం–ఈ చెప్పఁబోవు: ఫలం-ఫలము: భవతి-అగుచున్నది: [ఏవియవిన] నిర్వ్యాధిం–జన్మమందువ్యాధిలేకుండుటను: దారిద్ర్యం-రెండింటదారిద్ర్యమును: కీర్తిం-మూడింట కీర్తిని: సుహృదః-నాల్గింటస్నేహమును: నిష్పుత్రతాం-ఐదింట పుత్రులులేకుండుటను: నిశ్శత్రుతాం-ఆఱింటశత్రువులులేకుండుటను: నిర్జాయం-ఏడింటభార్యలేకుండుటను: నిధన-యెనిమిదింటమరణమును: అమయ-తొమ్మిదింటరోగము: స్థిర-పదింటచిరకాలస్థితిని: ధనం - పదకొండింట ధనమును: ద్వేష్యాః-పండ్రెండింట విరోధమును: సదా–ఎల్లప్పుడు: ప్రదద్యాత్-యిచ్చుచుండును.

తా॥ జన్మరాశియందును; జన్మలగ్నమునందును; జన్మరాశిలగ్నములకు ౩-౪-౬-౧౦-౧౧ ఈ లగ్నములయందును గృహప్రవేశము శుభకరంబగును: మఱియొక పక్షంబున తనజన్మాది ద్వాదశరాశిలగ్నములయందును గృహప్రవేశము క్రమంబున ఆరోగ్యదారిద్ర్యకీర్తి: స్నేహః విప్సంతానః నిశ్శత్రు భార్యాభావః మరణః రోగః స్థైర్యః ధనః శత్రుత్వములఁ గణుగఁజేయునని తా॥

## గృహప్రవేశమునకు పాపాష్టమచంద్రదోషములు

శ్లో॥ పాపః పాపయుతేక్షితోఽష్టమగతః పాపాలయస్థోఽథవా ।
వర్షాచ్ఛే చ్ఛుభవీక్షితోఽష్టగుణతోహాన్యాద్గృహస్వామినం

క్షీణేందుశ్చ షడష్టరిప్ఫగృహగ శ్చేత్సన్ని వేశాలయా ।
ద్ధన్యాత్కర్తృకళత్రమాశునివిశేల్లగ్నే విశుద్ధే౽ష్టమే॥ ౨౮౦

టీ॥ పాపః-క్రూరగ్రహము, పాప-పాపగ్రహముతో, యుత - కూడినను, ఈక్షితః - చూడఁబడినను, అష్టమగతః — ప్రవేశలగ్నమున కష్టమముననున్నను, అథవా-లేక, పాపాలయస్థ-పాపరాశిగతుఁడై (అష్టమముననున్నను, గృహస్వామినం —యజమానుని, వర్షాత్-సంవత్సరానంతరము, హన్యాత్-చంపును; శుభవీక్షితః— శుభగ్రహములచే చూడఁబడి పాపగ్రహ మష్టమమందున్న: అష్టగుణితః-ఎనిమిది సంవత్సరములకు తర్వాత: హన్యాత్-చంపును: క్షీణేందుః-క్షీణచంద్రుడుఁ: షడష్ట రిప్ఫగృహగః-ఆరు: ఎనిమిది: పండ్రెండురాసులబొందినవాడై: సన్నివేశాలయాత్- గృహప్రవేశలగ్నముకంటె: స్థితశ్చేత్-ఉన్నయెడల: కర్తృకళత్రం-యజమానుని భార్యను: ఆశు-శీఘ్రముగా: హన్యాత్-చంపును: అష్టమే - అష్టమస్థానము: విశుద్ధే సతి-గ్రహశూన్యమగుచుండగా: లగ్నే-మంచిలగ్నమందు: విశేత్-ప్రవేశించవలెను

తా॥ ఒకానొక పాపగ్రహము: మఱియొక పాపగ్రహముచేఁ జూడఁబడుచు నైనను: పాపగ్రహముతోఁ గూడియైనను: పాపగ్రహరాశిబొందియైనమండిప్రవేశ లగ్నమునకు ౮ ట నుండెనేని యొకసంవత్సరమునకుపిదప నాగృహపతిభార్యవైధ వ్యమునొందును: పాపగ్రహము శుభగ్రహముచేఁ జూడఁబడుచు ౮ట నున్న నెని మిది సంవత్సరములకు పిదప ముందుచెప్పిన దుష్ఫలముగలుగును: చంద్రుఁడు ౬-౮-౧౨ ఈస్థానములయందున్న గృహపతి యపత్నీకుఁడగును: కావున ౮ ట నేగ్రహంబు నుండఁగూడదని తా॥

గ్రహములదృష్టినిర్ణయము ౨౮౧

౧ పాదాఖ్యా దశమే తృతీయభవనే దృష్టిర్ద్విపాదా౽భిధా ।
ఖేటాద్యా నవమేచ పంచమగృహే రాశౌ చతుర్థే౽ష్టమే॥
దృష్టి స్స్యాత్త్రిపదాథసప్తమగృహే సంపూర్ణదృష్టిః క్రమా।
దేకద్విత్రిచతుష్పదేషు బలినో మందార్యభౌమాః పరే ॥

టీక॥ ఖేటద్యా-గ్రహముమొదలుగాగల, దృష్టిః—దృష్టి, దశమే - పదింట, తృతీయభవనే-మూడింట, పాదాఖ్యా-పాదమను పేరుగలది: నవమే—తొమ్మిదింట: పంచమగృహే-ఐదింట: ద్విపదాభిధా-ద్విపదమను పేరుగలది; చతుర్థే-నాలుగింట అష్టమేచ-ఎనిమిదింట,త్రిపదా-త్రిపదమను పేరుగలది:అథ-పిమ్మట:సమస్తగృహే

ఏడింట: సంపూర్ణదృష్టిః-పూర్ణమగుదృష్టి మందారభౌమాః - శనిగుర్వంగారకులు పరేచ-ఇతరగ్రహములు త్రిమాత్-వరుసగా: ఏక ద్విత్రియచతుష్పదేషు- ఒకటి రెండు మూడు: నాల్గుపాదములయందు బలినః-బలవంతులు.

తా॥ గ్రహములకు తమరాశి మొదలుకొని ౩, ౧౦ ఈ రాసులయందుపాద దృష్టియు: ౫: ౯ రాసులయందు అర్ధదృష్టియు ౪: ౮ ఈ రాసులయందు త్రిపాద దృష్టియు: ౭ వ రాశియందు పూర్ణదృష్టియుఁ గలిగియుండును: అందు పాదదృష్టిచే శనియు: అర్ధదృష్టిచే గురుఁడును: త్రిపాదదృష్టిచే కుజుండును: పూర్ణదృష్టిచేసూర్య చంద్ర బుధ శుక్రులు నధికవీక్షణముగలవారని తా॥

గృహప్రవేశలగ్నమునకు గ్రహస్థితఫలము ౨౮౨

శ్లో॥ ఏక శ్చేచ్ఛత్రుభాగగో దశమగో జాయాస్థితో వాగ్రహా।
స్తద్గేహం పరహస్తయాత మథవా తత్సద్మ వేశాలయాత్ ।
క్రూరా లాభరిపుత్రిగా శ్శుభఫలాః కేంద్రత్రికోణస్థితాః ।
సౌమ్యా స్సౌమ్యనిరీక్షితే స్థిరగృహే రాత్రౌ దివావావిశేత్॥

టీక॥ ఏకః-ఒక్కటగుశుభగ్రహమైనపాపగ్రహమైననుపరమభాగగః-శత్రు భాగమునుబొందినను: వేశాలయాత్-ప్రవేశలగ్నముకన్న దశమగః-పదింటనున్నను జాయాస్థితః-సప్తమముననున్నను: తద్గేహం-అగృహము:పరహస్తయాతం-పరాధీన మగును, అథవా-లేక: వేశాలయాత్-ప్రవేశలగ్నముకన్న:క్రూరాః-పాపగ్రహములు లాభరిపుత్రిగాః— పదకొండు:అరు:మూడురాసులనున్న:శుభఫలాః—మంచిఫలమిచ్చు నవి: సౌమ్యాః-శుభగ్రహములుకేంద్రత్రికోణస్థితాః—కేంద్రత్రికోణములయందుండి శుభఫలాః-మంచిఫలమునిచ్చునవి: సౌమ్యనిరీక్షితే - శుభగ్రహముచే చూడఁబడిన స్థిరగృహే — స్థిరలగ్నమందు: రాత్రౌవా — రాత్రియందైనా: దివావా - పగలైనా: తత్సద్మ - నూతనగృహమును విశేత్ - ప్రవేశించవలయును.

తా॥ ఒక గ్రహము శత్రువుయొక్క అంశమును బొందియుండిలగ్నమునకు ౭-౧౦ ఈ స్థానములయందుండెనేనియాగృహముపరాధీనమగును:పాపగ్రహములు ౩-౬-౧౧ ఈ స్థానములయందును శుభగ్రహములుకేంద్రత్రికోణస్థానములయందు నుండగ శుభగ్రహములచేఁ జూడఁబడుచున్న స్థిరలగ్నమునందు నూతనగృహమును ప్రవేశించిన శుభఫలంబులుగలుగునని తా॥

గ్రహదృష్టినిర్ణయము ౨౮౩

శ్లో॥ అష్టౌ మేషకుళీరచాపఘటగోకుంభాళిమీనాః క్రమాత్ ।
జ్ఞేయా యామ్యాదిగాద్యయః ప్రతిదిశం త్వేకైకరాశిర్భవేత్ ।
తత్తద్రాశిభవస్య తద్దిశి గృహే మృత్యుప్రదం నో విశేత్ ।
ద్బ్రహ్మస్థానగృహంతు కేసరిమృగస్త్రీయుగ్మజానాంతథా ॥

టీక॥ మేష–మేషము, కుళీర-కర్కాటకము, చాప- ధనస్సు, ఘట - తుల, గో-వృషభము, కుంభ-కుంభము, అళి–వృశ్చికము, మీనాః–మీనములు, అష్టౌ- ఎనిమిదిరాసులు, యామ్యాదిగాదయః-దక్షిణదిక్కు మొదలుగాఁగలవై, క్రమాత్ - వరుసగా, జ్ఞేయాః-తెలియతగినవి, ఏకైకరాశిః-ఒక్కొక్కరాశి ప్రతిదిశం-ప్రతిదిక్కున భవేత్ – ఉండును, తత్-ఆహేతువువల్ల, తద్రాశిభవస్య-ఆరాశియందు పుట్టువానికి, తద్దిశి-ఆదిక్కున, గృహే–లగ్నమందు,మృత్యుప్రదం-మరణము చేయును:నోవిశేత్ ఆరాశియందు ప్రవేశించగూడదు, బ్రహ్మస్థానగృహం-బ్రహ్మయందురాశిని,అనగా మధ్యమగృహమైతే] కేసరి-సింహము, మృగ-మకరము స్త్రీ-కన్యయుగ్మ - మిథునము, జానాం-పుట్టినపురుషులకు, తథా - అట్లుమృత్యువుకలుగును గనుక గృహప్రవేశముకూడదు.

అవ॥ జన్మరాశియందు గృహప్రవేశమునకు కొరగానివిషయమును జెప్పుచున్నాఁడు

తా॥ మేష కర్కాట, ధనుః తులా,వృషభ:వృశ్చిక: మీనరాసులు క్రమంబున దక్షిణదిక్కు మొదలుగ నెనిమిదిదిక్కులకు నధిపతులుగాన గృహపతి జన్మరాశి యేదిక్కున కధిపతియైయుండునో యాదిక్కునందుండెడిగృహమును:జన్మరాశిలగ్నమునందును మధ్యమగృహమును సింహః మకరః కన్యా, మిథునః రాసులయందు బుట్టినవరులు ఈలగ్నములయందును ప్రవేశించిరేని మరణముగలుగునని తా॥

వృషభచక్రలక్షణము

శ్లో॥యస్మిన్ భే౽గ్కయుతస్తదాదిగణయేచ్ఛంద్రాన్వితర్క్షాంతత
కుర్యాన్మృత్యుముదుత్రయంశిరసిచ ప్రాక్పాదయోర్దర్శామ్
చత్వార్యవతు పశ్చిమాంఘ్రియుగళే స్థైర్యంచ చత్వారితః
త్పృచ్ఛేతుభ్రమణంత్రయంచతురధోవామేతుపార్శ్వేఽర్థకృత్

టీ॥ వృషభమువలె చక్రమునువ్రాసిశిరస్సు మొదలుగ నవయవములయందు చెప్పఁబోవునట్లు సమస్తనక్షత్రములువ్రాసి ఆచక్రమందు: యస్మి యే: భే - నక్షత్రమందు: అర్క-యుతః-సూర్యుడుండునో: తదాది-అనక్షత్రము మొదలు: చంద్రాన్వితర్క్షాంతతః-నిత్యనక్షత్రమువరకు: గణయేత్-లెక్కించవలయును.ప్రాక్పాదయోః తూర్పుపాదములనఁగా ముందుపాదములయందుః చత్వారి-నాల్గునక్షత్రములు: దుర్గాం-దుర్గశను: కుర్యాత్ - చేయును: పశ్చిమాంఘ్రియుగళే — వెనుకకాళ్ళయందు చత్వారి-నాలుగునక్షత్రములు; స్థైర్యం — స్థిరకాలస్థితిని చేయును; తత్పుచ్ఛే - దాని తోకయందు; త్రియం—మూడునక్షత్రములు: భ్రమరాం- తిప్పటను కుర్యాత్-చేయును అథః-క్రింద; వామపార్శ్వే-యెడమభాగమందు;చత్వారి-నాల్గునక్షత్రములు అర్థ కృత్-ధనదాయకము: స్యాత్—అగును

శ్లో॥ ధాన్యం దక్షిణపార్శ్వకే చతు రధో పృష్ఠేత్రియంసంపదం
వక్త్రే భత్రితయంపశూన్ ప్రకురుతే చక్రంవృషాఖ్యంత్విదమ్।
ద్వంద్వాఖ్యేఽగ్నిభయాదికే చ నృపతేర్యాత్రానివృత్తౌ పున।
స్సంవేశే చ విధిస్స్వనిర్మితగృహే సర్వం విచింత్యం బుధైః ॥

టీక॥ దక్షిణపార్శ్వకే- కుడిప్రక్కయందు: చతుః - నాలుగునక్షత్రములు ధాన్యం-ధాన్యమును; ప్రకురుతే - చేయుచున్నది- అథః - పిమ్మట పృష్ఠే - పృష్ట భాగమందు త్రియం-నక్షత్రత్రయము: సంపదం-సంపత్తును, ప్రకురుతే - చేయుచున్నది. వక్త్రే-ముఖమందు: భత్రితయం-నక్షత్రత్రయము: పశూన్—పశువులను ప్రకురుతే-చేయుచున్నది: ఇదం - ఇది వృషాఖ్యం - వృషభము: చక్రము: ద్వంద్వాఖ్యే-ద్వంద్వయుద్ధమందుః అగ్నిభయాదికే-అగ్నిభయాదులయందును;నృపతేః-రాజుయొక్క: యాత్రానివృత్తౌ - యుద్ధమునుంచి వచ్చునపుడును: పునః- తిరిగి సంవేశే-గృహప్రవేశమందును: స్వనిర్మితగృహే-నూతనముగాకట్టి యింటప్రవేశించునపుడును అయంవిధిః-ఈవిధి: బుధైః పండితులచే, విచింత్యం-విచారించఁదగినది

ఆవ॥ రెండుశ్లోకములచే గృహప్రవేశవిషయమై వృషభచక్రగతనక్షత్రములకు ఫలము చెప్పుచున్నాడు

తా॥ వృషభాకార మగుచక్రమును వ్రాసి దానిశిరస్సు మొదలగు నవయవంబులయందుచెప్పఁబొయ్యెడి తెఱంగున సూర్యుఁడున్న నక్షత్రము మొదలుగ వ్రాసి యదిమొదలు నిత్యనక్షత్రమువరకు గణనచేయఁగా నామనక్షత్రము చక్రరూపమైన

వృషభముయొక్క శిరస్సులగు ౩ నక్షత్రములలోనున్న మృత్యువును, ముందరి కాళ్ళలోనున్న ౪ నక్షత్రములైన దురవస్థను, వెనుకటికాళ్ళయందున్న ౪ నక్షత్రములు చిరకాలముండుటను, తోకయందున్న మూఁడునక్షత్రములు దేశత్రిమణమును, ఎడమ పార్శ్వమందున్న ౪ నక్షత్రము ధనమును, కుడిప్రక్కనున్న ౪ నక్షత్రములు ధాన్యమును, పృష్ఠభాగమందున్న ౩ నక్షత్రములు సంపదను, ముఖమందున్న ౩ నక్షత్రములు పశువులనుంగలుగజేయుననియు, ఇది వృషభచక్రమనియు; నీచక్రము ద్వంద్వయుద్ధము జేయునపుడును, రాజులు యాత్రబోవునపుడును, మరలవచ్చునపుడును నూతనగృహప్రవేశము కాలమందును ఇత్యాది కార్యములయందు పండితులచేఁ జూడఁదగినదనియును తా॥ [దీనిచక్రము ఆఖరునఁ జూడవలయును]

## కలశచక్రలక్షణమ్ ౨౯౬

శ్లో॥ చక్రం స్యాత్కలశ స్వరూపమథతత్సంలిఖ్యమూర్ధ్న్యేకభం
ప్రాగాద్యాసు చతుశ్చతుః ప్రతిదిశం చత్వారితన్మధ్యమే।
కంఠే త్రీణి గుదే త్రయంచ విలిఖే ద్భానాం క్రమాత్తత్ఫలం
వక్ష్యేఽర్కాన్వితభాదితశ్చగణయేత్సంవేశధిష్ణ్యాంతతః।

శ్లో॥ శీర్షచ్ఛేదం మథ ప్రవాస ముభయా ధాన్యంతతో నిర్ధనం।
గర్భస్రావ మథ శ్రియం గృహపతేర్ద్వా భ్యాంతుస్సదా
సంగ్రామాఖిలమంగళైలసగన ప్రాసాదదేవాలయ।
క్షేత్రారామగృహప్రవేశసమయే జ్ఞేయంహిచక్రద్వయం॥

టీక॥ కలశస్వరూపం — కలశాకారముకలుగునట్లుగా సంలిఖ్య-వ్రాసి అథ - పిమ్మట, అర్కాన్వితభాదితః-సూర్యుఁడుండునక్షత్రముమొదలు, సంవేశధిష్ణ్యాంతతః- గృహప్రవేశనక్షత్రమువరకు, గణయేత్-లెక్కించవలయును, అథ-పిమ్మటమూర్ధ్ని కలశశిరస్సునందు, ఏకభం-ఒకనక్షత్రము; ప్రాగాద్యాసు — తూర్పుదిక్కుమొదలు ప్రతిదిశం-ప్రతిదిక్కునను, చతుశ్చతుః-నాలుగునాలుగునక్షత్రములు; తన్మధ్యే - కలశమధ్యయందు చత్వారి-నాలుగు, కంఠే-కంఠమందు, త్రీణి-మూడు; గుదే-గుదమందుత్రయం [illegible] విలిఖేత్ - వ్రాయవలయును; భానాం-మూర్ధాది
[illegible], క్రమాత్ -క్రమముగ [illegible]
[illegible] - దేశాంతరః
ధాన్యమును, నిర్ధనం-దారిద్ర్యమును గర్భస్రావం-గర్భస్రావమును అథ - పిమ్మట

శ్రియం-సంపత్తును, శతాయుః-నూరేండ్లాయువును, గృహపతేః-యజమానునికి,సదా యెల్లప్పుడు, దద్యాత్-ఇవ్వవలయును, సంగ్రామ-యుద్ధమందు, అఖిలదుర్గ-సమస్త దుర్గములయందు, శైల-పర్వతములయందు, నగర-పట్టములవిషయమై, ప్రాసాద మేడలయందు, క్షేత్ర-క్షేత్రములవిషయమై, ఆరామ-తోటలయందు, గృహప్రవేశ గృహప్రవేశముయొక్క, సమయే-కాలమందు, చక్రద్వయం- ఈకలశవృషభచక్ర ములురెండు, జ్ఞేయం-తెలియతగినవి.

తా॥ కలశాకారంబగు నొకచక్రమువ్రాసి యందునీచెప్పఁ బోయెడి క్రమం బున సూర్యుఁడున్న నక్షత్రము మొదలుగా, ౨౭నక్షత్రములనువ్రాసియది మొదలు గృహప్రవేశనక్షత్రమువరకు నెంచఁగా నాప్రవేశనక్షత్రకలశశిరస్థంబగు నొకనక్ష త్రమైయున్న గృహపతి శిరచ్ఛేదంబును, కలశములకు ప్రాగ్భాగమందున్న ౪నక్ష త్రములలో నొకటియైన నెల్లకాలము పరదేశగమనమును, దక్షిణభాగమందున్న ౪ లో నొకటియైన నిర్భయమును, పశ్చిమంబునున్న ౪ లో నొకటియైన ధాన్యమును, ఉత్తరంబుననున్న ౪ లో నొకటియైన దారిద్ర్యమును, మధ్యభాగముననున్న ౪లో నొకటియైన గృహపతిభార్యకు గర్భస్రావంబును, కంఠస్థానమందున్న ౩లో నొకటి యైన సంపదయు, అధఃప్రదేశమందున్న ౩ లో నొకటియైన పూర్ణాయువుం గలు గును. ఈ చెప్పఁబడిన వృషభకలశచక్రములు రెండును, యుద్ధ, దుర్గ, పర్వత, పుర, సౌధ, దేవతాలయ, కృషిభూమి, ఉద్యానవన, నూతనగృహముల బ్రవేశించు నపుడు చూడవలయునని తా॥ [దీనిచక్రము ఆఖరునఁ జూడవలయును]

పూర్వకాలామృతే — షష్ఠబిందు స్సమాప్తః

ఓమ్

పరబ్రహ్మణేనమః

# పూర్వకాలామృతే

## సప్తమబిందు ప్రారంభః

...(౦)...

### సకలదేవతాప్రతిష్ఠాకాలము ౨౨

శ్లో॥ వారేష్వేవ సవిజ్ఞజీవశశినాం శ్రోత్రత్రయే చోత్తరా।
మైత్రాదిత్యకరద్వయాంత్యశశభృద్ధస్తప్రదేశోత్సవు।

భద్రాప్రపూర్ణజయాసు-చోదగయనేశుక్రేజ్యయోర్వ్యక్తయోః
కుర్యాత్కామదినంవిహాయచకుహూం దేవప్రతిష్ఠాంశుభామ్ ॥

టీక॥ కవిజ్ఞజీవశశినాం-శుక్ర బుధ బృహస్పతి చంద్రులయొక్క, వాసేషు-వారములయందు, శ్రోణత్రయే-శ్రవణధనిష్ఠ శతభిషములయందు, ఉత్తరా-ఉత్తర, ఉత్తరాషాఢ-ఉత్తరాభాద్రలు, మైత్ర-అనూరాధ, అదిత్య-పునర్వసు, కరద్వయం-హస్త చిత్తలు, అంత్య - రేవతి, శశభృత్ - మృగశీర్ష, దస్ర-అశ్విని, ప్రజేశ-రోహిణి- ఉడుషు-ఈ నక్షత్రములయందు, భద్రాప్రపూర్ణజయాసు - భద్రపూర్ణజయ తిధులయందు, ఉదగయనే-ఉత్తరాయణమందు, శుక్రేజ్యయోః-శుక్రబృహస్పతులు వ్యక్తయోః-స్ఫుటముగనుండగా, కామదినం-త్రయోదశివి, కుహూం-అమావాస్యను విహాయ-విడచి, శుభాం-శుభమైన, దేవప్రతిష్ఠాం — దేవతాప్రతిష్ఠను, కుర్యాత్ — చేయవలయును.

తా॥ ఉత్తరాయణమందు గురుశుక్రుల స్తమించకయుండఁగా శుక్ర-బుధ-గురు-సోమవారములును, శ్ర - ధ - శత - ఉధ- ఉషా-ఉభా-అనూ-పున-హ-చి-రే-మృ-అశ్వి-రో ఈ నక్షత్రములును, భద్రతిధులును, అమావాస్యావ్యతిరిక్తపూర్ణ తిధులును,త్రయోదశీవ్యతిరిక్తజయతిధులును, ఇవిసకలదేవతాప్రతిష్ఠలకుప్రశస్తంబు

పశుబంధన కాలము ౨౮౯

శ్లో॥ ఆర్ద్రాజైకపదాంత్యమూలశశభృత్తోయాగ్నిభే షస్వర్థదం ॥
శస్తం స్యాత్పశుబంధనం గురుభృగుబ్రధ్నాఖ్యవారేష్వపి ।
త్యక్త్వా త్వష్ట్రజనార్దనోత్తరవిధీః దర్శంకలిం చాష్టమీం ।
చాంద్రంవః పశుజన్మవారమపి తచ్ఛేషా తిధి శ్శోభనా ॥

టీక॥ ఆర్ద్రా - ఆర్ద్ర, అజైకపద—పూర్వాభాద్ర, అంత్య— రేవతి, మూల-మూలయు, శశభృత్-మృగశీర్ష, తోయ-పూర్వాషాఢ, అగ్ని-కృత్తిక, భేషు-ఈనక్షత్రములయందు, గురు-గురునియొక్క, భృగు-శుక్రునియొక్క, బ్రధ్న—సూర్యుని యొక్క, అఖ్య-పేరుగల, వారేషు-వారములయందు, పశుబంధనం-పశుబంధనము, అర్థదం—ధనమును, శస్తం-ముఖ్యము, స్యాత్-అగును, (బంధనముచే గోశాలప్రవేశాదులగ్రహించవలయును) త్వష్ట్ర-చిత్ర, జనార్దన-శ్రవణ, ఉత్తర - ఉత్తరాత్రయము, విధీః-రోహిణివి, దర్శం-అమావాస్యను, కలిం-చతుర్దశివి, అష్టమీంచ-

అష్టమివి, చాంద్రిం-సోమవారమును; పరుజన్మవారమపి-పరువుయొక్క జన్మవార మునున్నూ, త్యక్త్వా-విడిచి, తచ్ఛేషా - అంతకవన్నమిగిలిన, తిధిః-తిధి; శోభనా-మంచిది. [తిధివల్ల మిగిలిన వారనక్షత్రాదులగూడ గ్రహించవలయును]

తా॥ ఆర్ద్రి - పూభా - రే-మూ-మృ - పూషా-కృ ఈ ౭ నక్షత్రములును గురు శుక్రభానువారములును; పశుబంధనగోష్ఠప్రవేశాదులకు ముఖ్యంబులవియు; చిత్రి-ఉప-ఉషా-ఉభా-రోహిణి ఈ నక్షత్రములును; అమావాస్య - చతుర్దశి- అష్టమి సోమవారము; పశుజన్మవారము లివి నిషిద్ధంబులవియు; తక్కినతిధివారాదులు శుభకరములని తాత్పర్యము. [గోష్ఠమనఁగా బశువులదొడ్డి]

పైతృకవిషయములు ౨౯౦

శ్లో॥ యావంత్యోఘటికాదినేవిఘటికాస్సర్వాశ్చకుర్యాత్సమం
కాలంతంచవిధం క్రమాచ్చ గణనా ప్రాతస్తతస్సంగమః ।
మధ్యాహ్నోఽప్యపరాహ్ణ ఇత్యధభవేత్సాయంతనీమాసికే ।
దర్శే చాబ్దికఏవ వా పితృతిధిస్స్యా సర్వకాలాయది ॥

టీక॥ దినే-పగటియందు; ఘటికాః - ఘటికలు; విఘటికాః - విఘడియలు; యావంత్యః-ఎన్నో: తాః - అః సర్వాః - సమస్తఘడియలను: సమం- సమముగా కుర్యాత్-చేయవలయును; తతః-పిమ్మట: కాలం-కాలమును: పంచవిధం - ఐదువిధములుగా: కుర్యాత్ - చేయవలయును; క్రమాత్ - క్రమముగా: గణనాత్-లెక్కించుటవల్ల:ప్రాతః-ప్రాతఃకాలము:సంగమః-సంగమము: మధ్యాహ్నః-మధ్యాహ్నం అపరాహ్ణః-అపరాహ్నము; అథ - పిమ్మట: సాయంతనీ - సాయంకాలము, సా-ఆతిధి; సర్వకాలాయది-పగలంతయునుండిన, మాసికే-మాసికమందు;దర్శేచ-అమావాస్యయందు; అబ్దికఏవవా-ప్రత్యాబ్దికమందైనా; యోగ్యా-మంచిది; భవేత్-అగును,

తా॥ అహఃప్రమాణఘటికల విఘటికలతోఁగూడ సమంబుగనైదుభాగములఁ జేయఁగా నవి క్రమంబున ప్రాతస్సంగమమధ్యాహ్నపరాహ్ణసాయంకాలములనంబడును; ఈ ౫ విధములగు కాలములయందు వ్యాపించియున్నతిథులు అబ్దికాదిపితృక్రియలకు యోగ్యంబులని తా॥

మాసికాదులకు విశేషకాలము ౨౯౧

శ్లో॥ కార్యాసద్వ్యపరాహ్ణగామో స్సమధికా సామ్యాతుపూర్వాద్య

యోః । పూర్వా సాయాదిన ద్వయో రథ పరా ప్రాగస్తకాలా
ద్రవేః। సానోచేత్ త్రిముహూర్తగాపిత్ర్యతిధిస్స్యాయంతనీచేద్ద్వయో
స్స్యాదేవాత్ర పరాబ్ధికేవిధి రయం దర్శేథవామాసికే ।

టీక॥ ద్వ్యపరాహ్ణయోః- రెండుపరాహ్ణములమధ్యయందు, సమధికా—అధిక
ముగయేపరాహ్ణమందు తిథియుండునో, అని, కార్యా - చేయతగినది, సామ్యాతు-
సమానవ్యాప్తికల తిధి, పూర్వా — పూర్వతిథిచేయవలయును, [తిధి తగ్గుచున్న
ప్పుడు] [పరతిధిహెచ్చునపుడు పరతిధియేచేయవలయుననుట) అట్లు సుమంతుచే
చెప్పఁబడినది. శ్లో॥క్షీయమాణేతుపూర్వైవ వర్ధమానేతుపైపరా । సమత్వేపితద్ధి
వాసావపరాహ్ణోద్వయోర్యది ॥ సా-అ, పిత్ర్యతిధిః-రెండుతిధులయందు సమానమైన
తిధి, రవేః-సూర్యునియొక్క-, అస్తకాలాత్-అస్తమానముకంటె, త్రిముహూర్తగా-
మూడుముహూర్తములుకలదైన, పూర్వైవ-పూర్వతిధియె, నోచేత్-మూడుముహూ
ర్తములువ్యాపించకున్న, పరా - పరతిథి, కార్యా-చేయతగినది, [అపరాహ్ణవ్యాప్తిలే
కున్నను కుతుపకాలవ్యాప్తిగలదైనందువల్ల] ద్వయోః-రెండుతిధులయందు,సాయం
తనీ—సాయంకాలవ్యాప్తిగలుగుటచే, పరా—పరతిధియే, స్యాత్-అగును,అబ్దికే-ఆబ్ధిక
మందు; దర్శే-దర్శయందు; అధవా—లేక; మాసికే—మాసికమందు; అయం - ఈ
విధి-విధిః స్యాత్-అగును.

తా॥ ఒకతిధి రెండుదినముల యపరాహ్ణములయందు వ్యాపించియున్న నప
డెద్ది యపరాహ్ణమంధధికముగనుండునో అతిధియందును: రెండవపరాహ్ణములయం
దును సమముగానుంటెనేని పూర్వతిథియందును: ఒకయపరాహ్ణమందైనను వ్యాపిం
చక పూర్వదినంబున సూర్యాస్తమయమునకు ముందు ౬ ఘడియలు వ్యాపించియుం
డెనేనియు బూర్వతిధియందును; అట్లు లేకయున్నప్పుడును రెండుసాయంకాలముల
యందొక తిధివ్యాపించియున్నప్పుడును పరతిథియందును ప్రతిసాంవత్సరికదర్శ
శ్రాద్ధమాసికములఁ జేయవలయును; రెండవపరాహ్ణములయందు సమముగానున్న
యెడల తిధిక్షయకాలమందు పూర్వతిథియువృద్ధి సామాన్యకాలములయందు పరతిధి
యును గ్రాహ్యంబులని తా॥

మహాలయ నిర్ణయము

శ్లో॥ కుర్యాద్భాద్రపదే ప్రమీతపితృక స్తత్కృష్ణపక్షాదితః ।
పక్షశ్రాద్ధ మథాశ్వినప్రతిపదా యుక్తేంచ పక్షాదితః ।

పక్షాదౌ యది సూతకాదిసహిత స్తత్పంచమీ వాష్టమీ,
యద్వా స్యాద్దశమీతదాదిషుసదాతత్పక్షశేషేషువా ॥ ౨౯౧

టీక॥ ప్రమీతపితృకః-తండ్రిచనిపోయినవాడు; భాద్రపదే - భాద్రపదమాస
మందు; కృష్ణపక్షాదితః—కృష్ణపక్ష ౧ ప్రతిపత్తుమొదలు;ఆశ్వినిప్రతిపదా-అశ్వయుజ
శు ౧ ప్రతిపత్తుతో, యుక్తం-కూడుకొనిన, తత్-ప్రసిద్ధమగు, పక్షశ్రాద్ధం - పక్ష
శ్రాద్ధమును, కుర్యాత్—చేయవలయును, పక్షాదౌ-పక్షాదియందు, సూతకాదిసహితః -
సూతకముమొదలగు వానితోఁ గూడినవాడైన తత్పంచమీ — ఆపక్షమందుపంచమీ
అష్టమీ—అష్టమి, యద్వా-లేక, దశమీ—దశమియు; స్యాత్ — మంచిదగును, తదా
దిషు-కృష్ణపక్షపాడ్యమి మొదలుగాగల, తత్పక్షశేషు - ఆపక్షమందు మిగిలినదిన
ములయందు, సదా—యెల్లప్పుడు, స్యాత్—శ్రాద్ధముచేయవలయును.

తా॥ మృతపితృకుఁడగు నరుఁడు భాద్రపదబ ౧ మొదలాశ్వయుజశుక్ల౧తో
జేరిన౧౬దినములనునిత్యశ్రాద్ధముజేయవలయు; నొకవేళయాపక్షప్రథమదివసమందు
జేయుటకు; ఆశౌచము, పత్నీరజోదర్శనము ఇత్యాదులగు నభ్యంతరములుసంభవించె
నేని యాపక్షమందు, పంచమి, అష్టమి, దశమి, వీటివో నేదినమైనమొదలుగనాపక్ష
శేషదినములయందు మహాలయంబావశ్యకముగ జేయువలయునని తా॥

సకృన్మహాలయ కాలనిర్ణయము

శ్లో॥ పంచమ్యాదిషు చేచ్ఛుభేషు దివసేష్వేవప్రకుర్యాత్సదా
ద్వాదశ్యాం యతిపైతృకం కలిదినే శస్త్రైర్హతానాం పునః।
వర్జ్యే కామదినేపిపైతృభయుతే హస్తాన్వితే భాస్కరే,
స్యాత్సంకల్పవిధిశ్చ పార్వణవిధి ర్యద్వా పితృప్రీతిద ॥ ౨౯౩

టీక॥ శుభేషు-పంచాంగశుద్ధిగలపంచమ్యాదిషు- పంచమిమొదలుగాగల, దివ
సేష్వేవ- దినములయందే,ద్వాదశ్యాం-ద్వాదశియందును,ప్రకుర్యాత్-చేయవలయును
ఏవకారముచే పంచమీపూర్వదినములగ్రహించవలయును,యతిపైతృకం-యతిమహా
లయము, కలిదినే-చతుర్దశియందు, కుర్యాత్ — చేయునది శస్త్రైః — ఆయుధముల
చేత? హతానాంపునః-చచ్చినవారలకైతే చతుర్దశియందుచేయవలయును; పునః అను
టచే యేదినమందైనపార్వణవిధినిచేసి చతుర్దశియందేకోద్దిష్టవిధివి చేయవలయును,
మాధవీయమందు....శ్లో॥ సమత్వమాగతస్యాపి పితుశ్శస్త్రహతస్యచ ఏకోద్దిష్టంసుతైః
కార్యం చతుర్దశ్యాం మహాలయే మితి॥ వర్జ్యేపి విడువతగిన భాద్రపదబహుళత్రయో

దశయందును; పైతృభయుతే–మఘానక్షత్రముతోఁగూడినదినంబునను; భాస్కరే - సూర్యుఁడు, హస్తాన్వితే-హస్తానక్షత్రమందున్నప్పుడును, సంకల్పవిధిః - సంకల్ప విధానము, యద్వా-లేక, పార్వణవిధిః-పార్వణశ్రాద్ధము, పితృప్రీతిదః-పితృప్రీతిని చేయునది, స్యాత్—అగును [ఇట్టియోగముకలిగినపుడేత్రయోదశియందుజేయవలయు ననుట, లేనిచో మానవలయును] ఇదే గజచ్ఛాయమనఁబడును. శ్లో॥యదేందుఃపితజ దైవత్యే హంసశ్చైవకరేస్థితః । యావాతిథిర్వవేత్సాహి గజచ్ఛాయాప్రకీర్తితా॥మృ మానుఁడు పుత్రవంతుడై.తే మఘాయుక్తత్రయోదశియందుసంకల్పశ్రాద్ధముమపుత్ర వంతుడు కానిచో పార్వణశ్రాద్ధమును చేయవలయును; శ్లో॥ మఘాయుగాద్యోశ్చా మ్యేచ శ్రాద్ధంకుర్యాత్ప్రయత్నతః । పిండదానంనకుర్వీత యదిచ్ఛేజ్జీవినస్సుతాన్ ॥

తా॥ పంచాంగశుద్ధిగల కృష్ణపక్షపంచమి మొదలగు దినములయందే సకృన్మ హాలయము జేయవలయుననియు, యతికి ద్వాదశియందు జేయవలయుననియు, విష శస్త్రాదులచే మృతులైనవారల కితరదినములయందు పార్వణశ్రాద్ధముచేసిననుచతు ర్దశినాఁడేకోద్దిష్టవిధిచేచేయవలయుననియు, సూర్యుఁడు హస్తనక్షత్రమందుండినను చంద్రుఁడుమఘయందుండిన నపుడు మహాలయనిషిద్ధమైన త్రయోదశియందును మహాలయము సంకల్పవిధిచేతనైనపార్వణవిధిచేతనైనఁజేసినపితృప్రీతికరంబనియు మఘానక్షత్రముతోఁగూడిన దినమునందును యుగాదియందును,భరణీనక్షత్రమందు అవశ్యకంబుగ జేయందగినశ్రాద్ధమునుశ్రాద్ధకర్తపుత్రవంతుడైయుండెనేనిన కల్ప విధిగానే చేయవలయునని తా॥

శ్లో॥ కారుణ్యాన్విత పైతృకం శుభదినే తత్పక్ష ఏవాచరే ।
కన్యాయాం యది భాస్కరేప్యగతికః కన్యాదిమాసద్వయే ।
యావ ద్వృశ్చికదర్శనాత్స్మృతిబలా దేకంచ వా పైతృకం ।
కాముత్వాచ్చ సకృన్మహాలయమిదం శుద్ధ్యాయుతంచేచ్ఛుభమ్

టీక॥ భాస్కరే-సూర్యుడు, కన్యాయాంయది–కన్యాలగ్నమందున్న, తత్పక్ష ఏవ-అభాద్రపదకృష్ణపక్షమందే, శుభదినే మంచిదినమందే, కారుణ్యాన్వితపైతృకం కారుణ్యశ్రాద్ధమును; ఆచరేత్—చేయవలయును; [పక్షశ్రాద్ధముచేసిననుకారుణ్యశ్రాద్ధ ము తప్పదనుట) అగతికోయది-దరిద్రుఁడైనచో, భాస్కరేపి — సూర్యుఁడున్నా, కన్యాదిమాసద్వయే-కన్యాతులలయందుండగా; యావద్వృశ్చికదర్శనాత్-వృశ్చికప్రవే శముకాగపూర్వము, స్మృతిబలాత్-స్మృతియొక్క బలమువల్ల [శ్లో॥ వృశ్చికాదర్శనా ద్యాంతినిరాశాః పితరోగతాః॥] ఏకంచవా-ఒక్కటైనా,పైతృకం-శ్రాద్ధము,కుర్యాత్

చేయవలయును, అశక్తు(డై నచో నొకకారుణ్యమైనచేయవలయుననియావశ్యకతను తెలుపుచున్నది) సకృన్మహాలయదినం-సకృన్మహాలయరోజు, కామ్యత్వాత్— కామ్యమగుటవల్ల, శుధ్యా, పంచాంగశుద్ధితో యుతం-కూడినదై, శుభం-మంచిది

తా॥ పితృపక్షమున నన్నిదినములయందు నిత్యశ్రాద్ధముచేసినను: ఒకదినమున సకృన్మహాలయము బహుదైవత్యముగ చేయవలయుననియు: ఆకారుణ్యశ్రాద్ధము కామ్యమగుటచేత నాదినంబు పంచాంగశుద్ధిగలదై యుండవలయుననియు.ఆపక్షమున చేయుటకుదారిద్ర్యముచేతనైనను,అనుపపత్తిచేతనైననుసందర్భించకపోయెనేనితులామాసముతుదవరకు శుద్ధిగలదినమున జేయవచ్చునని తా॥

సకృన్మహాలయమ యోగ్యతిథివారనక్షత్రనిర్ణయము ౹౦౯ ౫

శ్లో॥ వర్జ్యా స్త్యేకమహాలయే జననభం నందాశ్చ కామః కలిః ।
శుక్రార్కార్కిదినాని సూతకదినం పత్నీరజోదూషితమ్ ।
తారాస్సప్తదశ స్యు రేవ శుభదా విష్ణుత్రయార్కత్రయా ।
హ్యార్ద్రామిత్రచతుష్టయాద్యశశభృద్భాగ్యార్యయామ్యాభిదా

టీ॥ ఏకమహాలయే-సకృన్మహాలయమందు, జననభం-జన్మనక్షత్రమునందానందతిథులు, కామః—త్రయోదశి; కలి—చతుర్దశి; శుక్రార్కార్కిదినాని - శుక్రగురుసూర్యవారములు: సూతకదినం-సూతకదినము;పత్నీరజోదూషితం-తనభార్యరజస్వలయైనరోజునను; వర్జ్యాని - విడువ(దగినవి; అనగా పవికిరావనుట] విష్ణుత్రయ - శ్రవణ ధనిష్ఠశతభిషములు; అర్కత్రయ-హస్తచిత్రాస్వాతులు; అహి — ఆశ్లేష: ఆర్ద్రా-ఆర్ద్ర; మిత్ర-అనూరాధ; చతుష్టయ - జ్యేష్టమూలపూర్వాషాఢలు: అద్య - అశ్వని; శశభృత్-మృగశిర: భాగ్య-ఉత్తర; ఆర్య — పుష్యమి; యామ్య - భరిణీ; అభిధాః-పేరుగాగల; సప్తదశ-పదునేడు; తారాః నక్షత్రములు; శుభదాః—మంచివి స్యుః ఏవ-ఈప్రకారముగా అగుచున్నవి.

తా॥ నందతిథులు, త్రయోదశి; చతుర్దశి, ఈతిథులును శుక్రభానుగురువారములును; సూతకదినంబులు భార్యబహిష్టయైయున్నదినములును జననవక్షత్రము కృ రో; పున; మ; పూఫ; ఉషా; పూభా; ఉభా; రే; ఈ ౧౦ నక్షత్రములును విషిద్ధములనియు తక్కినవక్షత్రాదులు ముఖ్యంబులనియుతా॥

నిత్యశ్రాద్ధసకృచ్ఛ్రాద్ధములు జేసినగలిగెడుఫలములు

శ్లో॥ నోకుర్యాద్యది పక్షమేకదివసం వానల్ప మల్పంచ వా ।
దారిద్ర్యం బహుదుఃఖ మత్రచ పరే దౌర్గత్య మేవాత్మనః

దాతుః పుత్రధనం భవే దిహ పరే స్వర్గాది పశ్చాద్భవే।
దిత్యుక్త్వాస్వగృహం విసృజ్యపితరః స్వం స్వంవిశేయుఃపదమ్

టీక॥ పక్షం-పక్షశ్రాద్ధమునైనా; ఏకదివసం-సకృన్మహాలయమునైనా; అనల్పం అధికమైన; [ధనికునికి] అల్పంవా - కొద్దిగానైనా; [దరిద్రునికి] నోకుర్యాద్యది- చేయకున్న, ఆత్మనః-తనకు; ధారిద్ర్యం-దారిద్ర్యమున్ను; బహుదుఃఖం - మిక్కిలి దుఃఖమున్ను; దౌర్గత్యం-దుర్గతియు; స్యాత్-కలుగును; దాతుః-మహాలయముపెట్టు వారికి; ఇహ-ఈలోకమందు; పుత్రధనం-పుత్రధనమున్ను; పరే - పరలోకమందు పశ్చాత్-మరణానంతరము; స్వర్గాది-స్వర్గాదులున్నూ; భవేత్-అగును ఇతి - ఇట్లు ఉక్త్వా-పలికి; పితరః-పితృదేవతలు; స్వగృహం-తమగృహమును; విసృజ్య- విడచి స్వంస్వంపదం.తమతమస్థానమగుపితృలోకమును; విశేయుః- ప్రవేశించెదరు

తా॥ పక్షశ్రాద్ధమునైనను, సకృన్మహాలయమునైనను జేసినకర్తకు ఇహం బున పుత్రధనాదిసంపదలను స్వర్గాదిభోగంబులుఁగలుగును: జేయనివాని కిహం బున పుత్రధననాశదుఃఖములును, పరంబున నరకాదులుఁగలుగునట్లు వాని పితృదేవ తలు శపింతురనియుతా॥

షణ్ణవతి శ్రాద్ధస్వరూపము ౨౯౭

శ్లో॥ మన్వాద్యాశ్చ మహాలయాయుగదినాన్యాదిత్యసంక్రాంతయో
దర్శాశ్చ వ్యతిపాతవైధృతిదినా న్యన్వష్టకాః పైతృకే ॥
కాలాషణ్ణవతి స్మృతాశ్చ సతతం దాతుః సుపుత్రార్థదాః ॥
నాయంతో యవనేరిపూరిపుబకాలో కారిపు స్తత్క్రమాత్।

టీక॥ మన్వాద్యాః-మన్వాదులు; నాయం-అక్షర సంఖ్యచేపదునాలుగు; మహా లయాః-మహాలయములు; తోయం-పదునారు; యుగదినాని-యుగదినములు; వన- నాలుగు; ఆదిత్యసంక్రాంతయః-సూర్యసంక్రాంతులు; రిపుః-పండ్రెండు; దర్శాః - అమావాస్యలు, రిపుః-పండ్రెండు; వ్యతిపాతవైధృతిదినాని - వ్యతీపాతవైధృతిదిన ములు; బకాః-వ్యతిపాతలుపదమూడు; లోకాః-వైధృతులుపదమూడు; అన్వష్టకాః - అన్వష్టకలు; రిపుః-పండ్రెండు షణ్ణవతి-తొంబదియారు స్మృతాః - జెప్పఁబడినవై పైతృకే-పితృకర్మయందు క్రమాత్ - క్రమముగ దాతుః దాతకు సుపుత్రార్థదాః- యోగ్యమగు పుత్రధనములకలిగించును

తా॥ మన్వాదులు ౧౪ మహాలయములు ౧౬ యుగాదులు ౪ సంక్రాం తులు ౧౨ అమావాస్యలు ౧౨ వ్యతిపాతదినములు ౧౩ వైధృతిదినములు ౧౩ అన్వ

ష్టకదినములు ౧౨ ఈ౯ాట దినములయందును శ్రాద్ధముచేయువారలకు పుత్రపౌత్ర ధనాభివృద్ధి గలుగుననియు తా॥

మన్వాదియుగాదులయందు శ్రాద్ధఫలములు ౪౯౦

శ్లో॥ కృష్ణాభాద్రపదేఽష్టమీ యది నభో దర్శశ్చ శేషాస్సితా ।
ఆషాఢే దశమీ త్విషే చ నవమీ సాకార్తికే ద్వాదశీ ,
జ్యేష్ఠే ఫాల్గునచైత్రయోరపి శుచౌ ఊర్జేతిథిఃపూర్ణిమా ।
మాఘే మాస్యథ సప్తమీ శుభఫలాపౌషేసితైకాదశీ ॥

శ్లో॥ చైత్రేభాద్రపదేచ మాసయుగళే జ్ఞేయాస్తృతీయాతిథి ,
ర్మన్వాద్యాశ్చ చతుర్దశైవతిథయః పుణ్యాయుగాద్యాశ్చతు ॥
శుక్లోర్జేనవమీసితైవ శుభదా రాధే తృతీయాతిథి ॥
ర్మాఘేదర్శతిథిర్నభస్యబహుళే కామఃకృతాద్యాఇమాః॥

టీక॥ భాద్రపదే-భాద్రపదమాసమందు, కృష్ణాష్టమీ-బహుళాష్టమియు, నభో దర్శశ్చ-శ్రావణబహుళామావాస్య, శేషాః - మిగతతిథులు, సితాః- శుక్లపక్షసంబంధమైనవి, ఆషాఢే-ఆషాఢమాసమందు, దశమీ-శుక్లదశమియు, ఇషేతు-అశ్వయుజమాసమందు, నవమీ-శుద్ధనవమియు, కార్తికే-కార్తీకమాసమందు, సా - ఆశుక్లపక్షముయొక్క, ద్వాదశీ-ద్వాదశియు, జ్యేష్ఠే-జ్యేష్ఠమాసమందు, ఫాల్గుణచైత్రయోః-ఫాల్గుణచైత్రమాసములయందు, శుచౌ-ఆషాఢమాసమందు, పూర్ణిమా-పూర్ణిమయు తిథిః-తిథియును, అథ-పిమ్మట; మాఘే-మాఘమును, మాసి-మాసమందు సప్తమీ శుద్ధసప్తమియు, పౌష్యే-పుష్యమాసమందు, సితైకాదశీ- శుక్లపక్షైకాదశి, చైత్రే-చైత్రమాసమందు, భాద్రపదే-భాద్రపదము,మాసయుగళే-రెండుమాసములయందు తృతీయా- శుక్లతదియయును, తిథిః- తిథియు, చతుర్దశ - పదునాలుగు, తిథయః_ తిథులు, మన్వాద్యాః- మన్వాదులు, శుభఫలాః!- మంచిఫలమిచ్చునవిగా, జ్ఞేయాః- తెలియతగినవి, ఊర్జే-కార్తీకమాసమందు, శుక్లే- శుద్ధ, నవమీ-నవమియు, రాధే-వైశాఖమాసమందు, సితైవ-శుక్లపక్షసంబంధమైన, తృతీయా-తదియయు, మాఘే-మఘమాసమందు; దర్శతిథిః – అమావాస్యయు, నభస్యబహుళే– భాద్రపదబహుళమందు, కామః-త్రయోదశియు; ఇమాః-ఈః చతుః-నాల్గు [తిథులు] కృతాద్యాః– కృతత్రేతాద్వాపరకలియుగములు; పుణ్యాః-పుణ్యదినములు; జ్ఞేయాః–తెలియతగినవి

తా॥ భాద్రపద బహుళ ౧౩, శ్రావణ బహుళ ౩౦, ఆషాఢ శుద్ధ ౧౦, ఆశ్వయుజశుద్ధ౯, కార్తికశుద్ధ ౧౨, చైత్రజ్యేష్ఠాషాఢకార్తిక ఫాల్గున మాసములయందు పూర్ణిమ, మాఘశుద్ధ ౭, పుష్యశుద్ధ ౧౧, చైత్రభాద్రపదశుద్ధ ౩ ఈ ౧౪ దినంబులు మన్వాదులనంబడు. [కార్తీకశుద్ధ ౯, వైశాఖశుద్ధ ౩, మాఘబహుళ ౩౦, భాద్రపద బహుళ ౧౩ ఇవి నాలుగును క్రమంబున కృత, త్రేతా, ద్వాపర, కలి యుగాదులనంబడునుగాన నీమన్వాదియుగాదులయందు శ్రాద్ధముచేయువానికిశుభము.

అష్టకాశ్రాద్ధతిథినిర్ణయము 300

శ్లో॥ పౌషే ఫాల్గునసౌమ్యయోరపి తథామాఘేఽంత్యపక్షేషు చే
త్సప్తమ్యత్ర తథాష్టమీచ నవమీ తిస్రోష్టకా ద్వాదశ ।
షష్ఠే మాసి మహాలయాంతరగతా స్తిస్రోష్టకాస్తత్ర నో ।
దర్శాద్యాస్తదను ప్రసిద్ధదివసాః శ్రాద్ధే పితృప్రీతిదమ్ ॥

టీక॥ పౌషే-పుష్యమాసమందు, ఫాల్గునసౌమ్యయోఃపి - ఫాల్గున మార్గశీర్ష మాసములయందును, తథా-అట్లు, మాఘే- మాఘమాసమందు, అంత్యపక్షేషుచేత్-కృష్ణపక్షములయందైతే, అత్ర-ఈమాసములయందు, తథా - అట్లు, సప్తమీ-సప్తమియు, అష్టమీ-అష్టమియు, నవమీచ-నవమియును, ద్వాదశ-పండ్రెండు, తిస్రోష్టకాః-తిస్రోష్టకలు, షష్ఠే-ఆఱవదియగు, మాసి-మాసమందు, [అనఁగా భాద్రపదమాసమందనుట] తిస్రోష్టకాః-తిస్రోష్టకా, మహాలయాంతరగతాః-మహాలయ మధ్యమందున్నవి, తత్ర-ఆహేతువవల్లను, అమాసమందు తిస్రోష్టకలులేవు,[జ్యేష్ఠ మాసమందే తిస్రోష్టకలని స్మృతులయందున్నందువల్ల] భాద్రపదమందు[తిస్రోష్ట కలయొక్కప్రసంగమువల్ల నిషేధించఁబడినదనుట] తదను-పిమ్మట, దర్శాద్యాః-ఆమావాస్యాసంక్రాంతివ్యతీపాతవై ధృతులను,ప్రసిద్ధదివసాః-ప్రసిద్ధమగుదినములు శ్రాద్ధే-శ్రాద్ధవిషయమై, పితృప్రీతిదాః-పితృప్రీతినికలుగఁజేయుచున్నవి.

తా॥ మార్గశీర్ష పుష్యమాఘఫాల్గునమాసకృష్ణపక్షములయందు సప్తమీ, అష్టమీ నవమి ఈతిథులు ౧౨ను తిస్రోష్టకలనంబడుననియు "మన్వాద్యా" యను శ్లోకము మొదలీనాలుగు శ్లోకములయందును జెప్పఁబడిన ౯౬ దినములయందును శ్రాద్ధము జేసిన పితృదేవతలు ప్రీతినొందుదురనియు తా॥

గయాశ్రాద్ధఫలము 301

శ్లో॥ పితాద్రేర్బహుదానకర్మఫలదం తృప్తిప్రదం స్వర్గదం ।

సాయుజ్యప్రదమేవ వా తదపి యత్కించి ద్గయాపార్వణమ్
సా యాత్రా ప్యథవా మహాసుఖకరీ దైవాచ్చ కర్తుర్మృతిః
స్యా ద్యత్రైవహి ముక్తిదై వసహతత్కర్త్రాపితౄణాంభవేత్

టీక॥ యత్కించిత్ - కొంచమైన, గయాపార్వణం—గయయందుపిండము పేయుట; పితౄదేః-తడ్రిమొదలగువారికి; బహుదానకర్మఫలదం - అనేకదానముల యొక్కఫలమునిచ్చును; తృప్తిప్రదం-మోక్షమునిచ్చునది; స్వర్గదం-స్వర్గమునిచ్చునది; సాయుజ్యప్రదం-మోక్షమునిచ్చునది; సా - ఆ; యాత్రా-అగయనుగూర్చిన ప్రయాణమున్ను; మహాసుఖకరీ-గొప్పసుఖమునిచ్చును; అధవా-లేక;దైవాత్-దైవవశమున; కర్తుః-గయాప్రయాణమగువానికి; మృతిః-మరణము; స్యాద్యది-అయినచో; కర్త్రాసహా-కర్తతోఁగూడ; పితౄణాం—పితృదేవతలకు; ముక్తిదైవ-ముక్తినిచ్చునదే; భవేత్ -అగును. [గయకుప్రయాణమగువాడు మధ్యచనిపోయినను వానికి పితృదేవతులకు కూడ ముక్తి కలదనుట]

తా॥ గయయందు స్వల్పముగనయిన పిండప్రదానముచేసినవాని పితృదేవతలకుషోడశమహాదానాది కర్మలవలన గలిగెడుఫలమును; సంతుష్టియు; సర్వంబును మోక్షంబునుఁ గలుగుననియు; గయాయాత్ర యపారమగునానందము గలుగజేయుననియు; దైవవశయువలన గయకుఁబోవుచుండఁగ మార్గమధ్యంబున దేహత్యాగము సంభవించినను; గయయందు పిండదానము చేసిన ఫలముగలుగుననియు తా॥

నిత్యశ్రాద్ధసాంవత్సరికనిర్ణయము 30౨

శ్లో॥ నిత్యశ్రాద్ధవిధి స్స్వకాలబలవా నేకం వినాసూతకం
కుర్యాత్సూతకనిర్గమేఽథ దివసే కార్యం తథైవాబ్దికమ్ ।
తారాచంద్రబలం వినాపి యదివా పత్నీ రజోదూషితా ।
యద్వా దుష్టతిథిశ్చ సాపితృతిథిః కార్యైవ నిత్యాయది ॥

టీక॥ ఏకం-ఒక; సూతకం-జాతమునుమృతమును; వినా - వదలి; నిత్యశ్రాద్ధవిధిః-ప్రతిదినమందుచేయతగినవిధి; స్వకాలబలవాన్-తనకాలమేబలముగాఁగలది [అనఁగానాశౌచకాలమువదలి ప్రతిదినమున నిత్యశ్రాద్ధముచేయతగినదనుట]సూతకనిర్గమే-అశుచిపోవుటకు; అథ-పిమ్మట; దివసే-దినమందు; కార్యం-చేయతగినది; అబ్దికం-ప్రతిసాంవత్సరికమున్ను; తథైవ—అట్లెచేయతగినది; తారాచంద్రబలం వినాపి — తారాచంద్రబలములులేకున్నను; పత్నీ—భార్య; రజోదూషితాయది-రజ

స్వల్పమైనను; యద్వా - లేక; దుష్టతిథిః - దుష్టతిథియైనను; సా - అప్రసిద్ధమైన పితృతిధిః-పితృతిథి; నిత్యాయది-నిత్యమైనచో; కార్యాహి- యావశ్యముచేయతగినది.

తా॥ ఆశౌచదినముల బరిత్యజించి తక్కినసకలదినంబులయందును నిత్యశ్రాద్ధముచేయవలయుననియు; ఆశౌచము సంభవించినపు డాయాశౌచము సమాప్తమైన మరునాఁడావశ్యకముగ జేయవలయుననియు ప్రత్యాబ్దికము సూతకము సంభవించిన యెడల తత్సమాప్త్యనంతరదినంబుననే చేయవలయుగాక తక్కినయేహేతువు సంభవించిన నభ్యంతరముచేయక యామృతతిధియందు శ్రాద్ధముచేయవలయునని తా॥

## ఏకాదశాహవిధినిర్ణయము 303

శ్లో॥ ఆద్యం షోడశసంయుతం మృతితిథే రేకాదశాహే తథా ।
దాహాదేరథ యజ్వనాం త్వనుగతస్త్రీణాంతుభర్తృక్షయాత్ ।
కుర్యా దుద్రగణాన్వితం వృషపరిత్యాగానుయుక్తంక్రమా।
న్నగ్నశ్రాద్ధమథాదిమేఽహ్ని విషమేశుద్ధే ద్వితీయేఽథవా ॥

టీక॥ మృతతిధేః-మరణదినానంతరము; ఏకాదశాహే—పదునొకండవరోజున షోడశసంయుతం-షోడశముతోకూడినట్టిన్ని; రుద్రగణాన్వితం-వసుగణరుద్రగణములతో కూడినట్టిన్ని; వృషపరిత్యాగానుయుక్తం - వృషోత్సర్జనతో కూడినట్టిన్ని; ఆద్యం—ఆద్యమును; శ్రాద్ధం-శ్రాద్ధమును; కుర్యాత్-చేయవలయును; [అనాహితాగ్నులకనుట] యజ్వనాంతు-ఆహితాగ్నులకైతే; దాహాదేః—దహనదినము మొదలుగాచేయవలయును. [ఇందువల్ల ఆహితాగ్నులకు నంతర్దశాహమంతైన బహిర్దశాహమంతైన శాస్త్రోక్తదహనమైనతర్వాతనే దినములలెక్కయని తాత్పర్యము] అనుగతస్త్రీణాంతు సహగమనముచేసిన స్త్రీలకైతే; భర్తృక్షయాత్ - పెనిమిటిపోయిన దినము మొదలుగ నారంభము; [అనఁగా భర్తచనిపోయినమరునాడు సహగమనమైనను భర్తపోయినదినమేఆరంభమనుట]నగ్నశ్రాద్ధంతు-నగ్నశ్రాద్ధమైతే;ఆదిమే; —మొదటిదగు; అహ్ని-దినమందు; [అనఁగా దహనదినమందనుట] అథవా—లేక; విషమే-పదిరోజులమధ్యజేసితోజులయందు; అథవా-లేక; శుద్ధే- పంచాంగశుద్ధిగల ద్వితీయే-రెండవరోజునైన; కుర్యాత్-చేయవలయును.

తా॥ యజ్ఞముచేయక మృతులైనవారలకు మరణదినము మొదలుగను: ఆహితాగ్నులకువిధియుక్తదహనదినముమొదలగను: సహగమనముచేసిన స్త్రీలకు భర్తృ

మరణదినము మొదలుగను:౧౧.వదినంబున షోడశము, రుద్రగణము, వృషోత్సర్జనము వీనితోడ ఆద్యశ్రాద్ధము చేయవలయుననియు, నగ్నశ్రాద్ధము ప్రథమ దినమున జేయవల యుననియు, ఆదినమున దప్పెనేని, ౯ దినములలో నొకబేసిదినంబున నైనను, పంచాంగ శుద్ధియుక్తంబగు ద్వితీయదినంబుననైనను జేయవలయునని తా॥

నవశ్రాద్ధసంఖ్యఅస్థిసంచయనకాలము శ్లో॥ ౩౦౮

శ్లో॥ షట్సు కుర్యా ద్విషమేషు షట్స్వపి నవశ్రాద్ధానిచైకైకశః ।
స్సర్వా ణ్యేకదినేఽప్యశక్తవిషయే పంచైవ కేషాంచిత్ ॥
అస్థ్నాం సంచయనం భవేన్మృతిదినా దాద్యేద్వితీయేదినే ।
కుర్యాద్వా విషమేశుభేఽహ్ని యదివా కేషాంచతుర్థేమతమ్

టీక॥ విషమేషు-బేసివగు, షట్సు - ఆఱగుదినములయందు, షట్ — ఆఱు, నవశ్రాద్ధాని-నవశ్రాద్ధములను, ఏకైకశః-ఒక్కొక్కటిని, కుర్యాః-చేయుదురు[అనగా బేసిదినముల నొక్కొక్క నవశ్రాద్ధము చేయవలయుననుట]అశక్తవిషయే-శక్తిలేని వారివిషయమై, సర్వాణ్యపి—అఱుశ్రాద్ధములు, ఏకదినే-ఒకదినమందు, కుర్యాః - చేయుదురు, కేషాం-కొందఱియొక్క, (అనగా నాశ్వలాయనులయొక్క) మతే — అభిప్రాయమందు, పంచైవ-అయిదే, శివస్వామిచెప్పినది-శ్లో॥ నవశ్రాద్ధానిపంచాహు రాశ్వలాయనశాఖినాం। అపస్తంబాస్తుషట్కుర్యు ర్యథాతదితరేషుహితి॥ క్షత్రియులకు నేడు: వైశ్యులకు తొమ్మిది, శ్లో॥ నవసప్తవిశాంరాజ్ఞాం నవశ్రాద్ధాన్యను క్రమాత్। అద్యంతయోర్వర్ణయోస్తు షడిత్యాహుర్మహర్షయః॥ ఇట్లు భవిష్యత్పురాణమందు, మృతిదినాత్—మరణదినము మొదలు, ఆద్యే-దహనదినమందైనను, అదిగాలేక, ద్వితీయే-రెంతవదగు, దినే-దినమందైనను, అస్థ్నాం-యెముకలయొక్క:సంచయనం-సంగ్రహము, కుర్యాత్-చేయవలయును: శుభే—పంచాంగశుద్ధిగల: విషమే—విషమదినమందైన చేయవలయును: చతుర్థే-మరణదినమునకునాల్గవదినము;కేషాం కొందఱియొక్క: మతం-అభిప్రాయము: [నాల్గవదినమున పంచాంగశుద్ధిఅక్కరలేదనుట] అపరకృష్ణియందు... శ్లో॥ చతుర్థేదివసేచైవ అస్థిసంచయనంయది । తిథివారాదిదోషాణా మనపేక్షేతిగౌతమః ॥

తా॥ మృతదినము మొదలు ౧౧వదినమువరకుబేసిదినములయందొక్కొక్క శ్రాద్ధమువరుసనాఱుశ్రాద్ధములాపస్తంభసూత్రవంతులును:౯వదినమువరకు నైదు శ్రాద్ధము లాశ్వలాయన సూత్రవంతులును జేయవలయుననియు అశక్తవిషయమున

నన్నింటినొక్కదినంబున చేయవచ్చుననియు అస్థిసంచయనము దహనదినమునైనను ౨ వ దినముననైనను, జేయవలయుననియు, అట్లుగాకున్న పంచాంగశుద్ధిగలదేసిదిన మునసైనను కొందఱి మతానుసారముగ పంచాంగ శుద్ధి వివక్షచేయక ళ్ళవదినంబునైనను చేయవచ్చునని తా॥

వపనవిధినిర్ణయము

శ్లో॥ కర్త్రైవ ప్రథమేఽహ్ని తేన సహవా సంవాపయేత్సప్తమా।
దర్వాక్ప్రే ద్దశమే ప్రమీతపితృకో జ్ఞాతిఃకనిష్ఠో యది।
పూర్వాహ్ణే సకలామదాన మథవా మధ్యాహ్నకాలే భవేత్॥
దన్నశ్రాద్ధ మథాదిమేఽహ్నితు నవశ్రాద్ధంవినాస్తాదథః॥ ౩౦౬

టీక॥ కర్త్రైవ - కర్మచేయువాఁడే, ప్రథమే - మొదటిరోజున, సంవాపయేత్—క్షౌరమును చేయించుకొనవలయును, [ఏవకారముచేత మొదటిదినమందేఇతర, దినములయందు కూడదనుట] సప్తమాత్ సప్తపురుషులకంటె, అర్వాక్ — లోపున ప్రమీతపితృకః—తండ్రిచనిపోయిన, జ్ఞాతిః-జ్ఞాతి,కనిష్ఠోయది—చిన్నవాడైనచో తేన సహ-కర్తతో కూడ, దశమే-పదవదినమందు, సంవాపయేత్-వపనము చేయించుకొన వలయును. (కనిష్ఠుఁడని జెప్పుటచేత జ్యేష్ఠునకక్కరలేదనియు: జేష్ఠుఁడేకర్తైనచో ఆవశ్యకమనియు తోచుచున్నది] సకలామదానం-సమస్తమైన ఆమదానములు: పూర్వాహ్ణే-పూర్వాహ్ణమందు, కుర్యాత్-చేయవలయును, అథవా - లేక, మధ్యాహ్న కాలే-మధ్యాహ్నమందైనా: భవేత్-అగును, ఆదిమే అన్నశ్రాద్ధమునకు మొదలగు అహ్ని—దినమందు, [అనఁగా నేకాదశాహమందనుట]అస్తాత్—అస్తమానముకంటె అథః-పూర్వకాలమందు, అన్నశ్రాద్ధం—అన్నశ్రాద్ధమును: కుర్యాత్-చేయవలయును నవశ్రాద్ధంవినా—నవశ్రాద్ధమును వదలి చేయవలెను

తా॥ దహనదినమునకర్తగాక యితరులకు వపనముగూడదనియును సప్తమపురుషునకు లోఁబడిన జ్ఞాతులలో వయస్సునమృతునికంటె చిన్నవాండ్రైన మృతపితృకులు కర్తతోఁగూడ ౧౦ వ దినమున క్షౌరముజేసుకొనవలయుననియు, ఒకవేళ నా మృతునికి జ్యేష్ఠుఁడగ్నిప్రదానము చేసెనేని యితండును దహనదినదశమదినములయందుజేసుకొనవలయుననియు, ఆయనతోఁజేసిన నవశ్రాద్ధనవగ్న శ్రాద్ధములుపూర్వాహ్ణమందు జేయవలయుననియు నట్లు గాకున్న మధ్యాహ్నమునకకు జేయవచ్చుననియు, ఆద్యశ్రాద్ధము మొదలగు నన్నశ్రాద్ధ మపరాహ్ణమందుజేయవలెనని తా॥

## తిలోదకవాసోదక నిర్ణయము

శ్లో॥ కర్తారోఽప్యుదకాంజలీన్ తిలయుతాన్ త్రీన్ దద్యురాద్యేదినే
చైకైకోత్తరవృద్ధి చాదశదినాత్ తృప్త్యై శిలాయాం పితుః।
మృత్స్నానత్రితయం భవేత్ప్రతిదినం వస్త్రోదకానాం త్రయం
పిండ స్త్వేక ఇహాకృతం యది పితుర్దద్యుర్దశాహేఽఖిలమ్॥

టీక॥ కర్తారః-పుత్రాదికర్తలు, పితుః-తండ్రియొక్క, తృప్త్యై - తృప్తికొరకు; శిలాయాం-శిలయందు; తిలయుతాన్-తిలలతోఁగూడిన; త్రీన్-మూడు; ఉదకాంజలీన్—దోసెళ్ళను; ఆద్యే-మొదటి; దినే-దినమందు; దద్యుః- ఇవ్వవలయును; ఆదశదినాత్,పదవదినపర్యంతము;ఏకోత్తరవృద్ధి-ప్రతిదినమొక్కొక్కటివృద్ధికలుగునట్లుగా; దద్యు- యివ్వవలయును: క్షత్రియాణాంతు.... శ్లో॥ చతుష్షష్టిః పంచషష్టిర్నవతిః పంచసప్తతిః॥ క్షత్రవిట్ఛూద్రవిప్రాణాంవర్ణానాంతుతిలోదకం॥ప్రతిదినం ప్రతిభోజన స్వర్ణవర్ణములకు, మృత్స్నానత్రితయం- మూడుమృత్తికస్నానములు వస్త్రోదకానాం- వాసోదకములయొక్క: త్రయం—మూడు;భవేత్-అగును:పిండస్తు- పిండమైతే; ఏకఏవ-ఒకటే: ఇహ-దశాహమధ్యయందు: అకృతం-చేయనటువంటి తిలోదకాదులను చేయనిచో - అఖిలం—సమస్తము; పితుః-తండ్రికి:దశాహే-పదవరోజున; దద్యుః-ఇవ్వవలెను

తా॥ బ్రాహ్మణులకు పుత్రులందఱును పితృప్రీతికొరకు శిలయందు తిలోదకమును ప్రథమదినంబున ముమ్మారును; అది మొదలొక్కొదినంబున నొక్కొక్కమారధికముగ విడువగ ౧౦ దినములవరకు నవియన్నియు ౬౫ అగుననియు: క్షత్రియులకు మరణదినము మొదలు ప్రతిదినంబును ౬ మార్లును; ౧౨ వదినంబున ౯ మార్లును; విడువగ నవియన్నియు ౬౪ అగుననియు, వైశ్యులకుప్రతిదినంబును ౪ మార్లును; ౧౫ వ దినంబున ౬ మార్లును విడువగ నివి ౯౫ అగుననియు;శూద్రులకు ప్రతిదినంబును; ౩ వతుసన ౩౦ దినములైనను ౬ వతుసననుం౧౫దినములైనను విడువగనవి ౯౦ అగుననియు; సకలవర్ణజులును ఆశౌచనివృత్తివరకుప్రతిదినంబును ౩ మృత్తికాస్నానములును ౪ వాసోదకములును ౧ పిండదానము, చేయవలయుననియు నివి యాయాదినంబుల జేయకున్న నాశౌచాంత్యదినంబునఁ జేయవఁయునని తా॥

### తిలోదకాదులకు నిషిద్ధకాలము

శ్లో॥ దర్శ శ్శావదశాహమధ్యదివసే యద్యాప తేత్సంక్రమో ।
ఉప్యన్యేషాంతు సమాప్యపిండముదకం దేయంపితృభ్యాంవినా
పిత్రోశ్చైవసమాపయే త్త్రిదినత స్స్యాచ్చేత్పరంతద్వయం।
పూర్వంచేన్నసమాపయేత్త్రిదినతస్స్యాత్స్నానమాత్రంసదా।

టీక॥ శావదశాహమధ్యదివసే—మృతముయొక్క పదిదినములమధ్యయందు దర్శః-అమావాస్యయైనా; సంక్రమోవా-సంక్రమణమైనా; ఆపతేద్యది— వచ్చినచో; పితృభ్యాంవినా-తల్లిదండ్రులనువదలి; అన్యేషాం-ఇతరులకు;పిండం- పిండమున్ను ఉదకం-తిలోదకమునున్ను వాసోదకమునున్ను; సమాప్య-సమాప్తిచేసి; దేయం — ఇవ్వతగినది; పిత్రోశ్చైవ-మాతాపితృలకున్ను; త్రిదినతః- మూడుదినములకంటె పరం-పరమందు; తద్వయం-ఆసంక్రాంతమావాస్యలు; స్యాచ్చేత్— వచ్చినచోతద్వయం-ఆపిండోదకక్రియలకు; సమాపయేత్—సమాప్తిచేయవలయును;(ఇదితత్తునివిషయము] ఔరసుడు ప్రతిదినము నివ్వవలయును; అట్లు యల్లాజీయమందున్నది ....
శ్లో॥ దశాహమధ్యేదర్శశ్చేత్పిండదానంతిలోదకం। ఔరసఃప్రత్యహందద్యాన్నచదర్శే సమాపయేత్॥ సదా-యెల్లప్పుడు; స్నాన క్రిం-స్నానమే; స్యాత్-చేయవలయును త్రిదినతః-మూడుదినములకంటె; పూర్వం-ముందు; తద్వయం- ఆసంక్రాంత్యమావాస్యలు; స్యాచ్చేత్-వచ్చినచో; నసమాపయేత్-సమాప్తిచేయఁగూడదు.

తా॥ తల్లిదండ్రులుగాక తక్కినవారలకుఁ గర్మజేయునపుడు: దశదినాశౌచమధ్యమునఁ నమావాస్యయైనను;సంక్రాంతియైనను;సంభవించినేనియాపిమ్మట జేయఁవగినసకలతిలోదక వాసోదకపిండదానములను;తత్పూర్వదినంబునజేర్చిదేయవలయుననియు; ౩ దినములైన పిమ్మట నాదర్శసంక్రాంతులుసంభవింజెనేని; దత్తపుత్రులు చేయునపుడు తల్లిదండ్రులకునుఁ బూర్వోక్తక్రమంబున జేయవలయుననియు ఔరసపుత్రులు యధాక్రమంబున జేయవచ్చుననియు; అనంగ్రహించి చేసిన పురుషుఁడు తక్కిన సమయములయందు శిలాస్నానమాత్రముచేయవలయునని తా॥

### ఏకాదశాహమునకు జ్ఞాత్యాశౌచము శ్లో॥ ౩౦౮

శ్లో॥ త్యక్త్వా బాంధవసూతకేతు సకలం చాద్యాది పశ్చాచరే ।
త్కార్యం తల్లఘుసూతకేతువిహితంచాద్యాదియచ్చోదితమ్।

సాపిండ్యార్థ మథాపకృష్య సఖిలం శ్రాద్ధం పరిత్యజ్యత ।
త్సాపిండ్యాద్విహితోదకుంభమథవాప్యూనంచపశ్చాచ్చరేత్

టీక॥ బాంధవసూతకేతు - సమానులగు జ్ఞాతులయొక్క మరణసూతకములు వచ్చినవగుచుండగా, [దశాహమందైనా ఏకాదశాహమందైన ననుట] సకలం-సమస్తమగు, ఆద్యాది-ఆద్యమాసికము మొదలు షోడశమాసికములను, త్యక్త్వా-విడిచి, పశ్చాత్ - జ్ఞాత్యాశౌచము తర్వాత, చరేత్-చేయవలెను, ఇదికొంచె మాలోచించతగినది—శ్లో॥ ఆద్యశ్రాద్ధమశుద్ధోపి కుర్యాదేకాదశేహని । కర్తుస్తాత్కాలికీశుద్ధిరశుద్ధః పునరేవస ఇతి ॥ మాధవునిచేచెప్పఁబడుటవల్ల లఘుసూతకే—బాంధవులత్రిరాత్రాశౌచము కలిగినప్పుడు, విహితం-చెప్పఁబడిన,ఆద్యాది-ఆద్యము మొదలు పదునాఱు శ్రద్ధములు కలవో, తత్-అశ్రాద్ధసమూహము, కార్యం-చేయతగినది,[పెద్దాశౌచముకన్న చిన్నది పరిశుద్ధమగుటవల్లననుట]సాపిండ్యార్థము-సపిండీకరణమునిమిత్తము,సాపిండ్యాత్-సాపిండ్యమునకు పిదప, విహితోదకుంభం-అవశ్యమైన యుదకుంభశ్రాద్ధమును, పరిత్యజ్య - వదలి, అపకృష్యం- అపకర్షచేయతగిన, అఖిలం-సమస్తమైన, తత్-అఊనాది, శ్రాద్ధం-శ్రాద్ధమును, అథవా-లేక, ఊనంచ-ఊనమాసికమునున్ను, పశ్చాత్—సపిండీకరణానంతరము, చరేత్-చేయవలెను.

తా॥ ౧౦ వ దినమునైనను, ౧౧ వ దినమునయినను, జ్ఞాతిసంబంధమైన దశరాత్రాశౌచము, సంభవించెనేని ౧౧వ దినంబున ఆద్యమాసిక మనఁగా నేకాహశ్రాద్ధముచేసి అశౌచము నివృత్తియైనపిమ్మట తక్కినకృత్యములఁ జేయవలయునవియు త్రిరాత్రాశౌచము సంభవించెనేని,ఆయ్యేకాహశ్రాద్ధముతోడనపుడు చేయఁదగిన యన్నిశ్రాద్ధములఁ జేయవచ్చుననియు౧౨వదినంబునసపిండీకరణము చేయవిచ్చగల పురుషుడాదినంబున జేయతగిన సోదకుంభశ్రాద్ధమును వదలి తక్కిన ౧౫ఏకోద్దిష్టశ్రాద్ధములఁ జేర్చి ౧౧ వ దినంబునజేసి సపిండీకరణం బైనపిమ్మటమరలనాయాకాలములయందూనాదిమాసశ్రాద్ధములను,తక్కినసోదకుంభశ్రాద్ధములను జేయవలెను.

సాపిండ్యత్రైపక్షికశ్రాద్ధములకు కాలనిర్ణయము ౩౦౯

శ్లో॥ త్రిష్యాద్యాదిషుచ త్రిపక్షవిషయే మాసే త్రిమాసేఽథవా ॥
షాణ్మాసే నవమాఖ్యమాసవిషయే ఏకాదశే వత్సరే ।
కార్యం తత్రిసపిండనం దశసుత త్కాలేషు శుద్ధే దినే ।
స్యా త్త్రైపక్షికకర్మ పంచసు దినేష్వేవ త్రిపక్షాదిషు ॥

టీక॥ ఆద్యాదిషు-పదునొకండు, పండ్రెండు, పదమూడు రోజుల యందయినను, త్రిపక్షవిషయే—మూడవపక్షమందైనా, మాసే-మాసాంతరమందైనా త్రిమాసే తృతీయమాసమందైనా, అధవా-లేక, షాణ్మాసే-ఆఱవమాసమందయినా, నవమాఖ్యమాసవిషయే - తొమ్మిదవమాసమందయినా, ఏకాదశే- పదునొకొండవమాసమందయినా, వత్సరే-సంవత్సరాంతమందయినా, దశసు-పదియగు, కాలేషు-కాలములయందు, శుద్ధే-పరిశుద్ధమైన, దినే-దినమందు, సపిండనం-సపిండీకరణము, కార్యం-చేయతగినది, త్రిపక్షాదిషు-మూడవపక్షము మొదలున, పంచసు—ఐదగు, దినేష్వేవ దినములయందే, త్రైపక్షికకర్మ-త్రైపక్షికమనుకర్మ, స్యాత్-అగును.

తా॥ మృతాహస్సు మొదలు ౧౧ - ౧౨ - ౧౩ ఈదినములలో నయినను ౩ వ పక్షంబున నయిన, ౧-౩-౬-౯-౧౧-౧౨ ఈ మాసములలోనయిన నొక పంచాంగశుద్ధియుక్త దినంబున సపిండీకరణము చేయవలయుననియు, ౩ వ పక్షంబున నాదియందు ౧౦ దినములకు పిమ్మట ౫ దినములలో నొకదినంబునఁ త్రైపక్షికశ్రాద్ధము చేయవలయునని తా॥

ఊనత్రియనిర్ణయము ౩౧౦

శ్లో॥ నిత్యం ద్వాదశవాసరే మృతదినా దూనంతు సర్వస్యత ।
నోచే న్మాసతృతీయభాగవిషమే శుద్ధేఽహ్ని కార్యంపునః॥
ఊనం మధ్యమపంచకే శుభదినే పక్షే తథా ద్వాదశే ।
ప్యూనం చాంతిమపంచకేఽన్యదపితత్పక్షే చతుర్వింశకే ॥

టీక॥ మృతదినాత్-చనిపోయినదినము మొదలు, ద్వాదశవాసరే-పండ్రెండవ దినమందు, సర్వస్య-సమస్తశాఖవారలకు, ఊనంతు-ఊనమాసికమైతే, నిత్యం-ఆవశ్యకము, తత్ - ఆదినమందు, నోచేత్- కాకున్న, మాసతృతీయభాగవిషమే-మాసముయొక్క మూడవభాగమందువిషమరోజులలో, శుద్ధేపంచాంగశుద్ధిగల, అహ్ని—రోజున, పునః-తిరిగి, కార్యం - చేయవలెను. (పదునొకండవరోజున ప్రేమత్వేన చేయుటవల్ల పునః అనిచెప్పబడినది) ద్వాదశే - పండ్రెండవపదియగు, పక్షే — పక్షమందు [చనిపోయినదిమొదలనుట] మధ్యమపంచకే—ద్వితీయపంచకమందు, శుభ దినే—మంచిదినమందు, ఊనం-ఊనషాణ్మాసికము, కుర్యాత్ - చేయవలెను, చతుర్వింశకే—ఇరువదినాలుగవదియగు, పక్షే-పక్షమందు, అంతిమపంచకే-అంత్యపంచకమందు, శుభదినే - మంచిదినమందు, అన్యదపి — మఱియొకఊనాబ్దికమున్ను, కుర్యాత్-చేయవలెను.

తా॥ మృతదినములకు ౧౨ వ దినంబున, ఊనమాసిక మవశ్యముగ జేయ వలయుననియు ఆదినమునజేయుట కనుపపత్తి సంభవించెనేని, ౨౦ దినములకుపైన ౧౦ దినములలో శుద్ధిగల యొకబేసిదినంబున జేయవచ్చుననియు, ౬ వ మాసమున ౨౦ వ దినముమొదలు ౨౫ వ దినమునకులోగా శుద్ధిగల యొకదినంబున, ఊన షాణ్మాసికంబును ౧౨ వ మాసంబున ౨౫ దినములకుపైన నొకశుద్ధియుక్త దినంబున, ఊనాబ్దికమాసికంబుఁ జేయవలయునని తా॥

ఊనత్రియ వర్జ్యకాలము ౩౦౧

శ్లో॥ నందాదర్శచతుర్దశీభృగుశని ష్వగ్నిత్రిపూర్వాసురే।
పూనాన్యేవ నహి త్రిపుష్కరదినే ష్వాన్యేషు వర్జ్యేష్వపి।
కుర్యా దుత్తరమాసికేనసహిత త్ప్రాఙ్మాసికం చాకృతం।
నత్రైపక్షిక మూనకర్మచ తథా పశ్చాచ్చరే దేవతత్॥

టీక॥ నందా-నందతిధులు, దర్శ-అమావాస్య చతుర్దశీ రెండుపక్షములనుండు చతుర్దశీ, భృగుశనిషు - శుక్రశనివారములయందు, అగ్ని-కృత్తిక, త్రిపూర్వ-పూర్వఫల్గునీ, పూర్వాషాఢ: పూర్వాభాద్రలు: అసుర - మూల: ఏతేషు - వీట్లయందు: త్రిపుష్కరదినేషు- చెప్పఁబోవుత్రిపుష్కరరోజులయందు: అన్యేషు - ఇతరమగు: వర్జ్యేషు - విడువతగినద్విపాత్త్రిపాన్నక్షత్రములయందును: ఉనాన్యేవ-ఊనములే: నకార్యాణి-చేయకూడదు: ప్రాఙ్మాసికం-పూర్వమాసికము: అకృతంచేత్-పెట్టకున్న తత్-అమాసికమును: ఉత్తరమాసికేనసహ-రాబోవుమాసికముతోఁగూడా: కుర్యాత్-చేయవలయును: తత్-ప్రసిద్ధమగు: త్రైపక్షికం-త్రైపక్షికమున్నూ: ఊనకర్మచ-ఊనములున్నూ: తథా-అట్లు: పశ్చాత్-పిమ్మట: నచరేదేవ-చేయకూడదు.

తా॥ నందతిధులును: అమావాస్యయు: ఉభయపక్షచతుర్దశీతిధులును: శుక్రశనివారంబులును: కృ - పూఫ-పూషా-పూభా-మూ-ద్విపాత్త్రిపాన్నక్షత్రంబులును చెప్పఁబోవు త్రిపుష్కరదినంబులును నివి ఊనమాసికములకు నిషిద్ధకబులనియు: అనుపపత్తిచేత నిలిచియున్న మాసికమునా పైమాసికముతోఁజేర్చి జేయవచ్చుననియు: ఊనత్రైపక్షికమాసికము లట్లు చేయఁగూడదని తా॥

సంక్రాంతిపుణ్యకాల నిర్ణయము ౩౧౨

శ్లో॥ త్రిశంత్కర్కటకేతు పూర్వ మయనే నాడ్యః పరే వింశతి
ర్వైశ్యార్యంఘ్రిషునాడికా నృపమితామే షేతులాయాందశ।

షష్టిశ్చైవ పరేషు పుణ్యఫలదాః స్నానంచ దానం పితుః ।
శ్రాద్ధంకార్యమినాబ్జయోర్గ్రహణయోః స్తద్వత్పితృప్రీతిదమ్

టీక॥ కర్కటకే-కర్కటసంక్రాంతియందు, పూర్వం— సంక్రమణముకన్న పూర్వమందు, త్రింశత్-ముప్పది, నాడ్యః—గడియలు, అయనే-మకరసంక్రమణమందు, పరే-సంక్రమణానంతరము, నిశంతి - ఇరువదిఘడియలు, పుణ్యఫలదాః— పుణ్యఫలమునిచ్చునవి, [ఇదిపగలుసంక్రమణవిషయమైనది) రాత్రియందైన నలుబదిఘడియలు పుణ్యఘడియలు, అట్లు హేమాద్రియందున్నది —శ్లో॥ త్రింశత్కర్కటకేనాడ్యో మకరేతుదశాతికాః । తాఏవదక్షిణేపూర్వ మతీతేచోత్తరాయణే ॥ అస్తాత్ప్రాక్సంక్రమేనక్రే తదహః పుణ్యమాచరేత్ । ప్రదోషేవార్ధరాత్రేవా స్నానందానం పరేహనీతి ॥ ధైత్యార్యంఘ్రిషు-విష్ణుపదపుణ్యకాలములయందు, నృపమితాః—పదునారు, నాడికాఃఘడియలు పూర్వమందే, మేషే - మేషసంక్రమణమందు, తులాయాః-తులాసంక్రమణమునకు, దశ-పదిఘడియలు పూర్వాపరములయందు, పరేషు-మిథునకన్యాధనుర్మీనములగు షడశీతిముఖములయందు, షష్టిః—పూర్వోత్తరములయందు అరువదిఘడియలు, స్నానం-స్నానమును, దానం-దానము, పితుః-తండ్రికితల్లికి, శ్రాద్ధం-శ్రాద్ధమున్ను, కార్యం-చేయతగినది, ఇనాబ్జయోః—సూర్యచంద్రులయొక్క, గ్రహణయోః-గ్రహణములయందు, తద్వత్-అట్లుగానే, పితృప్రీతిదం-పితృదేవతలకు నిష్టమగును.

తా॥ కటక సంక్రమణమునకు పూర్వము ౩౦ ఘడియలును, మకర సంక్రమణము పగటియందైన తదనంతరంబున ౨౦ఘడియలును, రాత్రియందైన ౪౦ ఘడియలును: వృషభ: సింహ: వృశ్చిక: కుంభ సంక్రాంతులనెడి విష్ణుపదపుణ్యకాలమునకు పూర్వంబున ౧౬ఘడియలును: మేషతులాసంక్రమణములకు పూర్వంబున ౫ గడియలును: పరంబున ౫ గడియలును మిథునకన్యా ధనుర్మీనములనెడి షడశీతిపుణ్యకాలములకు పూర్వంబున ౩౦ గడియలును: పరంబున ౩౦ గడియలును పుణ్యఫలప్రదంబులుగాన నీపుణ్యకాలముల యందును: సూర్యచంద్రగ్రహణకాలములయందును స్నానదానపితృశ్రాద్ధాదు లావశ్యకంబుగఁ జేయవలయునని తా॥

అఖండతిథినక్షత్రనిర్ణయము 303

శ్లో॥ సంపూర్ణాయది తారకాశ్చ తిథయస్స్యుస్తా అఖండాభిధా ॥
అప్యర్కోదయసంయుతా నశుభదా స్సర్వవ్రతానామపి ।

యద్వారోదయగా ఇనాస్తసహితా స్తా అప్యఖండాః పరే॥
ప్రాహు ర్యా దినఖండ మప్యతిగతా స్తా అప్యఖండా ఇతి ॥

టీక॥ యాః-యేవి, తారకాః-నక్షత్రములు, తిథయశ్చ-తిథులు, సంపూర్ణాః-సంపూర్ణమైనవి, స్యుర్యది-అయినచో, తాః-అవి, అఖండాఖ్యాః — అఖండములను పేరుగలవి. అర్కోదయసంయుతా అపి- సూర్యోదయమునకు మాత్రము వ్యాపించి యున్న తిథులు; సర్వవ్రతానామపి-సమస్తవ్రతములకున్నూ, నశుభదాః - మంచివి కావు, ఖండతిథులయందువ్రతారంభవ్రతోద్యాపనలు చేయకూడదనుట] [ దైవజ్ఞవిలాసమందుసత్యవ్రతుడు....శ్లో॥ ఉదయస్థాతిథిర్యాహి నభవేద్దినమధ్యగా । సాఖండానవ్రిధానాస్యా ద్వ్రతారంభేపమాపవఇతి॥ యద్వా-లేక, అర్కోదయగాః - సూర్యోదయముపొందినవగుచూ, ఇనాస్తసహితాః-సూర్యాస్తమయమునువ్యాపించినగడియలున్నూ, తా అపి—అవియు, అఖండాః-అఖండతిథులే, యాః-యేతిథులు; దినఖండమపి-దినార్ధభాగమును, అతిగతాః-అతిక్రమించినచో, తా అపి-అవియు, అఖండాః-అఖండతిథులని, పరే—కొందఱు, ప్రాహుః-చెప్పిరి-

తా॥ సూర్యోదయము మొదలు మఱునాడు సూర్యోదయమువరకు వ్యాపించి యున్న తిథినక్షత్రంబులను సూర్యోదయము మొదలస్తమయమువరకు వ్యాపించి యున్న తిథినక్షత్రంబులను కొందఱిమతంబున సూర్యోదయము మొదలు మధ్యాహ్నకాలమువఱకునున్న తిథినక్షత్రంబులను అఖండంబులనియు నివి వ్రతారంభవ్రతోద్యాపనములకు యోగ్యంబులనియు సూర్యోదయమందుమాత్రమున్న తిథినక్షత్రములు సర్వవ్రతములకు నయోగ్యంబులనియు వ్రతసమాప్తికినీ నియమము లేదని తా॥

అఖండతిథినక్షత్రములకు వ్రతనిర్ణయము

శ్లో॥ శుక్లే భాద్రపదే చతుర్థదివసే భూపుత్రవారాన్వితే ।
చిత్రాధిష్ణ్యయుతేఽప్యఖణ్డతిథిభే సిద్ధేశపుత్రవ్రతమ్।
కుర్యాద్భాద్రపదే సితే కలిదినేఽనంతవ్రతం శ్రీప్రదం।
భాద్రేపంచదశేఽప్యఖండదివసే కుర్యాదుమేశవ్రతమ్ ॥ ౩౧౮

టీక॥ భాద్రపదే — భాద్రపదమాసమందు; శుక్లే - శుక్లపక్షమందు, చతుర్థదివసే—నాల్గవదినమందు, భూపుత్రవారాన్వితే — మంగళవారముతోఁ గూడినదై, చిత్రాధిష్ణ్యయుతే-చిత్రానక్షత్రయుక్తమై, అఖండతిథిభే-సంపూర్ణమగు తిథినక్షత్రములు కలదగుచుండగా, సిద్ధేశపుత్రవ్రతం-సిద్ధివినాయకవ్రతమును, కుర్యాత్-చేయవలయును. భాద్రపదే-భాద్రపదమాసమందు, సితే-శుక్లపక్షమందు; కలిదినే -

చతుర్దశినాడు, శ్రీప్రదం-ఐశ్వర్యమునిచ్చు,అనంతవ్రతం-అనంతునివ్రతము,కుర్యాత్-చేయవలయును. భాద్రే-భాద్రపదమందు, అఖండదివసే — సంపూర్ణదినమగు, పంచదశేపి-పూర్ణిమయందును;ఉమేశవ్రతం-శివవ్రతమును,కుర్యాత్-చేయవలయును

తా॥ భాద్రపదశుద్ధంబున కుజవారచిత్రానక్షత్రములతోఁగూడిన యఖండ చతుర్థతిథియందు సిద్ధివినాయక వ్రతంబును ఆపక్షమున నఖండంబగు చతుర్దశియందనంతవ్రతంబును అట్టిపూర్ణిమయందుమామహేశ్వరవ్రతంబు నారంభింపవలెను.

## అభ్యంగనిషేధకాలము

శ్లో॥ శ్రీశార్ద్రాదిమశక్రభేషు నిశిచేత్పాతేఽష్టమీద్వాదశీ।
నందాపర్వచతుర్దశీవ్రతపితృశ్రాద్ధేషు దీక్షాస్వపి।
యాత్రాహే మృతిసూతకే కుజకవిబ్రధ్నార్యవారేషువా।
నాభ్యంగంశిశువృద్ధరోగిషుయదిద్రవ్యాంతరస్థంశుభమ్॥ ౨౧౫

టీక॥ శ్రీశ-శ్రవణము, ఆర్ద్ర-ఆర్ద్ర, ఆదిమ-అశ్వని, శక్ర-జ్యేష్ఠ,భేషు-నక్షత్రములయందు, నిశి-రాత్రియందు;పాతే-వ్యతీపాతమహాపాతలయందుఅష్టమి శుక్లాష్టమియు, ద్వాదశీ — శుద్ధబహుళద్వాదశులును, నందా - నందతిథులు, పర్వ - పంచపర్వలు, చతుర్దశీ-శుక్లచతుర్దశియు, వ్రత-వ్రతదినములు; పితృశ్రాద్ధేషు-పితృశ్రాద్ధదినములయందు, దీక్షాస్వపి-దీక్షరోజులయందును, యాత్రాహే-ప్రయాణదినమందును, మృతసూతకే—మరణాశౌచమధ్యయందు, కుజ— కుజునియొక్క, కవి—శుక్రునియొక్క; బ్రధ్న-సూర్యునియొక్క, ఆర్య - గురునియొక్క, వారేషువా - వారములయందైనా; అభ్యంగము-తైలాభ్యంగము, నకుర్యాత్-చేయఁగూడదు, శిశు వృద్ధరోగిషు-పిల్లవాండ్రుమునలివాండురోగులవిషయమై,ద్రవ్యాంతరస్థశయది-మరియొకద్రవ్యముతో కలసినచో; తైలం-తైలము: శుభం-మంచిది; భవేత్ - అగును. ద్రవ్యముల చెప్పుచున్నాఁడు....శ్లో॥ రవౌదూర్వాం గురౌపుష్పం భృగౌగోమయమ్మే వచ॥ భౌమేచయోజయేన్మృత్స్నాంతైలదోషాపనుత్తమమితి॥మీగిలిన తిథివారనక్షత్రములుమంచివని తెలియవలయును.

తా॥ శ్ర; ఆర్ద్ర; ఆశ్వి; జ్యే; ఈనక్షత్రములును రాత్రియు వ్యతీపాతమహాపాతలతోఁ జేరినదినంబులును శుక్లాష్టమియు పక్షద్వయగతద్వాదశియునందతిథులును పంచపర్వంబులును శుక్లచతుర్దశియు;వ్రతదినంబులును;స్వకర్తృకశ్రాద్ధదినంబులును దీక్షామధ్యదినంబులును; ప్రయాణదినంబును;మృతాశౌచమధ్యదినంబులును;కుజశుక్ర

ఖానుగురువారంబులును వీనియందభ్యంగము చేయకూడదనియుఃబాలవృద్ధరోగులకు ఖానువారమున దూర్వము గురువారంబునబుష్పంబునశుక్రవారమునగోమయంబును కుజవారమున మృత్తికయుః తైలముతోఁజేర్చియభ్యంగముచేయ దోషంబులేదనియు నీచెప్పినదినములుగాక తక్కినదినంబులు శ్రేష్టములనియును తా॥

నిషిద్ధదినములయందు అభ్యంగవిధి

శ్లో॥ అభ్యంగం శుభమత్రిదుష్టసమ తేఽప్యాద్యంతయోర్యాఽశుభే
స్వాతీయుక్తదినే త్విషేచ బహుళే త్రిష్వేషు భూతాదిషు।
పూర్వస్మిన్ దివసే రవౌ మృగయుతే హ్యశౌచపూర్వేదినే ।
వర్షాదౌ భృగువాసరోత్తరదళే చేదర్థకామీ భవేత్। ३०८

టీక॥ శుభే- వివాహోపనయన శుభకాలములయందును; ఆద్యంతయోః - అద్యంతములయందును; ఇషే-ఆశ్వీజమాసమందు; బహుళే-కృష్ణపక్షమందు; స్వాతీయుక్తదినే-స్వాతీనక్షత్రయుక్తమగుదినమందును; భూతాదిషు - చతుర్దశి మొదలు త్రిష్వేవ-మూడుదినములయందును; రవౌ-సూర్యుఁడు, మృగయుతే-మకరముఁదుం డగా; పూర్వస్మిన్-ముందుగనుండు; దివసే-దినమందును; ఆశౌచపూర్వే- అశుచికి పూర్వమందుండు; దినే-దినమందును వర్షాదౌ- చైత్రశుక్లప్రతిపత్తునందును; దుష్ట సమయే-దుష్టవారతిథినక్షత్రములయందైనా; శుభం-మంగళప్రదమగు: అభ్యంగం- అభ్యంగనము; కుర్యాత్ - చేయవచ్చును: భృగువాసరోత్తరదళే — శుక్రవారము యొక్క ఉత్తరార్ధమందు; అర్థకామీ-ధనకాముఁడు; భవేచేత్-అయినచో; అభ్యం గం-అభ్యంగమును; కుర్యాత్-చేయవలయును.

తా॥ వివాహాదిశుభకాలములయొక్క ఆద్యంతదినములనుఆశ్వయుజబహుళం బున స్వాతీనక్షత్రముతోఁ గూడినదినమనగా దీపావళియు మకరసంక్రమణమునకు తొలిదినమనగా భోగిపండుగయు జాతాశౌచపూర్వదినంబును సంవత్సరాదియు యీ దినములు పూర్వశ్లోకోక్తనిషిద్ధములతోఁ జేరియుండినను ఈకాలములయందు మంగళ కరంబగు నభ్యంగమావశ్యకముగాచేయవలయుననియు ధనకాముఁడగువాఁడు శుక్ర వారమందు మధ్యాహ్నానంతరంబున నభ్యంగముచేయువలయునని తా॥

ముహూర్తమునకు తిథివారనక్షత్రలగ్నముల నిర్ణయము

శ్లో॥ ఆర్ద్రాగ్నేయమఘాసు రేందభరణీపూర్వాంబునాథోరగ ।
స్వాతీశ్వష్టహయేషు కృష్ణవిజయారిక్తాసు విష్ట్యామపి

మాహేయామరపూజ్యమందదినకృద్వారే గ్రహలగ్నాంశకే ।
యః కుర్యాత్సమరంస జైత్రవిభవః స్యాద్వీరకర్మా చిరం॥

టీక॥ ఆర్ద్రా-ఆర్ద్రయు: ఆగ్నేయ-కృత్తికయు, మఘా-మఖయు: అసుర - మూలయు, ఇంద్ర-జ్యేష్ఠయు; భరణీ - భరణియు: పూర్వా-పూర్వఫల్గుని; పూరాషాఢ: పూర్వాభాద్రలును; అంబునాధ-శతభిషమును; ఉరగ-ఆశ్లేషయు: స్వాతీ - స్వాతియు; త్వష్టృ-చిత్తయు; హయ-అశ్వినియు; ఏషు-ఈనక్షత్రములయందున్ను కృష్ణవిజయా-కృష్ణపక్షజయతిధులయందును; రిక్తాసు - రిక్తతిధులయందును: విష్టా: అపి-భద్రకరణమందును;మాహేయా-కుజునియొక్క;అమరపూజ్య-గురునియొక్క-మంద-శనియొక్క: దినకృత్-సూర్యునియొక్క: వార-వారమందు; అర్క్ష - నక్షత్రమందు: లగ్న-లగ్నమందు: అంశకే-అంశయందును; సమరం-యుద్ధమును;యః-యెవడు; కుర్యాత్-చేయునో; సః- వాడు; జైత్రవిభవః - జయశీలమగుపరాక్రమము గలవాడై; చిరం-చిరకాలము; వీరకర్మాచ-వీరాక్రమయుక్తుడై స్యాత్ - అగును

తా॥ ఆర్ద్ర: కృ: మ: మూ, జ్యే, భ: పూఫ: పూషా: పూభా: శ; ఆశ్లేష: స్వా చి అశ్వి ఈ ౧౪ నక్షత్రములయందును కృష్ణపక్షజయతిధులయందును రిక్త తిధులయందును భద్రకరణమందును కుజగురుశనిభానువారములయందును. వీనిసంబంధములగు మేష వృశ్చికధనుర్మీనమకరకుంభసింహరాసులలో చంద్రుడుండగ వీలగ్నములయందును వీని అంశములయందును యుద్ధమునకుబోయిన పురుషుడు జయశీల పరాక్రమవంతుడును స్థిరతరం బగుశౌర్యము గలవాడునగునని తా॥

యమకంటకగుళికార్థప్రహరములు శ్లో॥ ౩౧౮

శ్లో॥ భానౌ బాణనగాబ్ధయ శ్శశిదినే తోయరుశైలాః కుజే ।
రామేష్వక్షి బుధేఽక్షి సాగరశరా జీవేక్షితిత్ర్యష్టమాః ।
శుక్రే శైలాద్యగ్న యశ్శనిదినే త్వష్టైకషష్ఠాః క్రమాః ।
ద్యామార్థం యమకంటకాఖ్యగుళికాఖ్యార్థప్రహరాభిధాః ॥

టీక॥ భానౌ - ఆదివారమందు బాణనగాబ్ధయః - బాణ - ఐదు నగ.యేడు అబ్ధయః-నాలుగు యామార్థం - అర్థయామములున్నూ శశిదినే - సోమవారమందు తోయ - నాలుగు ఋతు - ఆరు శైలాః - యేడు అర్ధయామములున్నూ కుజే - మంగళవారమందు రామ-మూడు, ఇషు-ఐదు అక్షి - రెండు యామార్థములున్నూ

బుధే-బుధవారమందు, అక్షి - రెండు, సాగర-నాలుగు, శరాః - ఐదుయామార్ధము లున్నూ, జీవే-గురువారమందు, క్షితి - ఒకటి, త్రి-మూడు, అష్టమాః-యెనిమిది అర్ధయామములున్నూ, శుక్రే-శుక్రవారమందు, శైల-ఏడు, దృక్-రెండు, అగ్న యః-మూడు అర్ధయామములున్నూ, శనిదినేతు-శనివారమందు, అష్టైకషష్టాః-అష్ట -యెనిమిది, ఏక-ఒకటి, షష్టా - ఆఱుఅర్ధయామములున్నూ, క్రమాత్-వరుసగా యమకంటకాఖ్య - యమకంటకములనునవిన్ని, గుళికాఖ్య-గుళికలనునవిన్ని, అర్ధ ప్రహారాభిధాః-అర్ధప్రహారములను పేరుగలవి.

తా॥ అహః ప్రమాణఘటికల నెనిమిది భాగములుచేసిన నాభాగములలో ఆదివారంబున ౫వ భాగము యమకంటకము, ౭వ భాగము గుళికయు, ౪వ భాగ మర్ధప్రహారంబును, ఈ రీతిన సోమవారంబున ౪-౬-౭, కుజవారమున ౩-౫-౨, బుధవారమున ౨-౪-౫, గురువారమున ౧-౩-౮, శుక్రవారమున ౭-౨-౩; శని వారమున ౮-౧-౬ ఈభాగములకు పచ్చెడియర్ధయామకాలము; క్రమంబున యమ కంటక గుళికార్ధప్రహారము లనంబడును కాన నివి శుభకర్మల కయోగ్యంబులనితా॥

అవమాత్రిద్యుస్పృగాదికము ౩౧౯

శ్లో॥ ఏకస్మిన్నపి వారఏవ తిథయో వ్యాప్తా స్త్రియ స్సావమా,
త్రిద్యుస్పృక్త్రిషు వాసరేషుచ తిథశ్శైకాతినింద్యాశుభే।
ప్రత్యాఖ్యౌ నవమీ ప్రయాణనవమీ కార్యేషు సర్వేషువా।
యాత్రాధిష్ణ్యపునఃప్రవేశనవమీతిస్రశ్చ మృత్యుప్రదాః॥

టీక॥ త్రియః-మూడు; తిథయః-తిధులు; ఏకస్మిన్ - ఒక; వారేఏవ-వార మందే; వ్యాప్తాః - సంక్రమించినచో; సా - అతిధి; అవమా -అవమయనబడును; ఏకా - ఒక; తిధిః-తిధి; త్రిషు-మూడు; వాసరేషుచ - వారములయందునూ; వ్యా ప్తాయది-వ్యాపించినచో; సా-అతిథి; త్రిదుస్పృక్-త్రిద్యుస్పృక్కనబడును; సా- ఆ అవమతిధి; శుభే - శుభకర్మయందు; అతినింద్యా - మిక్కిలినిందించతగినది; సర్వేషు-సమస్తమగు; కార్యేషుచ-కార్యములయందును; ప్రత్యక్ష-ప్రత్యక్షమను; నవమీ-నవమియు; ప్రయాణనవమీ-ప్రయాణనవమియు; యాత్రాధిష్ణ్యపునఃప్రవేశ నవమీ - ప్రయాణమైవెళ్లితిరుగప్రవేశింపుచునపుడు తొమ్మిదవనక్షత్రదినములును; తిస్రః-మూడు; మృత్యుప్రదాః-మరణమునుచేయును.

తా॥ ఒక వారమున ౩ తిధులు వ్యాపించియున్ననది యవమయనియు ౩ వారములయందొకతిధి వ్యాపించియున్న నది త్రిద్యుస్పృక్కనియు ననంబడుఁగాన వీరెండుతిధులును శుభకార్యముల కత్యంత అయోగ్యంబులనియు ప్రత్యక్షనవమియు ప్రయాణనవమియుః ప్రవేశనవమియు నీమూఁడును సకలకార్యములను నతినింద్యములని తా॥

పాదచ్ఛాయాగతఘటికానిర్ణయము ౩౨౦

శ్లో॥ యావంత్య శ్చరణప్రభాః ప్రతిదినం మేషాదిషట్స్వేవష ।
డ్యోజ్యాశ్చ్యైవతులాదిషట్సుజలధిత్రిద్వ్యక్షి రామాబ్ధయః
అర్ధీకృత్య దినప్రమాణఘటికా స్సప్తాహతా నాడికా ।
స్తావంత్యోఽపరపూర్వయోఃస్థితగతాయత్పూర్వసంఖ్యాభిధాః॥

టీక॥ ప్రతిదినం-ప్రతిరోజు, చరణప్రభాః-పాదచ్ఛాయలు, యావంత్యః-యెన్నియో, తాసు - వాట్లయందు, మేషాదిషట్సు - మేషాదియాఱుసంక్రాంతులయందు, జలధి-నాలుగు, త్రిముఁడు, ద్వి - రెండు, అక్షి-రెండు, రామ-మూడు, అబ్ధయః-నాలుగు, షట్ - ఆఱుసంఖ్యలు, యోజ్యాః - కలుపవలయును, తులాదిషట్సు-తులాదిషట్సంక్రాంతులయందును ఇట్లె కలుపవలయును, దినప్రమాణఘటికాః-అహఃప్రమాణఘడియలను, అర్ధీకృత్య-సగముచేసి, సప్తాహతాః-ఏడింటగుణింపబడినవగుచు , జలధిత్రిద్వ్యక్షి-రామాబ్ధిసంఖ్యలకలిపిన పాదచ్ఛాయలచే భాగించవలయును, యత్పూర్వసంఖ్యాభిధాః - పూర్వము యెంతసంఖ్యగల, నాడికాః-ఘడియలుకలవో, తావంత్యః - అన్నిఘడియలు, అపరపూర్వయోః - దినముయొక్కపూర్వార్ధాపరార్ధములయందు, స్థితగతాః-ఐనవిగతించనవియని తెలియవలయును.

తా॥ తననీడ తనయడుగులచేఁ గొలిచి, ఆయడుగులసంఖ్యతోడ, మేషకనాశితులా మీన మాసములయందు ౪ను, వృష, సింహ, వృశ్చిక, కుంభ మాసములయందు ౩ను, మిధున, కర్కటక, ధనుర్మకర మాసములయందు ౨ను, జేర్చి అహఃప్రమాణఘటికల ౨ భాగములుచేసి, యందొకభాగము నేడింట గుణించి, పూర్వోక్తంబగు నధికసంఖ్యతోఁ జేరిన పాదాచ్ఛాయలసంఖ్యచే భాగించగా నేర్పడిపన్ని గడియలపొద్దు, మధ్యాహ్నమునకు ముందుగనైన జరిగినదనియు మధ్యాహ్నమునకు పిమ్మటనైన నున్నదనియు నెరుగవలయునని తా॥

వి ష్టి ది న ము లు ౩౨౧

శ్లో॥ త్యక్త్వారాన్వితబాది సప్తనిశిచే ద్యానంతిమధ్యాహ్నభా।

స్యైకైకస్యతు నాడికాద్వయమిదం చోర్ధ్వాంఘ్రియు క్తిక్రమాత్
లగ్నానామపి షట్కమేవ నియతం సూర్యోదయాద్యాలయా
త్పూర్వస్యాస్తమయాది చేన్నిశితథాలగ్నాః షట్క్రమాత్ ॥

టీక॥ నిశిచేత్-రాత్రియైనచో, అర్కాన్వితభాది-సూర్యుడుండునక్షత్రము మొదలు; మధ్యాహ్నభాని - శిరోనక్షత్రమువరకు, యావంతి - యెన్నినక్షత్రములో; తేషు-వాట్లయందు, సప్త-ఏడు; భాని - నక్షత్రములను, త్యక్త్వా - వదలి, అవశిష్టానాం—మిగిలినవాట్లకు, ఏకైకస్యతు - ఒక్కొక్కనక్షత్రమునకు; నాడికాద్వయం - రెండుగడియలు, ఊర్ధ్వాంఘ్రియుక్తిక్రమాత్ - సూర్యుడుండు నక్షత్రము మొదలు; జ్ఞేయాః-తెలియతగినది; పూ -దినముయొక్క మొదటిభాగమునకు, సూర్యోదయాత్ సూర్యోదయము మొదలు, ఆలయాత్-అస్తమానమువరకు, లగ్నానామపి-లగ్నములయొక్కయున్నూ; షట్కమేవ-ఆరే, నిశిచేత్—రాత్రియైనచో అస్తమయాది-అస్తమానము మొదలు; తథా-అట్లు, క్రమాత్-వరుసగా; లగ్నాని-లగ్నములు, షట్—ఆరే

తా॥ ప్రతిదినము సూర్యుడున్ననక్షత్రము మొదలుచ్ఛగతనక్షత్రమువరకు గణనచేసి, అందు ౭ నక్షత్రములవిడిచితక్కిననక్షత్రములకు నొక్కొక్కనక్షత్రమునకు రెండేసిగడియల చొప్పుననున్ను, సూర్యుడు తానున్ననక్షత్రమందెన్నవపాదమందుండునో, ఆపాదము మొదలు తక్కిన పాదములలో నొక్కొక్కపాదమునకు అరగడియచొప్పుననున్ను గణనచేయగా నేర్పడినమొత్తమప్పటికి గతించినగడియలనియు, సూర్యుడున్నరాశిమొదలు సూర్యాస్తమయమువరకు ౬ రాసులనియు, అస్తమయము మొదలు మరునాడు సూర్యోదయమువరకు ౬ రాసులని తా॥

భద్రకరణదిననిర్ణయము శ్లో॥ ౩౨౨

శ్లో॥ రాకాపూర్వదళేఽష్టమీతి దినయోర్విష్టిస్సితే మృత్యుదా
స్యైకాదశ్యపి మృత్యుకృత్పరదళే విష్టిశ్చతుర్థీ తయోః।
సప్తమ్యత చతుర్దశీతి దినయోర్జాతాతు పూర్వార్ధతో,
ర్విష్టిః స్యాద్దశమీ తయోః పరదళే కృష్ణేతృతీయాసదా॥

టీక॥ సితే-శుక్లపక్షమందు, రాకా - పూర్ణిమా; అష్టమీ - అష్టమియు, ఇతి దినయోః-ఈదినములయందు; పూర్వదళే—పూర్వార్థమందు, విష్టిః-భద్రకరణము, స్యాత్-వచ్చును. సా-అది; మృత్యుదా-మరణముచేయును, ఏకాదశీ— ఏకాదశియు;

చతుర్థి-చవితియు, ఇతితయోః-ఇరెండుతిథులయందు, పరదళే-పరార్థమందు,విష్టిః-భద్రికరణము, మృత్యుకృత్-మరణముచేయునది, కృష్ణే-కృష్ణపక్షమందు,సప్తమీ - సప్తమియు, చతుర్దశీ – చతుర్దశియు, ఇతిదినయోః - ఈదినములయందు, జాతాతు పుట్టినదైతే, పూర్వా- పూర్వార్ధమందుండునది, అత్ర - ఈపక్షమందే, దశమీ - దశమియు, తృతీయా-తదియయు,తయోః–ఆదినములయందు,పరదళే-పరార్థమందు విష్టిః-భద్రికరణము, సదా-ఎల్లప్పుడు, స్యాత్- కలుగును.

తా॥ శుక్లాష్టమి పూర్ణిమా కృష్ణచతుర్దశి కృష్ణసప్తమీతిథుల పూర్వార్ధమందును శుక్లైకాదశీ శుక్లచతుర్థి కృష్ణతృతీయలయుత్త రార్థమందును, భద్రికరణము సంభవించుచున్నదిగాన నది శుభకర్మ లవిషయమై మృత్యుప్రదమని తా॥

హాలచక్రము ౩౨౩

శ్లో॥ స్యాచ్చక్రం హాలనామకంసమచతుష్కోణం లిఖేచ్ఛేత్క్రమా
దీశాన్యాం రవిముక్తభాది విలిఖే ద్దిష్ణ్యాని దిక్ష్వష్టసు ।
గం గా గా ణ గ మా గు రుశ్చ సతతంజ్ఞేయం మహాదిక్షుభం
దద్యాత్పూర్ణఫలం విదిక్షు విఫలం భూమిప్రవేశేకృషౌ ॥

టీక॥ సమచతుష్కోణం, సమమగు నాలుగుకోణములుగల, చక్రం-చక్రమును, లిఖేచ్చేత్–లిఖించినచో, హాలనామకం-నాగలనుపేరుగల; చక్ర-చక్రము, స్యాత్-అగును, ఈశాన్యాం-ఈశాన్యదిక్కు మొదలు; క్రమాత్-క్రమముగా అష్టమి ఎనిమిదగు, దిక్షు-దిక్కులయందు, రవిముక్తభాది సూర్యుడువదలినక్షత్రముదలు గంగాగాణగమాగురుః[అక్షరసంఖ్యచే] గం-మూడు, గా - మూడుః గా - మూడు, ణ-ఐదు; గ-మూడు, మా-ఐదు, గు-మూడు; రుః - రెండు; విలిఖేచ్చేత్ - వ్రాసినచో, మహాదిక్షు-పెద్దదిక్కులయందు, భం–నక్షత్రము, కృషౌ కృషియందును, భూమిప్రవేశే-భూమియందు ప్రవేశించుటయందును పూర్ణఫలం - పూర్ణలాభమును, సతతం–ఎల్లప్పుడు దద్యాత్–ఇచ్చును; విదిక్షు- విదిక్కులయందు: విఫలం ఫలములేకుండుటను దద్యాత్-ఇచ్చును; ఇతి–ఇట్లు జ్ఞేయం-తెలియవలయును.

తా॥ సమచతుష్కోణమగు హాలచక్రమునువ్రాసి అందుతత్కాలమున సూర్యుడుండి వదలిననక్షత్రములుమొదలుగనీశాన్యాద్యష్టదిక్కులయందుక్రమంబున ౩ ౩ ౩ ౫ ౩ ౫ ౩ ౨ ఈ సంఖ్యలప్రకారముగా ౨౮ నక్షత్రములవ్రాయగా ప్రాగ్దక్షిణ పశ్చిమోత్తరదిశల నున్న నక్షత్రములయందు కృషిచేయుటకుభూమిని

బ్రివేశించిన సంపూర్ణఫలంబును ఈశాన్యాది విదిక్కులయందున్న నక్షత్రములలో కృషి భూమిం బ్రివేశించిన నిష్ఫలముఁగలుగునని తా॥

కృషిభూమిప్రివేశ తిధివారనక్షత్రనిర్ణయము 3.౯౮

శ్లో॥ మైత్రార్కత్రయరోహిణీవసుమఘాదస్రోత్తరాంత్యాసురే।
ష్వార్యారజ్ఞకవేర్దినేషు శుభదోమధ్యస్తు చాంద్రేదినే।
త్యక్త్వారిక్తదినాదిదగ్ధదివసాన్ దర్శానమావైధృతి।
వ్యాఘాతవ్యతిపాతవిష్టిదివసాన్ శేషాః కృషౌ శోభనాః॥

టీ॥ మైత్రి-అనూరాధ; అర్కత్రియ - హస్తచిత్తస్వాతులు; రోహిణి - రోహిణియు; వసు-ధనిష్ఠా,మఘ-మఘయు; దస్రి-అశ్వినియు; ఉత్తరా - ఉత్తర, ఉత్తరాషాఢ ఉత్తరాభాద్రలు; అంత్య-రేవతి; అసురేషు-మూల; ఏషు - ఈనక్షత్రములయందును: ఆర్య గురునియొక్క; ఆర-కుజునియొక్క; జ్ఞ — బుధునియొక్క; కవేః—శుక్రునియొక్క; దినేషు-వారములయందును:శుభదః-మంచిది;కృషి[ప్రారంభమునకు] చాంద్రే-చంద్రునియొక్క; దినే-వారమందు; మధ్యః మధ్యమము;రిక్త-రిక్తతిధులను; దినాది పాడ్యమి; దగ్ధదివసాన్-దగ్ధతిధులనున్నూ:దర్శ—అమావాస్యనున్ను: అవమా—అవమతిథినిన్ని; వైధృతి-వైధృతినిన్ని; వ్యాఘాత-వ్యాఘాతమునున్ను; వ్యతీపాత-వ్యతీపాతమున్నూ: విష్టిదివసాన్-భద్రకరణమునున్నూత్యక్త్వా విడచి: శేషాః-మిగిలినతిధులు: కృషౌ-కృషికర్మయందు శోభనాః-మంచివి.

తా॥ అనూః హః చి, స్వా రో ధ, మః । అశ్విః ఉఫః ఉషాః, ఉభా, రే మూ ఈ ౧౩ నక్షత్రములును భౌమ బుధ గురు శుక్రవారంబులునుకృషిప్రారంభమునకు శుభకరములనియు సోమవారము మధ్య మనియు రిక్తతిధులును దగ్ధతిధులను ప్రతిపత్తును అమావాస్యయు పూర్వోక్తమైన అవమయు వైధృతి వ్యాఘాత వ్యతీపాతనామయోగములును భద్రకరణమును వీనింబరిత్యజించి తక్కినదినములు కృషికి యోగ్యములనియును తా॥

బీజఫణిచక్రము 3.౯౯

శ్లో॥ బిందూనామపి సప్తవింశతి మృజుం సంలిఖ్య బిందోర్గ్రతో।
రేఖాభిస్త్రిసృభిః పునః పున రథ శోర్ధ్వంచ తన్మూలతః।
తస్యాగ్రేతు లిఖేద్విలోమత ఇహ్యాస్వర్భానుభాద్గణ్యతే।
నక్షత్రేష్వపి నిత్యచక్రచలనా ద్రాహోర్గతర్క్షాదివా॥

టీక॥ ఋజుం-వంకరలేని: బిందూనాం—సున్నలయొక్క: సప్తవింశతిం — ఇరువదియేడును: సంలిఖ్య-వ్రాసి: బింద్వగ్రితః-ప్రథమద్వితీయబిందువులముందు మొదలు: త్రిసృభిః-మూఁడగు: రేఖాభిః-రేఖలచేత: అథః-క్రిందభాగమందు:[నాలుగవబిందువును వదలి యేడవబిందువరకు త్రిప్పవలయుననుట] తన్మూలతః- మొదటిరేఖలసమాప్తిచేసిన బిందువుమొదలు: ఊర్ధ్వం-పైగా:మూడురేఖలుచుట్టవలయును (యెనిమిదవ బిందువుమొదలు పదునొకండవ బిందువువఱకుననుట] ఏవం — ఇట్లు పునఃపునః—మాటిమాటికి[అనగారేఖాసమాప్తిబిందువుమొదలధోగాగోర్ధ్వభాగలుకలుగునట్లు పండ్రెండు పదునాలు ఇఱువది ఇఱువదినాలుగు బిందువులచుట్టవలయును బిందుపరిత్యాగ మెట్లనిన చెప్పబోవుశ్లోకమందున్నది,తస్య-బీజఫణిచక్రముయొక్క-అగ్రే-ముందు: లిఖేత్-వ్రాయవలయును: స్వర్భానుభాత్ - రాహువుండునక్షత్రము మొదలు: నక్షత్రేషు-చక్రమందుండునక్షత్రములయందు నిత్యచక్రచలనాత్ - నిత్యనక్షత్రమువరకు: విలోమతః—తల్లక్రిందుగా: గణ్యతే లెక్కించఁబడును: యద్వా - లేక: రాహోః-రాహువుయొక్క: గతర్క్షాదినా-వదలిననక్షత్రముమొదలుగా:గణ్యతే-లెక్కించఁబడును.

తా॥ ఒకవరుసగ ౨౭ బిందువులనఁగా ఇట్టి చిహ్నములువ్రాసి అందు మొదటనున్న మూఁడుబిందువులయందుమూఁడు రేఖలఁబ్రారంభించి, ౪ వ బిందువునువదలి ముందువ్రాసియున్న రేఖల ౫,౬,౭, ఈ బిందువులఁతో గలిపి మరల ౮ వ బిందువును బరిత్యజించి ఈ రీతిని 3 బిందువుల కొక్కొక్కబిందువు చొప్పున బరిత్యజింపుచు తక్కినబిందువులలో నుత్తరక్రమంబున రేఖలవ్రాయగా బీజఫణిచక్రమగును. ఆచక్రంబున మొదటిబిందువునందు రాహువున్ననక్షత్రమునైనను తత్కాలమున రాహువువదలిన నక్షత్రమునైననువ్రాసి అది మొదలు తలక్రిందుగ నన్ని నక్షత్రములను ౨౭ బిందువులయందును వ్రాయవలయునని తా॥

చక్రఫలనిర్ణయము 3 ౨౬

శ్లో॥ చక్రం బీజఫణిం విలిఖ్య ఫణిభాత్తన్మూర్ధ్ని నాశం త్రయం।
కంఠే త్రీణ్యపి కజ్జలంచ జఠరే భాని క్రమాద్ద్వాదశ ।

దద్యుశ్చాన్న సమృద్ధి మత్రికృషితో నిస్తందులత్వంత్రియం
పుచ్ఛే త్వీతిభయంబహిస్తుషడపి ప్రాగ్బీజసంస్థాపనే ॥

టీక॥ బీజఫణిం—బీజఫణియను: చక్రం-చక్రమును: విలిఖ్య-వ్రాసి:ఫణిభాత్ రాహునక్షత్రము మొదలు: తన్మూర్ధ్ని-ఆఫణిచక్రముయొక్క శిరస్సున: త్రియం - మూడునక్షత్రములు: నాశం—నాశకరములు:కంఠే-కంఠమందు: త్రీణ్యపి మూడున్ను కజ్జలం-కాటుకయున్ను, (అనగా నల్లధాన్యమనుట) జఠరే-కడుపునందు, ద్వాదశ - పండ్రెండు: భాని-నక్షత్రములు, అన్నసమృద్ధిం-అన్నసమృద్దిని: దద్యుః-ఇచ్చుచున్నవి, పుచ్ఛే-తోకయందు, త్రయం-మూడు: కృషితః- కృషికర్మయందు: నిస్తందులత్వం-ధాన్యములేకపోవుటను: బహిస్తు-వెలుపలనున్న: షడపి - ఆరును: ఈతిభయం-శలభాదిభయమును: క్రమాత్- క్రమముగా ప్రాగ్బీజసంస్థాపనే - ప్రథమబీజావాపమందు దద్యుః-ఇచ్చుచున్నవి.

తా॥ పూర్వోక్తక్రమంబున నన్నినక్షత్రముల వ్రాయగా చక్రశిరమునుబొంది యున్న 3 నక్షత్రములు బీజావాపనవిషయమై హానిని కంఠమునను్న 3 నక్షత్రములు కృష్ణధ్యానమును కుక్షిలోనన్న ౧౨ నక్షత్రములు అన్నసమృద్ధిని తోకయందున్న 3 నక్షత్రములు తండులాభావమును మూడేసిబిందువుల నడుమనుబరిత్యజింపబడియున్న బిందువులలోనున్న ౬ నక్షత్రములు పైర్లకుమిడతలుమొదలైన యీతిబాధలుగలుగును.

బీజావాపనమంత్రవిధి ౩౨౭

శ్లో॥ జ్యేష్ఠాయా మథ మూలభే శుభగృహే లగ్నే విశుద్ధేఽష్టమే
సంపూజ్యాఖిలదేవతాః కృషిభువం సంస్పృశ్య సన్మంగళైః
"ఓం విశ్వేమహీ తేనమ్మోభగవతీ" త్యేతేన సంమంత్రితం ।
బీజావాపన మాద్యమేవ ఫలదం కుర్యాత్సతారాసువా ॥

టీక॥ జ్యేష్ఠాయాం జ్యేష్ఠనక్షత్రమందు, అథవా-లేక: మూలభే - మూలనక్షత్రమందు శుభగ్రహే-శుభగ్రహముగల లగ్నే- లగ్నమందును అష్టమే - అష్టమ

స్థానము, విశుద్ధె-గ్రిహరహితమైయుండగాను, అఖిలదేవతాః-గణపతిమొదలు సకల దేవతలను, సంపూజ్య-బాగుగపూజించి ఓంవిశ్వేమహతేనమోశగపతీ-ఇతి — అను ఏతేన—ఈమంత్రముచే,సంమంత్రితాం.బాగుగమంత్రించినకృషీభువంకృషిభూమిని సన్మంగళై-మంచిమంగళములచేత; సంస్పృశ్య - స్పృశించి, ఆద్యం - మొదటి, బీజావాపనం — విత్తులువేయుటను: సుతారాసువా - శుభ నక్షత్రములయందైనా కుర్యాత్-చేయవలయును.

తా॥ అత్యంతముఖ్యంబులగు జ్యేష్ఠామూలానక్షత్రములయందైనను, శుభనక్షత్రములయందైనను, సప్తమశుద్ధిగల శుభగ్రహసంబంధలగ్నమందు సకలదేవతలంబూజించి 'ఓంవిశ్వేమహితేనమోభగవతి' అను నీమంత్రముచేత నభిమంత్రింపబడినకృషి భూమిని మంగళవాద్యాదులతోడ స్పృసించి ప్రథమబీజావాపనము జేయవలెనని తా॥

బీజావాపనతిథివారనక్షత్రములు 3౽౦

శ్లో॥ రిక్తాపర్వవిషప్రదోషరహితే వారే శుభానాం గృహే ।
క్షిప్రస్వాతిమృదుధ్రువాసురమఘావిష్ణుత్రయాశ్లేషు ।
బీజావాపనమాద్యమేవ ఫలదం స్యాత్పూర్వసస్యే పరే ।
యద్వర్ణగ్రహవాసరేష్వ యదివా తద్వర్ణబీజం వపేత్ ॥

టీక॥ రిక్తా-రిక్తతిథులు, పర్వ-పంచపర్వలు, విష-విషఘటికలు: ప్రదోష-ప్రదోషకాలము, ఏతైః-వీటితోః రహితే-శూన్యమగు; తిథౌ-తిథియందును: శుభానాం-శుభగ్రహములయొక్క, వారే-వారమందు: గృహే - లగ్నమందు: క్షిప్ర - ఆశ్వినిహస్తపుష్యములయందు స్వాతి—స్వాతియందు, మృదు-చిత్ర: రేవతిమృగశీర్ష అనూరాధలయందు ధ్రువ—రోహిణి ఉత్తరా, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్రలయందు అసుర-మూలయందు: మఘ-మఘయందు: విష్ణుత్రయ-శ్రవణ ధనిష్ఠాశతభిషములయందు ఆశ్లేషు-ఈపేర్లుగల ఉడుము-నక్షత్రములయందును, పూర్వసస్యే- పూర్వ సస్యమందైనా, అపరే-అపరసస్యమందైనాఆద్యం- మొదటి, బీజావాపనం విత్తుల వెద: ఫలదం-ఫలమిచ్చునది: స్యాత్-అగును యదివా-లేక: యద్వర్ణగ్రహవాస

రేషు-ఏవర్గముగల గ్రహముయొక్క దినమందుతద్వర్ణబీజం-ఆవర్ణముగలవిత్తులను వపేత్-వెదవేయవలయును.

తా॥ రిక్తతిధులును, పంచపర్వలును, త్యాజ్యఘటికలును ప్రదోష కాలంబును వీనింబరిత్యజించితక్కిన తిధులయందును, శుభగ్రహసంధులగువారములయందును, క్షిప్రసంజ్ఞికంబులగు నశ్విన్హస్త పుష్య నక్షత్రములయందును, మృదుసంజ్ఞిక చిత్రా రేవతీ మృగశీర్షానూరాధలయందును, స్థిరసంజ్ఞకంబులగురోహిణ్యుత్తరోత్తరాషాఢోత్తరాభాద్రలయందును, స్వాతీ మూలా మఘ శ్రవణము ధనిష్ఠ శతభిషక్కు ఈనక్షత్రములయందును విత్తనముల్లుజల్లిన ఫలప్రదమగు ననియు, నొకపక్షంబున నేవన్నెగలవిత్తనములుజల్లుట కావన్నెగల గ్రహముల వారములు శుభకరములని తా॥

## బీజవాపనలగ్న ఫలనిర్ణయము ౩౨౯

శ్లో॥ మేషే చేత్పశునాశనం బహుఫలం చేత్కర్కచేద్ఘటే ।
కుర్యాత్ప్రాణహృతించ సస్యహరణం లగ్నే మృగేసర్వదా
సింహే చోరభయం ఘటే బహుభయంబీజాప్తిరాద్యాశుభా ।
కన్యాగోఝషయుగ్మవృశ్చికధనుష్వేతేషు ధాన్యప్రదా ॥

టీక॥ ఆద్యా-మొదటి; బీజాప్తిః - విత్తులవెద, మేషే - మేషము, లగ్నే చేత్-లగ్నమైనచో; పశునాశనం - పశువులునశించును: కర్కచేచేత్ - కర్కాటకమందైతే; బహుఫలం-మిక్కిలిలాభము, తటే - తులయందు, ప్రాణహృతిం - ప్రాణహరణముచేయును, మృగేలగ్నే-మకరలగ్నమందు, సర్వదా-ఎల్లప్పుడు,సస్యహరణం-సస్యముపాడుచేయును, సింహే-సింహలగ్నమందు, చోరభయం-దొంగల భయము: ఘటే-కుంభలగ్నమందు: బహుభయం - అధికభయముకలుగునుకన్యా-కన్యయందు గో-వృషభమందు ఝష-మీనమందు: యుగ్మ - మిధునమందు వృశ్చిక - వృశ్చికమందు ధనుష - ధనస్సుయందు ఏతేషు - ఈలగ్నములయందు బీజావాప్తిః-విత్తులవెద, శుభదా - శుభమునిచ్చునది ధాన్యప్రదా - ధాన్యమునిచ్చునది. స్యాత్—అగును.

తా॥ మేషలగ్నమునందువిత్తనము జల్లుటకారంభించిన పశునాశనంబును, కటకమునందు బహుఫలంబును, తులయందుప్రాణహానియు మకరమునందుసస్యహానియు సింహమునందు చోరభయంబును, కుంభమునం దధికభీతియు, కన్యా వృషభ మీన మిథున వృశ్చిక ధనుర్లగ్నములయందు శుభసమృద్ధి ధాన్యసమృద్ధియు కలుగునని తా॥

శ్లో॥ పూర్వకాలామృతం నామ గ్రంథః ప్రాచీన నిర్మితః
పదచ్ఛేద పదార్థోక్తిసహితాస్యాం ద్యథాక్రమమ్॥
మచిలీపట్టణే చల్లా లక్ష్మీనృసింహశాస్త్రిణా ।
విరచ్యతే మయాటికా బాలానాంబోధసిద్ధయే ॥
శాలివాహశకే షష్ఠ చతురష్టేందువత్సరే ।
రక్తాక్షి శ్రావణేశుక్ల పూర్ణిమాగురు వాసరే ॥
పూర్వకాలామృతస్యాయం సమ్యక్సంశోధ్యముద్రితః
మచిలీపట్టణేస్వీయ్య ముద్రాయంత్రే ప్రకాశితః ॥

పూర్వకాలామృతే-సప్తమబిందు

సమాప్తః

